ప్రాకృత అకాడెమీ ప్రచురణ : 6

# మనవి మాటలు

డాక్టర్ తిరుమల రామచంద్ర, డి.లిట్.

ప్రాకృత అకాడెమీ
హైదరాబాద్-500 380.

ప్రథమ ముద్రణ : డిశంబర్, 1992

ప్రతులు : 1000

ముఖచిత్రం : శ్రీ శ్వేత

ధర: రూ. 40-00

ఈ వ్యాససంపుటి తెలుగు విశ్వవిద్యాలయం
ఆర్థిక సహాయంతో ముద్రితమైంది.

ప్రతులకు :
ప్రాకృత అకాడెమీ,
3-4-880/17, బరోడా బ్యాంక్ కాలనీ,

న్యూ బాకారం, హైదరాబాద్ - 500 380.
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞాన్‌భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.

ముద్రణ : లక్ష్మి గణపతి ప్రింటింగ్ ప్రెస్,
SRT 199, 1-1-379-50/1, జవాహర్‌నగర్,
హైదరాబాద్ - 500 020

# మనవి

ఈ వ్యాసాలు కొన్ని బుద్ధివికాసం కలిగించేవి, మరికొన్ని వినోదం కల్గించేవి, ఇక కొన్ని ఆలోచనలు రేకెత్తించేవి. ఇవన్నీ పత్రికలలో ప్రచురిత మైనవే. ఆయా పత్రికల నిర్వాహకులకు కృతజ్ఞతా వందనాలు.

ఈ వ్యాసాలలో కొన్ని భారతి మాస పత్రికలో మనవి మాటలు శీర్షికతో ప్రచురించినవి. కనుక ఈ వ్యాస సంపుటికి 'మనవి మాటలు' అనే పేరు పెట్టాను. పాఠకులు వీటిని అప్పటిలాగే ఆదరిస్తారని విశ్వసిస్తున్నాను.

ఈ వ్యాస సంపుటి ప్రచురణకు తెలుగు విశ్వవిద్యాలయం వారు ఆరువేల రూపాయలు ఆర్థిక సహాయం చేశారు. వారికి, ముఖ్యంగా అప్పటి వైస్ ఛాన్సలర్, పద్మభూషణ డాక్టర్ సి. నారాయణరెడ్డి గారికి కృతజ్ఞతా వందనాలు అర్పిస్తున్నాను.

ఈ వ్యాస సంపుటిని శ్రీమతి డాక్టర్ వి. సరళకుమారి గారికి, ఆమె భర్త శ్రీ జి. శ్రీనివాసరావుగారికి అంకితమిస్తున్నందుకు ఆనందిస్తున్నాను శ్రీ శ్రీనివాసరావుగారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సచివాలయంలో డిప్యూటీ సెక్రెటరీ; కర్తవ్య పరాయణులయిన అధికారులు.

డాక్టర్ సరళకుమారిగారు సావిత్రీ అనసూయల కోవవారు. ఈమె వివాహమై అత్తవారిల్లు పెట్టిన కొత్తలోనే శ్రీ శ్రీనివాసరావుగారికి భయంకర మైన జబ్బు చేసింది. వైద్యులు, ఆత్మీయులు ఆశవదలుకున్నారు. ఆ విషమ పరిస్థితిలో ఈమె ఇష్టదైవాన్ని ప్రార్థించారు "నా భర్త ఆరోగ్యవంతులయితే జీవితమంతా ఏకభుక్తం చేస్తాను. పగలంతా ఉపవసించి, రాత్రి స్నానపూజా దుల తర్వాతే భుజిస్తాను" అని. భర్త ఆరోగ్యవంతు లయ్యారు. ఈమె అప్పటి నుంచి ఈ వ్రతాన్ని నిష్ఠతో ముప్పయిఅయిదు సంవత్సరాలుగా ఆచరిస్తున్నారు.

ఈమె నాటి సావిత్రిలాగే తన భర్తను యముని ఉక్కుపిడికిలినుంచి విడిపించు కున్న వీరనారి, ప్రతిజ్ఞను నిలబెట్టుకున్న సత్యసందురాలు.

ముఖచిత్రాన్ని అందంగా తీర్చిన శ్రీ శ్వేతగారికి కృతజ్ఞుణ్ని.

ఈ వ్యాస సంపుటిని చక్కగా, సకాలానికి ముద్రించి యిచ్చిన లక్ష్మీ గణపతి ప్రింటింగ్ ప్రెస్ వారికి కృతజ్ఞతలు.

అంగిరస మార్గశిర పూర్ణిమ,
9-2-1992,
హైదరాబాద్-380.

భాషా సేవకుడు,
తిరుమల రామచంద్ర

# అంకితం



శ్రీ జి. శ్రీనివాసరావు గారికి డాక్టర్ సరళకుమారి గారికి

నాహం జానామి సావిత్రీం
న చ సీతాం అరుంధతీమ్,
సరళామేవ జానామి
యా చకర్ష యమాత్పతిమ్.

[నాకు సావిత్రి ఎవరో తెలియదు; సీతగాని, అరుంధతిగాని తెలియదు. యముని నుంచి తన భర్తను లాక్కున్న సరళాదేవి మాత్రమే తెలుసు.]

# విషయ సూచిక

# సంస్కృత వాఙ్మయంలో చెఱకు, బెల్లం, చక్కెర

భారతదేశంలో చెఱకుపంట అనాదిగా ఉన్నా, ఋగ్వేదకాలపు మన పూర్వులకు చెఱకు తెలిసి ఉండదనే భావించవలసిఉంది. చెఱకు తెలిసి ఉంటే, సోమవల్లితోనో, పర్జన్యుని విద్యుల్లతతోనో, ఇంద్రుని వజ్రాయుధంతోనో పోల్చేవారు. వారికి తెలిసిన మధుర పదార్థం మధు - తేనె. దానిని వారు మనసారా, నోరారా ప్రస్తుతించారు.

“మధు వాతా ఋతాయతే
మధు క్షరంతి సింధవః
మాధ్వీః నః సంత్వోషధీః

మధు నక్త ముతోషసి
మధుమత్ పార్థివగ్ం రజః
మధు ద్యౌరస్తు నః పితా

మధుమాన్నో వనస్పతిః
మధుమాగ్ం అస్తు సూర్యః
మాధ్వీః గావో భవంతు నః.”

(ఋగ్వేదం)

గాలులు మధువును వీస్తున్నాయి; నిజం. నదులు మధువును పారిస్తున్నాయి. మా ఓషధులు మధుమయాలుగా ఆగుగాక! రాత్రి, ఉషస్సు మధుమయాలు కానీ! ఈ భూమిలోని ప్రతి ధూళికణమూ మధుమయంగా ఉంది. మన తండ్రి అయిన దివి మధువగుగాక! మన వనస్పతులు - చెట్టుచేమ మధుమయాలుగా ఉన్నాయి. సూర్యుడు మధువు కలవాడగుగాక! మన ఆవులు మధుమయాలై మధువును పిండనీ! - అని వారు విశ్వమంతా మధుమయంగా దర్శించారు. విచిత్ర మేమిటంటే, ఋగ్వేదం తొలి ఋక్కును గాయత్రీచ్ఛందస్సులో గానం చేసిన

ఋషి పేరు మధుచ్ఛందసుడు. అతడు విశ్వామిత్రుని కుమారుడు, అతడు పాడిన ఛందస్సు, గానం అంత తియ్యనిదేమో! క్రమంగా మన ప్రాచీనులు తియ్యగా, ఇంపుగా ఉన్న వాటినన్నిటినీ మధువనే అన్నారు. నేతిని, వెన్నను, పాలను మధువని అన్నారు.[1] మధు - తియ్యదనాన్ని కలిగించేది కనుక — తేనె వున్నది గనుక ఇంపుగా ఉన్నవన్నీ మధురాలయాయి. మధు-ర.

కాని, అథర్వణ వేదకాలానికి మన పూర్వులకు చెఱకు బాగా తెలుసు. దీనికి సాక్ష్యం ఈ మంత్రం దీనిని వివరించడం అవసరం.

"పరి త్వా పరితత్ను నేక్షుణా గా మవిద్విషే,
యథా మాగ్ం కామిన్యసో యథా మన్నాపగా అసః."[2]

పదం॥ పరి త్వా పరితత్నునా ఇక్షుణా అగామ్ అవిద్విషే యథా మాం కామినీ అసః యథా మత్ న అపగాః అసః.

అర్థం॥ పరితత్నునా = బాగా వ్యాపించిన, ఇక్షుణా = చెఱకువంటి మాధుర్యంతో (అభిలాషతో), అవిద్విషే = వైరం వదలడానికి (మైత్రికోసం), త్వా = నిన్ను, పరి అగామ్ = అన్నివైపులనుంచి పొందినాను. యథా = దేని వలన నీవు, మాం కామినీ = నన్ను కోరే దానివిగా, అసః = అగుదువు గాక; (మరిన్ని) యథా = దేనివలన నీవు, మత్ = నానుంచి. అపగాః = వియోగం పొందేదానివి, న అసః = కావద్దు.

ఈ మంత్రం విద్యాప్రాప్త్యుపదేశంలోనిది. దీనికి అథర్వుడు ఋషి. వీరుత్ (లత) దేవత. అనుష్టుప్ ఛందస్సు. బ్రహ్మచారి (విద్యార్థి) విద్యాదేవతను ప్రార్థిస్తున్నాడు. "నా కోరిక చెఱకులాగ తియ్యనిది. ఆ కోరిక నా మనసంతా వ్యాపించింది. అలాటి కోరికతో, ఓ విద్యాదేవీ, నిన్ను సకల లోకాలతోను మైత్రికోసం అన్నివైపులనుంచి పొందినాను - నేర్చుకున్నాను. ఏవిధంగా నీవు నిరంతరం నన్ను కోరుతూ ఉంటావో, ఏవిధంగా నీవు నన్ను వదిలిపోవో ఆ విధంగా ప్రవర్తించు."

బ్రహ్మచారి సంపూర్ణమైన అభిలాషతో విద్యకోసం ప్రయత్నించినప్పుడు కఠినాతికఠినమైన విద్యకూడ అతనికి లభిస్తుంది. అభీష్టానందం కలిగిస్తుంది అని తాత్పర్యం.

అథర్వఋషి అభిలాషను అత్యంత మధురమైన ఇక్షువుతో - చెఱకుతో

---

1. శబ్దకల్పద్రుమం.
2. అథర్వణ, 2.34-5.

పోల్చడం అద్భుతంగా ఉంది. అప్పటివారి విద్యార్జన సమస్త ప్రజలతోను 'అవిద్విషే'కు - మైత్రికోసమేగాని విద్వేషంకోసం కాదు. విద్యాదేవీ నిన్ను గాఢంగా ప్రేమించి పొందాను. నాతోనే ఎల్లకాలం ఉండు; నన్నే ప్రేమించు, నన్ను విడిచిపోవద్దు - వియోగం పొందవద్దు - అని కోరుకుంటాడు బ్రహ్మచారి.

వేదాలలోని మొదటి చెఱకు ఇదే. ఇక్షురసంతో పుట్టిన గుడశర్కరాదులు ఉండేవుంటాయి. కాని దాఖలాలు కనిపించడంలేదు.

మహాభారత కాలానికి ముందుగానే చెఱకు తోటలు బాగా ఏపుగా పెరిగి ఉంటాయి. బెల్లం చక్కెరల వాడకం, వాటిని తయారుచేయడానికి చెఱకు గానుగల వాడకం విరివిగా ఉండి ఉంటుంది. కనుకనే మహాభారతంలో చాలా చోట్ల బెల్లం, చెఱకు, గానుగ ప్రసక్తి వచ్చింది.

"ఇక్షూన్ మధుచ లాజాంశ్చ"[3] అని చెఱకులను, తేనెను, పేలాలను సేకరించాలని ఆదిపర్వంలో ఉంది. భీష్మపర్వంలో ఇక్షువర్ధనిక ప్రసక్తి ఉంది.[4] ఇక్షువర్ధనిక అంటే చెఱకు తోటలను పెంచే వ్యక్తి. భూమిదాన

"ఇక్షుభిః సతతాం భూమిం యవ గోధూమ సంకులామ్,
గోశ్వవాహన సంపూర్ణామ్ బాహువీర్య సమార్జితామ్.
నిధి గర్భాం దదన్ భూమిం సర్వరత్న పరిచ్ఛదామ్,
అక్షయాన్ లభతే లోకాన్ భూమిసత్రం హి తస్యతత్."[5]

భీష్ముడన్న మాటలివి : చెఱకు తోటలను, యవలు, గోధుమల పంట ఉన్న భూములను, నిధినిక్షేపాలున్న భూములను, సకల రత్నాలు విరజిమ్మి దానమిచ్చే వారికి అక్షయ పుణ్యలోకాలు లభిస్తాయి. ఈ భూములు ఎవరో దానమిచ్చినవో, సులభంగా వారసత్వంలో వచ్చినవో కాక స్వబాహువీర్యంతో-స్వయంకృషితో సంపాదించినవై ఉండాలి. అలాగే వీటిని గోవులు, గుర్రాలు, వాహనాలతోపాటుగా దానం చేయాలి. ఈ దానాన్ని భూమిసత్రం అంటారు.

బ్రాహ్మణుడు చెఱకు గానుగ ఆడించరాదని అశ్వమేధ పర్వంలో ఉంది.

---

3. మహా.భార. ఆదిపర్వం.
4. భీష్మ. అ. 12.
5. అనుశాసనిక-అ. 61.

"ఇక్షువంశోద్భవః సోమః సోమవంశోద్భవాః ద్విజాః,
ఇక్షూ న్న పీడయేత్ తస్మాత్ ఇక్షుఘాత్యాత్మఘాతకః.
ఇక్షుదండ సహస్రాణా మేకై కేన యుధిష్ఠిర,
బ్రహ్మహత్యా మవాప్నోతి బ్రాహ్మణో యంత్రపీడనాత్.
తస్మా న్న పీడయేత్ ఇక్షూన్ యంత్రచక్రే ద్విజోత్తమః."[6]

సోముడు ఇక్షువంశంలో పుట్టాడు. బ్రాహ్మణులు ఆ సోమవంశజులు. కనుక బ్రాహ్మణుడు చెఱకును గానుగలో వేసి తిప్పరాదు. ఇలా తిప్పేవాడు ఆత్మ ఘాతకుడు. వేయి చెఱకులను గానుగాడించడం ఒక బ్రహ్మ హత్యతో సమానం. కనుక గానుగలో బ్రాహ్మణుడు చెఱకు ఆడించరాదు. చెఱకు గానుగాడించే వృత్తిని చేపట్టరాదు.

ఈ శ్లోకాలలోని యంత్ర, యంత్రచక్ర పదాలను బట్టి చెఱకు గానుగలు విరివిగా ఉన్నవనే స్పష్టమవుతుంది.

మహాభారతంలో గుడప్రసక్తి - బెల్లం సంగతి కూడ ఉంది.

"క్షీరం దధిఘృతం వాపి గుడం మధురసం తథా."[7]

యజ్ఞద్రవ్యాలైన క్షీరదధిఘృత మధువులలో గుడం - బెల్లం కూడ చేరింది.

భాగవతంలోను చాలాచోట్ల చెఱకు కనిపిస్తుంది. కంసుడు కృష్ణ బలరాములను చంపడానికి మధురకు పిలిపిస్తాడు. వారు మధురకు వస్తారు. మధురానగర శోభను తిలకిస్తారు. కంసుడు ఏర్పాటు చేసిన ధనుర్యజ్ఞశాలకు వెళ్ళుతారు.

"తతః పౌరాన్ పృచ్ఛమానో ధనుషఃస్థాన మచ్యుతః,
తస్మిన్ ప్రవిష్టో దదృశే ధనురైంద్ర మివాద్భుతమ్.
పురుషైః బహుభిః గుప్తమ్ అద్భుతమ్ పర మర్థితమ్.
వార్యమాణః నృభిః కృష్ణః ప్రసహ్య ధను రాదదే.
కరేణ వామేన సలీల ముద్భుతం
సజ్జంచ కృత్వానిమిషేణ పశ్యతామ్,
నృణాం వికృష్య ప్రబభంజ మధ్యతః
యథేక్షుదండం మదకర్యురుక్రమః."[8]

---

6. అశ్వమేధ పర్వం-అ. 46.
7. అశ్వమేధ. అ. 4.
8. భాగవతం, దశమ అ. 4-15, 16, 17.

తర్వాత కృష్ణుడు ఆ ధనుర్యజ్ఞంకోసం పెట్టిన ధనుస్సు ఎక్కడ ఉంది అని జనాన్ని అడుగుతూ యజ్ఞశాలలో ప్రవేశించాడు. ఆ ధనుస్సు ఆశ్చర్యకరంగా ఇంద్రచాపంవలె ఉంది. చాలమంది రాజపురుషులు (భటులు) దాన్ని కాపాడు తున్నారు. దానికి పూజలు చేస్తున్నారు. అలాటి ధనుస్సును ఎక్కువెట్టడం తమకు చేతనవునా అని ప్రతి వీరుడూ కోరుకునే ధనుస్సుకదా అది! కనుక పూజనీయమే. దాని దగ్గరికి కృష్ణుడు పోయి అక్కడి కాపలావాళ్ళు వద్దు వద్దు అని అంటున్నా వినక, లెక్కచేయక ఎడమచేతితో దాన్ని అలవోకగా ఎత్తి అక్కడి జనం ఆశ్చర్యంతో చూస్తుండగా నిమిషంలో అల్లెతాడు ఎక్కించి లాగాడు. అది నడుమకు సరిగ్గా విరిగి రెండు ముక్కలైంది. కృష్ణుడు ఆ ధనుస్సును విరచడం ఎలా ఉందంటే, మహాబలంగల మదపుటేనుగు చెఱకు గడను అవలీలగా రెండుముక్కలు చేసినట్టు ఉంది.

రుక్మిణీదేవి గౌరీదేవిని "లవణాపూప తాంబూల కంఠసూత్ర ఫలేక్షుభిః" ఉప్పుఅప్పాలు, తాంబూలం, కంఠ సూత్రం, పండ్లు, చెఱుకులు సమర్పించి పూజించిందట.[9]

చెఱకు ప్రసక్తి కౌశిక సూత్రంలోను, ఆశ్వలాయన గృహ్య సూత్రాల లోను, మనుస్మృతిలోను ఉంది.[10] గుడప్రస్తావన మను, కాత్యాయన, యాజ్ఞ వల్క్య స్మృతులలో కనిపిస్తుంది.[11] చెఱకు గానుగాడి బెల్లం చేసే ప్రదేశంలో ఎంగిలి మంగలం చూస్తే బెల్లం తినబుద్ధికాదు. చెఱకును ఆడించేవాడు బెల్లం పాకానికి వచ్చిందోలేదో అని చూడడానికి ఇనుపకడ్డీతో కొప్పెరలోని చెఱకు పాకాన్ని కొద్దిగాతీసి వేళ్ళతో తాకి ఎంగిలిచేసి ఆ కడ్డీని అలాగే వదలుతాడు. ఇలాటి ఎంగిళ్ళు సహజం. కనుక స్మృతికారులు ఇలాటి ఎంగిళ్ళకు దోషం లేదని, అట్టిచోట్ల శౌచాన్ని (ఆచారదృష్టితో పారిశుద్ధ్యాన్ని) చర్చించరాదని.

"గోకులే కందుశాలాయాం తైలయంత్రేక్షుయంత్రయోః.
అమీమాంస్యాని శౌచాని."[12]

అన్నారు. ఆవులకొట్టంలో, సెనగలు మురమురాలు పేలాలువంటివి వేయించి అమ్మే కందుశాలలలో (కప్పు బట్టీలలో), నూనె గానుగలవద్ద, చెఱకు గానుగల వద్ద శౌచం సంగతి చర్చించరాదు.

---

9. భాగవత. దశమ అ. 53-47.
10. మోనియర్ విల్లియమ్స్ సంస్కృత డిక్షనరీ.
11. మోనియర్ విల్లియమ్స్ సం. డి.
12. వాచస్పత్యమ్.

వైద్య గ్రంథాలలో అతి ప్రాచీనమైన సుశ్రుతంలో రకరకాల చెఱకుల పేర్లు, బెల్లం చక్కెరల పేర్లు కనిపిస్తాయి. సుశ్రుతం క్రీస్తుకు పూర్వం వేయి సంవత్సరాలనాటిదని, తర్వాత కొంత సంస్కారం పొందిందని, సంస్కారం పొందిన సుశ్రుత సంహిత ఏడు-ఎనిమిది శతాబ్దాల మధ్యకాలంలో అరబ్బీ భాషలోకి తర్జుమా అయిందని దీని సంపాదకులు డాక్టర్ లక్ష్మీశంకర్‌గురు అంటున్నారు. ఈ అభిప్రాయాన్నే దీనిని లాటిన్‌లోకి అనువదించిన డాక్టర్ హెయిసలర్ సమర్థించారు. ఋతు చర్యలో ఋతువుల నిర్వచనంలో ఫాల్గుణ చైత్ర మాసాలు వసంతమని, వైశాఖ జ్యేష్ఠాలు గ్రీష్మమని వివరిస్తూ, మాఘ మాసాన్ని పండ్రెండవ మాసంగా చెప్పడం కూడ దీని అతి ప్రాచీనత్వాన్ని సూచిస్తున్నది. సుశ్రుతుడు స్థూలంగా పన్నెండు రకాల చెఱకు చెప్పాడు.

"పౌండ్రకో భీరుకశ్చైవ వంశకః శ్వేతపోరకః,
కాంతారః తాపసేక్షుశ్చ కాష్ఠేక్షుః సూచి పత్రకః
నైపాలో దీర్ఘపత్రశ్చ నీలపోర్యోథ కోశకృత్.
ఇత్యేతా జాతయః స్థౌల్యాత్ గుణాన్వక్ష్యామ్యతః పరమ్."[13]

పౌండ్రకం, భీరుకం, వంశకం, శ్వేతపోరకం, కాంతారం, తాపసం, కాష్ఠేక్షువు, సూచిపత్రకం, నైపాలం, దీర్ఘపత్రం, నీలపోరం, కోశకృత్ - అనేవి ఈ పండ్రెండు రకాలు. పోరకమంటే గనువు. వెదురు గడలాటిది. తెల్లగనుపులది, నల్లగనుపులది. అడవిలో వన్యస్థితిలో పెరిగేది. కర్రలాగ ఉండేది, సూదిమొనలాంటి ఆకులది, పొడుగాటి ఆకులది, నేపాల్ దేశంది లావుపాటి గనుపులది - ఇలా ఎన్నో. వాటిలో ఇవి పండ్రెండు. పౌండ్రక భీరుకాలు ఆయా ప్రాంతాలవేమో!

చెఱకురసం గుణాలలోను భేదం ఉంది. చెఱకును పండ్లతో కొరికి నమిలి మింగే రసం వేడిచేయదు. వాతపిత్తాలను పోగొడుతుంది. కఫకరం, నోటిపూత మొదలయిన వాటిని పోగొట్టి అహ్లాదం కలిగిస్తుంది. వీర్యవృద్ధి కరమూను. గానుగాడిన రసం బరువయింది - తేలికగా జీర్ణంకాదు, వేడి కలిగిస్తుంది. కొద్దిగా మలబంధం కలిగిస్తుంది.

"అవిదాహీ కఫకరో వాతపిత్త నివారణః,
వక్త్ర ప్రహ్లాదనో వృష్యః దంత నిష్పీడితో రసః.
గురుః విదాహీ విష్టంభీ యాంత్రికస్తు ప్రకీర్తితః."[14]

---

13. సుశ్రుతం సూత్రస్థానం అధ్యా. 45-149, 150.
14. సుశ్రుతం సూత్రస్థానం అ. 45-157, 58.

దంతనిష్పీడితరసానికి, యంత్ర నిష్పీడిత రసానికి గుణంలో ఇంత భేదానికి కారణం

"మూలాగ్రజంతు గ్రంథ్యాది పీడనాత్ మల సంగరాత్."[15]

మొదళ్ళు, కొనలు మొదలయిన వాటితోసహా చెఱకుగడను గడనే గానుగలో ఆడిస్తారు గనుక ఈ వ్యత్యాసం ఏర్పడిందట. నిలువచేసిన రసం మంచిదికాదు. పులిసిపోయి వుంటుంది కనుక త్వరగా జీర్ణంకాదు, కఫ పిత్తాలు కలిగిస్తుంది. రక్తాన్ని పాడుచేస్తుంది. విరేచనం కలిగిస్తుంది, ఎక్కువ మూత్రం కలిగిస్తుంది.

"రసః పర్యుషితో నేష్టః హ్యామ్లో వాతాపహో గురుః,
కఫపిత్తకరః శోషి భేదనశ్చ అతిమూత్రలః."[16]

సుశ్రుతుడు చెఱకు రసాన్ని కాచిన దశలను వివరించాడు. ఆ దశల లోనే బెల్లం, చక్కెర మొదలయినవి ఏర్పడ్డాయి.

సుశ్రుతుడు గుడశర్కరాభేదాలను చెబుతూ మొదట ఫాణితమ్, తర్వాత గుడ, మత్స్యండికా, ఖండ, శర్కరలను వరుసగా చెప్పాడు.[17] ఫాణితమంటే కొంచెం గట్టిపడి జావజావగా ఉండేది. దీనిని నిలవచేసి పూరీలు, అట్లు మొదలైన వాటికి వ్యంజనంగా వాడుతారు. చెఱకు పాకమని, చెఱకు పానకమని అంటారు. బళ్ళారి మున్నగు ప్రాంతాలలో కాకంబి అంటారు.

"ఇక్షోరసస్తు యః పక్వః కించిద్గాఢో బహుద్రవః.
సవీవేక్షు వికారేషు ఖ్యాతః ఫాణిత సంజ్ఞయా."[18]

కాపులో కొంచెంగా గట్టిపడి ఎక్కువ ద్రవంగా వుండే చెఱకు రసాన్ని ఫాణిత మంటారు. ఇంత స్పష్టంగా ఉండగా శబ్దరత్నాకరం దీనికి కండ చక్కెర అని అర్థమిచ్చింది.

"ఇక్షో రసోయః సంపక్వో ఘనః కించిద్రవాన్వితః,
మత్స్యవత్ స్యందతే యస్మాత్ మత్స్యండితి తతఃస్మృతః."[19]

15. వాచస్పత్యం.
16. వాచస్పత్యం.
17. సుశ్రు. సూత్ర. అధ్యా. 45.
18. వాచస్పత్యమ్.
19. వాచస్పత్యమ్.

రాయిలాగ గట్టిపడకుండ ముద్దగా కాచిన చెఱకురసం మత్స్యండి. ఇది పట్టుకుంటే చేపలాగ జారిపోతుంది గనుక మత్స్యండి అనే పేరు పొందిందట.

"ఇక్షో రసోయః సంపక్వో జాయతే లోష్టవత్ దృఢః,
స గుడో గౌడదేశేతు మత్స్యండ్యేవ గుడో మతః.'[20]

మట్టిబెడ్డలాగ గట్టిగా అయ్యేట్టు కాచిన చెఱకురసం గుడం. గౌడదేశంలో (వంగదేశంలో) మత్స్యండినే గుడమంటారని భావప్రకాశం అన్నది. కొత్త గుడం-బెల్లం కన్నా పాత బెల్లం మంచిదని, పథ్యతమమని సుశ్రుతుడన్నాడు. "సపురాణో ధికగుణో గుడః పథ్యతమః స్మృతః."[21]

వీటినుంచి - వీటిని వడబోసి ఖండ (కండ చక్కెర), శర్కర, (చక్కెర)లు తయారుచేసేవారు. ఇవి క్రమంగా ఎంత పరిశుద్ధమైతే అంత తెలుపు, అంత తీపి కలుగుతాయన్నాడు సుశ్రుతుడు. గుణాలు కూడ ఎక్కువవుతాయి.

"మత్స్యండికా, ఖండ, శర్కరాః విమల జాతాః ఉత్తరోత్తరం శీతాః, స్నిగ్ధాః, గురుతరాః, మధుర తరాః, వృష్యాః, రక్తపిత్తప్రశమనాశ్చ.

"యథాయథేషాం వైమల్యమ్ మధురత్వం తథాతథా,
స్నేహగౌరవ శైత్యాది సరత్వంచ తథా తథా."[22]

అంతేకాక, చక్కెర కాచి పరిశుద్ధం చేసినకొద్దీ, సారం నిలిచి ఉప్పు తొలగి తెల్లబడి, ఎక్కువ ప్రయోజనకరమవుతుంది.

"సారస్థితా సువిమలా నిఃక్షారా చ యథా యథా
తథా తథా గుణవతీ విజ్ఞేయా శర్కరా బుధైః."[23]

ఈ మత్స్యండికా, ఖండ, శర్కరల పానీయాలు (విస్రావణాలు-షర్బత్తులు) మున్నగువాటిలోను వీటి గుణాలే ఉంటాయన్నాడు సుశ్రుతుడు.

"యో యో మత్స్యండికా ఖండ శర్కరాణాం స్వకో గుణః,
తేన తేనైవ నిర్దేశ్యః తేషాం విస్రావణో గుణః."[24]

సుశ్రుతుడు బెల్లం, చక్కెర, ఫాణితాలనుంచి, పచ్చి చెఱకురసం నుంచి

20. వాచస్పత్యమ్.
21. సుశ. సూత్ర. అధ్యా. 45-161.
22. సుశ. సూత్ర. 1-162,163.
23. సుశ. అదే అధ్యా. 165.
24. సుశ. అదే అధ్యా. 164.

చేసే మద్యాలను కూడ తెలిపాడు-గౌడం. శార్కరం, పక్వరసిక, సీథువు, శీతరసికం అని.[25]

తర్వాతి వైద్యశాస్త్రజ్ఞులు సుశ్రుతుని అనుసరించి, మరికొన్ని భేదాలు చెప్పారు. సుశ్రుతుడు మధుమేహవ్యాధిని ఇక్షుమేహమని అన్నాడు. ఇవి దాదాపు ఇరవై విధాలు.

పురాణాలలో బెల్లం, చక్కెరల ప్రస్తావం కోకొల్లలు. వ్రతకథలలో నైవేద్యానికి, దానానికి చాలచోట్ల వీటి ప్రసక్తి ఉంది. స్కాందపురాణంలో శర్కరాధేనుదానం ఉంది. ధేనువు ఆకారంలో చక్కెర పాకంతో పోతపోసి దానం చేయాలి. దీనిని శర్కరాధేనుః అంటారు. "దానార్థం కల్పితే ధేన్వాకారే శర్కరా కృతే స్తూపభేదే." మత్స్య పురాణంలో వైశాఖశుద్ధ సప్తమినాడు శర్కరా సప్తమి అనే వ్రతం చేయాలి.

"తద్వచ్ఛ శర్కరాధేనుం రాజన్ కుర్యాత్ యథార్థతః,
అనులిప్తే మహీపృష్ఠే కృష్ణాజిన కుశోత్తరే.
ధేనుశ్శర్కరయా రాజన్ సదా భారచతుష్టయమ్."[26]

చక్కెరపోతతో ధేనువును తయారుచేసి అలికి శుభ్రపరచిన స్థలంలో కృష్ణాజినం పరచి, దానిమీద దర్భలు పరచి శర్కరాధేనువును దానిపై పెట్టి పూజించి దానం చేయాలి.

పద్మపురాణంలో దీనిని గుడధేనువన్నారు. చక్కెరకు మారు బెల్లంతో ధేనువును తయారు చేయాలన్న మాట.

కొబ్బరికాయను, చెఱకును మాంసబలికి ప్రత్యామ్నాయంగా కాళికా పురాణంలో చెప్పారు.

"శ్రీఫలంచ ఇక్షుదండశ్చ విప్రాణాంతు బలిర్మతః"

విప్రులు జంతుబలి ఇవ్వరాదని, దానికి మారు శ్రీఫలంకొట్టి, చెఱకు నరికి నైవేద్యం పెట్టాలని ఆదేశం. శ్రీఫలమంటే గుమ్మడి అని కూడ కొందరి అభిప్రాయం. "కూష్మాండం చేక్షుదండశ్చ" అని దేవీపురాణం నిర్దేశించింది. గుమ్మడికాయ, చెఱకుగడ-ఇవి రెండు. ఇక్కడ కూష్మాండం (బూడిద గుమ్మడికాయ) స్పష్టంగా ఉంది గనుక శ్రీఫలమంటే కొబ్బరికాయ అనే అనుకుందాము.

---

25. సుశ్రు, సూత్ర. అధ్యా. 46.182.83, 84.
26. చతుర్వర్గ చింతామణి. వ్రతఖండం.

ఇక స్తోత్రసాహిత్యంలో చాలాచోట్ల చెఱకు, బెల్లం, చక్కెర ప్రసక్తి ఉంది. లలితా సహస్రనామంలో గుడాన్నప్రియ అని లలితాదేవిని కీర్తించారు. శ్యామలాదండకం ప్రారంభ శ్లోకాలలో దేవిని పుండ్రేక్షుధారిణిగా స్తుతించారు.

"చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమరాగశోణే,
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ
హస్తే నమస్తే జగదేకమాతః."

మౌర్యసామ్రాజ్యకాలానికి చెఱకుపంట బాగా ఉన్నట్టు ఉంది. కాని కౌటిల్యుడు ఈ పంటను ప్రత్యవరః (చాల తక్కువ రకం పంట) అన్నాడు.

"ఇక్షుః ప్రత్యవరః, ఇక్షవోహి బహ్వాబాధాః వ్యయగ్రాహిణ్యశ్చ."[27]
చెఱకుపంట ప్రత్యవరం. ఎందుకంటే, వ్యయసాధ్యం, చాల చిక్కులతో దీన్ని కాపాడాలి గనుక. ఎన్నో విఘ్నాలు కలుగుతాయి.

కోష్ఠాగారాధ్యక్షుని అధికారంలోని వస్తువర్గాలలో ఫాణిత, గుడ, మత్స్యండికా, ఖండ, శర్కరాః-లను క్షారవర్గంలో చెప్పాడు. శుక్తవర్గంలో ఇక్షురస, గుడ, మధు, ఫాణిత, జాంబవ, పనసానాం అన్యతమః అని చెప్పాడు. వీటిని కోష్ఠాగారాధ్యకుడు తనిఖీ చేయాలి.[28]

కావ్యాలలో మన్మథుడు ఇక్షుధన్వుడు - వాడికి చెఱకే విల్లు. శృంగార రసం మధురం గనుక మన్మథుని విల్లు చెఱకుగాను, బాణాలు పూవులుగాను చేశారేమో!

క్రీస్తుశకం ఒకటవ శతాబ్దినాటి హాలసాతవాహనుని గాథాసప్తశతిలో చెఱకు, చెఱకు గానుగ, చెఱకు మద్యాల ప్రస్తావం ఉంది. ఒక సరసురాలు ఇలా అంటుంది:

"జంతిఅ గులం విమగ్గసి
ణ అ మే ఇచ్ఛాఇ వాహసే జంతమ్,
అణరసిఅ కిం ణ అణాసి
ణ రసేణ వినా గులో హోఇ."[29]

---

27. కౌటిలీయార్థశాస్త్రం అధి 2. శీతాధ్యక్షప్రకరణం.
28. అదే అధికరణం.
29. గాథాసప్తశతి. 6-54.

(యాంత్రిక గుడం విసూర్గయసే
న చ మమేచ్ఛయా వాహయసి యంత్రమ్.
అరసిక కిం నజానాసి
న రసేన వినా గుడో భవతి.)

ఓ గానుగబ్బాయి! బెల్లం బెల్లం అని వెదుకుతావు. నా ఇష్టం ప్రకారం గానుగ తిప్పితేగదా నీవు? ఓ అరసికుడా! రసం లేకుండ గుడం (బెల్లం-మాధుర్యం) ఎలా వస్తుంది?

గ్రామజీవితంలో చెఱకు గానుగ ఒక భాగం. దానిని కవి శృంగారానికి అన్వయించాడు. దీనిలో చెఱకు ఆడడం, బెల్లం తయారుకావడం చెప్పాడు.

మరొకచోట హాలుడు సరకం - చెఱకు మద్యం ప్రస్తావించాడు. వయసు దిగజారినా, చెఱకు మద్యం తాగి మన్మథ వికారం పొందిన ఒక వనితను చూచి శరద్వర్ణన వ్యాజంతో హేళనచేస్తూ చెప్పిన గాథ ఇది.

"ఆరుహఇ జుణ్ణఅం
ఖంజ్జఅం వి జం ఉఅహ వల్లరీ తఉసీ.
ణీలుప్పల పరిమల
వాసిఅస్స సరఅస్స సో దోసో."[30]
(ఆరోహతి జీర్ణం
కుబ్జక మపి యత్పశ్యత వేల్లనశీలా త్రపుసీ.
నీలోత్పల పరిమల వాసితాయాః
శరదః స దోషః.)

పక్కన ఉన్నవాటిని అల్లుకొనడమే దోసతీగ స్వభావం. శరత్కాలం రాగానే పక్కన రాయివున్నా రప్పవున్నా, చెట్టువున్నా, మోడువున్నా అది అల్లుకుంటుంది. చెఱకు మద్యం తాగి కైపెక్కిన ఈ వయసు జారిన వనిత కూడ పక్కన వున్నవానిపై తూలిపడుతుంది. ఇది నీలోత్పల పరిమళంగల నరకం తప్పేకాని, ఆమె తప్పుకాదు. మద్యం తాగితే ఉచితానుచితాలు తెలీకుండా ప్రవర్తిస్తారు ఎవ్వరైనా.

సరకం అనే మాటకు చెఱకు మద్యమని, శరత్కాలమని రెండర్థాలున్నాయి. కవి శ్లేషతో ఈ సొగసు తెచ్చాడు. శరత్ అనే సంస్కృత శబ్దం ప్రాకృతంలో సర–సరఅ అవుతుంది. ఇది తద్భవార్థం. కాని ప్రాకృతపదంగా

30. గాథా. సప్త. 6-34.

అనుకునే సరళ నిజానికి ప్రాకృత పదంకాదు. చెఱకు - చఱకు అనే తెలుగు పదం సరళ అయి ప్రాకృత భాషలో చేరి ఉంటుందని నా అభిప్రాయం. గాథాసప్తశతీ వ్యాఖ్యాతలు దీనిని దేశిపద మన్నారు. దేశి అంటే స్థానికపదం.

తమిళ కన్నడాలలో తెలుగుకు సమానార్థక పదాలు కఱుంబు, కబ్బు. కరచి తినేవి గనుక ధ్వన్యనుకరణగా కఱుంబు, కబ్బు అయాయి. క చ గా మారి తెలుగులో చఱకు అయింది. గడ్డ - గెడ్డ అయినట్లు చఱకు తర్వాత చెఱకయింది. చఱకునుంచి పుట్టిన మద్యానికి కూడ చఱకం - సరకం అని పేరు వచ్చివుంటుంది.[31] ఈ సరకం - చెఱకు కల్లు కథాసరిత్సాగరంలోను ఉంది. ఒక కథలో నాయకుడు రాత్రికాగానే మనకు రాత్రికి సరిపడా సరకం ఉందా లేదా అని తన పరిజనాన్ని అడుగుతాడు.

"ప్రాప్తాయాం నిశి పప్రచ్ఛ నిజం పరిజనం చ సః.
కి మద్య రాత్రిపర్యాప్తం అస్తి నః సరకం న వా."[32]

రఘుమహారాజు జైత్రయాత్రకు బయలుదేరినప్పుడు పొలాలు కాచే పిల్లలు - శాలిగోపికలు అతని గుణగణాల కీర్తిని చిన్నప్పటినుంచి పెద్దవాడయ్యేదాక జరిగిన అభ్యుదయంతో చెఱకుతోటల నీడన హాయిగా కూర్చుని పాడుకొన్నారని కాళిదాసు వర్ణించాడు.

"ఇక్షుచ్ఛాయా నిషాదిన్యః తస్య గోప్తుః గుణోదయమ్
ఆకుమార కథోద్ఘాతం శాలిగోప్యో జగుర్యశః."[33]

మృచ్ఛకటిక రూపకంలో గుడప్రసక్తి ఉంది. ప్రస్తావనలో సూత్రధారుడు అడుగుతాడు నటిని:

సూత్ర :— కిం కిం అత్థి? (కిం కి మస్తి?)

నటీ :— తం జథా. గుడోదనం, ఘిదం, దహీం, తండులాయం, అజ్జేణ అత్తవ్వం రసాయణం సవ్వం అత్థిత్తి. ఎవ్వం తే దేవా ఆసాసేదు. (తత్ యథా, గుడౌదనం, ఘృతం, దధి, తండులాః. ఆర్యేణ అత్తవ్యం రసాయనం సర్వమ్ అస్తీతి, ఏవం తవ దేవా ఆశాసస్తు.)[34]

31. గాథా సప్తశతిలో తెలుగుపదాలు - తిరుమల రామచంద్ర. పుట. 11-12.
32. కథాసరిత్సాగరం - 54 - 99.
33. రఘువంశం - 4 - 20.
34. మృచ్ఛకటిక ప్రస్తావన.

సూత్ర :— ఏమేముంది (తినడానికి)?

నటి :— ఇవి ఉన్నాయి. గుడౌదనం (చక్కెర పొంగలి వంటిది), నేయి, పెరుగు, బియ్యం. తమరు భుజింపదగిన రసాయనమంతా ఉంది. ఇలా మీ దేవతలు శుభాశంస చేయనీ!

చెఱకూ తీపే, పాలూ తీపే, బెల్లమూ తీపే. వీటి తీపిలో - మాధుర్యంలో భేదం కొంచెమే. కాని, దానిని విడదీసి ఏమిటి భేదం అని సరస్వతి కూడ చెప్పజాలదు - అంటాడు దండి.

"ఇక్షు క్షీర గుడాదీనామ్ మాధుర్యేష్వంతరం క్వచిత్,
తథాపి న తదాఖ్యాతుమ్ సరస్వత్యాపి శక్యతే."[35]

వజ్జాలగ్గమనే ప్రాకృత ముక్తక కావ్యంలో చెఱకు తినడం సరిగా తెలియక ఇష్టం వచ్చినట్టు పీక్కుతినేవాడిని ఉపమానంగా తీసుకొన్నాడు కవి.

ప్రాకృత గాథలను చదవడం అందరికీ చేతకాదు. ఇష్టం వచ్చినట్టు విరిచి చదువుతారు. అయ్యో గాథా! చెఱకు తినడం చేతకాని అనాగరకుడు చెఱకును ఇష్టంవచ్చినట్టు గట్టిగా కొరికి విరిచినట్టు లేక విసిరిపారేసినట్టు ఎక్కడబడితే అక్కడ విరిచి అపార్థం కలిగించి నీకు అగౌరవం కలిగిస్తున్నారు. ఏం చేయను? - అంటాడు దీని సంకలనకర్త జయవల్లభుడు. ఇతడు 9 వ శతాబ్దంవాడు.

"గాహే భజ్జహిసి తుమం
అహవా లహుఅత్తణం వి వావిహిసి,
గామార దంత దిఢ కరిణ
పీడిఆ ఉచ్ఛులట్ఠివ్వ."[36]
(గాథే భక్ష్యసే త్వమ్
అథవా లఘుత్వ మపి ప్రాప్స్యసి,
గ్రామీణ దంత దృఢ కరిణ
పీడితా ఇక్షు యష్టి రివ.)

తెనుగునాటి సంస్కృత కవయిత్రి గంగాదేవి రచించిన మధురా విజయ మహాకావ్యంలోను, తక్కిన సంస్కృత కావ్యాలలోను చెఱకు ప్రస్తావన వుంది.

---

35. దండికావ్యాదర్శం.

36. వజ్జాలగ్గ - 16.

క్రమంగా చెఱకు, బెల్లం, చక్కెరలపై ఎన్నో లోకోక్తులు, న్యాయాలు, సుభాషితాలు సంస్కృతంలో పుట్టాయి.

1. ఇక్షువికార న్యాయం :—

చెఱకుగడను గానుగాడించడంవలన రసం, ఆ రసాన్ని సరైనపాకంలో వండడంవలన బెల్లం, ఆ బెల్లంద్వారా తదితరమైన ఉత్తమోత్తమ మధుర పదార్థాలు తయారవుతాయి. ఇలా ఉత్తరోత్తరం ఉత్తమ లాభాలు పొందడాన్ని ఈ న్యాయం సూచిస్తుంది.

2. ఇక్షురస న్యాయం :—

చెఱకును గానుగలో పెట్టి నొక్కితేగాని రసం రాదు. అలాగే రోకళ్ళతో బాగా దంచితేగాని బియ్యం రాదుకదా. అలాగే దేనికైనా బాగా కృషిచేయాలి అని ఈ న్యాయం అభిప్రాయం.

3. గుడజిహ్వికా న్యాయం -

బెల్లం నాలుకపై ఉన్నంతసేపే తీపి. అంతా అనిత్యమని, సుఖాలన్నీ నిత్యాలు కావని ఈ న్యాయం సూచిస్తుంది.

4. గుడోపల న్యాయం :-

బెల్లం కొట్టిన రాయిలాగ - బెల్లం కొట్టిన రాయి కదలదు. ఎందుకంటే బెల్లం జిగురు గనుక కదల నివ్వదు. ఏమాత్రమూ చురుకుదనం లేనివారికి ఈ న్యాయం వర్తిస్తుంది.

5. శర్కరోన్మజ్జనీయ న్యాయం :-

శర్కరా చ క్షిప్తా పురుషస్యోన్మజ్జనమ్; తత్తుల్యం శర్కరోన్మజ్జనీయమ్. ఇక్కడ శర్కర అంటే గులకరాలు, ఒకడు గట్టుమిదినుంచి నదిలోకి రాయి విసురుతాడు, అంతకుముందు నదిలో స్నానం చేస్తూ నీటిలో మునిగినవాడు తటాలున తలయెత్తుతాడు. ఆ రాయి వాడి తలకు తగులుతుంది, ఇది కాకతాళీయం వంటిది.

5. ఇక్షుదండ న్యాయం :-

చెఱకుగడలోని కణుపులు ఒకదానికంటె మరొకటి రుచిగా ఉంటాయి. జరిగినకొద్దీ మంచి కలిగినప్పుడు ఈ న్యాయం వాడుతాడు. ఉదాహరణకు సజ్జనమైత్రి కాలం గడచినకొద్దీ సుదృఢమవుతుంది; దుర్జనమైత్రి అలా కాదు.

6. గుడశ్లేష్మ న్యాయం :-

శ్లేష్మరోగి బెల్లం తింటే, శ్లేష్మం ప్రకోపించి, ముందు తిన్నదానితోసహా అంతా కక్కుకుంటాడు. ఒక పనివల్ల ముందుచేసిన పనులన్నీ పాడయినప్పుడు ఈ నాయ్యం వాడుతారు.[37]

సంస్కృత కవులు చెఱకుపై అన్యాపదేశంగా చెప్పిన పద్యాలు చాల ఉన్నాయి. వాటిలో కొన్ని ఇవి:

కాంతోసి నిత్యమధురోసి రసాకులోసి
కించాసి పంచశరకార్ముకమ్ అద్వితీయమ్,
ఇక్షో తవాస్తి సకలం పరమేక మూనమ్
యత్సేవితో భజసి నీరసతాం క్రమేణ.

ఓ చెఱకా! అందంగా ఉన్నావు. ఎప్పుడూ తియ్యగా ఉంటావు. రసం తొణికిలలాడుతూ ఉంటావు, అంతేకాక మన్మథునికి సాటిలేని విల్లువు. అంతా ఉంది. కాని ఒక్కటి మాత్రం నీకు తక్కువ. నిన్ను అనుభవిస్తూపోతే క్రమంగా నీరసించిపోతావు. (చెఱకు తుదలో అంత తియ్యగా ఉండదు.) ఇది ఒక రాజును గురించి చెప్పినది. నిన్ను కొలిచేవారి ఎడల క్రమంగా అనాదరం చూపుతావు అనిన్నీ.

పరార్థే యః పీడా మనుభవతి భంగేపి మధురః
యదీయః సర్వేషామిహ ఖలు వికారో ప్యభిమతః,
న సంప్రాప్తో వృద్ధిం యది స భృశ మక్షేత్ర పతితః
కిమిక్షో ర్దోషో సౌ నపునః అగుణాయాః మరుభువః.

సరైన స్థానంలో లేక గుర్తింపురాని గుణవంతుని ప్రశంసిస్తూ చెప్పిన అన్యోక్తి ఇది. చెఱకు ఇతరుల కోసం నలిగిపోతుంది, విరిచినా తియ్యగా ఉంటుంది. ఎన్ని వికారాలు (మార్పులు) పొందినా అందరూ ఇష్టపడుతారు. కాని మంచి భూమిలో పడక ఎదగలేదు. ఎదగకపోవడం దాని తప్పా? ఎలాటి సారమూలేని బీడుభూమి తప్పుకాదా?

ముఖే యద్వైరస్యం వపురపి పునః గ్రంథినిచితం
న సంతప్తః కోపి క్షణమపి భజేత్ మూలమభితః,

---

37. సంస్కృత న్యాయములు : కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి.

ఫలంచైవ అప్రాప్యం వితథ రసలిప్తస్య భవతః
తదిక్షో! నాయుక్తం విహితమ్ ఇతరైః యత్తు దలనమ్.[38]

ముఖం చూద్దామా (కొనచూద్దామా) రసహీనం. ఒళ్ళు చూద్దామా గంట్లు ఎండకు మాడినప్పుడు కింద కూచోని సేదదీర్చుకుందామా క్షణం సేపైనా అంటే అదీలేదు. పండ్లు కాస్తుందా అంటే, అదీలేదు. ఒళ్ళంతా దండగ రసం మాత్రం నిండుగా వుంది. కనుక, చెఱకును ఇతరులు విరచడం ఏమీ తప్పుగాదు.

ఒక విషయం చెప్పడం మరచాను. ఇక్షు, గుడ, శర్కరా పదాలకు సంస్కృత సాధారణ, వైద్యక నిఘంటువులలో చాల పర్యాయాలున్నాయి. ఇక్షు అనే దానికి ఇష్యతే మధురత్వాత్- తియ్యగా వుంటుంది కనుక అందరూ కోరుతారు - అని వాచస్పత్యం, శబ్ద కల్పద్రుమం వ్యుత్పత్తి చెప్పినా, మోనియర్ విల్లియమ్స్ సంస్కృత కోశం దీనిని ఉణాదిగణంలోనిదని తెలిపింది. ఉణాదిగణమంటే వ్యుత్పత్తి స్పష్టంగాలేని దన్నమాట. గుడః అనే పదమూ ఇలాటిదే. దీనికి గులః అనే పర్యాయమూ ఉంది. వ్యుత్పత్తి స్పష్టంగా తెలియదు. గుల—గోల—గోళ గుడ అయిందేమో! చెఱకురసం కాచి బెల్లం చేయడానికి ముద్దగా చేయడంవల్ల గుడ అని రూపొంది వుంటుందని కొందరి ఊహ.

శర్కర అనే పదానికి రుచికి సంబంధం లేదు. శర్కర అంటే, గరుకు గరుకుగా ఉండేది - మొరుంగా ఉండేది అని అర్థం. బెల్లం శుద్ధి కానుకాను పలుకులు పలుకులుగా మిగలడంవల్ల, ఇసకలాగ వుండడంవల్ల శర్కర అయింది. శర్కర చక్కెర అయింది. తమిళంలో శక్కరై, కన్నడంతో సక్కరె. శర్కర నుంచే షుగర్ మున్నగు పాశ్చాత్యభాషా పదాలు వచ్చాయి.

తెనుగులో పంచదార అనే పదం చక్కెరకు పర్యాయంగా వుంది. ఐదు సార్లు బెల్లాన్ని వడపోసి శుద్ధిచేయగా తయారయిన చక్కెర ఇది. పంచదారా శర్కర. అది క్రమంగా పంచదార అయింది.

మళయాళంలో పంచసార అంటారు పంచదారను. ఇది ఐదుసార్లు వడపోయగా మిగిలిన సారం కనుక పంచసార శర్కర అయింది. క్రమంగా వాడుకలో పంచసార అయింది.

వాల్మీకి రామాయణంలో చెఱకు ప్రసక్తి కొన్నిచోట్ల ఉంది.

---

38. సుభాషితరత్న భాండాగారం-పుట 254.

1. బాలకాండలో అయోధ్యానగర వర్ణనం విపులంగా ఉంది. అయోధ్యలో శాలిధాన్యక్షేత్రాలు చాల ఉన్నాయి. అక్కడి నీరు చెఱకుగడరసంలాగ తియ్యగా ఉన్నదట. (బాలకాండ. స. 5-17.)

2. భరతుడు రాముణ్ని వనంనుంచి పిలుచుకొనివచ్చి రాజ్యం అప్పగించదలచి పెద్ద సైన్యంతో సపరివారంగా రాముడున్న అడవికి పయనమవుతాడు. దారిలో భరద్వాజాశ్రమంలో ఒకరాత్రి ఆగుతాడు. ఆ ఋషి వారికి అద్భుతమైన విందు చేస్తాడు. ఆ ఏర్పాట్లు విశ్వకర్మ చేశాడు. అప్పుడు ఆ ఋషి ఇలా అంటాడు :- "తూర్పుకు పారే నదులు, పడమటికి పారే నదులు భూమ్యాకాశాలను వ్యాపించుగాక। మరికొన్ని మైరేయాన్ని, ఇంకా కొన్ని బాగా తయారుచేసిన సురను పారించుగాక। మరికొన్ని నదులు చెఱకుగడ రసంవంటి చల్లని నీటిని ప్రవహింపజేయుగాక।" (మైరేయం, సుర రెండు రకాలయిన మద్యాలు.)

> "అన్యాః స్రవంతు మైరేయం సురామన్యాః సునిర్మితామ్,
> అపరాశ్చోదకం శీతమ్ ఇక్షుకాండ రసోపమమ్."
>
> (అయో. 91-15)

3. అదే విందులోనే భరతుని సైనికులు తమ తమ వాహనాలకు చెఱకుగడలు, తేనె, పేలాలు మేత పెట్టారట.

> "ఇక్షూంశ్చ మధులాజాంశ్చ భోజయంతి స్మ వాహనాన్."
>
> (అయో. 91-56)

మరి ఒకటి రెండుచోట్ల చెఱకు ప్రసక్తి వుంది.

ఈ వ్యాసం కేవలం దిఙ్మాత్రసూచకం. కొండను అద్దంలో చూపినట్టు చూపాను. గృహ్య శ్రౌత సూత్రాలు, ఉపనిషత్తులు, జాతకకథలు, పరిశీలిస్తే, కావ్యాల వర్ణనలు తిరగవేస్తే ఇంకా ఎంతో సేకరించవచ్చు. ఇలాటి సదవకాశం కలిగించినందుకు ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన కేంద్రం (అనకాపల్లి) నిర్వాహకులకు చాలా కృతజ్ఞుణ్ణి.

[ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన స్థానం (అనకాపల్లి) పంచ సప్తతి మహోత్సవ సంచిక: 1913-1988]

# విశ్వవిద్యాలయాలకు వెలిగా జరిగిన వాఙ్మయ పరిశోధన

పరిశోధన అనే పదం నవ్య పరిభాషగా మనకు కొత్తదే అయినా, ప్రక్రియగా మనకు కొంత పరిచితమే. శబ్ద సాధుత్వా సాధుత్వ చర్చలు, శాస్త్ర వాక్యార్థాలు, అలంకారాదుల పరిశీలన, రసమీమాంస, వేదాంత విచారం, వ్యాఖ్యలు, టీకలు, టిప్పణులు, క్రోడపత్రాలు-ఇదంతా ఒకవిధంగా పరిశోధన వంటిదే. కాని, ఇది సంస్కృత వాఙ్మయానికి మాత్రమే పరిమితంగా ఉండేది.

తెలుగువారు సాహిత్య శాస్త్రాదుల విషయంలో సంస్కృతాలంకారికుల సిద్ధాంతాలపై ఆధారపడటంవల్ల, తాము కొత్తగా కనుక్కొన్న చమత్కార ప్రస్థానం వంటి వాటిని సంస్కృత భాషలోనే ప్రతిపాదించడంవల్ల, తెలుగులో సంస్కృతంలో లాగ పరిశీలన పద్ధతి పాదుకొనకపోయినా, సంకలన గ్రంథాలలోనూ లక్షణగ్రంథాలలోను కొంతకు కొంత పరిశోధన బీజాలు ఉన్నవని భావించవచ్చు. ఈ సందర్భంలో మడికి సింగన సకలనీతి సమ్మతం అనే సంకలన గ్రంథాన్ని పేర్కొనవచ్చు. ఈ సంకలనం కూడ సంస్కృత పద్ధతే.

పాశ్చాత్యులు మనదేశానికి వచ్చారు. పరిపాలకులయ్యారు. వారు విమతస్థులు, విదేశీయులు, విభాషీయులు కావడంవల్ల వారికి ఇక్కడి ప్రజల జీవిత పద్ధతంతా విచిత్రంగా కనిపించింది. హేళనతో కొందరు, నిజమైన జిజ్ఞాసతో కొందరు ఇక్కడి ప్రజల జీవన పద్ధతిని తెలుసుకొనడం ప్రారంభించారు. దేవాలయాలు చూశారు; దేవుళ్ళను పరిశీలించారు; శాసనాలు చదివారు; వాటి లిపుల మూలం తెలుసుకొనడానికి ప్రయత్నించారు; గ్రామాలకు వెళ్ళారు; జాతరలలో పాల్గొన్నారు; తాళపత్ర గ్రంథాలు సేకరించారు; ఎత్తి వ్రాయించారు; గ్రంథాలయాలు నెలకొల్పారు. ఈ విధంగా అన్ని రంగాలలోను ఆధునిక పరిశోధనకు నారులు పోసిన వారు పాశ్చాత్యులే.

## ఆరంభదశ

ఆరంభ దశలో పరిశోధన మూడు మొక్కలుగా మోసులెత్తిందని

మనం భావించవచ్చు. **మొదటిది:** దక్షిణ భారతంలో ముఖ్యంగా తెలుగుదేశంలో సర్వేయర్ జనరల్ కర్నల్ కాలిన్ మెకంజీ కావలి వెంకట బొర్రయ్య, వెంకటలక్ష్మయ్య, వెంకటరావు, నారాయణరావు, కావలి వెంకటనారాయణ స్వామి అనే వారి సహాయంతో స్థానిక చరిత్రలను, శాసన పాఠాలను, తాళ పత్రాలను సేకరించడం. **రెండవది:** కంపెనీ పరిపాలన వ్యవస్థలో ఉద్యోగు లయిన ఎల్లిస్ (1816), క్యాంపెల్ మొదలైనవారు దక్షిణ భారత ఉత్తర భారత భాషల జన్యజనక సంబంధాలను గురించి తులనాత్మక పరిశీలన చేయడం, ధాతుపాఠాలు సిద్ధపరచడం మొదలయినవి. **మూడవది:** సి.పి. బ్రౌన్ తాళపత్ర గ్రంథాలకు పద్యాలను పాదక్రమంలోను. వచనాలను మామూలు పంక్తులుగాను వింగడించి ప్రతులు వ్రాయించి, తైఫారు చేయించి పాఠాంత రాలు ఎత్తిచూపి ముద్రణకు సిద్ధపరచడం. ఈ మూడు పద్ధతులు అనంతర కాలంలో తెలుగు వాఙ్మయ పరిశోధనకు మూలబంధాలయాయి.

తెలుగు భారతం ఆదికావ్యంగాను, భాషకు కూడ ప్రామాణికంగానూ భావింపబడింది. కనుక, దాని పరిష్కరణకు సి.పి. బ్రౌను శ్రద్ధ వహించారు. అది 1830 ప్రాంతం. అంతకుముందే 1827లో భాగవత ప్రతిని పరిష్కరించి ముద్రణకు సిద్ధంచేశారు. తమ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు ఉపోద్ఘాతంలో "1827వ సంవత్సరమున సాధనముతో భాగవత సంష్కృత ప్రతి యొకటి సిద్ధము చేయబడినది. మదరాసులో తెలుగు భాగవతము 1840 వ సంవత్సరమున ముద్రింపబడినది." అని వ్రాసుకొన్నారు.

"మహాభారత మిప్పుడు చార్లెస్ ఫిలిఫ్ బ్రౌను గారి నిర్దేశము ననుస రించి మొట్టమొదటిసారి సంఖ్యాక్రమానుసారముగా గూర్చబడి వేఱు వేఱు పంక్తులుగాను, పద్యములుగాను వ్రాయింపబడినది. ఈ ప్రతిలో కావింపబడిన మార్పులు నేను సేకరించిన ప్రతులలో గానబడు భిన్న పాఠములు" అని నం. 163, 164 భారత పరిష్కృత ప్రతిలో ఉంది.

## రెండవ దశ

తెలుగులో ముద్రణ 1806 నాటికే మద్రాసులో ప్రారంభమయినా, 1830 నాటికిగాని నిర్దిష్ట స్వరూపాన్ని పొందలేదు. ముద్రణ ఫలితంగా పత్రి కలు వెలువడ్డాయి. పత్రికలవల్ల సాహిత్య ప్రక్రియావైవిధ్యం విలసిల్లడం, ప్రాచీన సాహిత్యంపట్ల ఆసక్తి ఎక్కువై ప్రతి పత్రికలోను ప్రాచీన గ్రంథం భాగాలు భాగాలుగా ప్రచురణ కావడం విస్తరించింది ఇదంతా నేడు పరిశోధన అనబడే దానికి దోహదమయింది. పత్రికలతో ప్రాచీన గ్రంథ ప్రచురణ ఒక

అంశం కావడంవల్ల పాఠ నిర్ణయం, కవి-దేశ కాలాదులు, ప్రతిభా మౌలికతలు, ఉత్తమ మధ్యమ కవులుగా శ్రేణీకరణం, విమర్శలు మున్నగునవి ప్రారంభమయాయి. పత్రికలవల్ల కలిగిన తత్క్షణప్రయోజనం పండితుల పరస్పర వాగ్వివాదాలు, ఖండనమండనలు మొదలయినవి. ఇవన్నీ పరిశోధనకు ప్రోదిచేశాయి. ఇలాంటి తొలి పత్రికలు నాల్గయిదింటిని పేర్కొనడం సముచితం. వాటిలో మొదటిది.

**సుజన రంజని (1866)**: ఇది తొలి సాహిత్య పత్రిక. బహుజన పల్లి సీతారామాచార్యులు, వింజమూరి కృష్ణమాచార్యులు, కార్మంచి సుబ్బరాయలు నాయనివారు దీని సంపాదకులు. దీనిలో కావ్యాల లఘుటిప్పణులు, కవి చరిత్ర సంగ్రహాలు, కావ్య లఘువిమర్శలు, ఆంగ్ల పారిభాషిక పదాలకు తెలుగు సమానార్థక పదాలు ప్రచురించేవారు. ఇది పరిశోధనకు మరొక దోహదం.

ఆంధ్రభాషా సంజీవని (1871) ఈ పద్ధతిని మరికొంత మెరుగుగా సాగించింది. దీని సంపాదకులు మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు.

పురుషార్థ ప్రదాయిని (1872) భాషోత్పత్తిపై చర్చను తొలిసారిగా ప్రారంభించింది. దీని సంపాదకులు ఉమా రంగనాయకులు. భాషోత్పత్తి, లిపి మొదలయిన వానిని "భాషోత్పత్తి మొదలగు వానిని గురించి" అని పరవస్తు శ్రీనివాస భట్టనాథాచార్యులయ్యవారలు చర్చించేవారు.

ఆధునిక పరిశోధనలో భాగమైన గ్రంథసమీక్షను తొలిసారిగా ప్రచురించినది వీరేశలింగంగారి సంపాదకత్వాన వెలువడిన వివేకవర్ధని (1874). వావిలాల వాసుదేవ శాస్త్రిగారి సంపాదకత్వాన వెలువడిన చింతామణి పత్రిక (1881) కూడా గ్రంథ సమీక్షలు విమర్శలు ప్రచురించింది.

## మూడవ దశ

ఆధునిక పరిశోధన సంప్రదాయానికి, వాఙ్మయ సంప్రదాయానికి గట్టి పునాదులు వేసినవారు వూండ్ల రామకృష్ణయ్యగారు. ఈయన అముద్రిత గ్రంథ చింతామణి అనే పత్రికను 1885 నుంచి 1904 దాకా సంపాదకులుగా నిర్వహించారు. ఇది పేరుకు అముద్రిత గ్రంథ చింతామణి అయినా, ఆధునిక పరిశోధన పద్ధతికే ఎక్కువ సహకరించింది. దీనికి సమకాలికమైన చిత్తూరి వర్తమాని అనే పక్షపత్రిక దీనిని ఈ విధంగా ప్రశంసించింది:-

"శ్రీ అముద్రిత గ్రంథ చింతామణి యను మాస పత్రిక నెల్లూరునందు 1885 సంవత్సరం జూన్ నెలలో ప్రారంభింపబడి వర్ధిల్లుచున్నది. ఈ పత్రిక

మొదటి భాగమందు వ్రాయబడు విద్యా విషయమందు ఛందో వ్యాకరణాలంకార శాస్త్ర విచారము, సమస్యాపూరణము, మనుచరిత్ర వసుచరిత్రాది ప్రాచీన గ్రంథస్థములగు పద్యముల కర్థనిరూపణము, భిన్నప్రతులయందు పాఠాంతరములున్నచో గవిహృదయ నిర్ధారణము, లక్షణ విరుద్ధంబులుగ గన్నట్లు శబ్దసమాసముల కాక్షేపణ పూర్వపక్ష సిద్ధాంతంబు ఇది మొదలగు విద్యార్థుల కత్యంత ప్రయోజనకరములగు ననేకాంశములు వ్రాయబడియున్నవి. దేశభాషాపఠనంబు కించిత్తైనను ప్రోత్సాహము లేక నవియుచుండు నిక్కాలంబుల నముద్రితంబులై జీర్ణంబు లగుచుండు రసవిశిష్టంబులగు ప్రాచీన గ్రంథముల నరసి రప్పించి లేఖక ప్రమాద జనిత దోషంబులు లేక పరిష్కరించి ముద్రించి యిప్పగిది సులభక్రయంబునకు నిప్పించుటచేత పత్రికాధిపతు లాంధ్ర భాషాభిమానుల సంపూర్ణ కృతజ్ఞతకు బాత్రులయి యున్నారు." (అముద్రిత గ్రంథ చింతామణి 1891 అక్టోబరు నం 4. సంచి 10.)

ఈ విధంగా 19 వ శతాబ్ది ఉత్తరార్ధం సాహిత్య పత్రికల కృషి 20వ శతాబ్దంలో ఆధునిక శాస్త్రీయ భాషా వాఙ్మయ పరిశోధనకు రూపురేఖలు తీర్చింది.

## నాల్గవ దశ

మద్రాసులో విశ్వవిద్యాలయం స్థాపితమైంది. దానితో పరిశోధనకు ప్రభుత్వ ప్రోత్సాహం 1857లో కలిగింది. మద్రాసు విశ్వవిద్యాలయానికి, తర్వాత వెలసిన విశ్వవిద్యాలయాలకు బాహిరంగా వాఙ్మయ పరిశోధన చేసిన మహనీయులను తెలుపడమే నా యీ వ్యాసం ఉద్దేశం. శాఖా చంద్ర న్యాయంగా కొందరిని మాత్రమే తెలుపడం సాధ్యమవుతుంది.

పైన పేర్కొన్న పత్రికలతో సంబంధమున్న వ్యక్తులు కొందరు వాఙ్మయ పరిశోధన వెలయించి, పరిశోధన భవనానికి మూలస్తంభాలయి నిలిచారు. వారిలో ప్రథములు **వరవస్తు వెంకటరంగనాథాచార్యులు** :- ఈయన సంస్కృత విజ్ఞాన సర్వస్వం, సంస్కృత నిఘంటువు కూర్చారు. సమకాలిక పత్రికలైన పురుషార్థ ప్రదాయిని, సకల విద్యాభివర్ధని మున్నగువాటిలో తెలుగు వాఙ్మయం గురించి మాత్రమే కాక ఆధునిక భౌతికశాస్త్రాలమీద, స్త్రీ పునర్వివాహం, స్త్రీ విద్యవంటి సంఘసంస్కరణ విషయాలపైన వ్యాసాలు వ్రాశారు. ఈయన వ్యాసాలను సంగ్రహం అని వ్యవహరించారు. అప్పటి తొలి మహామహోపాధ్యాయులు నలుగురిలో ఈయన ఒకరు.

**వీరేశలింగం గారు (1840-1919) :** ఈయన సాహిత్య ప్రక్రియా వైవిధ్యం ఆధునిక వాఙ్మయాన్ని పరిపుష్టం చేయడమేకాక పరిశోధనకు కూడ బాటలు తీర్చింది. గురుజాడ శ్రీరామమూర్తిగారు కవి జీవితములు అనే పేర కవిచరిత్ర రచించినా, ఆ చరిత్రలు కవుల ప్రతిభాప్రాశస్త్య నిరూపణలోను, దేశకాలాదుల నిర్ణయంలోను ఎక్కువగా జనశ్రుతిపైనే ఆధారపడి ఉండేవి. కాని, ఆయన కవులను రామాయణ కవులని, భారత కవులని, ద్వ్యర్థికావ్య కవులని, వీరశైవ కవులని తొలిసారిగా వర్గీకరించారు. ఆయన కూడా సమకాలిక పత్రికలు ప్రబంధ కల్పవల్లి, రాజయోగి మున్నగు వాటిలో వ్రాసేవారు. వీరేశలింగంగారు పుక్కిటి పురాణాలపై ఆధారపడక శాసనాలు, కైఫీయతులు పరిశీలించి, ప్రసిద్ధ గ్రంథభాండాగారాలలో చాలా సమయం వెచ్చించి శాస్త్రీయమైన పద్ధతిలో కవిచరిత్ర రచించారు. ఇది ఆయన పరిశోధనకు నికషం.

**కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు (1863-1940) :** ఆధునిక సాహిత్య ప్రక్రియలలో ఒకటయిన నవల ప్రపంచానికే కొత్త; మనకు మరీ కొత్త. నవలపై శాస్త్రీయ లక్షణ గ్రంథమనదగిన వివేక చంద్రికావిమర్శము బ్రహ్మయ్యశాస్త్రిగారు రచించడం మరింత కొత్త. ఈయన పెక్కు ప్రకరణాల ఈ గ్రంథంలో వివేక చంద్రికను మూల గ్రంథంతో పరిశీలించి విమర్శించారు. ఇది పరిశోధనకు, విమర్శకు రెండువిధాల మార్గదర్శక సూత్రాలను ఏర్పరిచింది. ఈ గ్రంథం మొదట రాజయోగి పత్రికలో ధారావాహికంగా ప్రచురితం కావడం కూడా కొత్త విషయమే. ఈయన సంప్రదాయాభిమాని అయినా, లోతుగా పరిశీలించే ప్రవృత్తి కలవాడనడానికి రామాయణమునందలి వానరులెవరు? రేఫద్వైవిధ్య విచారము మొదలగు వ్యాసాలు తార్కాణం. మన సంఘంలోని శాఖలను విమతస్థులైన క్రైస్తవులు ఆక్షేపించగా, ఈయన క్రైస్తవులలోని శాఖాంతశ్శాఖలను శతాధికంగా చూపుతూ వ్యాసాలు వ్రాశారు.

**సాంఖ్యాయన శర్మగారు (1864-1933):** తర్వాత ఎన్నదగిన వారు సాంఖ్యాయనశర్మ. సాహిత్యంతో సామాజిక జీవనం గురించి తొలిసారిగా తెలుపడం ఈయన పెట్టిన ఒరవడి. ఈయన సుజన ప్రమోదిని, కల్పలత అనే పత్రికలను నడిపారు. వాటిలో సాహిత్యంలోని శాస్త్ర విషయాలను గురించి వ్యాసాలు వ్రాశారు. బౌద్ధవాఙ్మయాన్ని తొలిసారిగా పరిచయంచేసి 'అవదాత కలభం' అనే పేర నాటకాన్ని రచించారు. భావకవితకు ప్రవర్తకులు కూడ ఈయనే.

**మానవల్లి రామకృష్ణ కవిగారు (1866-1957) :** ఈయన ఆంధ్ర సంస్కృతాలలో గొప్ప పరిశోధకులు. మద్రాసు ప్రభుత్వ పక్షాన వేట్లూర్థి

ప్రభాకరశాస్త్రిగారితో కలిసి మద్రాసురాష్ట్రమంతటా తిరిగి తాళపత్ర గ్రంథాలు సేకరించారు. విస్మృత కవులు అనే గ్రంథమాలలో 20 మంది కవులను గురించి వ్రాశారు. నన్నెచోడుని కుమార సంభవం, సకల నీతి సమ్మతం, ప్రబంధ మణిభూషణం మున్నగు తెలుగు అపూర్వకావ్యాలు, సంస్కృతంలో భరతనాట్యశాస్త్రం, కుందమాల, చతుర్భాణి వంటి అపూర్వ గ్రంథాలను పరిష్కరించి ప్రచురించారు. భరతకోశమనే పేర సంస్కృతంలో భరతశాస్త్ర సర్వస్వం రచించారు. నన్నెచోడుని కుమార సంభవం కూట సృష్టి అనే వాదం నేటికీ రావణకాష్ఠంగా ఉంది. ఈయన గొప్ప కృషి పాఠనిర్ణయం, కవి దేశ కాలాదుల నిర్ణయం, అర్థ నిర్ణయం.

**వేటూరి ప్రభాకరశాస్త్రి గారు (1888-1950) :** ఈయన తొక్కి చూడని తెలుగు వాఙ్మయరంగం లేదు. పరిశోధన వ్యాసాలు, భాషాతత్త్వ వ్యాసాలు, గ్రంథ సంపాదన, పరిష్కరణ, కూర్పులు, బాల వాఙ్మయం, జనపద వాఙ్మయం, పీఠికలు, శాసన పరిశోధన, చరిత్ర పరిశోధన-ఇలా అపారం. ఈయన శృంగారశ్రీనాథం గొప్పచరిత్రపరిశోధకగ్రంథం. పీఠికలలో బసవ పురాణం పీఠిక, క్రీడాభిరామ పీఠిక, తంజావూరు రాజుల చరిత్ర పీఠిక, అన్నమాచార్య చరిత్ర పీఠిక గొప్పవి. అన్నమాచార్యుల సంకీర్తన భండాగారాన్ని ఈయన శిష్యులతో శోధింపజేసి కీర్తనల రేకులను కనుక్కొన్నారు. లక్ష్మీపురశాసనం, అహదనకర శాసన పాఠాల చర్చ ఈయన శాసన, చరిత్ర పరిశోధనకు గీటురాళ్ళు. ఈయన వివిధవ్యాసాలు కొన్ని తెలుగు మెరుగులు, సింహావలోకనము, మీగడతరకలు మొదలుగా కొన్ని సంపుటాలుగా వెలువడ్డాయి. చాటుపద్యాలను ఈయన చాటుపద్య మణిమంజరి అనే గ్రంథంగా సేకరించి ముద్రించారు. ఇది సాహిత్య చరిత్రకు, దేశ చరిత్రకు ఎంతో సహాయకారి. వీరితో ఒక ఘట్టం సమాప్తమైందనవచ్చు.

**శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు (1874-1951)** కళాభిలాష కావ్య మాలిక అనే పేర పూర్వ కావ్య ప్రచురణకు విడిగా గ్రంథమాల నెలకొల్పడంతో పత్రికలలో ప్రాచీనకావ్యాలప్రచురణ ఆగిపోయింది. ఒకేమారు సమగ్రకావ్యం లభిస్తుండగా, పత్రికనుంచి ఒక ఫారం తీసి బైండు చేయించుకొని భద్రపరచుకొనే కష్టం ఎవరికి కావాలి? శాస్త్రిగారు తెలుగు భాషకు సమగ్రమైన నిఘంటువును 'తెలుగు నుడికడలి' వ్యవహార ప్రయోగాలు, సామెతలతో సహా నిర్మించడానికి ప్రయత్నించారు. ప్రాకృతభాషకు, తెలుగుకు గల సంబంధాన్ని కూడా చర్చించారు.

## కొత్త మలుపు

ఈ దశలో తెలుగు వాఙ్మయ, చరిత్ర పరిశోధనను కొత్త పుంతలకు మళ్ళించినవారు కొమర్రాజు లక్ష్మణరావుగారు (1877-1923). ఈయన బహుభాషావేత్త, చరిత్రకారుడు, శాసన పాఠకుడు, ఆధునిక వాఙ్మయ పరిశోధనకు శాస్త్రీయమైన రాజమార్గాన్ని తీర్చినవాడు. విజ్ఞాన సర్వస్వ నిర్మాణానికి భారత దేశంలో శ్రీకారం చుట్టి, పదకొండు వందల పుటల వ్యాసాలను ఆయనే రచించారు. యుద్ధమల్లుని బెజవాడ శాసనం, ద్రావిడ భాషలలోని సర్వనామాలు మొదలయిన పరిశోధన వ్యాసాలు లక్ష్మణరాయ వ్యాసావళిగా వచ్చాయి. ఈయన విజ్ఞాన చంద్రికా గ్రంథమాల స్థాపించి దేశభక్తి ప్రబోధక పరిశోధక గ్రంథాలు ప్రచురించారు.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు 1911 లో గ్రాంథిక వ్యావహారిక వాదంలో పుట్టిన గొప్ప సంస్థ. నాలుగు దశాబ్దాలపాటు ఈ సంస్థ ప్రచురించిన ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక భాషా, వాఙ్మయ, చరిత్రలకు చేసిన సేవ ఎనలేనిది. ఈ భాషా వివాదంలో మనకు కనిపించే వ్యక్తులు ముగ్గురు. జయంతి రామయ్య పంతులుగారు, వేదం వేంకటరాయ శాస్త్రిగారు, గిడుగు రామమూర్తి పంతులు గారు.

**జయంతి రామయ్య పంతులుగారు (1860-1941) :** ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు మూలస్తంభం. ఈయన పరిశోధన శక్తి అత్యద్భుతం. యుద్ధమల్లుని బెజవాడ శాసనాన్ని తొలిసారిగా వెలుగులోకి తెచ్చినవారు ఈయనే. 1800 శాసనాలు పరిశోధించారు. కవిజనాశ్రయాన్ని సంస్కరించి తొలిసారిగా ప్రచురించారు. సూర్యరాయాంధ్ర నిఘంటువుకు సంపాదకులుగా ఉన్నారు.

సంస్కృత సంప్రదాయ వ్యాఖ్యానపద్ధతిని ఉజ్జీవింపజేసినవారు **వేదం వేంకటరాయ శాస్త్రిగారు.** ఆముక్తమాల్యదా నైషధ విజయ విలాసాలకు గొప్ప వ్యాఖ్యలు వ్రాశారు. ఇవి వాఙ్మయ పరిశోధన వంటివే. ప్రతాపరుద్రీయ నాటకంలో సంస్కృత నాటకాలలో లాగ పాత్రోచిత భాష వాడారు. గ్రామ్యాక్షేపనిరసనము, గ్రామ్య భాషా ప్రయోగనిబంధనము అని భాషా విషయక గ్రంథాలు రచించారు.

**గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు (1863-40)** భాషా శాస్త్ర పరిశోధనలో ఆధునిక పాశ్చాత్య ప్రమాణాలను అనుసరించినవారు. ఈయనకు జర్మన్ లాటిన్ వంటి విదేశ భాషలు కూడా వచ్చు. 'సూర్యరా

యాంధ్ర నిఘంటు విమర్శ', 'బాలకవి శరణ్యం', 'ఆంధ్ర భిషక్కుల భాషా భేషజం', 'గద్య చింతామణి', 'నిజమైన సంప్రదాయం', 'మెమోరాండం', 'మోడరన్ తెలుగు' అనే గ్రంథాలు ఈయన పరిశోధన ప్రాభవాన్ని నిరూపిస్తాయి. ఊర్ణవాభమా, ఊర్ణనాభమా అనే చర్చ వచ్చినప్పుడు పండితులు ఊర్ణం నాభౌ యస్య సః ఊర్ణ నాభః అని వ్యుత్పత్తి చెప్పగా, ఈయన ఖండించి నాభం కాదు వాభమని పాశ్చాత్య భాషలలోని వెబ్ వబ్ మున్నగు సమానార్థక పదాలు చూపి ఊర్ణతో వలను నేసేది అనే అర్థం చెప్పి ఊర్ణవాభః అని సిద్ధాంతీకరించారు. తమ వ్యావహారిక భాషా సిద్ధాంత ప్రచారం కోసం తెలుగు అనే మాస పత్రికను నడిపారు.

**చిలుకూరి నారాయణ రావుగారు :** గిడుగు రామమూర్తి పంతులు గారి శిష్యుడైన ఈయన వ్యక్తి కాదు; గొప్ప సంస్థ. పరిశోధనతోపాటు సాహిత్య ప్రక్రియలన్నిటనూ సిద్ధహస్తులు. లక్ష తెలుగు సామెతలు సేకరించారు. 240 గ్రంథాలు రాశారు. పి. ఇ. ఎన్.' అధ్యక్షులుగా వున్నారు నవ్యసాహిత్యాన్ని చిరకాలం కిందటే చేపట్టారు. తెలుగు ద్రావిడ భాష కాదనే విశ్వాసంతో ఆంధ్ర భాషా చరిత్ర రెండు సంపుటాలు రచించారు. ప్రాకృత భాషలో గొప్ప కృషి చేశారు.

**వంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు:** ఈయన ఆర్యభారతీయ గ్రంథ మాల స్థాపించి వాత్స్యాయన కామసూత్ర, గౌతమ న్యాయసూత్ర, రాజశేఖర కవి సాహిత్య మీమాంసలను తెలుగు వ్యాఖ్యానంతో ప్రచురించారు ప్రాకృత భాషా ప్రజాసేవానూ అనే వంద పైచిలుకు పుటల గొప్ప వ్యాసాన్ని గిడుగు రామమూర్తి పంతులు గారి షష్టిపూర్తి సంచికలో ప్రచురించారు. ఎంకి పాటలను ప్రాకృత గాథలతో పోల్చి సమర్థించారు. జైనుల మత కథలను తొలిసారిగా తెలుగులో రచించినవారు ఈయనే. ఆంధ్ర వాఙ్మయ చరిత్రను నవీన దృష్టితో రచించారు. అది అచ్చుకాలేదు.

**వావిలికొలను సుబ్బారావుగారు :** వీరేశలింగం గారి తర్వాత మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో తెలుగు పండితులైనారు ఈయన రామాయణాన్ని యథామూలంగా నిర్వచనంగా ఆంధ్రీకరించి ఆంధ్ర వాల్మీకిగా విఖ్యాతిగన్న ఈయన రామాయణానికి 'మందర'మనే గొప్ప వ్యాఖ్య రచించారు. ఎవరో కృష్ణుని దూషించగా, కృష్ణుని చరిత్రను 'కృష్ణ లీలాతరంగిణి' అని మూడు సంపుటాలుగా రచించి నాల్గవ సంపుటంగా కృష్ణావతార తత్త్వము అనే గొప్ప విమర్శ

గ్రంథం రచించారు. ఇందులో ఈయన పరిశోధన వైశారద్యం స్పష్టమవుతుంది.

వేదం వేంకటరాయశాస్త్రి తమ్ములైన **వేదం వేంకటాచలమయ్యగారు (1864-1931)** అద్భుత ప్రజ్ఞాశాలురు, ఆదర్శ న్యాయవాదులు, అద్భుత ధారణా శక్తిగలవారు. గ్రీకు, లాటిన్, ఫ్రెంచ్, జర్మన్, ఈజిప్షియన్, అస్సీరియన్, అరబ్బీ, జెండ్ అవెస్థా, ఇటాలియన్, పర్షియన్, ఆర్మీనియన్ మున్నగు 12 విదేశీ భాషలు, తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ, మహారాష్ట్ర, గుజరాతి మున్నగు తొమ్మిది భారతీయ భాషలూ వచ్చిన మహాపండితులు. ప్రాచీన ఖగోళ, భూగోళ, భారతీయ విజ్ఞాన, భాషా, చరిత్రాదులలో పరిశోధన జరిపి ఆంగ్లంలో 20 గ్రంథాలు రచించారు. మిస్టిక్ సొసైటీ జర్నల్ అనే పత్రికకు తరుచుగా వ్యాసాలు వ్రాసేవారు. తెలుగులో కతిపయ శబ్దార్థ విచారము అనే శీర్షిక కింద వ్యాసాలు, రామాయణ విమర్శ, లలితా సహస్రనామ భాష్యం, అమరకోశ వ్యాఖ్య రచించారు. కతిపయ శబ్దార్థ విచారం వ్యాసాలు గొప్ప పరిశోధన వ్యాసాలు. ఈయన సత్యదూరమైన కేసును చేపట్టేవారు కారట.

**అక్కిరాజు ఉమాకాంతంగారు (1889-1942)** : పుస్తక పరిష్కరణను శాస్త్రీయం చేసినవారు. ఈయన పరిష్కరించిన పల్నాటి వీర చరిత్ర 1911 కె విశిష్టమైన, పరిశోధనాత్మకమైన పీఠికతో వెలువడింది. తమిళ దేశంలోవి తెలుగు వాఙ్మయాన్ని అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము అనే పేరుతో ఒక డిస్క్రిప్టివ్ క్యాటలాగు ద్వారా పరిచయం చేశారు. త్రిలింగ పత్రిక సంపాదకులుగా ఉండి దానిలో భాషా చర్చలో వ్యంగ్యచిత్రాలను తొలి సారిగా ప్రవేశ పెట్టినవారు ఈయనే.

**టేకుమళ్ళ రాజగోపాలరావుగారు (1876-1938)** : 'దక్షిణ దేశ భాషలలోని ఛందస్సు' అనే పేర ద్రావిడ భాషా ఛందాలను తులనాత్మకంగా పరిశీలించినవారు. 'సౌత్ ఇండియన్ రిసర్చ్' అనే ఆంగ్ల పత్రికను నడిపారు. యుద్ధమల్లుని బెజవాడ శిలా శాసనంలోని మధ్యాక్కరలను కనుక్కొన్నవారు ఈయనే. ఆంధ్ర వాఙ్మయ చరిత్రను తెలుగులోను, ఆంగ్లంలోను రచించారు. దక్షిణ భారత భాషా కుటుంబంలో తెలుగు ప్రాచీనతమభాష అని ఈయన వాదం.

**పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు (1877-1950)** : గొప్ప విద్వాంసులు. పురాణేతిహాసాలను పరిశోధన దృష్టితో చూడడం నేర్చినవారు. ఈయన స్వశాఖన నూత్న సమన్వయ విమర్శన మార్గం వెల్లడించారు. ఈయన

భారతాన్ని విమర్శిస్తూ వ్రాసిన మహాభారత చరిత్ర సంప్రదాయవాదులలో అల జడి కలిగించింది.

## పూర్తిగా పాశ్చాత్య పద్ధతి

**టేకుమళ్ళ అచ్యుతరావుగారు (1876-1938)** : కావ్య సమీక్ష లోను, పరిశోధనలోను పాశ్చాత్య విమర్శ పద్ధతులను పూర్తిగా అనుసరించిన వారు. ఈ పద్ధతిలో ఈయన విజయనగర సామ్రాజ్యంలోని ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, పింగళిసూరన (ఆంధ్రాంగ్లాలలో), ఆంధ్ర ప్రబంధము చరిత్ర నడిపారు.

**చాగంటి శేషయ్యగారు (1881-1956)** : కవుల చరిత్రను కవి తరంగిణి అని పదమూడు సంపుటాలుగా రచించారు. పూర్వులు చెప్పిన కవుల చరిత్రకు మరికొన్ని వివరాలు చేర్చారు; కొందరు విస్మృత కవులను చేర్చారు.

**బండారు తమ్మయ్యగారు (1891-66)** : వీరశైవ వాఙ్మయాన్ని మథించినవారు సోమనాథుని కావ్యాన్ని, రచనను చర్చిస్తూ కొన్ని గ్రంథాలు రచించారు వీరశైవ వాఙ్మయంలోని పెక్కు రచనలను పీఠికలతో ప్రచు రించారు. నన్నెచోడుడు తిక్కన సమకాలికుడని ఈయన అభిప్రాయం.

**మున్నంగి లక్ష్మీనరసింహశర్మ (1884-1937)**: ఈయన కవిత్రయ భారత సంశోధిత ప్రతిని ప్రచురించారు. ఇది పాఠనిర్ణయంతో, అర్థంకాని చోట్ల లఘుటీకలతో నాలుగు సంపుటాలుగా వచ్చింది. ఈయన శైలి ముచ్చటగా ఉండేది. చిన్న చిన్న పదాలతో, అనుప్రాసతో, అర్థ స్ఫోరకంగా రచించేవారు- వేంకటరాయ శాస్త్రిగారు విమతులకు పులి, విశ్వాసభాజనులకు చెలి - ఈ విధంగా.

**మేడేపల్లి వేంకట రమణాచార్యులు (1862-1943)** : ప్రాకృత భాషోత్పత్తి, నిఘంటు చరిత్ర, ఆర్య భాషా విజ్ఞానం, అలంకార శాస్త్ర చరిత్ర మున్నగు గ్రంథాలు రచించారు. తమిళ భాషలోను విద్వాంసులు, నమ్మాళ్వార్ తిరువాయమొళిని శఠగోప సహస్రమనే పేర సంస్కృతాంధ్రాలలో అనువ దించారు కావ్యంగా.

**దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు (1895-1984)** : కవులు, మహా పండితులు, మహారచయితలు. ప్రాచీన నిఘంటువులలో చేరని పదాలకు ప్రామాణికమైన అర్థ నిర్ణయంతో సాహిత్య సమీక్ష అనే ఉద్గ్రంథం - ఉదాత్త పరిశోధన గ్రంథం రచించారు. దీనిని తెలుగు నిఘంటు సర్వస్వ సమీక్ష అన

వచ్చు. ఈయన భాగవత పాఠపరిశోధనం గొప్ప పరిశోధనగ్రంథం. ఈయన గద్య పద్య రచనలలోను గొప్పవారు.

**రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు (1896-1982)** : సంస్కృతాంధ్ర కన్నడ తమిళ ప్రాకృతాంగ్లాలలో మహా పండితులు. ఈయన ఈ శతాబ్ది ప్రారంభంలో ఎర్రన సోమనల తారతమ్యాలపై గ్రంథాలు వ్రాసి నడకుదుటి వీరరాజు పంతులుగారితోను, వేలూరి శివరామశాస్త్రిగారితోను ఢీకొనవలసి వచ్చింది. శివరామశాస్త్రిగారు సోముడు అనే ప్రత్యేక గ్రంథమే వ్రాశారు నాచనసోమనపై. ఈవాద వివాదాలు చాలా సభ్యంగా సాగి అప్పటి పండితలోకానికి ఆమెతలయాయి. ఈయన వేమన గొప్ప ప్రామాణికమైన పరిశోధన గ్రంథం. తిక్కన తీర్చిన సీతమ్మ, నిగమశర్మ అక్క, నాచన సోముని నవీన గుణసనాథత్వం మున్నగు అపూర్వ వ్యాసాలతో సారస్వతాలోకం అనే సంపుటి, రాళ్ళపల్లి వారి పీఠికలు అనే పేర పరిశోధనాత్మక పీఠికల సంపుటి వెలువడ్డాయి. సుందరపాండ్యుని ఆర్యను చక్కని పీఠికతో అనువదించారు. హాలుని గాథాసప్తశతిని అపూర్వ పీఠికతో అనువదించారు. కన్నడంలోను విమర్శ వ్యాసాలు వ్రాశారు.

**పరవస్తు రామానుజస్వామిగారు** · ప్రాకృత విద్వాంసులు. ప్రాకృత భాషపై పెక్కు వ్యాసాలు వ్రాశారు. హేమచంద్రుని దేశీనామమాలను పరిష్కరించి ప్రచురించారు. దేశీనామమాలలోని తెలుగు పదాలను గురించి వ్రాశారు.

## పత్రికలలో విప్లవం

1923లో శారద మాస పత్రిక ప్రచురణతో సాహిత్య పత్రికా ప్రపంచంలో పెద్ద మార్పు వచ్చింది. శారద మోడర్న్ రివ్యూలాగ వర్ణ చిత్రాలతో ఆకర్షణీయమైన వివిధ శీర్షికలతో వెలువడింది. తెలుగుదేశంలోని పలువురు ప్రముఖులు సోమశేఖరశర్మగారు మున్నగువారు దీనిలో వ్యాసాలు వ్రాశారు. ఇది రెండున్నర సంవత్సరంపాటే వున్నా, వెలువడిన అన్ని సంచికలూ అమూల్యమైనవే. శారద వరవడిలోనే భారతి మాసపత్రిక వెలువడింది. 1924లో భారతి వివిధ సాహిత్య ప్రక్రియలకు, వివిధ రంగాలకు అరవైనాలుగేళ్ళుగా చేస్తున్న సేవ జగద్విదితం. నేడు ప్రముఖ కవులు, విమర్శకులు, చరిత్రకారులు, భాషా శాస్త్రజ్ఞులుగా పేరుపొందిన వారిలో అత్యధిక సంఖ్యాకులు భారతితో ప్రోత్సాహితులే. వీరిలో కొందరు విశ్వవిద్యాలయాలలోను పనిచేసిన వారున్నారు.

**నిడుదవోలు వెంకట రావుగారు (1903 1982)** : వీరిలో ప్రథమ

ఖ్యులు. ఈయన విజయనగరంలో జన్మించారు. 1920లో బి.ఎ.లో ఉత్తీర్ణులై జీవిక కోసం ఇంపీరియల్ బ్యాంకులో గుమాస్తాగా చేరారు. భారతి మొదలైన పత్రికలకు వ్యాసాలు వ్రాసేవారు. 1939లో కాకినాడలో సూర్యారాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో పండితులయ్యారు. 1941లో ఎం. ఎ. పరీక్షలో సర్వ ప్రథములుగా ఉత్తీర్ణులై బంగారు పతకం పొందారు. 1944లో మద్రాసు విశ్వ విద్యాలయంలో చేరే వరకే 'త్రిపురాంతకోదాహరణం' పరిష్కరించి ప్రచురించారు. 'ఉదాహరణ వాఙ్మయ చరిత్ర' కూడా రచించారు 1942లో నరసరావుపేటలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు వార్షికోత్సవంలో ఈయనను విద్యారత్న బిరుదంతో సత్కరించారు. 1951లో విశ్వనాథ సత్యనారాయణ గారి అధ్యక్షతను జరిగిన సన్మానసభలో పరిశోధన పరమేశ్వర బిరుదంతో గౌరవించారు. 1923కే బహుజనపల్లి సీతారామాచార్యులు, తంజనగరం తేవప్పెరుమాళయ్య మున్నగువారి జీవిత చరిత్రలు, పరిశోధన వ్యాసాలు సాహిత్య సర్వస్వం (ఏలూరిపాటి రామభద్ర చయనులు), ఆంధ్ర సర్వస్వం (ఏడిద కామేశ్వరరావు)లలో వ్రాశారు. వావిళ్ళవారు ప్రచురించిన పెక్కు ప్రబంధాలకు పీఠికలు సంతరించారు. శతక సంపుటి, పట్టాభిరామపండితీయం, రావిపాటి గురుమూర్తి శాస్త్రి వ్యాకరణం, బసవోదాహరణం, వీరభద్ర సముచ్చయం, వీరశైవ ప్రమాణ శతకాభరణం సంస్కరించారు. తండ్రి సుందరపంతులు గారి నుంచే పరిశోధన ఈయనకు అవడింది.

**బులుసు వేంకట రమణయ్యగారు (1908-1990)**: విజయనగరంలో జన్మించారు. విజయనగరం మహారాజా సంస్కృత కళాశాలలో సాహిత్య విద్యా ప్రవీణలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై బెనారస్ విశ్వవిద్యాలయాలలో పరిశోధన చేసి సంస్కృతాలంకార చరిత్ర రచించారు. ఇనపయెడ్లు, పొగడదండ మున్నగు పరిశోధన వ్యాసాలు కోకొల్లలుగా రచించారు. ఈయన కూడా వావిళ్ళ వారి గ్రంథాలకు అమూల్య పీఠికలు వెలయించారు. కువలయానందం అనువదించి, తెలుగు ప్రబంధాల నుంచి ఉదాహరణ లిచ్చే సంప్రదాయాన్ని ప్రవర్తింపజేశారు. ఆంధ్రాలంకార చరిత్ర రచించారు. బాలప్రౌఢ వ్యాకరణాలకు వ్యాఖ్యలు, వివిధ ప్రబంధాలకు వ్యాఖ్యలు రచించారు. కవి సప్తపతి పేరుతో 700 మంది కవుల చరిత్ర రచించారు. చంద్రికఅనే సాహిత్య మాసపత్రికకు సంపాదకులు. వీరి కథలు వ్యాసాలు, అసంఖ్యాకాలు. వెంకటరావుగారి తర్వాత ఇంతటి రచనా బాహుళ్యంగల పండితులు ఈయనే.

**సురవరం ప్రతాపరెడ్డిగారు (1896-1953)**: ఈయన గొప్ప సంస్థ.

తెలంగాణా వైతాళికులలో ఒకరు. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో బి.ఎ., లా కాలేజీలో బి.ఎల్. చదివారు. కర్నూలులోని వనం శంకర శాస్త్రిగారి వద్ద వ్యాకరణాది శాస్త్రాలు చదివారు. గోలకొండ పత్రికకు సంపాదకులుగా తెలంగాణాను సాహిత్యకంగా, సాంస్కృతికంగా మేల్కొలిపారు. విజ్ఞానవర్ధని మున్నగు వివిధ సంస్థలను నిర్వహించారు. గోలకొండ కవుల సంచిక వెలయించారు. రామాయణ విశేషాలు; ఆంధ్రుల సాంఘిక చరిత్ర ఈయన పరిశోధనకు దర్పణాలు.

**శేషాద్రి రమణ కవులు** (1893-1963) : ఈ పేరుతో ప్రఖ్యాతులైన దూపాటి శేషాచార్యులు, వెంకట రమణాచార్యులు గుంటూరు జిల్లా ఓడరేవులో జన్మించారు. మొదట వీరు బాపట్లలో ప్లీడరు గుమాస్తాలుగా పని చేశారు. తర్వాత జయంతి రామయ్య పంతులుగారి పరిచయంతో వీరి జీవితం పరిశోధనాత్మకంగా మారింది. పంతులుగారి ఆదేశంపై శేషాచార్యులు గుంటూరు మండలంలోను, రమణాచార్యులు నిజాం రాష్ట్రంలోను శాసన సామగ్రిని, తాళపత్ర గ్రంథాలను సేకరించారు ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుస్తక భాండాగారం కోసం. తర్వాత ఇద్దరూ తెలుగు పండితులుగా కొంత కాలం పనిచేశారు. పిదప వెంకట రమణాచార్యులు లక్ష్మణరావుగారి ఆదేశంపైన రామప్ప, పాకాల శాసనాలు సేకరించారు. కట్టమంచి రామలింగారెడ్డి ఆదేశంపై తెలంగాణాలో పర్యటించి అనేక తాళపత్ర గ్రంథాలు సేకరించి ఆంధ్ర విశ్వవిద్యాలయానికి పంపారు. పిదప హనుమకొండలో స్థిరపడి చారిత్రక పరిశోధన మండలి స్థాపించి 1931 లో అఖిలాంధ్ర చారిత్రక సమ్మేళనం జరిపారు. పోతన ఓరుగల్లువాడని, మల్లికార్జున పండితుడు తెలంగాణా వాడని, రుద్రమదేవి గణపతిదేవుని కూతురని, మల్లినాథుడు మెదకువాడని తొలుత చెప్పినది వెంకటరమణాచార్యులే. 'ఆంధ్ర మంత్రులు', 'రెడ్డికుల నిర్ణయ చంద్రిక', 'ఆంధ్ర వీరులు' గొప్ప చారిత్రక కృతులు. వావిళ్ళ వారి శతక సంపుటాలు, విష్ణు పురాణము, సీతారామాంజనేయ సంవాదము, కవిరాజ మనోరంజనము, మార్కండేయ పురాణము, దశరథ కుమార చరిత్ర, హరివంశము, భాగవతము మొదలయిన వాటిని పరిష్కరించి పీఠికలు వెలయించారు. వసుచరిత్ర వ్యాఖ్యానము, ఆంధ్రపద విధానము, హారావళి ప్రభృతి నిఘంటు పరిష్కృతి, అర్థాలు, లక్ష్మణరాయ పరిశోధన మండలి శాసనాల పరిశోధన వీరి పరిశోధనకు ఎత్తిన బావుటాలు.

**ఆదిరాజు వీరభద్రరావుగారు** (1890-1973): ఈయన నిజాంరాష్ట్ర వైతాళికులలో ఒకరు. ఈయన మధిర తాలూకా దెందుకూరులో జన్మించారు.

హైదరాబాద్‌లోని చాదర్‌ఘాట్ హైస్కూలులో మెట్రిక్ చదివారు. పిదప కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలోను, విజ్ఞానచంద్రికాగ్రంథమండలి లోను కార్యకర్తగా కొమర్రాజుగారి వద్ద పనిచేశారు. అప్పుడు, మద్రాసులో విజ్ఞాన సర్వస్వంలో పనిచేసినప్పుడు ఆయనకు పలువురు విద్వత్ప్రముఖులు— వీరేశలింగం, చిలుకూరి వీరభద్రరావు, గురజాడ అప్పారావు, వేమూరి విశ్వనాథ శర్మ మున్నగువారితో పరిచయం కలిగింది. 1914 నుంచి 1958 వరకు మహబూబ్ కాలేజి, చాదర్ఘాటు హైస్కూలు, నారాయణగూడ బాలికోన్నత పాఠశాలల్లో పనిచేశారు. పిదప సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము ప్రధాన సంపాద కులుగ, ఆంధ్ర చంద్రికా గ్రంథమాల ప్రధాన సంపాదకులుగా ఉన్నారు. జీవిత చరితావళి, చైతన్య జీవిత చరిత్రలు, మాడపాటి హనుమంతరావు, గ్రీకు పురాణ గాథలు, ప్రాచీనాంధ్ర నగరాలు, షితాబుఖాను, తెలంగాణా శాసనాలు మున్నగునవి వీరి పరిశోధన గ్రంథాలు.

**కురుగంటి సీతారామయ్యగారు (1880-1959)** : సంస్కృతాం గ్లాంధ్ర పండితులు. తెనాలి తాలూకా వేమూరులో జన్మించారు. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో బి.ఏ. ఆనర్సులో ప్రథములుగా బంగారు పతకం పొందారు. ప్రభుత్వ విద్యాశాఖలో స్కూళ్ళ ఇనెస్పెక్టరుగా పనిచేశారు. సహాయనిరాకరణలో ఆ ఉద్యోగం మాని బెజవాడలోని జాతీయ కళాశాలలో ప్రధానాచార్యులుగా వున్నారు. విద్యార్థి మాస పత్రికను స్థాపించి, సంపాద కులుగా నిర్వహించారు. కొవ్వూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగా పని చేశారు. ఫస్ట్‌గ్రేడ్ ప్లీడరై తెనాలిలో కొంతకాలం న్యాయవాదిగా వున్నారు. తంజావూరు సరస్వతీ గ్రంథాలయం సూపరింటెంటుగా వున్నారు. 1933 నుంచి 1949 వరకు హైదరాబాదులోని నిజాం కళాశాలలో సంస్కృతాంధ్రా చార్యులుగా, పిదప దక్కన్ రేడియోలోను, ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరోలోను అనువాదకులుగా, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంస్కృత లిఖిత గ్రంథాలయ సంపాదకులుగా ఉన్నారు. దాదాపు 30 గ్రంథాలు రచించారు. వాటిలో నవ్యాంధ్ర సాహిత్యవీథులు, అలంకార తత్త్వవిచారము, కొందరు తంజావూరు కవులూ పండితులు, తంజాపురాంధ్ర నాయకుల చరిత్ర, హాండ్ బుక్ ఆఫ్ తెలుగు లిటరేచర్, కురుగంటి వ్యాసలహరి, షడ్దర్శనాలు ప్రసిద్ధాలు.

**నేదునూరి గంగాధరంగారు (1904-70)** : జానపద సాహిత్య సంకలన కర్త, రచయిత. రాజమండ్రిలో జన్మించారు. 1925 లో లోయర్ గ్రేడ్ ట్రైనింగులో నెగ్గి కొంతమూరు ప్రాథమిక పాఠశాలకు ప్రధానోపా

ధ్యాయులయ్యారు రాజమండ్రి ట్రైయినింగ్ కాలేజీలో అప్పుడు పనిచేస్తున్న మానవల్లి రామకృష్ణ కవిగారి వద్ద లక్షణశాస్త్రాలు అభ్యసించారు. ఆయన ప్రేరణతో తాళపత్ర గ్రంథాల సేకరణ, టేకుమళ్ళ అచ్యుత రావుగారి ప్రేరణతో పాత పాటలు, పల్లెపదాలు, చింతా దీక్షితులుగారి సూచనతో స్త్రీల పాటలు, కథలు, కథాగేయాలు, శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారి సలహాపై పొడుక మాటలు, నుడికారాలు, సామెతలు, జాతీయాలు సేకరించారు. జానపద సాహిత్యాన్ని పెక్కు సంపుటాలుగా ప్రచురించారు. శ్రీ కాశీ కృష్ణాచార్యులు ఈయనను కవికోకిల, వాస్తు విశారద బిరుదులతోను, అయ్యదేవర కాళేశ్వర రావుగారు జానపద వాఙ్మయోద్ధారక బిరుదంతోను గౌరవించారు. జానపద సాహిత్యమే ఊపిరిగా జీవితం గడిపారు ఈయన.

**తాపి ధర్మారావుగారు** : ప్రాచీన నవీన సాహిత్యాలకు కొలికి, బంగారు కొలికి. విజయనగరం వాస్తవ్యులు. గొప్ప పత్రికారచయితలు. సమదర్శిని, జనవాణి దినపత్రికలకు, 'సందేశం' మున్నగు వారపత్రికలకు సంపాదకులుగా గొప్ప సేవ చేశారు. సహజంగా పరిశోధన ప్రవణులు కనుక కవితలో అక్షర శారదాస్తుతి అనే పేర లిపి పరిణామం రచించారు. శృంగేరి పీఠాధిపతులచే ఆంధ్ర విశారద బిరుదం పొందారు. ఈయనవి 'సాహిత్య మురు ముురాలు', 'దేవాలయంపై బూతుబొమ్మలు', 'పెళ్ళి - దాని పుట్టు పూర్వోత్తరాలు' మున్నగునవి మంచి పరిశోధన గ్రంథాలు.

**గవని వెంకట కృష్ణారావు గారు (1914-79)** : సంస్కృతాంధ్రాంగ్ల భాషా పండితులు. తెనాలి తాలూకా కూచిపూడిలో జన్మించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం పట్టభద్రులై కళాపూర్ణోదయంపై పరిశోధన జరిపి పి.హెచ్‌డి పట్టా పొందారు. మార్క్సు దృష్టితో కావ్యజగత్తు రచించారు. పాశ్చాత్యతత్త్వ సిద్ధాంతాలను తొలిసారిగా తెలుగులోకి తెచ్చినవారు ఈయనే. ప్లేటో ఆదర్శరాజ్యం, కాంట్ పరతత్త్వ వాదం, విగ్రహవ్యావర్తిని అనువాదం. మాధ్యమికకారికల అనువాదం. వివరణ గొప్ప పరిశోధన గ్రంథాలు. ఈయన పొన్నూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగా, వివిధ పత్రికలలో సహాయ సంపాదకులుగా, ఆకాశవాణిలో అసిస్టెంట్ ప్రొడ్యూసరుగా వున్నారు. కథకులుగా, నాటక రచయితగా నవలా రచయితగా కూడ పేరుపొందారు.

**డాక్టర్ తిమ్మావఝ్ఝల కోదండరామయ్య (1926-1981)**: ఈయన కవి, పండితుడు, విమర్శకుడు, పరిశోధకుడు ఈయన విద్వాన్, బి. వో. ఎల్., ఎం. ఏ.లలో సర్వ ప్రథముడుగా బంగారు పతాకాలు పొందారు. ఎం. ఏ.లో

సెంచరీ రికార్డు బ్రేకరు. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో పండితుడుగాను, మద్రాసు త్యాగరాయ కళాశాలలోను, వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో రీడరుగాను, మధురై విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసరు గాను వున్నారు. వివిధ విశ్వ విద్యాలయాలలోని వివిధ సంఘాలలో సభ్యులు. వావిళ్ళ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, కేంద్ర సాహిత్య అకాడెమి, తిరుపతి దేవస్థానం, స్వీయగ్రంథమాల అయిన సాహిత్య కుటీరం పక్షాన పెక్కు ప్రాచీన గ్రంథాలను పరిష్కరించి పీఠికలతో ప్రచురించారు. భారతీయ సాహిత్య తులనాత్మక పరిశీలన, వాఙ్మయ విమర్శ, పదసాహిత్యం, వ్యాకరణ చ్ఛందోలంకారాలు-మున్నగు రంగాలలో కృషి చేశారు. ఈయన పరిష్కృత గ్రంథాలలో అనుభవసారము, కేయూర బాహుచరిత్ర, శ్రీకాళహస్తి మాహాత్మ్యము, సారంగపాణి పదాలు పేర్కొనదగినవి. పరిశోధన గ్రంథాలలో కళాపూర్ణోదయ ప్రశంస, పాలవెల్లి, భువన విజయము, తెనుగు మెఱుగులు, కవిరాజశిఖామణి, తమిళ సాహిత్య చరిత్ర గణనీయమైనవి. నాతోపాటు పరిశోధనకు సహసంపాదకులు.

వీరు కాక పలువురు ఎందరో పరిశోధకులున్నారు-

రమణారెడ్డి గారు - గురుజాడ మహోదయం, బంగోరే - బ్రౌను జాబులు మొదలయినవి. దొరస్వామి శర్మగారు ఛందో వ్యాకరణాలపై గొప్ప కృషి చేశారు.

ఆరుద్ర గారి సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర మున్నగునవి పరిశోధక గ్రంథాలు, ఇవి మౌలికాలు కాకపోయినా, వివిధ విషయాల సేకరణ గలవి.

**తిరుమల రామచంద్ర** : నేను పరిశోధన పత్రికను అడ్వర్‌టైజ్‌మెంట్లు లేకుండా పడిపాను. మన లిపి పుట్టుపూర్వోలు-లో కొత్త విషయాలు చాలాచెప్పాను. భారతీయదేశ భాషలలో లిపిపై ఇదే సమగ్రగ్రంథం. 'నుడి నానుడి'-వివిధ దృక్కోణాలతో వ్రాసినది. ప్రాకృత సాహిత్యానికి తెలుగుకు గల సంబంధాన్ని తెలిసికొన ప్రయత్నించాను 'గాథా సప్తశతిలో తెలుగు పదాలు'లో. సాహితీ సుగతుని స్వగతం, ప్రాకృతంలో రామకథ, మౌలిక వ్యాస సంపుటాలు. దాదాపు 1000 పుస్తకాలు సమీక్ష చేశాను. తెలుగు భాషా చరిత్ర, వజ్రచ్ఛేదిక, జేగంటలు మున్నగువాని సమీక్షలు వైరం తెచ్చాయి. బుద్ధుని సమకాలికులైన వైశ్య పుంగవులు మొదలయినవి గొప్ప వ్యాసాలుగా పేరుపొందాయి.

ఇంకా ఎందరో శ్రీయుతులు చేకుమళ్ళ కామేశ్వరరావు, గొబ్బూరి వెంకటానంద రాఘవరావు, వసంతరావు వెంకటరావు, హరి ఆదిశేషువు, వెల్లంద ప్రభాకరరావు మున్నగువారు ఉన్నారు. ఇది అద్దంలో కొండను చూపడం మాత్రమే.

[1986 ఫిబ్రవరి 7న కాకతీయ విశ్వ విద్యాలయం నిర్వహించిన విమర్శ సదస్సులో సమర్పించిన వ్యాసం. తెలుగు : అక్టోబర్ 1991]

# గాథాసప్తశతితో విచ్చుకున్న తెలుగువాని కవితాకంఠం

తెలుగువాని కవితా కంఠం విచ్చుకుంది రెండు సహస్రాబ్దాలకు ముందే. గద్గద నదద్గోదావరీనది, పచ్చని అరణ్యాల దుప్పట్లుకప్పుకొని నిక్కిచూస్తున్న కొండలు, కొండలపిండులు దొర్లుతున్నట్టున్న మబ్బులను చూచి నర్తించే నెమళ్ళు, శరత్కాలంలోని నీలాకాశం, నీలాకాశంలోని నిండు చందురుడు తెలుగువాని కవితకు కారణమయి ఉంటాయి. వాటినే గొంతెత్తి గాథా ముక్తకాలుగా పాడాడు. ఆ ముక్తకాలను హాలుడు తన గాథా సప్తశతిలో కూర్చాడు.

## గాథా సప్తశతి యుగం

తెలుగువాళ్ళనదగిన అలయుడు, మానుడు, అలక్కుడు, హరియూళుడు, అసులద్ధీ, అణులచ్ఛీ మున్నగు కవులు, కవయిత్రులు చిత్రించిన దృశ్యాలు చూస్తుంటే, ఇంత అందం, ఇంత సహజత వీటికి ఎలా అబ్బాయా? అని మనం విస్తుపోతాము.

ఫాలేహి అచ్ఛభల్లం వ
ఉఅహ కుగ్గామ దేఉల ద్దారే,
హేమంతఆల పథిఓ
విజ్ఝూఅంతం పలాలగ్గిం. (గాథా స. 2.9)

(పాటయ త్యచ్ఛభల్ల మివ
పశ్యత కుగ్రామదేవకుల ద్వారే,
హేమంతకాల పథికో
విధ్మాయమానం పలాలాగ్నిమ్.)

చలికాలం. పల్లెటూరి దేవాలయం ముందు ఒక బాటసారి గడ్డినెగడు వేశాడు. చలికి గడ్డినెగడు ఎంత సేపు ఉంటుంది? కొంత సేపటికి ఆరిపోతుంది. పైకి ఆరిపోయినా, లోపల నిప్పు ఉంటుంది. కనుక వేడిమి కోసం బాటసారి

కర్రతో కెలుకుతున్నాడు. ఆ కెలకడం ఎలుగుబంటిని చీలుస్తున్నట్టు ఉన్నదట. కాలిన గడ్డి మంట ఆరిపోగానే నల్లగా పెద్ద రాశిగా కనిపిస్తుంది. కర్రతో కెలికితే, లోపల ఎర్రగా నిప్పు కణ కణ మంటుంది. కవి ఈ బైట ఆరిన నెగడును పొట్ట చీలుస్తున్న ఎలుగుబంటితో పోల్చాడు.

దారిద్ర్యాన్ని చిత్రించడంలో గాథా సప్తశతి కవి నేటి ఆధునిక కవిని కల్పనలో ఎలా మించి పోయాడో ఒక్క గాథోదాహరణం.

దుగ్గఅ కుటుంబఅట్ఠీ
కహంణు మఏ ధోఇఏణ సోఢవ్వా,
దసిఓసరంత సలిలేణ
ఉఅహ రుణ్ణంవ పడఏణ, (1-18)
(దుర్గత కుటుంబాకృష్టిః
కథన్ను మయా ధౌతేన సోఢవ్యా,
దశాపసరత్ సలిలేన
పశ్యత రుదిత మివ పటకేన.)

కటిక దర్రిదం. ఉన్న ఒక్క గుడ్డనూ దినమూ ఉతికి పులిమి ఆరవేసి కప్పుకుంటున్నారు. గుడ్డ చీకిపోయి అంచులనుంచి నీరుకారుతున్నది. ఈ దర్రిదపు సంసారం గుంజుకొని రావడం ఇక నాచేత కాదు — అన్నట్టు ఆగుడ్డ ఏడుస్తున్నదట.

కవితావతారానికి ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలు కారణమని కొందరు ఆలంకారికులు, ప్రతిభ మాత్రమే సమవాయకారణమని మరికొందరు చెప్పారుగాని, నిజానికి పరిసర పరిస్థితి, సాంఘిక పరిణామాలు ముఖ్యకారణమని నాతలంపు. రామాయణం వంటి కావ్యం ఆవిర్భవించడానికి బలమైనకారణం సంఘాచారాల మార్పులేనని నా విశ్వాసం. అన్నమరణిస్తే, అన్నభార్యను తమ్ముడు పెండ్లాడి, కుటుంబార్థిక వ్యవస్థను శిథిలంకానీక చూచుకోడం ఒకప్పుడు పరివ్యాప్తంగా ఉన్న ఆచారం. దాని అవశేషాలు నేడూ ఉత్తర భారతంలో పెక్కుకులాలలో ఉన్నాయి. అది సభ్యతకాదని సంఘంలో వివేకవంతులు భావించారు. వాల్మీకి దానిని ప్రధానంగా తీసుకొని సౌభ్రాత్రం జీవగర్రగా రామాయణం గానం చేశాడు.

కాళిదాసు రఘువంశ మహాకావ్యం రచించడానికీ బలమైన కారణం ఉంది. రామకథను జైనబౌద్ధ సంప్రదాయానుయాయులు ఇటులాగి, అటులాగి, ఛీకిరి బాకిరి చేశారు. ఈవిధంగా రెండువేల ఏళ్ళనాడు జైన సంప్రదాయంలో

'పఉమచరిఉ' అనే పేర రామాయణం విడ్డూరంగా వెలువడింది. దానిని ఎదు ర్కొని వాల్మీకి సంప్రదాయ పరిరక్షణకే భాసుడు రామాయణ నాటక చక్రాన్ని, కాళిదాసు రఘువంశాన్నీ, అతని సమకాలికుడూ, బహుశా అతని శిష్యుడూ అయిన వాకాట ప్రవరసేన మహీపాలుడు సేతుబంధమనే ప్రాకృతకావ్యాన్నీ రచించారని నా విశ్వాసం. సంఘ పరిస్థితులు, ఆటు పోట్లు మొదలయినవాటి పరిణామాలవల్ల నాయకులు, సంఘ సంస్కర్తలు అవతరించినట్లే, కావ్యాలు అవతరిస్తాయి. ఈ పరిస్థితే తెలుగు కవితకూ పట్టింది.

## గాథా సప్తశత్యనంతర యుగం

సంస్కృత ప్రాకృతాల ప్రాభవంవల్లనో, మరే కారణంవల్లనో తెలుగు వాడు తన మాతృభాషలో కొన్ని శతాబ్దాలపాటు నోరు విప్పలేదు. క్రీస్తుశకం ఆరవ శతాబ్దం చివరి పాదంలో రేనాటి చోళుల కాలంలో తొలి తెలుగు శాసనం పడింది. తర్వాత తన భాషా సారస్వతాలలో ఎన్నో కల్పనలు చేసి ఉంటాడు తెలుగువాడు. ఎన్నో పాటలు, పద్యాలు చెప్పి ఉంటాడు. కాని పద్యాలు శాసనాలలో లిఖిత రూపం దాల్చడం మాత్రం తొలి తెలుగు శాసనంపడిన మూడు వందలేళ్ళకు గాని జరుగలేదు. తూర్పు చాళుక్యరాజయిన గుణగవిజయాదిత్యుని సేనాపతి అయిన పండరంగడు తన విజయాలను వర్ణించే పద్యాన్ని ఒక శిలా శాసనంలో చెక్కించాడు. దీనిని అద్దంకి శాసనమంటారు. (849-850). జానపద గేయాలు తరచుగా ఉండే తరువోజలో ఉంది ఈ పద్యం.

"పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు
　　బలగర్వ మొప్పంగ బైలేచి సేన
పట్టంబు గట్టించి ప్రభు పండరంగు
　　బంచిన సామంత పడువతో బోయ
కొట్టముల్ పంద్రెండు గొని వేంగి నంటి
　　గొల్చి యాత్రిభువనాంకుశబాణు నిల్పి
కట్టెపు దుర్గంబు కడు బయల్సేసి
　　కందుకూర్బెజవాడ గావించె మెచ్చి."

తెలుగుదేశంలోనే ఉండి తొలి కన్నడ కావ్యం విక్రమార్జున విజయాన్ని రచిం చిన పంపమహాకవి సోదరుడు జినవల్లభుని గంగాధర కన్నడ శాసనంలో చివరన తెలుగు కందపద్యాలు రెండు ఉండడంవల్ల పద్య రచన అప్పటికి తెలుగు నాథంతటా ప్రారంభమయిందనే అనాలి. ఈ పద్య రచన క్రూడ

అమాంతంగా ఆకాశం పగిలి ఊడి పడిందేమీకాదు. నన్నయ్య తిక్కనల మధ్య కాలం వాడయిన పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో పేర్కొన్న తుమ్మెద పదాలు, ప్రభాతపదాలు, పర్వత పదాలు, ఆనంద పదాలు, నివాళి పదాలు, వాలేసు పదాలు మొదలైన దేశి గీతాలనుబట్టి తెలుగువాడు గాథాసప్త శతికాలం నుంచి ఏవేవో మట్లలో, బాణీలలో కూనిరాగాలు తీస్తూనే వుంటాడు. వాటిలో యాదృచ్ఛికంగా అక్షరావృత్తి, పదావృత్తి వుంటూనే వుంటాయి. వాటిని సమకాలిక కవులు సంస్కరించి, తమ సిద్ధాంతాలను ప్రజాసామాన్యానికి చెప్పడానికై వినియోగించుకోవలసి వచ్చింది. దానితో నూతన ఛ్ఛందః పద్ధతి, సంస్కృత దేశీ పద్ధతుల మేలికలయికతో ఏర్పడింది.

## భారత యుగం

ఇంతగా దేశి ఛ్ఛందస్సు జానపదులలో వ్యాప్తిలో ఉన్నా పెద్దపుస్తకం, గాథ, కావ్యం తెలుగులో అవతరించక పోయిందంటే ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. కాని, ఆశ్చర్యం నిజం. నన్నయకు పూర్వం తెలుగు దేశంలో జైన బౌద్ధాలు ప్రచారంలో ఉన్నాయి. జైనమతావలంబులు పాలకులు. ప్రజలలో వైదికమతాలవారూ ఉండి ఉంటారు. తక్కిన మతాలవారూ ఉంటారు. ఆయా మతాల పెద్దలు తమ అనుయాయులకోసం పాకృతాపభ్రంశాలతో పాటు దేశ భాషలలోను ఏవో రచనలు చేసే ఉంటారు. ప్రాకృతాపభ్రంశాలలో ఎన్నో తెలుగు కన్నడ పదాలు చేరడాన్ని బట్టి తద్‌భాషావేత్తలకు స్థానికులతో సంబంధం బాగానే ఉందని మనం గ్రహించవచ్చు.

ఈ జైన బౌద్ధాల ప్రాబల్యం వైదిక మత ప్రచారంతోనే గాక, వాటి తప్పులవల్లను 8, 9వ శతాబ్దాలలో తెలుగునాట సన్నగిల్లింది. దీనికి కారణం మహామేధావియయిన శంకరాచార్యుడు ఉపనిషదద్వైతాన్ని ఆసేతు శీతనగం ప్రచారం చేయడం. దీనికి తోడు తెలుగుదేశంలో చీటికి మాటికి అధికారాలు మారుతూ అల్లకల్లోలంగా ఉంది. కనుక ఏ మహాకావ్యమూ అవతరించడానికి అవకాశంలేకపోయి ఉంటుంది. కాని అరికేసరి పాలనలో వున్న తెలుగుదేశంలో పంపకవి కన్నడంలో మహా కావ్యం రచించాడు. కనుక పెద్దకావ్యం రచితం కాలేదనడానికి వీలులేదు. ఆ ప్రాంతంలో జైనుల ప్రాబల్యం వుంది. రాజాదృత భాష కన్నడం. కనుక తెలుగు కావ్యావతరణకు పశ్చిమాంధ్రంలో అవకాశం లేకపోయింది.

ఝాఝాఝాకు యుద్ధాలనుంచి కొంచెంగా తెరపి చిక్కింది. 1022లో

పట్టాభిషేకం చేసుకొన్నాడు. జనాన్ని నీతి మంతులను చేయాలనే భావం కలిగింది. దానికి భారతం తగినదని తోచింది.

ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
        అధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
        కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వ లక్ష్యసంగ్రహమని
        ఐతిహాసికు లితిహాసమనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
        యంబని మహి గొనియాడుచుండ        (భా. 1-1-32)

విశ్వజనీనమై పరగుచుండు గ్రంథం భారతం. రాజరాజుకు తమిళకన్నడాలతో సంబంధం పూర్తిగా ఉంది. తమిళభాషలో అదివరకే, రెండువందల సంవత్సరాలకుముందే పెరిందేవనార్ అనేకవి వెణ్బా అనే దేశివృత్తంలో భారతం రచించాడు. జైనకవులు భారతాన్ని విక్రమార్జున విజయమని, గదాయుద్ధమని తమమతానికి, ఇష్టానికి అనుగుణంగా మార్చివ్రాసి, వ్యాసునికి అప్రతిష్ఠతెచ్చారనుకుంటూ, తెలుగులో భారతం అవతరించాలనుకొన్నాడు పరమధర్మవిదుడైన రాజరాజు. పిదప

"తనకుల బ్రాహ్మణు ననురక్తు నవిరళ
        జపహోమ తత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
        నానాపురాణ విజ్ఞాన నిరతుఁబాత్రు
పాత్రు నాపస్తంబ సూత్రు ముద్గల గోత్ర
        జాతు సద్విమలావదాత చరితు
లోకజ్ఞు నుభయ భాషాకావ్యరచనాభి
        శోభితు సత్ప్రతిభాభియోగ్యు
        నిత్యసత్యవచను మత్యమరాధిపా
        చార్యు సుజను నన్నపార్యుఁజూచి"        (భా. 1-1-9)

తన మనస్సులో అనవరతం మహాభారతం వినాలనే అభిలాష పెద్దగా వుందని, కనుక,

"జననుత కృష్ణ ద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారతబ

ద్ధ నిరూపితార్థమేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్." (భా. 1-1-16)

అని కోరాడు. నన్నయ ఈ పనికి అర్హుడుకావడం నిస్సందేహం. కాని, ఆయన 'భారత భారతీ సముద్రముఁ దఱియఁగ నీఁదను విధాతృనకైనను నేరఁ బోలునే' అని జంకుతూనే, తన నేర్చుకొలది రచిస్తానని

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప" (భా. 1-1-25)

జగద్ధితంగా తెలుగులో మహాభారత సంహితా రచన బంధురుడయ్యాడు.

రాజరాజు రాజ్యంలో మరల కల్లోలం చెలరేగింది. అతడు రాజ్య భ్రష్టుడో, మృతుడో అయివుంటాడు. దానితో నన్నయకూ అశాంతి ఏర్పడింది; భారతరచన అరణ్యపర్వం మధ్యలోనే ఆగిపోయింది. ఆగిపోయిన ఘట్టంలోని చంద్రికావర్ణన పద్యం ఒక్కటే చాలు నన్నయను కవిగా ప్రపంచంలో నిల బెట్టడానికి. ఆ పద్య మిది :

"శారద రాత్రు లుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులం
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధ బంధుకో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగపాండు రుచి పూరములం బరిపూరితంబులై"

(3-4-142)

వ్యాస మహాభారతం తెలుగులోకి రాగానే ఇతర శాస్త్ర గ్రంథాలు కూడ తెలుగులోకి వచ్చాయి. అలాంటి వాటిలో పావులూరి మల్లన రచించిన గణితం పేర్కొనదగింది. ఇది మహావీరాచార్యుని సారసంగ్రహ గణితం అనే గ్రంథా నికి అనువాదం, పావులూరి గణితమనే ప్రసిద్ధమైంది. మల్లన పూర్తిగ నన్నయ ఒరవడిలోనే నడిచాడు అనువాదంలో. ఇతని తాత నన్నయ సమకాలికుడు. మూలం జైనమత సంబంధం. కాని మల్లన తన అనువాదాన్ని శైవపరంగా చేశాడు. నన్నయలాగే ఇతడుకూడ "అభినవసంఖ్యా మణి దీప్తి సారసంగ్రహ గణిత సముద్రంబు దరువంగ గణగితి ప్రీతిన్" అన్నాడు. మల్లన అనువాద పద్ధతికి ఒక్కపద్యం ఉదాహరిస్తాను మూలశ్లోకమిది:

"దత్త్వా న్యేకైకస్మై
జినభవనాంబుజాని తాన్యష్టౌ,

వసతీనాం చతురుత్తర
చత్వారింశచ్ఛతాని తాని కతి?"

దీనికి మల్లన అనువాదంలో జినభవనాలను శివాలయాలు చేశాడు.

"మేలుగ నెనిమిది యొక్క శి
వాలయమున కంబుజంబు లర్పించినచో
నీలెక్క నూటనలుబది
నాలుగు భవనముల కెన్ని నలినములయ్యెన్."

ఈ గణితంవల్ల మనకు ఆనాటి కొలతలు, నాణేలు, పెక్కు సాంఘిక విషయాలు తెలుస్తాయి. మల్లనగణితం పూర్తిగా అచ్చు పడలేదు. మిత్రులు. కీర్తిశేషులు డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్య కొంతభాగాన్ని, మేమిద్దరం సంపాదకత్వం వహించిన "పరిశోధన" పత్రికలో ప్రచురించారు. మరికొంత భారతిలో ప్రచురించారు. ఆయన ప్రతి లెక్కనూ మూలంతో సరిపోల్చి, వేసి సంస్కరించారు.

ఈ కాలంలోనే నీతిభూషణము, ముద్రామాత్యము వంటి నీతిశాస్త్ర గ్రంథాలు వెలువడినట్లు తర్వాతివారు ఉదాహరించారు.

నన్నయ పెట్టిన కవితా సంప్రదాయంలో పలువురు నడిచి ఉంటారు. కాని, అందరికీ దానిలో నైపుణ్యం సాధ్యమా? కనుక కవితకు కొన్ని లక్షణాలు, పద్ధతులు వుంటే మంచిదనితోచడం, అలాంటి మార్గదర్శక సూత్రాలు పలువురికి ఉపాదేయాలు కావడం సహజం. ఆ పరిస్థితులలో పుట్టింది కవి జనాశ్రయం.

కవి జనాశ్రయ రచయిత మల్లియరేచన. ఇతడు తనకాలపు కవులకు దారిచూపడానికి కన్నడ నాగవర్మ ఛందోంబుధి ననుసరించి కవిజనాశ్రయం వ్రాశాడు. ఇతడు జైనమతావలంబి అయిన వైశ్యుడు. తెనుగు కన్నడ తమిళ ప్రాంతాలలోని వైశ్యులందరూ పూర్వం జైనులే వారిని కోమట్లంటారు. కోమటిశబ్దం గోమఠ - గొమ్మట - శబ్దాలనుంచి పుట్టింది. తర్వాత వీరు శైవ వైష్ణవ మతాలు స్వీకరించినా కోమటిశబ్దం మారలేదు. మల్లియరేచన 'శ్రీవాదీంద్ర చూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాణుడు, కవి జనాశ్రయ శ్రావకాభరణుడు, మృగేంద్రోద్యచ్ఛౌర్యుడు, ప్రహరణకుశలుడు, అమిత సాహసుడు, అనతారి అని తనను చెప్పుకున్నాడు. కోమట్లేమి? సాహసమేమి? అన్ని పలువురు పూర్వం వాదించారు. సాహసం, ధైర్యం ఏకులం వారసత్వమూ

కాదు. భారతదేశాన్ని, భారతదేశంలోని కాశ్మీర్‌వంటి ప్రాంతాలను పాలించిన వైశ్యవంశాలవారున్నారు.

రేచన పంపమహాకవి సమకాలికుడు. నన్నయకు వంద సంవత్సరాల పూర్వుడు. (భారతితో డాక్టరు పరబ్రహ్మ శాస్త్రిగారి వ్యాసం.)

మల్లియరేచన పదదోషాలు, సమయదోషాలు, ఆగమదోషాలు, దేశకాల విరుద్ధమైనవి ఎన్నో తెలిపాడు.

"ఘన దండ కాష్ఠ కృష్ణా
జినములు సొగియింపనొక్క జినముని చనుదెం
చె ననగ సమయ విరోధం
బని కవులకు జెప్పె కవిజనాశ్రయ డొనరన్.

## కుమారసంభవ యుగం

భారత రచనతో జైనమతాన్ని ఎదిరించి ప్రాచీన వైదిక సంప్రదాయానికి నన్నయ పట్టంగట్టగా, అతి ప్రాచీన మతాలలో ఒక్కటైన శైవమతాన్ని అనుసరించినవారు శివ సర్వోత్తమత్వాన్ని ప్రచారం చేయడానికి పూనుకున్నారు. ఈ ఉద్యమానికి పండితత్రయం - శ్రీపతి పండితారాధ్యుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితారాధ్యుడు - నాయకత్వం వహించింది. వీరు ముగ్గురూ గొప్ప మాహాత్మ్యం చూపి శైవమతాన్ని చిరస్థాయి చేశారు. దీనికి ఆరాధ్యశైవమని పేరు. వీరు బ్రాహ్మణత్వాన్ని వదలుకోలేదు. కర్నాటక దేశంలో ఈకాలంలోనే చెలరేగిన బసవేశ్వరమతం బ్రాహ్మణత్వాన్ని వదలి, శివభక్తులలో వర్ణాలను రూపుమాపింది. కాని ఆ వర్గం వారు లింగాయతులు, లింగబలిజలు బలిజలు, జంగాలు అని వ్యవహృతులై విడిగా ఒక మతశాఖ అయ్యారు. "భక్తిమీద వలపు బ్రాహ్మ్యంబుతో బొత్తు బాయలేను నేను బసవలింగ" అని మల్లికార్జున పండితారాధ్యుడు అన్నాడంటారు.

ఈ పండిత త్రయంలో శ్రీపతి పండితుడు మొదటివాడు. ఇతని కాలం దాదాపు నన్నయ కాలం రెండవవాడయిన శివలెంక మంచన కాలం తర్వాత ఒకతరమయి వుంటుంది. మూడవ వాడయిన మల్లికార్జున పండితుడు నన్నయ తర్వాత రెండు తరాలవాడు. మొదటి ఇద్దరూ చేసిన రచనలు తెలియవుగాని, మల్లికార్జున పండితుడు రచించినవి దాదాపు యాభై వుంటాయి. వాటిలో ముఖ్యమైనది శివతత్త్వసారం. సంస్కృత రచనలూ చాల ఉన్నాయి.

శివతత్త్వసారం దాదాపు వేయిపద్యాలు, పది శతకాల గుచ్ఛం. దీనినితడు కన్నడంలోను రచించాడు.

"పతి రుద్రుడు పశువుల కని
శ్రుతి చెప్పుచు నునికి జేసి రుద్రుడు పతి త
క్కితరులు పశువులు పొమ్మని
మతిలో నెరిగితి శ్రుతి ప్రమాణమున శివా."

అని పశుపతికి వ్యుత్పత్తి చెప్పాడు. శివభక్తులు కనిపిస్తే అబ్బ బ్రతికాను - అనుకుంటూ సేవ చేయాలని అన్నాడు:

"భక్తుల దవ్వుల గని శివ
భక్తులు వచ్చిరని పొంగి బ్రతికితనని పో
భక్తుల కెదురేగి యథా
శక్తిస్థితి జేయవలయు సత్క్రియలు శివా."

శివభక్తుని జాతి మొదలయినవి అడగరాదని, బురదలో పుట్టిన పద్మం చాల పూజ్యమయినట్టు ఎంత తక్కువ కులంలో పుట్టినా శివభక్తుడు గొప్పవాడని పండితారాధ్యుడు శివతత్త్వసారంలో చెప్పాడు. మహిళ శివభక్తుడు కానిభర్తను వదిలివేయాలని, దానివల్ల ఆమెకు దుర్గతి లేదనీ బోధించాడు. శివనిందచేసే పాపాత్ములను చంపివేయాలని, శివనిందాత్మకాలయిన పుస్తకాలను కాల్చివేయాలని కూడ అతడు శాసించాడు. శివభక్తుల లోపాలను ఎన్నేవాడు చండాలుడు. శివభక్తుడు పాపం చేసినా పుణ్యమే—ఇలా వుంటుంది బోధ.

ఈ మల్లికార్జున పండితారాధ్యుని శిష్యుడే నన్నెచోడుడు. ఇతడు మల్లికార్జున పండితుని లాగే నన్నయకు రెండు తరాల ఈవలివాడు. ప్రాతస్స్మరణీయులు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి పుణ్యమా అని నన్నెచోడుని కుమారసంభవం 1910లో వెలుగులోకి వచ్చింది. శ్రీకవిగారు కుమారసంభవ శైలీ పదప్రయోగాదుల విశిష్టతను బట్టి అది నన్నయకు ముందవన్నారు. దానిపై పండితులు పలువురు కవిగారిపై విరుచుకుపడి ఆయనే దీనిని కల్పించి రచించారన్నంత వరకు వెళ్ళారు. దాదాపు అర్ధశతాబ్దం ఈ చర్చాయుద్ధం జరిగిన పిదప శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మున్నగువారు ఇతని కాలం. నన్నయ తరువాత దాదాపు వంద సంవత్సరాలన్నారు. ఇదే దాదాపు అందరికీ ఆమోదయోగ్యమయింది.

నన్నెచోడుడు నిజానికి తెలుగుదేశిప్రబంధ రచనకు ఆద్యుడు. నన్నయ వైదిక సంప్రదాయ స్థాపనకు భారతం చేపట్టగా, ఇతడు శైవమత వ్యాప్తికి పురాణాదులలోని కుమారసంభవ కథలను, జనంలో వ్యాప్తిలో వున్న కథలను సమన్వయపరచి, ఎక్కువగా దేశిచ్ఛందస్సునే వాడి తమిళ, కన్నడ

కవితా సంప్రదాయాలను ఆకళించుకొన్నవాడు గనుక, అప్పటి వస్తుకవితకు ప్రాధాన్యమిచ్చి సంస్కృత కావ్య లక్షణాలను కూడ చాలవరకు పొందుపరచి, నూతన సంప్రదాయానికి దారితీశాడు. ఈ దారిలోనే శివకవులు, మధ్యయుగపు అన్నమాచార్యాది వైష్ణవ భక్త కవులు నడిచి దేశికవితను పరిపుష్టం చేశారు. కనుకనే దీనిని కుమారసంభవ యుగమని సంభావించాను. మార్గ దేశి కవితా రీతులు రెండూ అనాదిగా ఒకదాని సరసన మరొకటి మనుతూ ఆయా అభిమానుల ఆదరం పొందుతూనే వున్నాయి.

నన్నెచోడుడు తన కవితారీతిని కావ్యాన్ని మదగజంతో పోల్చాడు. కవిత్వ లక్షణాలను కూడా చెప్పాడు.

"చతురోక్తుల నుతపదబహు
గతుల నలంకార భావ కాంతి రసార్థో
న్నతిగతి నతిరసికులు వర
సతిగతి నెరిగింప వలదె సౌభాగ్యమునన్. (1-39)

పదబంధంబుల నగ్గలించి బుధ శ
బ్ద భ్రాజియై సద్గుణా
స్పదమై దుష్కవిహృత్సరోజవనముల్
ఖండింపుచున్ భూరి స
మ్మదలీలన్ విలసిల్లి సత్కృతి జగ
న్మాన్య ప్రభావంబునన్
మదనాగంబును బోలె గ్రాలవలదా
మారెందులేకున్నతిన్?" (1-40)

తెలుగులో కృతులను అంకితమిచ్చే సంప్రదాయానికి నాంది పలికినవాడూ ఇతడే. తన గురువయిన మల్లికార్జున పండితారాధ్యునికి తన కావ్యం అంకితమిస్తున్నందుకు ఇలా మురిసిపోయాడు:

"రవికుల శేఖరుండు కవి
రాజ శిఖామణి గావ్యకర్త స
త్కవి భువి నన్నెచోడుడట,
కావ్యము దివ్యకథం గుమార సం
భవ మటె, సత్కథాధిపతి
భవ్యుడు జంగమ మల్లికార్జునుం

డవిచలితార్థ యోగధరు
దట్టె వినం గొనియాడజాలదే!" (1-57)

ఈయన వర్ణనలు సహజాలు, విశిష్టాలూనూ. గ్రీష్మవర్ణనలో ఒక చక్కని పద్యం :

"తలచిన డెండము కందును
బలికిన నోరెల్లబొక్కు బ్రబఠ సూచిన రె
ప్పలు కమరు ననగ బటుతర
విలయానల ఛాతి నెండ వేసవి గాచెన్!" (6-135)

విరూపాక్షుడు మూడవకన్ను తెరిచాడు. మన్మథుడు బుగ్గి అయ్యాడు. ఆ బుగ్గి అయిన విధం క్షణాలలో జరిగింది. దానిని నన్నెచోడుడు గొప్పగా ఊహించాడు:

"కని కోపించెనొ కానక
మును కోపించెనొ మహోగ్రముగ నుగ్రుడు చూ
చిన గాలెనొ చూడక యట
మును గాలెనొ నాగ నిమిషమున నర గాలెన్." (5-51)

విమర్శకాగ్రేసరులు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారన్నట్టు "వాస్తవానికి ఆంధ్ర సాహిత్యంలో ప్రప్రథమ ప్రబంధ పరమేశ్వరుడు కవిరాజశిఖామణి నన్నెచోడుడే యని చెప్పక తప్పదు." ప్రబంధమంటే నా దృష్టిలో దేశి సంప్రదాయ ప్రబంధం.

దేశంలో పరిస్థితి మారింది. జైనానికి బలం తగ్గుతూ శైవానికి బలం హెచ్చుతూ వచ్చింది. అదివరకు చాళుక్యులకు సామంతులుగా ఉన్న కాకతీయులు స్వతంత్ర రాజ్యం స్థాపించారు. వారు జైనమతాన్ని వదలి శైవాన్ని ఆదరించారు. కొత్తరాజ్యం గనుక, రాజులు ఏదో నీతిని అవలంబించాలి గనుక నీతి గ్రంథాలు పుట్టుకు వచ్చాయి. ఇలాటి వాటిలో పేర్కొన దగినవి నీతిసారం, పంచతంత్రి, కామందకం మొదలైనవి. నీతిసారాన్ని కాకతి రుద్రదేవుడు రచించాడని ప్రతీతి. ఇతడు సంస్కృతంలో ఇదేపేరున ఒక గ్రంథం రచించాడు. నీతిసారంలోని ఒక పద్యం:

"జనపతి పర్జన్యగతిం
దనభూప్రజ బ్రోవ వలయు దగ బ్రోవడయే,
దను బాసిపోవు నా ప్రజ
ఘన నీరస సరసి బాయు ఖగములభంగిన్."

శైవం బలం పుంజుకుందని ఇదివరకే అన్నాను. ఈ కాలంలోనే యథా వాక్కుల అన్నమయ్య అనేకవి శివసర్వేశ్వరత్వాన్ని నిరూపిస్తూ సర్వేశ్వర శతకం వ్రాశాడు దీనిని నిర్దిష్టమైన తొలి తెలుగు శతకమనవచ్చు. శివతత్త్వ సారం పెక్కు శతకాల సముచ్చయం.

శైవాన్ని ప్రజలవద్దకు తీసుకుపోవాలి. శైవభక్తుల మహాత్మ్యాలు ప్రజలకు తెలియాలి. కుల వర్ణాలకు అతీతమైన శైవం దేశంలో వ్యాపించాలి. అనే అభినివేశం ప్రజలలో ఎక్కువైంది. దాని పరిణామం పాల్కురికి సోమనాథుని జననం. అతడొక మహాసంస్థ. తెలుగులోని ప్రతి ప్రక్రియలోను రచన సాగించడమే కాక, నూతన ఛందస్సులనూ సృష్టించాడు. పండితుల ఆదరం కోసం అంగలార్చక, పామరులను ఆవర్జించుకొనడానికే ప్రయత్నించాడు.

"ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట
గూర్చెద ద్విపదలు గోర్కి దైవార
దెలుగుమాట లనంగ వలదు వేదముల
కొలదియ కా జూడు డిల నెట్టులనిన
బోటి తూమునకును బాటియౌనేని
బాటింప సోలయు బాటియకాదె
అల్పాక్షరముల ననల్పార్థ రచన
కల్పించుటయకాదె కవి వివేకంబు."

(బసవ పురాణం - 1-165 - మొదలు)

ఈ దృష్టితో పాతది, జనప్రచారంలో బహుళంగా వుండేది అయిన తరువోజపాదాన్ని రెండుగా విరిచి 'ద్విపద' అని పేరు పెట్టి, బసవపురాణం, పండితారాధ్య చరిత్ర అనే మహాపురాణాలు వ్రాశాడు. కన్నడదేశంలో వీరశైవమత స్థాపకుడైన బసవేశ్వరుని చరిత్ర బసవ పురాణం. తెలుగుదేశంలో బ్రాహ్మణ శైవాన్ని ప్రతిపాదించిన మల్లికార్జున పండితారాధ్యుని చరిత్ర పండితారాధ్య చరిత్ర. వీరిద్దరూ సమకాలికులు. సోమనాథుడు వీరిద్దరికీ రెండు తరాల ఈవలివాడు గనుక వీరిద్దరి జీవిత విశేషాలను శిష్య ప్రశిష్యుల నుంచి విని తన కృతులలో పొందుపరచాడు. ద్విపదను బసవన రెండు పాదాలని అన్నాడు. తరువోజను ద్విపదగా మార్చడం తొలిసారిగా నేను 1953 లో

'పరిశోధన' సోమనాథ సంచికలో ప్రచురించాను. సోమనాథుడు త్రిభంగి అనే మరొక చంధస్సు కూడ సృష్టించాడు. సోమనాథుని భాష, భావ ప్రకటన తెలుగు సాహిత్యంలో అరుదైనవి.

భవుని తన కుమారునిగా భావించిన బెజ్జమహాదేవి భావాలు చూడండి:—

"తల్లి గల్గిన నేల తపసి గానిచ్చు
దల్లి గల్గిన నేల తల జడల్గట్టు
దల్లియున్న విషంబు ద్రావనేలిచ్చు
దల్లియుండిన దోళ్ళు దాల్పనేలిచ్చు
దల్లి పాములనేల ధరియింపనిచ్చు
దల్లి బూడిద యేల దా బూయనిచ్చు."

(బసవ - 3-635 మొదలు)

సోమనాథుడు దాదాపు 30 రచనలు చేశాడు. వీటిలో సోమనాథభాష్యం, రుద్రభాష్యం వంటి పండిత వాదోపవాద రచనలు వున్నాయి.

దేశిచ్ఛందస్సయిన సరికొత్త ద్విపద ప్రజాదరం పొందడం చూసి వైష్ణవ మతానుయాయులూ దానిని తమ మత ప్రచారానికి వినియోగించు కొన్నారు. వైష్ణవులకు రామాయణం ప్రవత్తిశాస్త్రం. అప్పుడప్పుడే వ్యాపిస్తున్న రామానుజాచార్యుల విశిష్టాద్వైత ప్రభావమూ కొంతకారణమేమో! గోనబుద్ధరాజు వాల్మీకి రామాయణాన్ని స్థానికమయిన జంబుమాలికథ, సులోచనా వృత్తాంతం, కాలనేమికథ వంటివాటితోసహా ద్విపదలో రచించాడు. అదివరకు రామాయణాన్ని కొందరు కావ్యంగా రచించారనే ప్రతీతి వుంది కాని, అవేవీ లభించలేదు. గోన బుద్ధరాజుకు రంగనాథుడు రచనలో తోడ్పడివుంటాడు. కనుక అతని పేరూ ఈ రామాయణంతో వ్యాప్తికి వచ్చింది. బుద్ధా రెడ్డి అనువాదం విషయంలో నన్నయాది మార్గకవులనే అనుసరించాడు. ఇదొక విధంగా ఉభయరీతుల సమ్మేళనం. సీతా వియోగంతో వేగుతున్న రాముని దీనావస్థను కవి ఇలా వర్ణించాడు:

"అలసయానముల బాగంచల కిచ్చి
లలితాంఘ్రి రుచి ప్రవాళంబుల కిచ్చి
వరకుచోన్నతి చక్రవాకుల కిచ్చి
కరముల కెంపు పంకజముల కిచ్చి
మెయిచాయ క్రొక్కారు మెరుగుల కిచ్చి
నయన వైభవము మీనములకు నిచ్చి

చల్లని ముఖదీప్తి చంద్రున కిచ్చి
తెల్లని నగవు చంద్రికలకు నిచ్చి
చెలువంపు బలుకులు చిలుకల కిచ్చి
యలకల నునుగాంతి యళులకు నిచ్చి
రదముల యొప్పు వజ్రంబుల కిచ్చి
పొదలు నెత్తావులు పూవుల కిచ్చి
సన్నపునడుమాకసంబున కిచ్చి
నిను దైవము మ్రింగెనే నేడు సీతః"

ఇలా శైవ వైష్ణవాలు, ఒక ప్రక్క జైనమూ జనాన్ని ముతాలుగా చేశాయి. మా మతం గొప్పదని విర్రవీగడమే తప్ప, ప్రతిమతమూ మనః పరిపాతానికేననే భావం పోసాగింది. భాషా సారస్వత విషయాలలోను మార్గదేశీ సంప్రదాయాల మధ్య పోటీ ఎక్కువైంది. ఈ పరిస్థితి వివేకవంతులకు నచ్చలేదు. సామరస్యం వారి ఆశయం. హరిహరాభేదం సాధించి, భారతీయ ప్రాచీన సంప్రదాయం స్థాపించడం అవసరమనే నమ్మకం కలిగింది. దానికి భారతానువాద పునరారంభం ఆవశ్యకమనిపించింది. దానికి పూనుకున్నాడు వేదాది సమస్త విద్యాభ్యాస విభాస, బహు కళాసంపన్నుడు, సకల విద్యాకళా చణుడు, తెనుగు సంస్కృతాలలో చతురుడు, విద్యావైశారద్య సముద్యోతిత మతి, సకలాగమార్థ తత్త్వ విచారోదారుడు, సారకవితా నిర్మాణ చాతుర్యుడు మయూరసన్నిభ మహాకవి, భారవికల్పుడు, దీనజనతా భద్రాసనము, సతత దాన వినోది అయిన తిక్కనామాత్యుడు. ఆయన అదివరకే ఉత్తరరామాయణం మరికొన్ని కావ్యాలు రచించాడు. పిదప నన్నయ అరణ్యపర్వంతో వదలి పెట్టిన మహాభారతాన్ని పూర్తిచేశాడు. ఇదొక అపూర్వసృష్టి. కవితాకళ పరాకాష్ఠ పొందింది. తిక్కన రచనలో నాటకీయతకు ఆటపట్లు పలు పర్వాలు, ముఖ్యంగా విరాటోద్యోగ పర్వాలు. ప్రతిపర్వరసోదయమంటే చాలవు. వ్యాస భారతంనుంచి తెలుగువారికి అవసరమైనంతమాత్రం గ్రహించాడు తిక్కన. సైరంధ్రిపై వలపుగొన్న కీచకుని వారిస్తున్న సుదేష్ణమాటలివి:

"లలితంబులగు మట్టియల చప్పుడింపార
నంచకైవడి నడ నల్లవచ్చి
యెడమేని నెత్తావి సుడియంగ బయ్యెద
సగము దూలించు పైమగుడ దిగిచి

సోలెడు నెలదీఁగెలీల గ్రాలుచు వింత
 చెలువంబు దలకొన జేరి నిలిచి
తెలిగన్నుగవకు నెచ్చెలియైన లేత న
 వ్వొలయంగ సరసంపు బలుకు పలికి
 మెరయు చెయ్వుల రాగంబు మెయికొనంగ
 నెడద సొగయించు మాటల నెలమి మిగుల
 నిన్ను ననురక్తిగొలుచు నన్నేలతలుండ
 నీరసాకార సైరంధ్రి గోరదగునే?"

(విరాట. 2-64)

నీరసాకార అనే విశేషణ మొక్కటి పైపాదాల బరువుకు సమానం. యుద్ధంలో మరణించిన తమ ఆప్తులను వెదుకడానికి అంతఃపురకాంతలు తమ నగరుల నుంచి వెలువడిన తీరును తిక్కన ఎంత హృదయవిద్రావణంగా వర్ణించాడో:

"చేతులు నడుదల సేర్చు చుక్కట శోక
 మాకారములు దాల్చినట్టు లుండ,
విరిసిన వేనలుల్ వెన్నుల బ్రక్కల
 నెరసి చూపర దృష్టి నీరుసేయ
నందంద దొరగెడు నశ్రు జలంబుల
 పెంపున మోములు ముంప బడగ
నేమియు దొడవులు లేమి బాడరియున్న
 యంగంబులందు దైన్యంబు నెరయ
 బతుల నన్నల దమ్ముల సుతుల హితుల
 బేరుగొని వాతులెండంగ బ్రేముడించి
 పనవు పలుకులు వినువారి వనటదేల్చ
 గురుకుమార నారీజన కోటి వచ్చె."

(స్త్రీ 1-98)

వాల్మీకి ఆది కావ్యాన్నీ, వ్యాసుని భారతేతిహాసాన్నీ స్వాయత్తం చేసుకొన్న తిక్కన 'ఆంధ్రావళి మోదముం బొరయ' రచన చేశాడు, ఆనంద ముద్రతో; తానూ ఆనందించి ఆంధ్రావళినీ ఆనందింపజేశాడు.

తిక్కన కాలానికి కవులు చాలినంత మంది పుట్టారు. తమ తమ పద్ధతిలో రచనలు సాగించారు. వారి భాషను, భావాలను అదుపుచేయడం

అవసరమైంది. అలాగే లోకంలోని మోసాలు, దాయభాగాదులు, నేరాలు, శిక్షలు తెలియడం అవసరమైంది పాలకులకు, ప్రజలకు. ఏవో నీతిసారం వంటి గ్రంథాలున్నాయిగాని; సర్వజనాదృతమైన ధర్మశాస్త్ర గ్రంథమేదీ లేదు. కనుక వాటి అవసరాన్ని పూరించాడు తిక్కనకు సమకాలికుడు, ఆయనకన్నా వయసులో పెద్ద అయినా, ఆయనను ఆదరించి దశకుమార చరిత్రను అంకిత మిచ్చిన వాడూను అయిన కేతన.

దశకుమార చరిత్ర దండి రచన. సమకాలిక జన జీవిత దర్పణం. దానిని అనువదించాడు కేతన. ఇదే తెలుగులో తొలి కథా కావ్యం. కేతన దండి చెప్పిన కావ్య లక్షణాలను గూడ దీనిలో చొప్పించాడు. కవిజనాశ్రయం కేవలం ఛందస్సుకే సంబంధించింది. కనుక భాషా శాసనంకోసం కేతన ఆంధ్రభాషా భూషణమనే చిన్న వ్యాకరణ లక్షణ గ్రంథమూ వ్రాశాడు. ఇతనికి కన్నడాది భాషలు తెలుసు గనుక తనకన్నా వంద సంవత్సరాలకు ముందున్న కర్నాటక భాషాభూషణాన్ని అనుసరించాడు. సంఘ శాసనం కోసం విజ్ఞానేశ్వరీయమనే ధర్మశాస్త్రం రచించాడు. యాజ్ఞవల్క్యుడు రచించిన స్మృతికి విజ్ఞానేశ్వరుడు మితాక్షర అనే పేరుతో వ్యాఖ్య వ్రాశాడు. దానిని విజ్ఞానేశ్వరీయమంటారు. దానిని కేతన

"మును సకల ధర్మశాస్త్రము
విని విజ్ఞానేశ్వరుండు వివిధ ప్రౌఢిన్
జనులకు దెలిపిన దానిన్
దెనుగున జెప్పెద సమస్త దేశీయులకున్."

(1-5)

అని తెలుగు చేశాడు. కుల మతాలను తిట్టడం, దుకాణాలలో మోసపు కొలతలు, తూనికలు వాడడం, సరకులను కల్తీ చేయడం వంటి నేరాలకు శిక్షలు విధించాడు కేతన :

"మురికి నాటి వారు మొరకులు, పెనపరు
లరవ వారు, ద్విజుల కాస పెద్ద
యనుచు దేశ భాషలను కులంబును దిట్టు
నతడు దండు నిచ్చు శతపణములు."

(2-56)

ఈ కాలంలోనే బద్దెన నీతిశాస్త్ర ముక్తావళి అనే గ్రంథాన్ని, తిక్కన శిష్యుడైన మారన మార్కండేయ పురాణాన్ని, మంచన కేయూరబాహు

చరిత్రను రచించారు. భారతాన్ని, వ్యాకరణాన్ని రచించినట్టు చెప్పే అధర్వణునీ రచనలు, కమలనాభామాత్యుడు మున్నగువారి రచనలూ లభించలేదు.

## కొత్త రెమ్మ

ఈ కాలంలో తెలుగు సాహిత్యం మరొక కొత్త రెమ్మ వేసింది. అది వచన కవిత, నేటి బ్లాంక్ వర్స్ వంటిది. కన్నడంలో బసవేశ్వరుడు, ఆయన ధర్మపత్ని నీలాదేవి, భక్తురాలు అక్క మహాదేవి ఇలాటి వచనాలు రచించారు. ఇవి మధుర భక్తి భావంతో నిండిన ముద్ద కట్టిన కవితలు. వాటి ప్రేరణతోనే కృష్ణమాచార్యుడనే భక్తుడు సింహగిరి వచనాలు, శఠగోప విన్నపాలు అనే రెండు వచన కవితలు వెలయించినాడు. తెలుగులో తొలి వచన కవిత ఇదే గనుక ఒకటి ఉదహరిస్తాను :

"దేవా!
పదికోట్ల యజ్ఞాది క్రతువులు నడపంగా నేమి?
తొమ్మిది కోట్ల తులాభారంబులు తూగంగా నేమి?

దేవా!
మీ నామోచ్చారణంబు చేయక పదికోట్ల యజ్ఞాది క్రతువులు నడిపిన దేవేంద్రుడు నిలువెల్ల యోనులయ్యేను.
.... .... .... .... .... .... .... ....
దేవా!

మీ నామోచ్చారణంబు సేసిన ప్రహ్లాద .... విదురాదులగు పరమ భాగవతోత్తములు గృతార్థులైరి గావున యతి రామానుజుని పరందాతారు అనాథపతియైన సింహగిరి నరహరీ నమో నమో దయానిధీ!"

ఇంతలో కాకతీయులు సామ్రాజ్యం తురుష్కుల దండయాత్రతో విచ్ఛిన్న మయింది. వారికి దండనాయకులుగా ఉన్న పద్మనాయకులు, రెడ్లు, ఇతరులు చిన్న చిన్న రాజ్యాలు స్థాపించారు. హరిహర బుక్కలు తుంగభద్రా తీరంలో ఒక రాజ్యం స్థాపించారు. అది తర్వాత విజయనగర సామ్రాజమయింది. ఈ రాజ్యాల కాలంలో ముస్లింలకు ప్రతిఘటనగా అన్ని విధాల ప్రయత్నాలు జరిగాయి. పద్మనాయకుల రాజ్యంలో మరల రామాయణం రచితమైంది. రంగనాథ రామాయణం కేవలం వాల్మీకిని అనుసరించక పోవడంవల్ల, ద్విపద కావడం వల్ల ఈ ప్రయత్నం మరల జరిగి వుంటుంది.

## అనువాద యుగం

రెడ్డి రాజుల కాలంలో ఎర్రాప్రెగ్గడ నరసింహ పురాణం రచించాడు. హరివంశం తెలుగు చేశాడు. నన్నయ వదలి పెట్టిన అరణ్యపర్వశేషం పూరించాడు. నాచన సోముడు కూడ హరివంశం తెలుగు చేశాడు. తెలుగు కవితను నవీన గుణ సనాథను చేశాడు. ఇతడు విజయనగ రాస్థానకవి.

ఈ మూడు రాజ్యాల రాజులను మెప్పించి బహుమానాలు పొందుదామనే బుద్ధి కవి పండితులకు కలిగింది. ఆ బుద్ధి పరాకాష్ఠే శ్రీనాథ కవి ఆవిర్భావం.

శ్రీనాథుడు చివరి రోజులలో రెడ్డి 'రాజుల ఆస్థానంలో విద్యాధికారి అయినా, చిన్ననాటినుంచి ప్రతి ఆస్థానానికి తిరిగి రాజులను మెప్పించి సన్మానాలు పొందడంలో నిమగ్నుడయ్యాడు. వెళ్ళిన చోటెల్లా ఆశువుగా చాటువులు చెప్పడం, ఇతరులను ప్రసన్నులను చేసుకోవడం కూడ ఇతని అలవాటు. అనువాదమో, నాలుగైదు కథలతో ఒక కావ్యాన్ని గ్రథించడమో తొందరగా చేసి, ఏ ధనవంతుడైన వ్యాపారికో, రాజుకో, అతని మంత్రి సామంతులకో ఇచ్చి సంతృప్తి పడేవాడు. కనుక మహా ప్రతిభావంతుడైనా మౌలికమైన గొప్ప కావ్యమేమీ రచింపలేక పోయాడని పండితుల బాధ. కాని, చేసిన రచనలన్నీ గొప్పవే. అతడే చెప్పుకొన్నట్లు అతని అనువాదాలన్నీ శబ్దం అనుసరించి, అభిప్రాయం అనుసరించి, భావం ఉపలక్షించి, రసపోషణతో, అలంకారాలతో, అనౌచిత్యం పరిహరించి, ఔచిత్యం ఆదరించి మాతృ కానుసారంగా ఉన్నాయి. అతడు హర్షుని నైషధం, గాథా శప్తశతి, కాశీ ఖండం, భీమేశ్వర పురాణం, హర విలాసం మున్నగు అనువాద రచనలు చేశాడు. ఇతనిరచనలన్నీ ఒక ఎత్తూ, చాటువులు ఒక ఎత్తు అని నా అభిప్రాయం. ఈ చాటువులు ఆనాటి సాంఘిక స్థితికి అద్దం పడుతాయి. దేసి కవిత అయిన బసవ పురాణం వంటి వాటిలోని కథలు, వర్ణనలు గ్రహించి తన రచనలలో పొందు పరిచాడు. చాటువులలో మచ్చుకు ఒకటి:

"చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులును దేళ్ళు
పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు."

శ్రీనాథుడు వృద్ధాప్యంలో చాల బాధ పడ్డాడు. భూమిశిస్తు చెల్లించలేక రాజ శిక్ష పొందాడు. బాల్యం నుంచి వైభవం పొందిన శ్రీనాథుడు సహస్రమాసజీవి అయిన పిదప ఇక్కట్లు పాలుగావడం ఎవరికైనా బాధ కలిగిస్తుంది. చివరన

"కాశికా విశ్వేశు గలసె వీరారెడ్డి
రత్నాంబరమ్ము లేరాయ డిచ్చు?
కైలాసగిరి బంటమైలాల విభుడుండె
దిన వెచ్చ మేరాజు దీర్పగలడు?
రంభగూడె దెలుంగు రాయ రాహుత్తుండు
కస్తూరి కేరాజు బ్రస్తుతించు
స్వర్గస్థుడయ్యె విస్సన మంత్రి మరి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తి గలదు?
భాస్కరుడు మున్నె దేవుని పాలి కరిగె
కలియుగంబున నిక నుండ గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ
నరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి."

అంటూ మరణించాడు. రెడ్డి రాజుల ప్రాముఖ్యం పోయి కోస్తా జిల్లాలలో గజపతుల బలం పాదుకొని వుంటుంది. ఇతనిని ఆదరించే వారు ఎవరు?

## తొలి రూపకం

ఈ కాలంలో తెలుగు సారస్వతానికొక గొప్ప ఉపకారం కలిగింది. అది వల్లభరాయని క్రీడాభిరామం. ఇది త్రిపురాంతకుని ప్రేమాభిరామానికి అనువాదమైన వీథీ రూపకం. ఇదే తెలుగులో తొలి రూపకం. ఇది వ్యంగ్య కావ్యమని నా అభిప్రాయం. వినుకొండ వల్లభ రాయడు విజయనగర రాజుల మిత్రుడు; రెడ్డి రాజులకు అమిత్రుడు. శ్రీనాథుని ద్వారా రెడ్డి రాజులు తమ రాజకీయ ప్రయోజనాలు సాధించడాన్ని అవహేళన చేస్తూ శ్రీనాథుని శైలిని అనుకరిస్తూ వ్రాసిన సెటైర్ ఇది. కవి అవచి తిప్పయ్యను, శ్రీనాథుని, టిట్టిభ సెట్టి మంచనలుగా చిత్రించాడు దీనిలో.

ఈ కాలంలోను దేశి సారస్వతం మార్గ సారస్వతంతో పోటీ పడుతూనే ఉంది. గౌరవ అనే కవి ద్విపదలో హరిశ్చంద్రోపాఖ్యానం, నవనాథ చరిత్ర రచించాడు. ఈతని రచన పాల్కురికి సోమనాథుని శైలిలో నడుస్తుంది. హరిశ్చంద్రుడు కాలకౌశికుని ఇలా నిందిస్తాడు :

"పొద్దున లేచి నీ మొగము కన్గొనిన
నద్దినమున వచ్చు నాపదలెల్ల
నిన్నొక విప్రుని నిందింప నేల?
మిన్నక తలపోయ మేదినిలోన

కూడు వడ్డికి నిచ్చి కూర్చి కివారి
జాడ లిట్టివియ యాశ్చర్య మేమిటికి?
కులము ప్రధానమే గుణములేకున్న?
కలశాబ్ధి బుట్టదే కాలకూటంబు?"

జానపద సాహిత్య ప్రభావంతోనే కథాకావ్యాలు కూడ ఈ సమయంలోనే వచ్చాయి. జక్కన విక్రమార్క చరిత్ర, వెన్నెలకంటి అన్నయ్య షోడశకుమార చరిత్ర, అనంతామాత్యుని భోజరాజీయం ఇలాంటివి. దేశిప్రభావంతోనే అయ్యలరాజు తిప్పయ ఒంటిమిట్ట రఘువీరశతకమూ చెప్పాడు.

దేశంలో శైవభక్తితోపాటు. వైష్ణవభక్తి కూడ ప్రబలింది. దాని పరాకాష్ఠే పోతన భాగవత రచన. పోతన మొదట్లో భోగినీ దండకం, వీరభద్ర విజయం రచించినా, పిదప రామభక్తి పొంగగా అద్వైత దృష్టితో భాగవతాన్ని రచించాడు. ఇది అనువాదమైనా, మౌలిక మనిపించుకొని తెలుగువారి నాలుకపై తాండవ మాడింది. దీనిలోని ప్రహ్లాదచరిత్ర, రుక్మిణి కల్యాణం, గజేంద్ర మోక్షంవంటి ఘట్టాలురాని తెలుగువాడుండడు. దీనిని ఇతడు హరికి అంకితం చేశాడు; ఏరాజు దర్బారుకు తిరుగలేదు.

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముబాసి కాలుచే
సమ్మెటవ్రేటులంబడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగాన్."

(భా : 1-11)

అని తన రచనను నరాంకితం చేయలేదు. పోతనభక్తుడు గనుక దేశి రచనలను కూలంకషంగా చదివి వాటిని తన రచనలో జోడించాడు, తాను మార్గ పద్ధతిలో వ్రాసినా.

## పదకవితా యుగం

భక్తి ప్రచారానికి వివిధ రూపకాలు ఆడేవారని పాల్కురికి సోమనాథుడు చెప్పినా మనకు తొలినాటక మన దగిన 'సౌభరి చరిత' మనే జక్కులకథ (యక్షగానం) వెలువడింది 15వ శతాబ్దం చివర తుంగభద్రా తీరంలో. సాళ్వ నరసింహరాయల దండనాయకుడైన ప్రోలుగంటి చెన్నయ దీని రచయిత. క్రీడాభిరామం తొలిరూపకం, ఇది తొలి నాటకం. దీనితో సంగీతం భక్తి

ప్రచారానికి అవసరమని గ్రహించారు. దేశిరచనలకు సంగీతం మేళవించారు భక్తులు. ఆభక్తులలో అగ్రేసరుడు అన్నమాచార్యులు.

ఇతడు కడపజిల్లా తాళ్ళపాక గ్రామంలో జన్మించాడు. చిన్న నాటనే సంగీతం, భక్తి అలవడినవి. తిరుపతి వేంకటపతిమీద వేలకీర్తనలు చెప్పి సంకీర్తనాచార్యుడు, పద కవితా పితామహుడు అయ్యాడు. చిరుతప్రాయంలోనే "వేంకటేశ్వరా" మకుటంతో శతకం అళువుగా చెప్పాడు. హరిదాసుని లక్షణా లను అన్నమయ్య ఇలా చెప్పాడు :-

"అటువంటి వాడువో హరిదాసుడు
అటమటాలు విడిచినాతడే సుఖి
తిట్టేటి మాటలను దీవించేటి మాటలను
అట్టే సరేని తలచినాతడే సుఖి

పొంది పుణ్యము వచ్చినా పొరి పాపము వచ్చినా
ఒందలి ఫలమొల్లనియాతడే సుఖి
విందుగా శ్రీ వేంకటాద్రి విభుని దాసులజేరి
అందరాని పద మందినాతడే సుఖి."

(ఉత్సవ సంపుటి, సంకీర్తన 90)

అన్నమయ్య కీర్తన సంప్రదాయాన్ని ఆయన భార్య తిమ్మక్క, కుమారులు నరసింగన్న, పెద తిరుమలా చార్యులు, మనుమడు చినతిరుమలాచార్యులు కొనసాగించారు. పిదప భద్రాద్రి రామదాసు, క్షేత్రయ్య, త్యాగరాజు మున్నగు వారు ఈ సంప్రదాయాన్ని పెంపొందించారు. అన్నమయ్య "జోవచ్యుతానంద" పాటతోను, "చందమామ రావే జాబిల్లి రావే" పాటతోను తెలుగు తల్లీ పిల్లలకు నిరంతరం జ్ఞాపకముంటాడు.

## మనుచరిత్ర యుగం

రాజులను, రాజోద్యోగులను మెప్పించే ప్రవృత్తి, మెప్పు పొందాలనే ప్రవృత్తి రచయితలలో తీవ్రమైంది. పెద్ద పెద్ద కావ్యాలు, పురాణాలు రచించే, అనువదించే బాధకంటే పురాణాలలోనివో, జనపదాల లోనివో ఉపకథలను తీసుకొని పెంచి చిన్న కావ్యంగా అల్లి మెప్పుపొందడం సులభం కదా! శ్రీనాథుని కాలం నుంచి ఈ ప్రవృత్తి ప్రబలింది. పిల్లలమర్రి పినవీరభద్రుడు వ్యాస కాళిదాసుల శకుంతలా వృత్తాంతాలను గుదిగుచ్చి, తన ఊహాపోహలను

కూడా చేర్చిన శృంగార శాకుంతలం, కౌరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక మున్నగువాటిని రచించడం ఉదాహరణంగా పేర్కొనవచ్చు. ఇలా చిన్న కథను గ్రహించి కావ్యంగా మలచడం, పూర్వులు చెప్పిన కావ్య లక్షణాలను దృష్టిలో పెట్టుకుని సొబగులు తేవడం మనుచరిత్రగా పరిణమించింది. అది తర్వాతి కావ్యాలకు మార్గదర్శకమే కాక నికషోపలమూ అయింది. కవులు హాయిగా కూర్చుని తమ రచనలకు నగిషీలు చెక్కడానికి కావలసిన తీరికా ఏర్పడింది.

పీటికి కారణం విజయనగర రాజ్య సుఖసంకథా వినోదాలు. ముస్లింలు విదేశీయులైనా, భారతీయులను కూడ తమ మతంలో చేర్చుకుని రాజ్యాలు స్థాపించుకొన్నారు. ఉత్తరభారతాన, దక్షిణాపథాన బహమనీ సుల్తానుల రాజ్యాలు ఏర్పడ్డాయి. వాటి తాకిడి తక్కిన దక్షిణాపథానికి తగులకుండా విజయనగర సార్వభౌములు, ముఖ్యంగా కృష్ణదేవరాయలు తన బల పరాక్రమ రాజనీతిజ్ఞతలతో అరికట్టాడు. హరిహర బుక్కరాయల కాలం నుంచి కూడ తుంగభద్రకు దక్షిణంగా ఉన్న దక్షిణ భారతం ఒకవిధంగా శాంతిభద్రతలలో అలరారుతున్నదనే చెప్పాలి. దానికి మరింత సుస్థిరత ఏర్పడింది తుళువ వంశీయ సార్వభౌముల వల్ల. కృష్ణదేవరాయలు సాహితీ సమరాంగణ సార్వభౌముడు కావడంవల్ల, స్వయంగా రచయిత అయి ఆముక్తమాల్యద వంటి కావ్యం రచించినవాడు కావడంవల్ల, స్వతంత్ర కావ్యాలకు చాలా ప్రోత్సాహం కలిగింది. దీనికి చాలా విధాలుగా అల్లసాని పెద్దన మనుచరిత్ర నాందివంటిది గనుక తర్వాతిదంతా మనుచరిత్ర యుగమనడం సముచితం. ఈ యుగ లక్షణాలు కావ్యానికి ఒకే నాయకుడుండడం, వస్త్వైక్యం, అష్టాదశ వర్ణనలు, శృంగారం అంగిరసంగా నవరసాలు, అనువాదం కాక స్వతంత్ర రచనగా వుండడం. దీనిని ప్రబంధమన్నారు.

ఈ ప్రబంధానికి సమకాలంగా దేశి సాహిత్యం — యక్షగానాదులు విజయనగర సామ్రాజ్య పతనానంతరమూ, తమిళనాడులో అభివృద్ధి చెందుతూనే వుంది.

(విజ్ఞానసరస్వతి : ఏప్రిల్-జూన్ 1986)

# విమర్శ: సాహిత్యాభివృద్ధి

"మంచి కవితను ఎన్నుకొని, చెడ్డ కవితను విడనాడే సమర్థతే విమర్శలకు మూలసూత్రం. నూతన కవితను నూతన పరిస్థితులకు అనుగుణంగా ఎన్నుకొనే సమర్థత విమర్శకు అగ్నిపరీక్ష...." అన్నారు టి. యస్. ఎలియట్ ఒక సందర్భంలో. (The rudiment of criticism is the ability to chocse a good poem and reject a bad poem; and its most severe test is of its ability to select a new poem to respond properly to a new situation. – The Business of Criticism by Helan Gardner) దీనిని మనం రచనా సామాన్యానికి అన్వయించుకొందాం.

విమర్శ అనే మాటకు సాకల్యసమీక్ష అని అర్థం. కాని, దోషైక దృష్టితో దుమ్మెత్తి పోయడంకాదు. సానబడితేనే గాని మణి మరింతగా ప్రకాశించదు. వ్యష్టి సమష్టుల భూతభవిష్యద్వర్తమానాలతో పెనవేసుకొన్న సాహిత్యానికి విమర్శ పరామర్శలు మరీ అవసరం. మానవుడు - మనస్సు వికసించి తోటిజీవులతో శిష్టతను సంపాదించుకొన్న మానవుడు — ఏవేవో కలలు గంటాడు; ఊహిస్తాడు; భావిస్తాడు. మరికొంత బుద్ధిహృదయాలు పెరిగిన, భావాలను భాషలోకి మార్చుకోగలిగిన మానవుడు ఆ కలలను, ఊహలను, భావాలను సాహిత్య క్షేత్రంలో సాక్షాత్కరింప జేసుకొంటాడు; సాధ్యాసాధ్యతల వివక్షకు పోక జీవితంలోను వాటిని సాధించడానికి సాహసిస్తాడు; కొంత సాధిస్తాడు; కొంత సాహిత్యంలో మిగుల్చుకుంటాడు. మళ్ళీ కలలు, కలం, కార్యదీక్ష— ఈ నిరంతర, నిరంతరాయ. అందువల్ల ఆత్మ విమర్శలతో మానవుడు ముందుకుపోతూ, వెనక్కువస్తూ, మరల ముందుకు అంగలు వేస్తున్నట్టే సాహిత్యంలోను విమర్శ విధాయకం అవుతుంది.

విమర్శ సత్పరిశీలన సత్యదృష్టుల పెద్దకుమార్తె; న్యాయమనే దాదిచూడగా, వివేకమనే ప్రాసాదంలో పెరిగినట్టిది." అని జాన్సన్ అన్నాడు. (Criticism is the elder daughter of Labour and Truth, Committed to birth to care of Justice and brought up in the palace

**of wisdom, - The Ramblur iii)** జాన్సన్ మాటలు తరచి చూచినప్పుడు విమర్శకుల బాధ్యత ఎంత గురుతరమో చెప్పనక్కరలేదు. ఈ దృష్టితోనే కాబోలు విదేశాలలో సమకాలిక విమర్శ తీవ్రంగాను, నిష్పాక్షికంగాను, కొన్ని సమయాలలో ప్రమాదకరంగాను ఉంటుంది. ఈ శతాబ్ది ప్రారంభంలో సుప్రసిద్ధ మనస్తత్వ శాస్త్రజ్ఞులు ఫ్రాయిడ్, హెవలాక్ ఎల్లిస్‌లకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు దీనికి తార్కాణం. మహాకవి కీట్స్ "బ్లాక్‌వుడ్స్" పత్రికతో తన కవితలపై వెలువడిన విమర్శలకు గుండె లవిసి ఆకాలంలో కాలధర్మం చెందాడంటారు. వర్డ్స్ వర్త్ మహాకవి ఎంతో తీవ్రవిమర్శకు తట్టుకొని నిలబడ్డాడు.

ఇలాటి తీవ్రవిమర్శనే నిరసిస్తూ, హెలెన్ గార్డ్నర్ "విమర్శకు ప్రతీక రాజదండంకన్నా, కర దీపికే అంటాను. నా అభిప్రాయంలో వివరణ, నూతన తేజః ప్రసరణ విమర్శకుని ప్రాథమిక కర్తవ్యం" అన్నారు. **(The Troch rather than the sceptre should be my symbol for critic· Elucidition or illumination is the critic's primary task as I conceive it. – The Business of criticism)**

కాని, సమకాలిక విమర్శ తీవ్రంగా ఉండక తప్పదేమో? ప్రతిదేశానికీ, ప్రతికాలానికీ కొన్ని సంప్రదాయాలు స్థిరపడివుంటాయి. ఆకాలంలో వెలువడిన గ్రంథం ఆసంప్రదాయాల పరీక్షకు గురిగాక తప్పదు. అది సమకాలిక సంప్రదాయాలకూ, అభిరుచులకూ అనుగుణంగా ఉండడం అరుదు. కొంచెం ముందువెనుకలుగా వుంటుంది. అందువల్ల విమర్శకునికి సంతృప్తి కలగక పోవచ్చు; అతడు సహృదయుడు - కవితో సమానమైన హృదయం కలవాడు- అయితే, సంతృప్తి కలుగనూవచ్చు. అలాటి పరిస్థితిలో పొగడ్త అయినా తీవ్రంగా వుంటుంది. విమర్శకుడు వెనుకచూపుకలిగి, సమకాలిక సంప్రదాయ రీతులను గౌరవించేవాడయితే, రచనను ప్రశంసించడం, కొంత ముందుమాపు గలవాడయితే అభిశంసించడం సర్వసాధారణం.

ఈ విమర్శ కళా, శాస్త్రమా అనే మారుత్రోవచర్చ మరొకటి వుంది. విమర్శను మనం రంగవల్లితో పోల్చవచ్చు. ఒక మహిళ ఏవో చుక్కలు, గీతలు పెట్టుకొని రంగవల్లి గీస్తుంది. మొదట్లో గీతలు, చుక్కలుగా ఉన్నవి ఏ లత గానో, పూవుగానో రూపుదిద్దుకుంటాయి. సాహిత్య విమర్శలోను కొన్ని సూత్రాలు ఏర్పాటు చేసుకొంటాడు సహృదయుడు. వానిమీదుగా మరొకసృష్టి జరుగుతుంది. సాహిత్యం — రచనా — సృష్టి అయితే, విమర్శ పునస్సృష్టి అని అందాము. టాల్‌స్టాయ్ విమర్శ కళ అని యాభై ఆరు నిర్వచనాలు చెప్పారు. మరొకరు శాస్త్రమన్నారు, కాని, సాహిత్య విమర్శకు మార్గదర్శకాలయిన

అలంకార గ్రంథాలు శాస్త్రంగానే పరిగణితాలయినా, సర్జనాత్మక ప్రతిభకూడ అవసరం గనుక, విమర్శ కేవలం శాస్త్రపరిజ్ఞానం మీదనే ఆధారపడక సహృదయతకూడ అవసరమంటున్నది. అంతేగాక అలంకారశాస్త్రం ఎప్పటికప్పుడు ఏర్పడిన లక్షణాలను గురించిన వ్యవస్థమాత్రమే కావడంవల్ల కొత్త తీరుతెన్నులతో నిత్యనూతనంగా వికసించే సాహిత్య పురోగతిని అవగాహన చేసుకోడానికి విమర్శకునికి శాస్త్రపరిజ్ఞానంతోపాటు కళాత్మకాభిరుచీ, సర్జనాత్మకప్రతిభా అవసరమవుతాయి. అందువల్లనే సాహిత్యం సృష్టి అయితే, విమర్శ పునస్సృష్టి అవుతుంది. కనుక విమర్శను మనం శాస్త్రకళ, కళాశాస్త్రం అనవచ్చు.

నియమబద్ధ కళ అయిన ఈ విమర్శ సాహిత్యవికాసానికి మారు సాహిత్య వినాశానికి కారణమవుతున్నదా? కావడంలేదు అనే అనాలి. అలంకారశాస్త్రం శాసనం కాదని, క్రమంగా విస్తృతమవుతున్న, విస్తృతం కావలసిన శాస్త్రమని మనం గ్రహించినప్పుడు, సాహిత్యవికాసానికీ, సంప్రదాయానికీ, నూత్న ప్రయోగానికీ సమన్వయం ఏర్పడే అవకాశముంది. మార్పు జీవలక్షణం; జీవాన్ని ఆశ్రయించుకొన్న అన్నింటి లక్షణమూను. మిత్రుడు పుట్టపర్తి నారాయణాచార్యులు అన్నట్టు ఎప్పుడో కీర్తిశేషుడయిన ఆనందవర్ధమని వాణి ఇప్పటి కావ్యాలలో ప్రతిధ్వనించడంలేదని వాటిని ఈసడిస్తే ఎలా? అందువల్ల విమర్శకుడు శాస్త్రాన్ని విమర్శనీయ గ్రంథానికి అన్వయించేటప్పుడు సాహిత్యం కొత్త చిగుళ్ళువేసి వికాసం పొందేవిధంగా సహృదయత చూపించవలసిన అవసరం వుంది. ఇది సాహిత్యకళాభివృద్ధికి దోహదం కలిగించే శాస్త్రమేతప్ప దానికి అవరోధకమయిన శాసనదండం కాదని గ్రహించడం అవసరం.

ఛందోబందోబస్తులు, అలంకారకంకాళాలు సాహిత్యంలో స్తబ్ధతకు కారణమనే ఆపోహ నేడు చాలమంది పెద్దలకే వుంది. ప్రతిభాశాలికి ఇవి అడ్డు వస్తాయా? వాడు వాటిని మొదట్లో అనుసరించినా, తర్వాత తోసుకొని ముందుకు పోతాడు. వాడిపద్ధతి తర్వాత సామాన్యులకు నిబంధన మవుతుంది దానినికూడ మరొక ప్రతిభాశాలి ఏదోవిధంగా విదలించుకొని ముందుకుపోతాడు. ఇది వాల్మీకి నుంచి నేడు శేషేంద్రునివరకు మనం చూస్తున్నదే. కనుక, కేవలం అలంకార శాస్త్రమే మన సాహిత్యంలో స్తబ్ధతకు కారణమని చెప్పలేము; సాంఘికార్థికాది పరిస్థితులెన్నో కారణం. అందువల్ల సాహిత్యంలో — అన్నిటిలోను, నూత్నవికాసానికి కేవలం సంప్రదాయాన్ని అతిక్రమించడమో, అధిక్రమించడమో ముఖ్యం కాదు; రచయిత ప్రతిభ ఒక్కటే ముఖ్యం. వ్యుత్పత్తిని సంప్రదాయంగా మనం గ్రహిస్తే - ప్రతిభా వ్యుత్పత్త్యోః ప్రతిభే శ్రేయస్కరి అని ఆనందవర్ధనుడన్నాడు.

అవ్యుత్పత్తి కృతో దోషః
శక్త్యా సంవ్రియతే కవేః,
యస్త్వశక్తి కృతః తస్య
ఝగిత్యేవావభాసతే. (ధ్వన్యా 137 పు)

శక్తి అంటే ప్రతిభ.

ఇంత చెప్పుకున్నా, మన విమర్శదృష్టి గతంలోనికి ఎక్కువేలాగ చొచ్చుకొనిపోయినంత తీక్ష్ణంగా వర్తమానంలోకి చొరదు. సమకాలికవిషయంలో ఏవో జంకు కొంకులు మన మనోబుద్ధులను ఆవరిస్తాయి. అందువల్లనే చేమకూర వెంకటకవి "ఏ గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా!" అని ఆవేదన పడ్డాడు.

కాని, మన ప్రాచీన విమర్శ సంప్రదాయం నికషోపలం; ఏ దాక్షిణ్య దూషితమూ కాదనవలసి ఉంటుంది. దానికి తట్టుకోగల రచనే నిలిచేది; కొంతకాలమయినా. సమకాలికాభిరుచులకు సరిపడేవాటి విషయంలో స్థాలీపులాకన్యాయం సరిపోయేది కాని, కొంచెం ముందువెనుకలుగావున్న రచనల విషయంలో సముద్రమథనం తప్పేదికాదు. హెలెన్‌గార్డెనెర్ అన్నట్టు "రచనావబోధంలో మనజ్ఞానాన్ని విస్తరింపజేసి, పరిశుద్ధంచేసి, రచనారామణీయకాన్ని నిర్ణయించుకొనడంలో మనను సమర్థులనుచేసేది ఉత్తమ విమర్శపద్ధతి.' (Good criticism is said to enlarge and purify our understand ing of a work ur to enable us to judge of its excellance The Business of criticism) ఇది ఒకవిధంగా మన వ్యాఖ్యాన పద్ధతి. దీనిలో వ్యాఖ్యాత తన వివిధ శాస్త్ర పాండిత్యంతోపాటు రచయిత ప్రతిభను తేటతెల్లంచేస్తాడు. మహావ్యాఖ్యాత మల్లినాథసూరి "మాఘే మేఘే గతం వయః' అన్నాడట.

మన అలంకారికుల విమర్శ పద్ధతి విశిష్టమైంది. ఇది మిల్టన్ అన్నట్టు ఒక జీవితంనుంచి మరొకజీవితానికి అనువర్తించే ఆత్మ. ఆ అలంకార గ్రంథాలలోని ఉత్తమ భాగాలను, భావాలను మనం స్వీకరించాలి. (Books are not obsolutely dead things. A good book is precious life blood of master spirit enblanced and treasured up on purpose to a life beyond life) కావ్య శరీరం ఇతివృత్తమని, సౌందర్యహేతువు రసమని భరతాచార్యుడు, శబ్దార్థ సహితం కావ్యమని భామహుడు, ఇష్టార్థ వ్యవచ్ఛిన్న పదావళి కావ్యస్వరూపమన్ని దండి, రీతియే కావ్యాత్మ అని

వామనుడు, రసమే కావ్యానికి జీవితమని ధ్వనికారుడైన ఆనందవర్ధనుడు, రసమే అత్మ అని అభినవగుప్తుడు, అనుమానమే కాని ధ్వని కాదని మహిమ భట్టు, వక్రోక్తే కావ్య జీవితమని కుంతకుడు, రససిద్ధమయిన కావ్యానికి ఔచిత్యం జీవితమని, అనౌచిత్యంకన్నా రసభంగ కారణం మరొకటిలేదని

అలంకారా స్త్వలంకారాః
గుణా ఏవ గుణాస్పదమ్,
ఔచిత్యం రససిద్ధస్య
స్థిరం కావ్యస్య జీవితమ్.

అనౌచిత్యా దృతే నాన్యత్
రసభంగస్య కారణమ్,
ప్రసిద్ధౌచిత్యబంధస్తు
రసస్యోపనిషత్పరా. (ఔచిత్యవిచారచర్చ)

క్షేమేంద్రుడు మొదలుకొని మొన్నటి అలంకార మణిహార రచయిత లయిన శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాల యతీంద్రులవరకు - రెండు సహస్రాబ్దాల నుంచి నేటి వరకు - చేసిన సిద్ధాంతాలు సాహిత్య సౌందర్య గవేషణకు తోడ్పడేవే; ఇవి అరిస్టాటిల్ అనుకరణ (imitation) వాదానికి కాని, హోరేస్ పద్ధతి వాదానికి కాని, రచయిత ఉద్దేశమేమి; ఉద్దేశం సహేతుకమా, రచయిత దానిని నిర్వహించాడా అనే మాం జాయిన్ సూత్రాలకుగాని ప్రతికూలాలు కావు.

నన్నయ్య భట్టారకుడన్నట్టు సత్సభాంతర చర్చలు, పండిత పరిషత్తుల వివేచనలు, వాక్యార్థాలు పూర్వం అతి తీవ్రంగా, యుద్ధోన్మాదంగా, సంహార కాండగాను ఉండేవి. మరి ప్రాచీన తెలుగుసాహిత్యంలో సాహిత్య విమర్శ ప్రత్యేకశాఖగా ఎందుకు వికసించలేదో! రేఖామాత్రంగానే భాసిచింది. దానిని 1. స్వయంవిమర్శ, 2. సుకవిస్తుతి, 3. కుకవినింద, 4. పరోక్షవిమర్శ అని వింగడించవచ్చు. స్వయంవిమర్శను స్వయంప్రశంస, ఆత్మప్రశంస అని అన్నా తప్పులేదు. దీనిలో కవే తన కావ్య లక్షణాలను, శిల్పధర్మాలను చెప్పుకొంటాడు. దీనిని నన్నయభట్టారకుడే ఆరంభించాడు. ప్రసన్నకథా కవితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తి సంపద తన శిల్పలక్షణాలుగా చెప్పుకొన్నాడు. తిక్కన నిర్వచనోత్తరరామాయణం అవతారికలో సత్కావ్య లక్షణాలను, కావ్యదోషాలను కొంచెం విపులంగానే తెలిపాడు. శ్రీనాథుడు తన కవితను

"పంపావిరూపాక్ష బహుజటాజూటికా
రగ్వధ ప్రసవ సౌరభ్యములకు

తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా
గంభీర ఘుమ ఘుమారంభములకు
కర్నాటకామినీ కర్ణహాటకరత్న
తాటంకయుగ ధాళధళ్యములకు
కళాసాపురప్రాంత కదళీవనాంతర
ద్రాక్షాలతా ఫల స్తబకములకు
నిర్నిబంధనిబంధమై నెనయు...."

అని పొగడుకొన్నాడు ప్రౌఢదేవరాయల ఆస్థానంలో.

సుకవిస్తుతి ఒకవిధంగా మంచిదే. దీనివల్ల రెండు ప్రయోజనాలు కలిగాయి. ఒకటి: స్తుతుడైనకవి ఆ కావ్యకర్తకన్నా పూర్వుడన్న సంగతి స్థిరపడి, అతని, అతని సమకాలిక కవుల కాలాదుల నిర్ణయానికి ఉపయోగ పడడం; రెండవది: ఆ కవిపై స్తోతకు గల భావాలు తెలిసి విమర్శకు బాట ఏర్పడడం. నన్నయను తిక్కన "ఆంధ్రకవితావిశారదుండు, విద్యాదయితుండు మహితాత్ముడు" అని పొగడాడు. ఎర్రన తిక్కనను "తనకావించిన సృష్టి తక్కొరుల చేతంగాదునాన్, తన వల్కిన వల్కులాగమములుగా" అని కీర్తించాడు. శ్రీనాథుని వేమారెడ్డి

"వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండరీతి నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొకమాటు."

అని తులనాత్మకంగా స్తుతించాడు.

కుకవినింద ఒక ప్రత్యేకరీతిగానే చాలాకాలం ప్రవర్తిల్లింది. కుకవులు అనేవారు విడిగా ఒక తెగేమీకాదు. కావ్యదోషాలన్నిటి స్వరూపమే కుకవి. దీనివల్ల రచయిత పరిహరించవలసిన కావ్యదోషాలు తెలియవచ్చాయి గనుక ఇదీ సాహిత్యవిమర్శలో భాగమే.

పరోక్షవిమర్శ కవి తన కావ్యాలలోని పాత్రలద్వారా తన గొప్పదనం సూచించడం మొదలయిన పద్ధతులని చెప్పవచ్చు. పింగళిసూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఇంద్రునిచేత "శబ్దసంస్కార మెచటను జారనీక" అని కవితా ధర్మాలు చెప్పించాడు. కవితా విమర్శ చాటువులను పరోక్ష విమర్శగానే భావించాలి.

"అల్లసానివాని అల్లికజిగిబిగి
ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగసుకవి పదగుంభనంబును"
"చిన్నన్న ద్విపద కెరుగును
పన్నుగ పెదతిరుమలన్న పదముల కెరగున్
ఎన్నగదరమే నరసిం
గన్న కవిత్వంబు గద్య పద్యశ్రేణిన్."

లాంటి చాటువులు మన సాహిత్యంలో ఎన్నో ఉన్నాయి. కాని, నాకు చూడగా లాక్షణికులకంటే గొప్పగా కవితను నిర్వచించినవాడు పెద్దన.

"పూతమెఱుంగులున్ బసరు
పూపబెడంగులు జూపునట్టి వా
కైతలు జగ్గునిగ్గునెన
గావలె .. "

అని ప్రారంభించిన ఉత్పలమాలికలో

"....వియద్ధునీ చకచక
ద్వికచోత్పల సారసంగ్రహా
యాత కుమార గంధవహ
హారి సుగంధ విలాసయుక్తమై
చేతము జల్లజేయవలె
జిల్లనజల్లవలె న్మనోహర
ద్యోతక గోస్తనీఫల మ
ధుద్రవ గోఘృత పాయసద్రవసా
రాతిరసప్రసార రుచి
రప్రసరంబుగ సారెసారెకున్."

అని ముప్పైపంక్తులలోను కవితను నిర్వచించారు. ఇదే తెలుగులో మౌలికమైన సాహిత్య విమర్శకు శ్రీకారమని నా నమ్మిక.

రచయిత తన రచనకు చదివి వినిపించడం, ఎవరో ఒకరు ఆక్షేపించడం, మరొకరు సమాధానం చెప్పడం, దానిపై ఇంకొకరికోటి, దానికి వేరొకరి పూర్వపక్షం, పిదప రచయిత తనహృదయం వివరించడం, సిద్ధాంతం — ఇలాంటి ప్రాచీన పండిత పరిషత్సంప్రదాయాన్ని ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు చాలకాలం పాటించేవారు. ఇదంతా ప్రాచీన సంప్రదాయానుసారియే.

కాలం మారింది; పాశ్చాత్య సాహిత్య సంబంధం మనకు కలిగింది. తర్వాతనే కావ్యాన్ని, రచనను సాకల్య దృష్టిలో విమర్శించడమనే పద్ధతి మనకు అలవడింది అనవచ్చు. దీనిని శతాబ్దంక్రితం పత్రికలు ప్రారంభించాయి. తత్త్వబోధిని, వివేకవర్దని వంటివి సాంఘిక సమస్యలనుకూడ చర్చించేవి. భాషాసాహిత్యాలను మాత్రమే చర్చించిన పత్రిక "అముద్రిత గ్రంథ చింతామణి." ఇది 1885 ప్రాంతంలో నెల్లూరినుంచి వెలువడేది. ఇది సమకాలిక సాహిత్యాన్ని ఎంతో సహృదయతతో, ధైర్యంతో, నిష్పక్షపాతబుద్ధితో విమర్శించేది. ఇలాటి ప్రాచీన పత్రిక మరొకటి కనిపించలేదు నాకు. తక్కినవి వజ్రాయుధాలు. అముద్రిత గ్రంథ చింతామణి కన్యాశుల్కాన్ని విమర్శించిన తీరు చాల ప్రశంసార్హం (1899 మార్చి). చిత్రనళీయవిమర్శ ఎంతో సాహసోపేతం, ఉదాత్తతా సంయమయుతం (1895 మే).

సాహిత్యానికి - సంస్వతితత్త్వానికి కవి సహృదయులు రెండంగాలన్నారు ప్రాచీనాలంకారికులు. అభినవగుప్తాచార్యుడు ధ్వన్యాలోకవ్యాఖ్య అయిన లోచనం ప్రారంభంలో కవి సహృదయాఖ్యమైన సరస్వతితత్త్వాన్ని కార్య కారణ ప్రసక్తిలేకనే అపూర్వ వస్తువులను తెలిపేదిగాను, పాషాణంవంటి జగత్తును తన రసభరంతో సారవంతంచేసేదిగాను, దర్శన వర్ణన ప్రసర సుభగంగా ప్రకాశింపజేసేదిగాను నిర్వచిస్తూ ప్రశంసించాడు :-

"అపూర్వం యద్వస్తు ప్రథయతి
వినాకారణకలాం
జగద్గ్రావప్రఖ్యం నిజరసభరాత్
సారయతి చ,
క్రమా త్ప్రఖ్యోపాఖ్యాప్రసర
సుభగం భాసయతి తత్
సరస్వత్యా స్తత్త్వం కవి
సహృదయాఖ్యం విజయతే."

కవికి, సహృదయునికి సమానాధికరణం ఉండాలి. కవి కొండమీద, సహృదయుడు నేలమీద ఉంటే కుదరదు. సహృదయత అంటే సమాన హృదయం - కవికి, విమర్శకునితో, పాఠకునితో సమానాధికరణ్యం. అలాటి వాడే సహృదయుడు; కవి హృదయంతో - రచయిత హృదయంతో కొంతకు కొంతనా సమాన హృదయం కలిగివుండాలి. లేకపోతే కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు "అల్లసాని పెద్దనార్యుని కవిత్వతత్త్వము" అనే శీర్షికతో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో మనుచరిత్రను విమర్శించినట్లే ఉంటుంది.

"మనుచరిత్రము భాషావిషయములో ఉత్తమ గ్రంథము. ఇందు సలక్షణ మగు భాష గలదు. కూర్పు విషయములో మధ్యమస్థానములో నుండదగినది. రసానుగుణమగు రీతులు, వృత్తులు అంతగా లేవు. నీతివిషయములో నిది యధమ గ్రంథము; దుర్నీతి గరపుచున్నది. కాని, గృహస్థ ధర్మ వివరణాదికము లిందు బాగుగా నున్నవి. వర్ణనవిషయములో మనోహర గ్రంథము. చక్కని వర్ణనలు గలవు. రసవిషయములో నడిమితరములో జేరదగినదనుటయు నతిశయోక్తియగునని తోచెడినిది. శృంగార శాంతములు పాడుచేయబడినవి. వీరమొకింత కలదు. ఉత్తమ గ్రంథముకాదు."

బ్రహ్మయ్యశాస్త్రిగారి దృష్టితో చూస్తే, ఆనందవర్ధనుడు మొదలు అప్పయ్యదీక్షితులవారి వరకు రసకందాలుగా కోకొల్లలుగా ఉదాహృతాలయిన గాథాసప్తశతి గాథలు దుర్నీతి కరాలని తోసివేయవలసి వస్తుంది.

"అజ్జం మోహణసుహిఅం
మియేత్తి మెత్తూ పలాఇవే హలివే,
దరపుడిఅ వేంటభారోణయ
ముహివే విహసిఅం వ ఫలహివే." (4-60)

(దొరసానితో పాలేరుకు మనసు కలిసింది. హంసతూలికా తల్పాలను తలదన్నే మెత్తని మిడికయ్యలోనే ఇద్దరూ మన్మథుని ఆరాధించారు. దొరసాని చొక్కి కన్నులు మూసుకొనివుండగా, భయపడ్డాడు పామరుడైన పాలేరు. ఆమె మరణించినదేమోనని పలాయానం చిత్తగించాడు పిరికితనంతో. గట్టుమీదినుంచి వంగిన పత్తి వెంట్లతో వంగిచూస్తున్న పత్తికొమ్మ అరవిచ్చిన పత్తికాయ నెపాన నవ్వింది పరుగుతీస్తున్న పాలేరును చూచి.) అనే సుందరగాథ, మేఘసందేశం లోని,

"తస్యాః కించిత్ కరధృతమివ
ప్రాప్త వానీరశాఖం
హృత్వా నీలం సలిలవసనం
ముక్త రోధోనితంబమ్,
ప్రస్థానం తే కథమపి సఖే
లంబమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృత జఘనాం
కో విహాతుం సమర్థః."



(నాయిక తన నితంబమునుండి నల్లని వస్త్రముజారగా దానిని కొంచెము చేత బట్టుకొని యుండగా, నాయకుడు ఆ వస్త్రమును తొలగించివేసి ఆమెయొక్క జఘనమునందు జేరినవాడు, తత్పూర్వము రసమనుభవించినవాడు, విడిచిపోలేక యెట్లు క్రీడించియే పోవునో అట్లే ఆ గంభీరా నదియొక్క గట్టునుండి జారిన నల్లని జలమును కొంచెముగా ప్రబ్బలి కొమ్మకు తగులుచున్న దానిని నీవు తొలగించి (త్రాగివేసి) ఆ నీటిబరువుచే నదిపై వ్రేలుచున్న నీవు పూర్వము రస మనుభవించినవాడవు దానిని వదిలిపోలేక అందువర్షించి ఎట్టకేలకు అవతలికి పోదువు. (వేదం వేంకటరాయశాస్త్రిగారి సటీక మేఘసందేశము. పుట 95) అనే మందాక్రాంత ఎలాటి కావ్యాలవుతాయో!

భరతాచార్యుడు కావ్యంలో భాసించనిది, గ్రహింప దగనిది వస్తువంటూ లేదని అన్నాడు. (దీనినే శ్రీశ్రీ కాదేదీ కవితకనర్హం అని అన్నాడు.)

"న తచ్ఛాస్త్రం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా,
నా సౌ యోగో న తత్కర్మ నాచ్యేస్మిన్ యన్నదృశ్యతే."

ఆనందవర్ధనుడు ప్రపంచంలో కనిపించే విషయాలే వసంతఋతువులో కొత్త సోయాగాలతో అలరారే రీతిగా, రసమిళితాలు కావడంవల్ల కావ్యంలో నవ్య కాంతితో కనిపిస్తాయన్నాడు; వస్తుగ్రహణంలోను ఎలాటి విధినిషేధాలు చెప్పలేదు.

"దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్,
సర్వే నవా ఇవాఽఽ భాంతి మధుమాసఇవ ద్రుమాః."

(ధ్వన్యా. 4-4)

కవిత అనుకరణమనేవారికి, చౌర్యం అన్నవారికి రాజశేఖరుడు మంచి సమాధానం చెప్పాడు. దొంగకాని కవి, దొంగగాని వ్యాపారి లేరు. ఈ దొంగతనాన్ని చాతుర్యంతో కప్పిపుచ్చుకొనేవాడే ఏమీ బాధపడడు, ఆనందిస్తాడు అని.

"నాస్త్యచౌరః కవిజనః నాస్త్యచౌరో వణిగ్గనః,
స నందతి వినావాచ్యం యో జానాతి నిగూహితుమ్."

(కావ్యమీమాంస. పుట 16)

మనకు పాశ్చాత్యసాహిత్య సంబంధంతో ప్లేటో, అరిస్టాటిల్, హెగెల్, హడ్సన్, వించెస్టర్, రిచర్డ్స్ మున్నగు విమర్శ శాస్త్రజ్ఞుల భావాలతో

నూతన పద్ధతిలో విమర్శించే సంప్రదాయం ఏర్పడిందని ఇదివరకే అన్నాను. దీనివల్ల మనకు మన ప్రాచ్యాలంకారికుల సంప్రదాయానికి భిన్నంగా విషయం, సంవిధానం, శైలి, చరిత్ర, పౌర్వాపర్యం, తారతమ్యపరిశీలన, వస్తువిభజన, పాత్రచిత్రణం, ఆత్మీయతా ప్రాభవం, వ్యక్తిత్వం, ప్రకృతిపరిశీలనం, మానవ జీవిత వ్యాఖ్యానం, ప్రత్యక్షపరోక్షానుభూతులు, పరాంకోటినిర్వహణం, నామౌచిత్యవిచారం, సందేశపరిగణనం మొదలయిన పరిశీలన ప్రక్రియలు నూతన రీతిలో తెలిశాయి. ఇప్పటి రచయితలు, అదేమి విడ్డూరమో మన అలంకారిక సంప్రదాయంతో విమర్శించినా, పైన పేర్కొన్న పాశ్చాత్య సంప్రదాయంతో విమర్శించినా సహించలేక పోతున్నారు.

దీనికి కారణం ఏమిటి? "తత్త్వము, నీతి, ధర్మము మున్నగు విషయములను తన మనస్సాక్షిచేతను, అనుభవముచేతను నిర్ణయించుటకు బదులు తమ పెద్దల మాటలు వినియో, లేక వారి పెద్దలువ్రాసిన విషయములు చదివియో నిర్ణయించుస్థితికి వచ్చిన సంఘముబ్రతుకులు బొమ్మలాటవంటివే కాని సత్తువగల పదార్థములు కానేరవు" అని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ప్రకరణాంతరంలో అన్నట్టు సంఘస్థాయి దిగజారడమే కారణం.

నేడు నేల నాలుగు చెరగులూ వివిధ సంస్కృతుల సమ్మేళనం కారణంగా ఏకమవుతున్నాయి. సమ్మేళనదీధితులు ప్రసరించనే ప్రసరిస్తున్నాయి. ఆ వెలుగులో మనవెలుగునూ మిలాయించవలసివుంది కనుక అనధికారచర్యలు మానుకోవాలి. అర్హులెవరైనా ఆక్షేపిస్తే, అర్హతా, అంతరంగపారిశుద్ధ్యమూ సంపాదించుకొనడానికిమారు వ్యక్తిగత పరాభవంగా గ్రహించి కస్సుమని కసిపెంచుకొని; మనస్సులో కుమిలిపోవడం సంభవిస్తున్నది. యువరచయితల కెంతో భవితవ్యముంది కదా! మనస్సనే మల్లెపాదులో సామరస్యపు సరసీజలంతో సహనపు మల్లెలు పూయించుకోవద్దూ?

"కవులు తమకావ్యం ప్రజలసొమ్ము అని అనుకొన్నప్పుడు, సద్విమర్శ సాధ్యం. అప్పుడు సంయమం, సహృదయత వాటంతట అవే సిద్ధిస్తాయి. కాని, ఈ రెండింటికీ యౌగపద్యమూ అవసరం. కవి తన రచన తన సృష్టిగనుక గొప్పదని మురిసిపోతాడు. అందువల్ల ఎలాటి విమర్శను సహించడు. కాకిపిల్ల కాకికి ముద్దు. ఈ అసహనం చూచి విమర్శకుడు కొంచెం కొంటె కోణంగి అయితే, రచయితను మరీమరీ రెచ్చగొడుతాడు. కనుక విమర్శాభివృద్ధికి వాదోపవాదాల ఆర్భటి ఏలాటిదైనా, సుఖాంతం కలిగించే సహనం మూలబంధం కావాలి." (సాహితీ సుగతుని స్వగతం. పుట 95.)

సహనం, సహనం అని అనడం సులభం. కాని దానిని సంపాదించడం అంత సులభంకాదు మరి. మనసంఘ వ్యవస్థలోను, రాజకీయవ్యవస్థలోను పుట్టిన కుక్కమూతి పిందెలు (సాహిత్యం సంఘప్రతిబింబమన్నారు గనుక) సాహిత్యంలోను పొడసూపడంవల్ల సద్విమర్శ, సువిమర్శ సాధ్యంకావడంలేదు. విమర్శకునిదృష్టి కూడ కామిలాదూషితమూ, రచయిత దృష్టి అహంకార రాగరోగ పూరితమూ అవుతున్నదేమో! ఈ జ్వరం భర్తృహరి చెప్పినట్టు దిగిపోవడం ఎప్పుడో!

నేటి అసహనస్థితి తొలగి సాహిత్యరంగంలో నీత్యుషోదయం కావడానికి పందొమ్మిదో శతాబ్దం ప్రారంభంలో జనించినట్టు నిస్స్వార్థసేవాపరులు, అచంచల ధైర్యంతో అన్యాయాన్ని ఎదుర్కొనగల ధీరులూ ఉదయించాలి; అప్పుడుకాని భయకల్మషం తొలగదు; చీకట్లు పటాపంచెలుకావు. అలాటివారు ఇకమీద పుట్టి పెరగనక్కరలేదు; అలాటివారు మనలోనే వున్నారు; అలాటి గుణాలు మనలోనే పుట్టాలి. ఆ పుట్టడానికి సుముహూర్తమంటూ ఏదీ లేదు; ఎప్పుడైనా పుట్టవచ్చు. దానికి కావలసినవి న్యాయదృష్టి అనే క్షేత్రం. సాహిత్య శ్రేయస్సుద్వారా లోకకల్యాణం సాధిద్దామనే దీక్షాదోహదం, ధైర్యసాహసాలనే ఆతపపవనాలు.

"నియతికృత నియమ రహితాం
హ్లాదైకమయీ మనన్య పరతంత్రామ్,
నవరసభరితాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతి."

అనే మమ్మటాచార్యుని మాటలలో కవిభారతిని స్తుతిస్తూ విమర్శకుని కర్తవ్యాన్ని ఉద్బోధించే హెలెన్‌కార్జనెర్ మాటలను స్మరిస్తాను.

The beginning of the desipline of literary criticism lies in the recognition of the work of Arts, objectives existance as the product of Author's mind, which exists not to be used but to be understood and enjoyed (The Business of criticism)

# ఆధునిక చిత్రకళ ప్రజాసామాన్యం

తక్కిన కళలకు చిత్ర-శిల్ప కళకు ఒక భేదం వుంది. తక్కిన కళలను ఆస్వాదించడానికి పఠితకో, శ్రోతకో కొంత విషయ పరిచయం, శిక్షణ, సంస్కారం అవసరమవుతాయి. శిల్ప-చిత్రకళకు అవి అంతగా అవసరం లేదు. చిత్రం రంగులతో ద్రష్ట దృష్టిని ఆకట్టుకుంటుంది. శిల్పం గండరింపుల నిండుతనంతో చూపరి చూపును తనవైపు మళ్ళించుకొంటుంది. ఈ చిత్ర శిల్పాల అంతర్యం తెలియకనే చూపరి ఒక నిర్ణయానికి వస్తాడు. కాని, చిత్రం అంతర్యం. శిల్పం రహస్యం తెలియడానికిమాత్రం కొంతకు కొంత సంస్కారం అవసరమౌతుంది. ఈ సంస్కారం కాలదేశ వర్తమానాలను బట్టి, సంప్రదాయ రీతులను బట్టి ఏర్పడుతుంది. ఇద్దరు ధనుర్ధారులమధ్య ఉన్న మహిళ బొమ్మను ఏ భారతీయుడు చూచినా, సీతారామలక్ష్మణులని వెంటనే గ్రహిస్తాడు. రామాయణకథ, ముఖ్యంగా అరణ్యానికి వెళ్ళుతున్న సీతా రామ లక్ష్మణుల గాథ భారతీయుల మనస్సులలో ముద్రితమై తరతరాలుగా వస్తున్నది గనుక ఎంత అలవోకగా చిత్రం గీచినా, మనం గుర్తించి, ఆనందించి, ఆస్వాదించి అనుభూతి పొందగలం. కేవలం రంగుల హంగులతో, ఆకార సౌష్ఠవంతో కలిగే సంతోషం కన్నా విషయ పరిజ్ఞానంతో కలిగే అనుభూతి ఉదాత్తమైంది కదా? ఏమైనా, ఒక కళాఖండాన్ని అర్థం చేసుకొని, అభినందించి ఆనందించ డానికి కనీసపు శిక్షణ అవసరమవుతుంది అనేది స్పష్టమయింది.

కనీసపు శిక్షణ అన్నప్పుడు, కళాకారునికి, ద్రష్టకు మధ్య ఒక మధ్య వర్తి అవసరమవుతాడు. కళాకారుడు, ద్రష్ట ఒకేకాలంలో ఒకేచోట వుండే అవకాశం లేకపోవచ్చు. ఒకవేళ వున్నా, కళాకారుడు తన సృష్టిని గురించి వివరించలేనివాడు కావచ్చు. అందువల్ల, వారిద్దరికి మధ్యవర్తి కాదగినవాడు విమర్శకుడు, లేక — సహృదయుడు అందాము. సహృదయుడు అంటే, కళాకారుని హృదయానికి సమానమైన హృదయం కలవాడన్నమాట. ఈ విమర్శక — సహృదయుడు కళాకారుని సృష్టిని వ్యాఖ్యానిస్తూ, సామాన్య ప్రజానీకానికి దాని అంతర్యం తెలుపుతాడు; లేక తను ఊహించిన, భావించిన అంతర్యం వివరిస్తాడు.

ఇలా కళాకారుడు తన ప్రేక్షకులకోసం, విమర్శకులకోసం వారి సహా

కారంతో కళాసర్జనం చేస్తాడు. ప్రేక్షకులు తమ సంస్కారానుగుణంగా ఆ సర్జనాన్ని వ్యాఖ్యానిస్తారు. ఈవిధంగా కళ, విమర్శ రెండూ పరస్పరాశ్రయాలై ముందుకు సాగుతూ వుంటాయి. ముఖ్యంగా కళాకారుడు ఈ విమర్శను గ్రహించి మారినా, మారకపోయినా, ప్రేక్షకులు మాత్రం, అతని సృష్టి తమ భావాలకు, హృదయానికి, మనస్సుకు ఏమాత్రం నచ్చినా, దాని పురోగమనానికి, అభ్యుదయానికి, అభివృద్ధికి దోహదమవుతుంటారు. కళ కొనసాగుతూనే ఉంటుంది.

ఇదంతా కళాసామాన్యం గురించి, ప్రాచీన చిత్రకళ గురించీను. ఆధునిక కళ అన్నప్పుడు సామాన్యుడు అగమ్య పరిస్థితులలో పడిపోతాడు. ఈ ఆధునిక చిత్రకళ ఏమిటి? - అనే ప్రశ్నతో గింజుకుంటాడు. నాగరకతా ప్రాదుర్భావ సమయంలోని ప్రజల కళే ఆధునిక కళ; భావి కళే ఆధునిక కళ అని రకరకాలుగా చెప్పే నిర్వచనాలతో అతడు మరింత విమనస్కుడై, ఆ రెండూ కళ కావచ్చునేమోకాని, ఆధునిక కళమాత్రం కాదని నిర్ణయించుకుంటాడు. ఆధునిక చిత్రకళ అంటే ఏమిటి మరి?

ఆధునిక సంఘ వ్యవస్థలో-అన్నిమూల్యాలు, ధర్మాలు ధనానికే విధేయమైన ఆధునిక సంఘ వ్యవస్థలో ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం జరిగినందుకు కినిసి కోపించిన కళాకారుడు ఆ ప్రత్యాఖ్యానాన్ని ప్రత్యక్షంగా తెలిపిన ఆవేశరూపమే ఆధునికకళ అంటే, సామాన్య ప్రజకు అర్థమౌతుంది. సంఘంలో ధనం, ధనదాహంగల ధనస్వామ్యం చేస్తున్న మెలికలకు, విరూపాలకు, అరూపాలకు సంకేతప్రాయాలే ఆధునిక చిత్రకళలో వాస్తవికతకు మెలికలు పెట్టడాలు, మార్చడాలు, విరూపాలు చేయడాలునని వివరిస్తే బాగానే వుంది-అనుకొన్నాడు సామాన్యుడు. ఓహో! మన నిత్యజీవితంలోని అన్యాయాలకు ధనస్వామ్య వ్యవస్థ చేస్తున్న విరూపాలకు సంకేతాలా ఇవి? - అనే భావం సామాన్యప్రజ మనస్సును ఆధునిక చిత్ర కళాభిముఖం చేస్తుంది.

అయితే, చరిత్రగతి తెలిసినవారికి ఒకచిన్న సందేహం కలుగుతుంది. యూరప్‌లో మధ్యయుగపు భూస్వామ్య పరిపాలనలో చిత్రకారులు భూమి పాలకుల కొలువులో వుండేవారు. ఆ పాలకులు కళాకారులను తమ విలాస వస్తువులుగా వాడుకొన్నారేగాని, వారికి తగినంత స్వేచ్ఛ ఇవ్వలేదు. కనుక ఆ వ్యవస్థ, పాలన అంటేనే ఏవగింపు కలిగించింది కళాకారులకు. అంతలో బూర్జువా విప్లవం చెలరేగింది. తమ కష్టాలు తీరుతాయేమోననే ఆశతో, తమ కళకు స్వాతంత్ర్యం వుండగలదన్న విశ్వాసంతో దానిలో చేరారు కళాకారులు. కాని, బూర్జువా పరిపాలనతో, తత్సాంఘిక వ్యవస్థలో ధనానికే ప్రాముఖ్యం కావడంవల్ల, వారి తిండే పడిపోయింది. ఇల్లూ వాకిలీ లేక కడుపు మాడ్చుకో

వలసిన పరిస్థితి ఏర్పడింది; నైరాశ్యాందోళనలు ఎదురు తిరగడానికి దారితీసీ, ఆధునిక కళకు ప్రభవమయింది.

సర్రియలిజమని, క్యూబిజమని, ఇంప్రెషనిజమని, పోస్టు ఇంప్రెషనిజమని, డాడాయిజమని, సాంకేతికమని, సింబాలిజమని, ఇటీవల తాంత్రిక సింబాలిజమని ఆధునిక చిత్రకళ సప్తగోదావరంగా బహుముఖమయింది. కళాకారుడు తన దృష్టిగోచరమయిన ప్రపంచం వస్తువుగా చిత్రరచన చేయడమే కాక, తన అర్ధచేతనావస్థ ఆదేశాల ప్రకారం రచన సాగిస్తాడు. ఇది ఫ్రాయిడ్ ఇగో, లిబిడో సిద్ధాంతాలపై ఆధారపడింది. క్యూబిజమంటే ఘనరూపంలో భావించడం. పూర్వపు కళా సంప్రదాయంలో మానవరూపాలు వర్తులాకారంగా వున్నట్లు భావించబడితే క్యూబిస్టులు అన్ని ఆకారాలు క్యూబులరూపంలో వున్నవన్నారు, ఇది పాత సంప్రదాయాన్ని ఎదురుతిరిగి కాదనడం తప్ప మరొకటి కాదు. డాడాయిజం సంఘంలోని వికారాన్ని, అన్యాయాన్ని వికార రూపంతో చిత్రించడం. ఇంప్రెషనిజం ప్రత్యక్ష వస్తువును కాక, తదుత్పన్న భావనను చిత్రించడం, ... ఇలా చాలావరకు అన్ని ఆధునికరీతులూ ప్రాచీన సంప్రదాయంపై తిరుగుబాటు అంటే ఏమీ తప్పులేదు.

కాని ఇలాంటి తిరుగుబాటు జరుగగల, జరిగిన దశగాని, పరిణామంగాని మనదేశంలో ఏర్పడ్డాయా? ఎప్పుడు ఏర్పడ్డాయి? — అని సామాన్య మానవుడే కాదు; కొంత కళా సంస్కారంగల వ్యక్తి ప్రశ్నిస్తే, లేదు అనవలసివుంటుంది. మన ఆధునిక చిత్రకళ కేవలం పాశ్చాత్య వాదాల అనుకరణం అని అనవలసి ఉంటుంది. అలాంటప్పుడు ఏ పరంపర ఆధారంగా, ఏ కళాసంప్రదాయాను సారం మనం మన ప్రజాసామాన్యానికి ఆధునిక చిత్రకళను గురించి చెప్పగలం? అదేదో మాయావాదంలాగ మసిపూసి మారేడు కాయ చేసినట్లు కనిపిస్తుందే కాని అంతరంగానికి అనుభూతి కలిగించినట్లుకాదు. మరి గతి ఏమిటి? ఆధునిక చిత్రకళ శాఖోపశాఖలై విస్తరించిపోతున్నదే. సంఘంలో అత్యధిక సంఖ్యాకమైన ప్రజాసామాన్యం ఈ ఆనందం పొందడానికి అర్హం కాదా? అది ఈ ఆనంద వంచితం కావలసిందేనా? — అని ఏ సహృదయుడైనా ప్రశ్నించవచ్చు.

ఆధునిక చిత్రకారుడు తన ప్రియతమ సర్జనాన్ని — ప్రజలకోసం కొన సాగిస్తున్న సర్జనాన్ని ప్రజాసామాన్యం ఆనందించదలచుకొంటే, తన ఆనంద రసాయనాన్ని వారికికూడా పంచి, తన్మయులను చేయదలచుకొంటే, తాను తన కళాప్రాసాదంనుంచి కొన్ని మెట్లు కిందికి దిగవలసివుంటుంది. "ప్రజలు మా స్థాయిని అంధుకోలేద్దు. మేము మా స్థాయి నుంచి ఎలా కిందికి దిగుతాం?

మాకు అధిష్ఠానసామ్యం కుదరడం సంభవం కాదు" అని ఆధునిక కళా కారులు భీష్మించుకొని కూర్చుంటే మాత్రం ప్రయోజనం శూన్యం. మరి ఏమి చేయాలి?

ధనమదుమత్తమైన నేటి సంఘాన్ని దృష్టిలో వుంచుకొని, ప్రజా సామాన్యం కష్టాలు, దుఃఖాలు, సుఖసంతోషాలు కూడా ఆదునిక కళా సంప్రదాయంలో చిత్రించినప్పుడే, అది ప్రజాసామాన్యానికి బోధకంగా, జ్ఞానానంద దాయకంగా అవుతుంది. సామాన్య మానవుడు, ఆదునిక కళ తనను లక్షీభూతం చేసుకొన్నదని గ్రహించినప్పుడే దానిని ప్రశంసించగలడు, అది తన కష్టసుఖాలకు ప్రతీకమని భావించి ఆనందించి తదున్ముఖుడు కాగలడు. కళాకారుడు ఈ విషయంలో తనకు ఆత్మధర్మప్రత్యాఖ్యానం జరిగిందని భావించ నక్కరలేదు. తన ఒంటరితనాన్ని, ఏకాకిత్వాన్ని కొంతకు కొంత విడనాడి, ప్రజాసామాన్యం భావాలతో కలిసి పోవాలి; వారికష్టాలు, వారి జీవిత భారాలు, వారిదైనందిన జీవిత విశేషాలు చిత్రించే ప్రయత్నం చేయాలి; అప్పుడు తమ సాంకేతికతను అనుసరించినా క్రమంగా వారికి అర్థమవుతుంది. ఆ సంప్రదాయంలో, ఆబాణీలో తన విషయాలు గ్రహించుకొన్న సామాన్యుడు, క్రమంగా ఇతర విషయాల సాంకేతికతను గ్రహించగలుగుతాడు. ఇలా, అతని స్థాయికి దిగకుండా, అతని కష్టనష్టాలు గమనించకుండా, అతని జీవితం చిత్రించకుండా "ఆదునిక చిత్రకళను చూచి ఆనందించు" అని అడగడం కూడా భావ్యం కాదేమో ననిపిస్తుంది.

మన రాజధానిలోని కళభావన్‌లో తరచు జరిగే ఆధునిక చిత్రకళా ప్రదర్శనలను విడువకుండా చూస్తున్నాను. కొన్ని చిత్రాల సంకేతం ఆంతర్యమేమిటో, వాటి ప్రధాన తాత్పర్యమేమిటో తెలియకుండా పదేపదే చూస్తూ అర్థం చేసుకొనడానికి ప్రయత్నించాను; ప్రయత్నిస్తుంటాను. ప్రక్కనవున్న ప్రేక్షకుని అడగడానికి సంకోచం — ఏమీ తెలియదని అనుకుంటాడేమోనని. మరి నేను రంగులు చూచి, రేఖలు ఎంచి, మురిసిపోవడానికి ప్రయత్నించడమేనా చేయవలసింది? లేక లోతులలోకి దిగడానికి అర్హత సంపాదించుకోవద్దా? కళాకారులను అడిగితేనో? ఒకరిని అడిగాను, "సామాన్య సూత్రాలు తెలియకుండా వీటికి వచ్చి, మా తాడు తెంపడం ఎందుకండీ?" అని తన విసుగును నవ్వుగా మార్చి అన్నాడు. విడిగా ఏ కళాకారుని సన్నిధికిపోయి, ప్రత్యేకంగా శిష్యరికం చేద్దామా అనుకుంటే అతనికి తీరికగా వుండాలి, నాకు ఓపిక వుండాలి.

కనుక, నాబోటి చిన్నతరహా కళాభిమానులకోసం కళాకారులే దిగి రాగూడదా? నాబోటి వారిదే కదా ఎక్కువ సంఖ్య? బుద్ధుడంతటివాడు తత్త్వ బోధకై బుద్ధిగా ప్రజాసామాన్యం వద్దకు రాలేదా? కృష్ణుడంతటివాడు కదళీ పాకంగా, సపోటాపాకంగా, అనబేషాహీపాకంగా విశ్వరహస్యాలు టూకీగా చెప్పలేదా? గాంధీజీ దిగిరాలేదా? మరి ఆధునిక చిత్ర కళాగ్రేసరులు మావద్దకు వస్తే తప్పేముంది?

కళా గౌరవాన్ని గ్రహింపలేని,
దాని అందాన్ని అనుభవించలేని వానికి
దైవచింతన ఉండదు.
కళారాధనలేమి చాల తెలివి తక్కువ.

—స్వామి వివేకానంద

తల్లిగా, సుతుడుగా, సోదరుడుగా వివిధ పాత్రలను ధరింపజేస్తుంది భక్తి భక్తునిచేత. మోహనరాగంలో ప్రసిద్ధమైన 'నను పాలింప' కీర్తన మధురభక్తికి మచ్చు. ఈ పాటను త్యాగయ్య, కుమార్తె వివాహంలో కానుకగా వచ్చిన కోదండరాముని చిత్రపటం చూచి పాడారని కథ వుంది. కావచ్చు. తాను ప్రియురాలుగా, రాముడు ప్రియుడుగా భావించిన మదురభక్తే దీనితో వెలసిందని నావిశ్వాసం. మోహనరాగం ఆతురతకు, ఆవేగానికి, ఆశ్చర్య సంభ్రమాలకు మంచిరాగం.

నను పాలింప నడచివచ్చితివా - నాప్రాణనాథ. ॥న॥
వనజ నయన నీ మోము జూచుట జీ
వనమని నెనరున మనసు మర్మము దెలిసి. ॥న॥

సురపతి నీలమణి నిభ తనువుతో
ఉరమున ముత్యపు సరుల చయముతో
గరమున శర కోదండ కాంతితో
ధరణి తనయతో త్యాగరాజార్చిత. ॥న॥

ఈకీర్తన ఒక వచనకవితా ఖండికగా కానవస్తుంది. రాముడు స్వయంగా నడచివస్తున్నట్టు, వస్తూ వస్తూ తన భక్తుని రక్షణకు ఉంటే మంచిదనే దృష్టితో ధనుర్బాణాలు పట్టుకొని వచ్చినట్టు - ఒక దృశ్యం సృష్టించారు త్యాగయ్య. ఈ కీర్తనతో సూటిగా చెప్పదమనేది నవీన గుణ సనాథత్వానికి తార్కాణం కావచ్చు.

ఎత్తిపొడుపులకు ఉపయోగిస్తుంది బాగా, జయంత శ్రీరాగం. ప్రియుడు ఎంత సేపటికీ కనిపించడు. ప్రియురాలికి విసుగు పుడుతుంది. ఆ విసుగు విరిసి ఎత్తిపొడుపుగా తయారవుతుంది. ఇలాటి ఎత్తిపొడుపు భక్తుని హక్కు. భక్తుడు భగవంతుని నిలదీసి అడుగవచ్చు, అహాయిత్యమూ చేయవచ్చు. 'మరుగేలరా' కీర్తన దీనికి ఉదాహరణ. త్యాగయ్య తన అంతరంగాన్ని ఒలిచి పెటారు దీనిలో :

"మరుగేలరా ఓ రాఘవా! ॥మ"
మరుగేల చరాచరరూప పరా
త్పర! సూర్య సుధాకర లోచనా! ॥మ॥

అన్ని నీవనుచు అంతరంగమున
తిన్నగా వెతికి తెలిసికొంటినయ్య

నిన్నేగాని మది నెన్నజాల నొరుల
నన్నుబ్రోవవయ్య త్యాగరాజనుత!" ॥మ॥

ఈ ప్రియురాలు అంతా ప్రియునికి-భగవంతునికి ధారపోసింది. మరొకరిని ఎన్నజాలని విరహవ్రత. మరి అలాటి ప్రియురాలికి, తనను నిరంతరం చూస్తూ-చంద్ర సూర్యలోచనుడై చూస్తూ, తనకు కానరాకపోవడం ఎంత ఆర్తి కలిగిస్తుందో ఆవేదనాంతరంగులకే ఎఱుక. కనుకనే మరుగేలరా?—అని ఎత్తిపొడవడం.

శంకరాభరణం పేరుకు పామైనా, శాంతరసానికి చక్కనిరాగం. గంభీరంగా సాగుతుంది. దీనిని త్యాగయ్య జ్ఞానిలక్షణ నిర్వచనానికి వాడారు.

"మనసు స్వాధీనమైన యా ఘనునికి
మరి మంత్ర తంత్రము లేల?
తనువు తానని యెంచువానికి
తపసు చేయనేల దశరథబాల?

అన్ని నీవనుచు ఎంచినవానికి
ఆశ్రమభేదము లేల?
కనుగట్టు మాయలని యెంచినవానికి
కాంతల భ్రమలేల దశరథబాల?

అజన్మము దుర్విషయరహితునికి గ
తాగత మిక యేల?
రాజరాజేశ నిరంజన నిరుపమ
రాజవదన త్యాగరాజ వినుత."

జ్ఞానం, కర్మ, భక్తి - మూడు చివరకు పరిణామదశలో ఒక్కటే. నిజమైన భక్తుడే జ్ఞాని. అతడే కర్మయోగి. కనుకనే భగవద్రామానుజులు శేముషీ భక్తిరూపా అని ప్రార్థించారు. త్యాగయ్య జీవితమే ఈ కీర్తన కాబోలు! త్యాగయ్య భక్తి సహజంగా స్వాధీనమయినట్టిది. అతడెప్పుడూ తనువు శాశ్వతమని యెంచలేదు. రాముడే అన్నీ అని ఎంచినవారు. ఈ లోకమంతా కనుకట్టు మాయయని గ్రహించినవారు దుర్విషయరహితులు. త్యాగయ్య ఈ కీర్తనతో గీతలోని భక్తి జ్ఞాన కర్మ యోగాలను కుదించారనవచ్చు.

త్యాగయ్యలోని కవి భక్తిచాటును తొలగించి చూస్తాడు లోకాన్ని. అప్పుడు శబ్దార్థాలంకారాలు అహమహమికతో పరుగులు తీస్తాయి. అవి భక్తిలో నాని, తేనెలో నానిన పనసతొనలవలె నోరూరిస్తాయి.

"మరువకురా నవమన్మథరూపుని ॥మ॥
నీటో, మెల్లని మాటో, కన్నుల
తేటో, మరి వలెవాటో, మనసా ! ॥మ॥

కులుకో, పావలగిలుకో, కపురపు
బలుకో, చెక్కుల తళుకో, మనసా ! ॥మ॥

విల్లో, ఘంటలఘల్లో, సుమముల
ఇల్లో, సేవపు కొళ్ళో, మనసా ! ॥మ॥

కేలో, బంగరుంగరాలో, తూగు
య్యాలో, చెంతనిల్లాలో, మనసా ! ॥మ॥

శిరమో, కనకాంబరమో, శ్రీకర
మురమో, బ్రోచే దురమో, మనసా ! ॥మ॥

ఆజన్మము హృద్రాజీవముతో
పూజింతుర, త్యాగరాజనుతుని, మనసా !" ॥మ॥

దీనిలో భక్తుడు ఆశించే భగవంతుని రమణీయ రూప చిత్రణం శబ్దచిత్రణంతో పాటు మనకు కనిపిస్తుంది. భగవంతుడు ప్రసన్నుడుగా నున్నప్పుడే భక్తునికీ ప్రసన్నత. కనుక భగవంతుని ప్రసన్నరూపాన్ని చిత్రించే సామగ్రిని ఈ కీర్తనలో కుక్కిపెట్టారు త్యాగయ్య.

సిద్ధాంతానికి, ఆచరణకు పొత్తు కుదరడం కష్టం. సిద్ధాంతాలు, సూత్రాలు మనం చాలా చదువుతాం. వాటి ఆచరణ విషయంలో పెక్కు మినహాయింపులకు దోవలు వెతుకుతాం. త్యాగయ్య కేవల సిద్ధాంతపఠనం చాలదని, ఆచరణకూడ అవసరమని అన్నారు "బుద్ధి రాదూ" కీర్తనలో. శంకరాభరణం గంభీరభావాలకు ఎత్తినదని ఇదివరకే చెప్పాను. ఈ కీర్తన కూడా శంకరాభరణంలోనే.

"బుద్ధి రాదు బుద్ధి రాదు — పెద్దల సుద్దులు వినక ॥బు॥
బుద్ధిరాదు బుద్ధిరాదు — భూరివిద్యలు నేర్చిన. ॥బు॥

ధాన్యధనములచేత ధర్మమెంతయుజేసిన య
నన్యచిత్త భక్తుల వా — గమృతపానము సేయక ॥బు॥

మానక భాగవతాది రా — మాయణములు చదివిన
మానుషావతార చరిత — మర్మజ్ఞుల జతగూడక ॥బు॥

యోగములభ్యసించిన—భోగములెంతగల్గిన
త్యాగరాజసుతుడౌ రామ—దాసుల చెలిమిచేయక." ॥ఋ॥

మనఃపరిపాకానికి చదువూ కావాలి, పెద్దల సుద్దులూ వినాలి. ధర్మ కార్యాలూ చేయాలి. భక్తుల అనుభవామృతమూ వినాలి. భగవంతుడు మానవా కారంలో అవతరించాడని తెలిపే రామాయణ భాగవతాదులూ చదవాలి. వాటి మర్మమూ గ్రహించాలి. యోగం నేర్వాలి. భక్తుల చెలిమితో భక్తియోగమూ కావాలి. ఒకటి సిద్ధాంతం; రెండవది ఆచరణ. రెండూ సమ్మేళన మయి నప్పుడే మోక్షార్హత.

రాజసేవకునికి కావలసిన వేషం కంచుకం, బిళ్ళ, నడుమున వ్రేలాడే కత్తి. పూర్వపు రాజభటుల వేషంకూడా ఇదే. ఈ వేషంతో అధికారం కూడా సంక్రమిస్తుంది. కనుక చెడుగును తొలగించడానికి సాధికారకంగా ప్రయ త్నించవచ్చు. కామ క్రోధాదులనే ఆరుగురు శత్రువులను జయించడానికి త్యాగయ్య రాముని ఈ బంటు పదవి కోరుతున్నారు :

"బంటురీతి గొలువీయవయ్యా రామ। ॥బం॥
తుంటవింటివాడు మొదలైన మదా
దులబట్టి నేల గూలజేయ నీ ॥బం॥
రోమాంచమనే ఘనకంచుకము
రామభక్తుడనే ముద్ర బిళ్ళయు
రామనామ మనే వరఖడ్గ మివి
రాజిల్లునయ్య త్యాగరాజునకే." ॥బం॥

త్యాగయ్య కోరే కవచం రామనామ ధ్యానంతో కలిగే పులకాంకురాలనే కవచం, రామభక్తుడనే ముద్రబిళ్ళ, రామనామమనే కత్తి. దీనితో ఆయన కామ క్రోధాదులనే దొంగలను అదుపులో పెట్టదలిచాడు. ఎంత వీరుడయినా, తగిన ఆయుధాలు, అధికారం లేనిదే ఏమి చేయగలడు? అధికారులకు దొంగలు భయపడుతారు. అరిషడ్వర్గాన్ని జయించాలి. అప్పుడే నిజమైన భక్తుడు అవుతాడని త్యాగయ్య ధర్మసూక్ష్మం తెలిపారు.

ఖరహర ప్రియ రాగానికి ఈ పేరు ఎందుకు వచ్చిందో గాని, నిజానికి దీనిగమనం గజగమనం. ఇది బోధకు, దృష్టాంత ప్రదర్శనకు చక్కగా నప్పు తుంది. 'చక్కని రాజమార్గములుండగ' కీర్తన దీనికి ఉదాహృతిగా చెప్పవచ్చు. త్యాగయ్య లౌకిక దృష్టాంతాలతో రామభక్తి సర్వోత్తమత్వాన్ని ఈ కీర్తనలో నిరూపించారు :

"చక్కని రాజ మార్గము లుండగ
సందులే దూరనేల ఓ మనసా! ॥చ॥

చిక్కని పాల్మీగడ యుండగ
ఛీయను గంగాసాగర మేల?

కంటికి సుందరతరమగు రూపమే ము
క్కంటి నోట చెలగే నామమే త్యాగరా
జంటనే బాగ నెలకొన్నది దైవమే ఇటు
వంటి శ్రీ సాకేతరాముని భక్తియనే
చక్కని రాజమార్గము లుండగా." ॥చ॥

భక్తి అనేది నిజానికి అన్ని మత్తుమందులనూ మించిన మత్తు. భక్తికాని, ప్రేమ గాని కనులకు కప్పిన మరొకటి కానరాను. అలాటి భక్తిని అలవరచు కొమ్మంటున్నారు త్యాగయ్య. పాలమీగడల రుచి తెలియని మానవమాత్రుడుండడు గదా! సర్వ సాధారణ మయిన, అనుదిన దృశ్యమానమయిన దానితో గొప్ప దానిని పేర్కొనేశక్తి మహా కళాకారునికే వుంటుంది; గొప్ప ఆచార్యులకే వుంటుంది. త్యాగయ్య కీర్తనలలో అలాటివి కోకొల్లలు.

ఈ పాలమీగడలకన్న రుచిగలది రామభజన రసమని మరొక కీర్తనలో నిర్వచించారు త్యాగయ్య. తంజావూరు పాలకులు పంపిన కానుకలకు ప్రలోభం చెందక తనను విలువరించుకొని మనసును హెచ్చరించిన కీర్తనగా "నిధి చాల సుఖమా?" ప్రసిద్ధం. రాగం కల్యాణి.

"నిధి చాల సుఖమా రాముని స
న్నిధి చాల సుఖమా నిజముగ బల్కు మనసా ! ॥ని॥

దధి నవనీత క్షీరములు రుచో దాశ
రథి ధ్యానభజన సుధారసము రుచో ! ॥ని॥

శమదమమను గంగాస్నానము సుఖమా క
ర్దమ దుర్విషయ కూపస్నానము సుఖమా ! ॥ని॥

మమత బంధనయుత నరస్తుతి సుఖమా
సుమతి త్యాగరాజ నుతుని కీరన సుఖమా!" ॥ని॥

కల్యాణి రాగంలో విశేషముంది. అది హరిద్వార హృషికేశల వద్ద ప్రవహించే గంగవలె కాక, కాన్పూరువద్ద ప్రవహించే గంగవలె మదగజగంభీరంగా సాగు

తుంది; ప్రియతనయునికి తల్లి ముచ్చట్లు చెబుతూ మంచిమాట అడపాదడపా అందిస్తున్నట్టుంటుంది. కాంతా సమ్మితంగా వుంటుంది. కాంతా సమ్మితమంటే ప్రియురాలు మాత్రమేనని భావించ నక్కరలేదు; మహిళా సమ్మితమని భావించవచ్చు.

భక్తుడు సదా విరహి, అష్టవిధ నాయికలూ అతనిలో వసిస్తారు. ఒకప్పుడు విరహవేదన పడుతాడు; మరొకప్పుడు వాసక సజ్జికవలె ప్రవర్తిస్తాడు, కనిపించ లేదని కలహాంతరిత అవుతాడు. విసుగెత్తి అభిసారికగా బయలుదేరుతాడు. త్యాగయ్య 'ఎన్నాళ్ళు నీదోవ జూతు' కీర్తన భక్తవిరహ ఆవేదనకే కాక శృంగార సాహిత్యానికే గీటురాయి.

"ఎన్నాళ్ళు నీదోవ జూతు — రామ —
  ఏమని నే ప్రొద్దుబోతు
నీకే మనసిచ్చి నేను — రామ —
  నీమేనని పెంచినాను
ధరను కర్మములను గోరి — యుంటి —
  దలచుకొన్నది వేరేదారి
అందరివలెనే నీభువిలో - బొమ్మ —
  లాట లాడుదుగాని మదిలో
రామయ్య మదిలోనా — నాలో —
  మర్మములు దెలుపవలెనా
రసికులకే సరిబోను వట్టి —
  తనుకులకే హాస్యమౌను
తొలిభక్తులవద్ద కొలువువో — రావు —
  కలుగు ధనములకు సెలవో
ఎందుకు ఇంతపతాకు రాము —
  ఇకను దప్పులు పెట్టబోకు
ఎంతనిరాల్తు కన్నీరు — జాలి —
  ఎవరిలో తెలిపితే తీరు

కనకే పుట్టినయిల్లు — నీవు —
తప్పక నీకృప చెల్లు
ఆశించినదే తప్పా — నీ — కా
బుద్ధి వద్దు మాయప్పా
కలి మర్మము తెలియలేదా — నా —
వలె దీనుడిలలోను గలడా
పలుమారు నినుదూరుకొంటి — ఆ —
ఫలము ననుభవించుకొంటి
తొలికర్మము రాకబోనా —
భక్తి — వెలుగుచే దీరకబోనా
పూలమ్మి బ్రతికినవారు - రామ -
పుల్లలమ్మ బిల్వరాదు
ఆ చులకన నీకు గాదా - రామ -
నీచబుద్ధి విడరాదా
ఓ జగదీశ ఖరారే - త్యాగ -
రాజు నీవాడను వేరే."

దీనిలోని ప్రతిపంక్తి స్త్రీసహజనమైన గుణాలకు. లోకవృత్త వేదిత్వానికి అద్దం పడుతుంది. 'ఎంతని రాల్తు కన్నీరు' అని అక్కసు, 'నీకాబుద్ధి వద్దు మాయప్పా' అని అనునయం, అంతలోనే తొలి కర్మమని సంతృప్తి, 'నా క్షేమయినా నీకే గదా' అని, 'ఆ చులకన నీకుగాదా' అని విసురు. "ఇంతయినా నీవాడినేనని" శరణాగతి. ఆహా! ఏమి భావశబలత! దీనికి బంగరు పూతగా ఆత్తరు గుబాళింపుగా అంత్యప్రాస. ఎంతటి మనస్తత్వవేత్త త్యాగయ్య. లక్ష్య శుద్ధిలో వుంది ఈ గొప్పదనమంతా. లక్ష్యశుద్ధి గలవానికి తక్కినశక్తులు 'ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యాః' అన్నట్టు వచ్చి చేరుతాయి కనుకనే, యోగుల, భక్తుల సూక్తులలో అంతటి జిగి బిగి పాతుకొని వుంటాయి.

త్యాగయ్య కాకతాళీయంగా తెలుగువాడయ్యాడు; కాకపోయినా భారత భాగధేయం. సంగీతంతో ప్రసక్తి లేకుండానే ఆనందించడానికి ఆయన కీర్తన లలో అపార సామగ్రి వుంది. రాగ భావ రచనా సమ్మేళన సౌందర్యం

గురించి ఇంకా ఎంతో పరిశోధన జరుగాలి. త్యాగయ్య మంగళ కీర్తనతోనే నా మాటలు ముగిస్తాను. ఇది కూడ కవితతో తప్పతడిసిన కీర్తన.

నీ నామ రూపములకు నిత్య జయమంగళం
పవమాన సుతుడుబట్టు పాదార విందములకు
పంకజాక్షి నెలకొన్న అంకయుగమునకు
నవముక్తా హారములు నటియించే యురమునకు
నలినారి గేరు చిరునవ్వుగల మోమునకు
ప్రహ్లాద నారదాది భక్తులు పొగడుచుండే
రాజీవ నయన త్యాగరాజ వినుతమైన
నీ నామ రూపములకు నిత్య జయమంగళం.

# సంస్కృత వాఙ్మయంలో గోదావరి

నదీమూలం, ఋషిమూలం పరిశీలించకూడదని అంటారు పెద్దలు. నదుల ప్రయోజనాన్ని, ఋషుల గొప్పదనాన్ని చూడాలేగాని పుట్టుపూర్వాలు మనకు అనవసరమని దీని తాత్పర్యం.

గోదావరీ నది మూలం కూడ అలాటిదే. గోదావరి నది పశ్చిమ సముద్ర తీరానికి 50 మైళ్ళ దూరంలో, పడమటి కనుమలలో బ్రహ్మగిరి పంక్తి అనే పర్వత పంక్తిలో నాసిక్ సమీపంలోని త్రియంబకం వద్ద గోముఖాకారంగా ఉన్న చట్టురాళ్ళ నుంచి బిందు బిందువుగా పడుతుంది. ఈ ప్రాంతం ఎత్తు దాదాపు 3000 అడుగులు. ఆ ఎత్తునుంచి కిందికి జలపాతంగా దూకుతుంది. దీనిని గంగా సాగరమని, గంగా ద్వారమని వ్యవహరిస్తారు. అక్కడి నుంచి ముందుకు సాగిన దీనితో పారుకూర్, ద్రవా, ప్రవరా అనే ఉపనదులు చేరుతాయి. మరికొంతదూరం పోగా వంజరా, పెయిన్ గంగా కలుస్తాయి. వర్ధా నుంచి ఇది ఆగ్నేయంగా ప్రవహిస్తుంది.

మరికొంత ప్రవహించిన తర్వాత ఇది ఆదిలాబాద్ జిల్లా బాసరసమీపాన ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశిస్తుంది. ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాల పడమటి సరిహద్దు వద్ద మంజీరానదిని కలుపుకొని, ఆదిలాబాద్ — నిజామాబాద్, ఆదిలాబాద్ — కరీంనగర్ జిల్లాలకు సరిహద్దుగా ప్రవహిస్తూ, ఆదిలాబాద్ జిల్లా తూర్పు సరిహద్దున ప్రవహిస్తున్న ప్రాణహితను కలుపుకొని కొంతదూరం సాగి కరీంనగర్ జిల్లా తూర్పు సరిహద్దున బస్తరు నుంచి వచ్చే ఇంద్రావతిని కలుపుకొని, పాపికొండలు దాటి పశ్చిమ గోదావరి జిల్లా పోలవరం సమీపాన మైదాన ప్రాంతంలో ప్రవేశిస్తుంది. ఈ ప్రాంతంలోనే భద్రాచలం పరిసరాలలో శబరీ నది దీనితో కలుస్తుంది. తర్వాత వేగ గంభీరంగా పారుతూ, రాజమండ్రి వద్ద ఏడుపాయలుగా చీలుతుంది. పిదప సముద్రంలో చేరుతుంది. ఈ ఏడు పాయలకు వాశిష్ఠీ, వైశ్వామిత్రీ, వామదేవీ, గౌతమీ, భారద్వాజా, ఆత్రేయీ జామదగ్ని అని పేర్లు. వీటిలో వాశిష్ఠీ, గౌతమీ అనే పాయలే విశిష్టమైనవి తక్కినవి అంతర్వాహినులని అంటారు. వాశిష్ఠీ గోదావరి నరసాపురం వద్ద గౌతమీ గోదావరి యానాం వద్ద సముద్రంలో చేరుతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో

దీనిపొడవు 720 కిలో మీటర్లు. దీని ఉపనదులలో ముఖ్యమైనవి వరదా, ప్రాణహిత, ఇంద్రావతి, ముచికుంద, శబరి, మంజీర, పూర్ణ, దుధ్నా, మున్నేరు, పెద్దవాగు, తెల్లవాగు, కిన్నెరసాని

ఈ నది ఉభయతీరాలలో ఎన్నో ముఖ్యమైన క్షేత్రాలున్నాయి. సాతవాహన, వాకాట, పశ్చిమ చాళుక్య, పూర్వచాళుక్య చక్రవర్తుల, రాచకొండ, రెడ్డి, విజయనగర, గోల్కొండ, బ్రిటీష్ సామ్రాజ్యాల అభ్యుత్థాన పతనాలను ఈ నదీతీరాలు చూశాయి.

మహారాష్ట్రాంధ్రప్రదేశాలలో సుదీర్ఘంగా పయనించిన ఈ మహానది వేదంలో కనిపించదు:

"ఇమం మే గంగే యమునే సరస్వతి
శుతుద్రీ స్తోమం సరతా పరుష్ణ్యా
అసిక్న్యా మరుద్వృధే వితస్తయా
ఆర్జికీయే శృణుహ్యా సుషోమయా."

(ఋ. మం 10, సూ 76, మ. 5)

అన్న నదీస్తోత్రంలో గంగ, యమున, సరస్వతి, శతద్రు, పరుష్ణి, అసిక్ని, మరుద్వృధ, వితస్త, ఆర్జికి, సుషోమ, శృణుహ్యా — అనే నదులు ఉన్నాయి గాని, గోదావరి లేదు. దీనినిబట్టి మన ప్రాచీనార్యులకు వింధ్యకు ఈవలి నదులేవీ తెలిదనే భావించాలి. కాని, వేదాలను వింగడించి, భారతేతిహాసం ప్రవచించిన వ్యాసమహర్షికి దక్షిణాపథ నదులు చాల తెలుసు. అతడు ప్రసక్తి వచ్చినప్పుడెల్లా దక్షిణ భారత నదుల ప్రాశస్త్యాన్ని కూడ ఉగ్గడించాడు.

వ్యాసమహర్షి మహాభారతం సభాపర్వంలో వరుణాలయాన్ని వర్ణించే సందర్భంలో దక్షిణ భారత నదులను పేర్కొన్నాడు:

"గోదావరీ కృష్ణవేణా కావేరీ చ సరిద్వరా,
కింపునా చ విశల్యా చ, తథా వైతరణీ నదీ."

(సభా. ప. 9-2)

గోదావరి పుణ్యనది అని, వరుణదేవుని సభలో స్థానమేర్పరచు కొన్నదని ప్రశంసించాడు. వరుణాలయం అంతస్సలిలమై రత్నమయా లయిన ఫల వృక్షాలతో ఎంతో సుఖమయమైందని, వరుణుని సభ శ్రేష్ఠులు, దేవతలు, పర్వతాలు, పుణ్యనదులకు వాసస్థానమని అన్నాడు.

అరణ్య పర్వంలోను కొన్నిచోట్లకూడ గోధావరి, సప్తగోదావరం

ప్రస్తావన ఉంది. పులస్త్యుని తీర్థయాత్రా సందర్భంలో గోదావరీ వేణ్ణల ప్రశస్తి ఉంది;

"తతో గోదావరీం ప్రాప్య నిత్యం సిద్ధనిషేవితామ్,
గవాం మేధ మవాప్నోతి వాసుకేర్లోక ముత్తమమ్.
వేణాయాస్సంగమే స్నాత్వా వాజిమేధఫలం లభేత్."

(అరణ్య. వ. 85-33, 34)

ఎప్పుడూ సిద్ధులు సేవించి వుండే గోదావరిలో స్నానం చేసిన వ్యక్తి గోమేధ ఫలం పొంది వాసుకి లోకం చేరుతాడు. వేణా సంగమంలో స్నానం చేసిన వ్యక్తి అశ్వమేధ యజ్ఞ ఫలం పొందుతాడు — అని ఈ శ్లోకాల అర్థం.

సప్త గోదావరంలో — ఏడు పాయలుగా చీలిన గోదావరి నదిలో — నది ఏడుపాయలుగా చీలినచోట - స్నానం చేస్తే చాల పుణ్యం సంపాదించి అంత్యకాలంలో దేవలోకం చేరుతాడని ఆ ఘట్టంలోనే ఉంది. నియమ నిష్ఠలు గలవాడై, నియతాహారుడై స్నానం చేయాలట:

"సప్త గోదావరే స్నాత్వా నియతో నియతాశనః,
మహత్పుణ్య మవాప్నోతి దేవలోకం చ గచ్ఛతి."

(అర. వ. 85-44)

ఆ అరణ్య పర్వంలోనే ధౌమ్యుడు దక్షిణ దిక్కులో ఉన్న తీర్థాలను గురించి చెబుతూ "దక్షిణ దిక్కున పుణ్యమయి అయిన గోదావరి అనేనది సుప్రసిద్ధమైనది, దానితీరంలో అనేక ఆరామాలు (తోటలు) ఉన్నాయి. నదిలో అపారమైన జలం ప్రవహిస్తుంది. అంటే నిండుగా ఆ నది పారుతూ ఉంటుంది. పలువురు తపస్వులు దాని తీరప్రాంతాలలో తపస్సు చేస్తారు. ఆ నది చాల మంగళకరమైనది" అని వర్ణిస్తాడు:

"యస్యా మాఖ్యాయతే పుణ్యా దిశి గోదావరీ నదీ,
బహ్వారామా బహుఫలా తాపసాచరితా శివా."

(అర. వ. 88-2)

యుధిష్ఠిరుడు వివిధ తీర్థాలను సేవించి స్నానం ఆచరించి దేవతలను, పితృదేవతలను జలాంజలులతో సంతృప్తి పరచాడని చెప్పే సందర్భంలో మరొకమారు గోదావరి ప్రస్తావం ఉంది. యుధిష్ఠిరుడు సముద్రగామిని అయిన గోదావరీనదిలో స్నానం చేసి పితరులను, సురలను జలాంజలులతో సంతృప్తి

పరచి, బ్రాహ్మణశ్రేష్ఠులకు ధనం దక్షిణగా ఇచ్చి, ముందుకు కదిలినాడనేది ఈ వర్ణన.

"తత్రాపి చాప్లుత్య మహానుభావః
సంతర్పయామాస పితౄన్ సురాంశ్చ,
ద్విజాతి ముఖ్యేషు ధనం విసృజ్య
గోదావరీం సాగరగా మగచ్ఛత్."

(అర. ప. 118,3)

అరణ్యపర్వంలో మార్కండేయుడు యుధిష్ఠిరునికి అగ్ని ఉత్పత్తిని గురించి చెబుతూ సహ అనే అగ్ని జలప్రవేశం చేసి మళ్ళీ అథర్వాంగిరసుని ప్రయత్నంతో నీటినుంచి బయలువెడలి జనోపకారకమైందని, పెక్కునదులతో పాటు గోదావరికూడ అగ్నికి ఉత్పత్తి స్థానమని చెప్పాడు.

"సింధునదం, పంచనదం, దేవికాథ, సరస్వతీ,
గంగాచ, శతకుంభాచ, సరయూ, రండకాహ్వయా.
చర్మణ్వతీ, మహీచైవ మేధ్యా, మేధాతిథి, స్తథా,
తామ్రవతీ, వేత్రవతీ, నద్యస్త్రిస్రోథ కౌశికీ.
తమసా, నర్మదా, చైవ నదీ గోదావరీ తథా,
వేణోపవేణా, భీమా చ, బడబాచైవ భారత.
భారతీ, సుప్రయోగా, చ కావేరీ, ముర్మురా తథా,
తుంగవేణా, కృష్ణవేణా, కపిలా, శోణ ఏవచ.
ఏతా నద్యస్తు ధిష్ణ్యానాం మాతరో యాః ప్రకీర్తితాః."

(అరణ్య. వ. 222, 22-25)

ఇక స్కాందాది పురాణాలలో గోదావరి ప్రస్తావం చాలాచోట్ల ఉంది. వాయుపురాణం భువనవిన్యాస ప్రకరణంలో పర్వతాలను, ఆ పర్వతాలనుంచి ఉద్భవించే నదులను వివరిస్తూ, గోదావరిని దక్షిణాపథనదిగా పేర్కొన్నది:

"గోదావరీ. భీమరథీ, కృష్ణా, వైణ్యాథ, వంజులా,
తుంగభద్రా, సుప్రయోగా, కావేరీచ, తథాపగా,
దక్షిణాపథనద్యస్తు సహ్యపాదాద్వినిస్సృతాః."

(వాయు. 1,104-5)

గోదావరి, భీమరథి, కృష్ణ, వైణ్య, వంజుల, తుంగభద్ర, సుప్రయోగ (పెన్న), కావేరి - ఇవన్నీ సహ్యపర్వతోపత్యకాలనుంచి పుట్టాయి,

పితృదేవతలకు శ్రాద్ధకర్మ చేయవగిన తీర్థాలలో గోదావరి కూడ ఒకటని మత్స్యపురాణం శ్రాద్ధ ప్రకరణంలో తెలిపింది:-

"తథైవ పితృతీర్థంతు యత్ర గోదావరీ నదీ,
యుతా లింగసహస్రేణ సర్వాంతర జలావహా.
జామదగ్న్యాఖ్య తత్తీర్థం క్రమాదాయత ముత్తమమ్,
ప్రతీకస్య భయాద్భిన్నా యత్ర గోదావరీ నదీ."

(మత్స్య. పు. పుట. 47)

గోదావరి నదీతీరంలో పితృతీర్థం ఉంది. దానిలో వేయిలింగాలున్నాయి. గోదావరి నిరంతరం నిండుగా పారే జీవనది. గోదావరీ తీరంలో ఉన్న జమదగ్ని తీర్థం చాల విస్తారమైంది; ఉత్తమమైందీని. గోదావరీనది ఇక్కడ ప్రతీకుని భయంతో పాయలుగా చీలింది.

కూర్మపురాణంలోను గోదావరినది సహ్యపర్వత పాదోద్భవాలైన నదులలో ఒక్కటిగా వర్ణితమైంది :

"గోదావరీ, భీమరథీ, కృష్ణవేణ్ణాచ, వళ్యాతా,
తుంగభద్రా, సుప్రయోగా, కావేరీచ, ద్విజోత్తమాః.
దక్షిణాపథనద్యస్తు సహ్యాపాదా ద్వినిస్సృతాః."

(కూర్మ. 491-96)

వామన పురాణంలో భువనకోశ వర్ణనలో గోదావరీ, భీమరథీ, కృష్ణా' వేణ్యాది నదులు సహ్యపర్వతపాద సముద్భూతాలని, ఈ సాగరపత్నులన్నీ సర్వజగత్తుకు తల్లుల వంటివని వర్ణితమైంది:-

"జగతో మాతర ఇమా స్సర్వా స్సాగరయోషితః."

(వామన. పు. 13, 31-32.)

మార్కండేయపురాణం భారతవర్షవిభాగాల వర్ణనలో గోగావరిమొదలైన నదులు సహ్యసంభూతాలైన ఉత్తమ సరిత్తులని పేర్కొన్నది:-

"గోదావరీ, భీమరథీ, కృష్ణవేణ్యా, తథాపరా,
తుంగభద్రా, సుప్రయోగా, సహ్యా, కావేర్యథా పరా,
సహ్యపాద వినిష్క్రాంతా ఇత్యేతా స్సరిదుత్తమాః."

భారతేతి హాసపురాణాలు గోదావరీనదీ మాహాత్మ్యాన్ని ప్రశంసించగా, కావ్యజగత్తు గోదావరిని సీతారాముల అజరామర ప్రేమకు ప్రతీకను చేసింది.

రామకథలో గోదావరీనది ఒక విడదీయరాని భాగమైంది. గోదావరీనది పంచవటిని, ప్రస్రవణతాన్ని, గృధ్రరాజు జటాయువును, సీతాపహరణాన్ని, సీతవిరహంతో కుమిలిన రాముని బాష్పఝురులను స్మరింపజేస్తుంది. ఆదికవి వాల్మీకి రాముడి ప్రేమను, విరహవ్యథను విధవిధాలుగా గోదావరితో పెనవేసి నాడు.

ఇలాటి అనుభూతినే భవభూత్యాదులూ అనుభవించి, సీతారాముల మధురాతిమధుర పవిత్రప్రేమఘట్టాలతో గోదావరి ఇసుకదిబ్బలను అలంక రించారు. ప్రాసంగికంగా బాణభట్టు కాదంబరీ కథాముఖంలో పంచవటీ వర్ణనం చేస్తూ, ఈ అనుభూతినే పొందాడని, సీతారామ కథామృత స్రవంతితో పావన మైన గోదావరి వీరి శృంగార రసైకసాక్షిగా నిలిచిందని, సీతారాములు ప్రేమలో మునిగి తమ కంటిపాపల ప్రతిబింబాలను జోడించి చూచుకొన్నది ఈ నదీజలాలలోనే అని, ఈ నదీమతల్లి వారికి వనవాస ప్రియసఖి అయినదని. డాక్టర్ కె. కమలగారు మధుర సుందరంగా వర్ణించారు.

అగస్త్య మహాముని మాటప్రకారం రాముడు పంచవటికి తరలివస్తాడు సీతా లక్షణులతో పాటు పంచవటీ ప్రదేశం చేరి లక్ష్మణుని చూచి ఇలా అంటాడు:- "లక్ష్మణా, అగస్త్యముని చెప్పిన పంచవటీ ప్రాంత మిదే. అరణ్య మంతా పూచి ఎంతో రమ్యంగా ఉంది. నీవు చాలా నిపుణుడివి. అంతటా తేరిపార జూడు. ఆశ్రమం ఎక్కడ ఉంటే బాగుంటుందో చూడు. నీరు దగ్గరగా ఉండి, వనసౌందర్యం జలసౌందర్యం చక్కగా కనిపించేట్టు. నీరు, కర్రలు, దర్భలు అందుబాటులో ఉండేటట్టు చూడు." ఆ మాటలు విని లక్ష్మ ణుడు అంజలి ఘటించి ఇలా అన్నాడు: "ఓ కాకుత్స్థ! నీవు నూరేళ్ళున్నా నేను నీకు అధీనుణ్ణే. అందమైన స్థలంలో ఆశ్రమం నిర్మించు అని ఆదేశించు. నిర్మిస్తాను." ఆ మాటలకు రాముడు సంతోషించి, ఎక్కడ ఆశ్రమం నిర్మిస్తే బాగుంటుందని విమర్శించుకుంటూ, ఆశ్రమానికి అన్నివిధాల సౌకర్యంగల ప్రదేశాన్ని నిర్ణయించుకొని, లక్ష్మణుని చేయి పుచ్చుకుని, ఇలా అన్నాడు: "లక్ష్మణా! ఇదిగో! ఈ ప్రదేశం ఆశ్రమానికి బాగుంటుంది. సమతలంగా ఉంది సిరి ఉట్టిపడుతూంది. చుట్టూతా పూల చెట్లున్నాయి. ఇక్కడ చక్కగా ఆశ్రమం నిర్మించు. మహానుభావుడైన అగస్త్యముని చెప్పినట్టు ఇదిగో సమీ పంలోనే గోదావరిగట్లమీద చెట్లు విరియబూచి ఉన్నాయి. సూర్యునిలాగ మెరిసిపోతూ పరిమళాలు వెలార్చే పద్మాలమడుగులు చూచావా నదిలో! ఎంత అందంగా ఉన్నాయో! నదిలో హంసలూ, కారండవాలు, చక్రవాకాలు తిరుగుతూ అందాన్ని ఇనుమడింపజేస్తున్నాయి. అంతదూరమూ, అంతదగ్గరా కాకుండా

కొండలున్నాయి. వాటిలో జింకలు గుంపులు గుంపులుగా ఒత్తుకుని తిరుగ తున్నాయి. నెమళ్ళు కేకలు వేస్తున్నాయి. ఎత్తైన ఆ కొండలలో గుహలు కనిపిస్తున్నాయి. ఆ కొండలలో అక్కడక్కడ బంగారుపూవుల చెట్లూ, వెండి లాగ మెరిసే పూవుల చెట్లూ, రాగిలాగ ఎర్రగా విరిసిన పూలచెట్లూ, ఎంతో శుభకరంగా ఉన్నాయి. ఆచెట్ల మధ్య తిరిగే ఏనుగులు, ఆ ప్రాంతానికి గవాక్షాలలాగా కనిపిస్తున్నాయి. కొండల అడవులలో సాలతాలతమాలాది వృక్షాలు ఏపుగా పెరిగి వున్నాయి. ఇది పుణ్యమైన ప్రదేశం, రమ్యమైన ప్రదేశం. పెక్కు మృగాలు, పక్షులు ఉన్న ప్రదేశం. సౌమిత్రే ఈ జటాయువుతోపాటు మనం ఇక్కడ ఉందాము."

రాముడు ఇలా చెప్పగానే మహాబలుడైన లక్ష్మణుడు త్వరలోనే మట్టి గోడలు లేపి బలమైన స్తంభాలు నాటి, పొడుగాటి వెదుళ్ళ పైన అడ్డంగా బిగించి, జమ్మికొమ్మలు పైన పరిచి గట్టి తీగపగ్గాలతో బిగించి, వాటిపైన దర్భలు, రెల్లు దట్టంగా కప్పి, నేలను చదునుచేసి గట్టిపరచి విశాలమైన, రమ్యమైన పర్ణశాలను నిర్మించాడు. ఆ పర్ణశాల ఎంతో గొప్పగా, చూడ దగిందిగా ఉంది. తర్వాత లక్ష్మణుడు గోదావరికి వెళ్ళి స్నానంచేసి, పద్మాలు, పండ్లు తీసుకుని తిరిగివచ్చి, పర్ణశాలకు పుష్పబలి సమర్పించి, యథావిధిగా శాంతి జరిపి, తాను నిర్మించిన పర్ణశాలను రామునికి చూపాడు.

రాముడు ఆ పర్ణశాలను చూచి చాల సంతోషించి, లక్ష్మణుని కౌగి లించుకొని, ప్రేమ పెల్లుబుకుతూ మనస్సులో నాటేట్లు ఇలా అన్నాడు: 'లక్ష్మణా! గొప్ప పనిచేశావు. చాలా సంతోషపడ్డాను. నీకు నేను ఏమి ఇవ్వగలను? ఈ గాఢ పరిష్వంగం (కౌగిలి) తప్ప? నీవు ధర్మజ్ఞుడివి, కృతజ్ఞుడివి, ఎదుటివారి భావం కనిపెట్టగలవాడివి. ఇలాటి కుమారునితో మన తండ్రి సేవ చేయించుకో లేకపోయాడే!" ఇలా అని రాముడు రకరకాల పండ్లు ఏరాళంగా దొరికే ఆ ప్రాంతంలో స్వర్గలోకంలో దేవతలు ఉన్నట్టు సుఖంగా నివసించాడు.

వాల్మీకి గోదావరి ప్రాంతాన్ని తొలిసారిగా ఎంత మనోహరంగా వర్ణించాడో తెలుపడానికి ఈ భాగాన్ని వివరంగా ఉదాహరించాను.

రాముడు సీతా లక్ష్మణ సహితుడై ఇలాగే గోదావరిలో రోజూ స్నానం చేస్తూ పితృదేవతలకు, దేవతలకు జలాంజలులు సమర్పిస్తూ, ఉదయించిన సూర్యుణ్ణి స్తోత్రం చేస్తూ ఉండేవాడు. సీతా లక్ష్మణులతోపాటు స్నానం చేసిన

రాముడు అభిషేకం చేసుకొన్న పార్వతీ నందికేశ్వర సహితుడైన ఈశ్వరుని వలె వెలిగిపోయేవాడు.

"కృతాభిషేకః స రరాజ రామః
సీతాద్వితీయ స్సహ లక్ష్మణేన,
కృతాభిషేక స్త్వగరాజ పుత్ర్యా
రుద్ర స్ననంది ర్భగవానివేశః."

(అరణ్య. స. 17)

తర్వాత గోదావరి ప్రసక్తి చాలాచోట్ల కనబడుతుంది. సీతను రావణుడు ఎత్తుకొనిపోయిన తర్వాత రామలక్ష్మణులు సీతను అన్వేషిస్తూ, దండకారణ్యం లోని చెట్టు చెట్టునూ, గట్టు గుట్టనూ, పిట్ట పిట్టనూ అడుగుతారు–సీత సంగతి మీకు తెలుసా, మీకు తెలుసా అని.

సీతలేని పర్ణశాలను రాముడు చూచాడు. అది హేమంత ఋతువులో మంచుకు పగిలి కాంతిహీనమైన పద్మలతలాగ ఉంది. "అయ్యో! సీతను ఎవ రైనా ఎత్తుకొనిపోయారా? మరణించిందా? పరుగెత్తిపోయిందా? ఏ రాక్షసుడైనా తినివేశాడా? ఎక్కడైనా దాక్కుందేమో! అరణ్యంలోకి వెళ్ళిపోయిందేమో పూవులు పళ్ళకోసం? పద్మాల మడుగుకు పోయిందేమో! నీళ్ళు తేవడానికి గోదా వరికి వెళ్ళిందేమో!........ఓ కదంబమా! నీవంటే నా ప్రియురాలికి ఎంతో ఇష్టం. ఆవిడను చూచావా? ఓ బిల్వమా! నీ లేత చిగురుటాకుల రంగుతో, పచ్చని పట్టుగుడ్డతో నీ కాయలవంటివి పాలిండ్లుగల సీతను చూచావా? ఓ అర్జున వృక్షమా (మద్ది)! నీవంటే జనకరాజుకు చాల ఇష్టం. ఆమె బతికే ఉందా? చెప్పవూ? ఓ ఏరుమద్దీ ఆమె తొడలు నీ కాండంలాగే నున్నగా ఉంటాయి. ఆమెను ఎరుగవా?....' ఇలా రాముడు తిలకా శోక తాల జంబూ కర్ణికార చూత నీప సాల పనస కురవక ధవ దాడిమ వకుల పున్నాగ చందన కేతకాది వృక్షా లను ప్రశ్నించాడు. తర్వాత "ఓ జింకా! మైథిలిని ఎరుగుదువా? జింక కన్నుల వంటి కన్నులుగలది. నీ పెంటి జింకల గుంపులో ఉంటుందేమో చూడు. ఓ ఏనుగా! ఆమె తొడలు నీ తొండంలాంటివి. కనుక నీకు తెలిసే ఉంటుంది. చెప్పవూ? ఓ శార్దూలమా! భయపడకు. ఆమె ఎక్కడుందో చెప్పు.... ..." ఇలా రాముడు అంతటా సీతకోసం గాలిస్తాడు.

(అరణ్య. స. 60)

ఇలా దీనుడైన రాముడు లక్ష్మణుని చూచి దీనంగా అంటాడు: "లక్ష్మణా, గోదావరీ నదికి వెళ్ళు, చూడు. పద్మాలకోసం సీత గోదావరికి వెళ్ళిం

దేమో!" రాముడు ఇలా అనగానే లక్ష్మణుడు మళ్ళీ సుందరమైన గోదావరి గట్టుకు వెళ్ళతాడు. అక్కడ అన్ని తీర్థాలూ వెదికి, "అన్నా, అక్కడ వదిన లేదు. నేను ఎంత గట్టిగా కేకలు పెట్టినా ప్రత్యుత్తరం లేదు. ఎక్కడికి వెళ్ళిందో!" అన్నాడు. లక్ష్మణుని మాటలు విని రాముడు సంతాపంతో మూర్ఛపోయి స్వయంగా తానే గోదావరికి వెళ్ళాడు వెదకడానికి. "ఎక్కడ సీత?" అని అడిగాడు. చంపదగినంత దుర్మార్గుడైన రావణునికి భయపడి పంచభూతాలు కూడ సీతాపహరణ వార్తలు రామునికి చెప్పలేదు. గోదావరి కూడ అలాగే భయపడి చెప్పలేదు. పంచభూతాలు గోదావరిని కోరాయి సీత సంగతి రామునికి చెప్పమని. కాని, గోదావరి చెప్పలేదు. రావణుని భయంకర రూపాన్ని, రావణుని భయంకర కృత్యాలను తలచుకుని గోదావరి ఉలకలేదు పలుకలేదు. అది చూచి రాముడు "లక్ష్మణా, ఈ గోదావరి ఏమీ మాట్లాడడం లేదు............"అని వాపోయాడు.

"స దీనో దీనయా వాచా లక్ష్మణం వాక్యమబ్రవీత్,
శీఘ్రం లక్ష్మణ జానీహి గత్వా గోదావరీ నదీమ్.
అపి గోదావరీం సీతా పద్మాన్యానయితుం గతా,
ఏవముక్తస్తు రామేణ లక్ష్మణః పునరేవ హి.
నదీం గోదావరీం రమ్యాం జగామ లఘువిక్రమః,
తాం లక్ష్మణః తీర్థవతీం విదిత్వా రామ మబ్రవీత్.
నైనాం పశ్యామి తీర్థేషు క్రోశతో న శృణోతి మే,
కంను సా దేశమాపన్నా వైదేహీ క్లేశనాశినీ.
నహి తం వేద్మివై రామ యత్ర సా తనుమధ్యమా
లక్ష్మణస్య వచశ్శ్రుత్వా దీనః సంతాపమోహితః.
రామస్సమభిచక్రామ స్వయం గోదావరీం నదీమ్,
స తా ముపస్థితో రామః క్వసీతేత్యేవ మబ్రవీత్.
భూతాని రాక్షసేంద్రేణ వధార్హేణ హృతామపి,
న తాం శశంసూ రామాయ తథా గోదావరీ నదీ.
తతః ప్రచోదితా భూతైః శంసచాస్మై ప్రియామితి,
నచ సా హ్యవదత్ సీతాం పృష్టా రామేణ శోచతా.
రావణస్య చ తద్రూపం కర్మాణిచ దురాత్మనః,

ధ్యాత్వా భయాత్తు వైదేహీం సా నదీ న శశంస హ.
నిరాశస్తు తయా నద్యా సీతాయా దర్శనే కృతః,
ఉవాచ రామః సౌమిత్రిం సీతాదర్శన కర్శితః.
ఏషా గోదావరీ సౌమ్య కించి న్న ప్రతిభాషతే."

(అరణ్య. స. 64, 1—11)

వా  మహర్షి గోదావరిని, పరిసర పంచభూతాలను సచేతనంగా చూపడంవల్లనే కాబోలు ఉత్తర రామ చరిత నాటకకర్త భవభూతి, ప్రసన్న రాఘవ నాటకకర్త జయదేవుడు తమసా, మురళీ, భాగీరథీ గౌదావర్యాది నదులను సజీవపాత్రలుగా నాటకాలలో ప్రవేశపెట్టారు.

పాణినికి గోదావరి సంగతి, గోదావరి ఏడు పాయల సంగతి తెలుసు. కనుకనే నదీభిశ్చ (2-1-20) అనే సూత్రంతో సప్త గంగం, ద్వియమునం, సప్త గోదావరం అనే రూపాలకు అవకాశం కలిగించాడు. సిద్ధాంతకాముది వ్యాఖ్య తత్త్వబోధినివ్యాఖ్య "తేసి పంచనదం సప్త గోదావరమితి సిద్ధమ్" అని వివరించింది, ఈ సూత్రాన్ని.

కాళిదాసు రచించిన రఘువంశం రామకథతోపాటు, రాముని పూర్వుల కథ కూడ కదా! గోదావరి ప్రసక్తి ఎలా లేకుండా పోతుంది దానిలో? రావణుడు నిహతుడయ్యాడు. విజయం చేకూరింది. లంకలో పనులన్నీ యథావిధిగా పూర్తయిన అనంతరం రాముడు సీతాసమేతుడై పుష్పక విమానంలో అయోధ్యకు బయలుదేరాడు. దారిలో తాము అరణ్యవాసంలో గడిపిన వివిధ ప్రాంతాలను వర్ణిస్తూ, సీతాదేవికి ఆహ్లాదం కలిగిస్తాడు. గోదావరి ప్రాంతం వస్తుంది గోదావరీ పరిసర ప్రదేశాలలో, గట్లమీది పొదరిండ్లలో సీతారాముల ప్రణయ జీవితం గడిచింది. అప్పటి స్మృతులను సీతకు జ్ఞాపకం చేస్తాడు. ఏవేవో చెబుతాడు. ఏమేమో భావిస్తాడు. అప్పుడు రాముడు:

"అమూ ర్విమానాన్తర లంబినీనాం
శ్రుత్వా స్వనం కాంచన కింకిణీనామ్,
ప్రత్యుద్వ్రజంతీవ ఖముత్పతంత్యో
గోదావరీసారస పంక్తయ స్త్వాః."

(రఘు. 13.33)

"ఓ జానకీ, ఇటు చూడు. ఇవి గోదావరీ తీర భూములు. కొంగలు బారులుకట్టి ఎగురుతున్నాయి. మనం పయనిస్తున్న విమానానికి కట్టిన చిరు

గంటల మోత విని, మనకు స్వాగతం చెప్పడానికి ఎగిరివస్తున్నట్టున్నాయి" అని అంటాడు.

మళ్ళీ ఇలా అంటాడు రాముడు : "ఓ సీతా, అడవిలో వేటాడి వచ్చిన నాకు, గోదావరీ తీరంలో వేటాడిన నాకు రెండే అలసట తీర్చేవి. గోదావరి తరగలపైగా వచ్చే వాయువు అలసటతీర్చేది; గోదావరీ తీరంలోని నీటి ప్రబ్బలి పొదల్లో ఏకాంతంగా నీ ఒడిలో పడుకొని అలసట తీర్చుకున్నాను. ఆ మధుర క్షణాలను స్మరిస్తున్నాను.

"అత్రానుగోదం మృగయానివృత్తః
తరంగ వాతేన వినీత ఖేదః,
రహస్త్వ దుత్సంగ వినీతఖేదః
స్మరామి వానీర గృహేషు సుప్తః."

(రఘు 13.35)

రాముడు క్రూరంగా లంకలో సీతమ్మకు అగ్ని పరీక్ష పెట్టాడు అందరి ఎదుటే. ఆమె మనస్సు ఎంత గాయపడిందో! ఆ బాధను అపనయించడానికే కాబోలు రాముడు పాత ప్రణయపు మాటలతో సీతమ్మను సంతోషపెట్టి సుముఖురాలను చేసుకోడానికి ప్రయత్నించి ఉంటాడు.

కాళిదాసు సమకాలీనుడైన దిగ్నాగుడు వేదపురాణ మతానుయాయి కాని బౌద్ధుడైనా సీతేతివృత్తంతో కుందమాల అనే మహోత్కృష్ట నాటకం రచించాడు. దానిలోను గోదావరి ప్రసక్తి ఉంది.

భవభూతి మహాకవి ఉత్తర రామచరిత నాటకంలో గోదావరిని వర్ణించిన తీరు వాల్మీకితో పోటీ పడుతుందా అన్నట్టు ఉంటుంది. భవభూతి గోదావరిని నదీమతల్లిగా, తల్లిగా ఆరాధించి అనుభూతి చెందినవాడు. అతడు ప్రాణహిత గోదావరీ సంగమాన్ని చూచి ఉప్పొంగిపోయివుంటాడు. "అబ్బ! ఏమి సౌందర్యం! ఏమి సౌందర్యం! ఇటు చూద్దామా, కొండగుహలనుంచి గద్గదంగా నదిస్తూ పారుతున్న గోదావరి జలాలు. దక్షిణంవైపు చూద్దామా, మేఘాలు పట్టుకొని వేలాడుతున్న నల్లని ఎత్తైన కొండల శిఖరాలు. నదీ సంగమం జరిగే పుణ్య ప్రాంతం చూద్దామా, రెండు నదులూ ఒరుసుకొని పారడంవల్ల ఉవ్వెత్తున ఎగురుతున్న తరంగాల కోలాహలం!" అంటాడు.

"ఏతే తే కుహరేషు గద్గదనదత్
గోదావరీ వారయః

మేఘాలంబిత మౌళి నీలశిఖరాః
క్షోణీభృతో దాక్షిణాః,
అన్యోన్య ప్రతిఘాత సంకులచలత్
కల్లోల కోలాహలైః
ఉత్తాలాస్త ఇమే గభీరపయసః
పుణ్యా స్సరిత్సంగమాః."

(ఉత్తర. 2-29)

భవభూతి ఉత్తర రామచరితంలో వనదేవత, గోదావరినది కూడ సజీవ పాత్రలు. ద్వితీయాంకంలో ఆత్రేయి వనదేవతలు సంభాషిస్తాయి. ఆత్రేయి గంగాతీరంలో ఉన్న వాల్మీకిగురుకులంలో ఉన్న అంతేవాసిని. గోదావరీతీరం లోని అగస్త్యాశ్రమంలో నివసిస్తున్న ఉద్గీథ విదులైన వేదాధ్యయన పరాయణులవద్ద వేదాధ్యయనం చేయడానికి ఆమె దక్షిణాపథానికి బయలు దేరింది. వనదేవత ఆమెకు దారి చూపుతుంది. అప్పుడు ఆత్రేయి "అప్యేషా పంచవటీ? అపి సరిదయం గోదావరీ? అప్యయం ప్రస్రవణః? (ఇది పంచవటేనా? ఇది గోదావరీ నదేనా? ఇది ప్రస్రవణ పర్వతమేనా?)" అని ప్రశ్నిస్తుంది. అప్పుడు వనదేవత ఇలా ప్రత్యుత్తరమిస్తుంది:

"మేఘ మాలేవ యశ్చాయ మారాదేవ విభావ్యతే,
గిరిః ప్రస్రవణ స్సోయం యత్ర గోదావరీ నదీ.

అస్యైవాసీ న్మహతి శిఖరే గృధ్రరాజస్య వాసః
తస్యాధస్తా ద్వయమపి రతాస్తేషు పర్ణోటజేషు,
గోదావర్యాః పయసి వితతానోకహ శ్యామలశ్రీః
అంతఃకూజన్ముఖరశకునో యత్ర రమ్యో వనాంతః."

(ఉ. అం.2.)

అదిగో చూచావా? దూరంగా మేఘాల వరుసవలె కనిపిస్తున్నదే, అదే ప్రస్రవణ పర్వతం. దాని పక్కన పారుతున్నదే, అదే గోదావరి. ఆ గొప్ప ప్రస్రవణ పర్వత శిఖరం మీదే గృధ్రరాజయిన జటాయునివాసం. దాని అడివారంలోనే మేము పర్ణకుటీరంలో ఉంటున్నాము. ఆ గోదావరీ నదీతీరంలో

పచ్చనిచెట్లసిరి చెప్పడానికి కాదు. ఆ చెట్లగూళ్ళలో కువకువలాడే పక్షులు. ఎంత రమణీయంగా ఉందీ వనప్రదేశం?

రాముడు సీతావిరహంతో కుమిలిపోతున్నాడు. అతనికి ఏమైనా ప్రమాదం సంభవించవచ్చు. కనుక అగస్త్యుని సతి లోపాముద్ర మురళానదితో గోదావరికి సందేశం పంపుతుంది ఈవిధంగా:-

వీచీ వాతైః శీకరక్షోదశీతైః
ఆకర్షద్భిః పద్మకింజల్క గంధాన్,
మోహే మోహే రామభద్రస్య జీవం
స్వైరం స్వైరం ప్రేషితై స్తర్పయేతి."

(ఉత్త. 3.2)

గోదావరీ! నీవు చాల మెలకువతో మెలగాలి. నీ తరగలు చల్లని జలకణాలు కలపి పాడిగాలి పారించు. అవి పద్మకేసరాల వాసనలను తీసుకు వస్తాయి. రామభద్రుడు మూర్ఛపోయినప్పుడెల్లా నీవు అలాటి తరగల గాలిని నెమ్మదిగా ఆయనను సేదదీర్చడానికి పంపు.

భవభూతి కరుణ శృంగార రసాభివ్యక్తి చిత్రీకరణలో వాల్మీకితో పోటీ పడ్డాడు అతడు ఛాయా సీతకు రామునితో కల్పించిన కలయిక కరుణ శృంగారాల మధుర సమ్మేళనం. ఈ సన్నివేశం రాతిని కూడ కరిగింపజేస్తుంది. వజ్రాన్ని కూడ ముక్కలుగా పగులగొడుతుంది - అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం.

బాణుని కాదంబరిలో గోదావరి ప్రస్తావం మధుర మంజులంగా ఉంది:

"దిశిదిశి శుకహరితైశ్చ కదలీవనైః శ్యామలీకృత పరిసరమ్, సరితా చ కలశయోని పరిపీత సాగర మార్గానుగతయేవ బద్ధవేణికయా గోదావర్యా పరిగత మాశ్రమపద మాసీత్." (కాద. కథాముఖం. అగస్త్యాశ్రమం)

చిలక పచ్చని అరటి తోటలు అగస్త్యాశ్రమంలో దిక్కు దిక్కులకూ వ్యాపించాయి. గోదావరీనది ఆ ఆశ్రమాన్ని చుట్టి ప్రవహిస్తుంది. దానిని చూడగా ఎలా ఉందంటే, అగస్త్యుడు సముద్రాన్ని ఆపోశనపట్టగా ఆ సముద్రుణ్ణే అనుసరిద్దామని ఏకవేణిగా (ఒంటి జడతో) గోదావరి వచ్చినట్టుందట. ఆ ఆశ్రమంలో రాముడు గోడమీద సీతాదేవి చిత్రాన్ని గీచాడట. దానిని చూడగా సీతాదేవి మళ్ళీ రాముని నివాసాన్ని చూడదలచి భూమిలోంచి లేచివచ్చినట్లున్నదట.

రామచరితాన్ని చిత్రించిన ప్రసన్న రాఘవ నాటకకర్త తన నాటకంలో గంగ, యమున, సరయు, గోదావరి, సాగరాలను పాత్రలుగా ప్రవేశపెట్టి వారిద్వారా రామవనవాసం మొదలు సీతాపహరణ రామకిష్కింధా ప్రవేశ హనుమత్సమాగమం వరకు గల కథను చెప్పించాడు. వాల్మీకి రామాయణంలో సీతాపహరణాన్ని చూచిన గోదావరి రాముడు ఎంత అడిగినా మారుపలకలేదు. ఆ గోదావరి ప్రసన్నరాఘవంలో సీతాపహరణ వార్తను సాగరునికి ఈ విధంగా నివేదిస్తుంది:

"హా రామ, హా రమణ, హా జగదేకవీర,
హా నాథ, హా రఘుపతే, కిము పేక్షసేమామ్,
ఇత్థం విదేహతనయాం ముహు రాలపంతీం
ఆదాయ రాక్షస పతిర్నభసా జగామ."

(ప్రస. 5-45)

హా రామ, హా రమణ, హా జగదేకవీర, హా నాథ, హా రఘుపతీ, నన్ను ఎందుకు ఉపేక్షిస్తున్నావు? — అని పలుమారు ఆక్రోశిస్తున్న జానకిని రాక్షస రాజయిన రావణుడు లాక్కొని ఆకాశమార్గంలో వెళ్ళిపోయాడు.

రాముడు సీతావియోగంతో ఉన్మత్తుడయిపోయాడు. ఏమేమో పలవరిస్తాడు. సీతను ఉద్దేశించి ఇలా అన్నాడు:

"దేవి త్వదీయ మణినూపుర జృంభమాణ
కోలాహలోత్తరల హంస కులాకులాసు,
వైదేహి లక్ష్మణ పదాంబుజ లాంఛితాసు
గోదావరీ పులిన భూమిషు దేహి దృష్టిమ్."

ఓ దేవీ, వైదేహీ! గోదావరి ఇసుకగట్లపై ఒకసారి నీచూపు ప్రసరింపజేయి. ఆ ఇసుక దిబ్బలమీద పారాడే హంసలు నీ కాలి రత్నాల అందెల రవళి విని తమతో మరేవో హంసలు పోటీకి వచ్చాయని కోలాహలంగా కూస్తున్నాయి. లక్ష్మణుని పాదపద్మాల గుర్తులు ఇంకా చెరిగిపోలేదు.

ఆ ఉన్మత్తావస్థలో రామునికి మధురాతిమధురాలైన పాత స్మృతులు జ్ఞాపకం వస్తాయి. అప్పుడు "గోదావరీ తీరంలోని తపోవనాలలో ఒకవైపు లక్ష్మణుడు మరొకవైపు జానకి నిండుగా ఉండగా, సంతోషంతో నిమిషాల వలె గడపిన రోజులు మళ్ళీ జ్ఞాపకం వస్తున్నాయి." అనుకుంటాడు.

"గోదావరీ తీర తపోవనేషు
సౌమిత్రి సీతా పరిపూర్ణ పార్శ్వాః,
ముదా నిమేషా నివ యాన్యనైషం
దినాని తాన్యేవ పునః స్మరామి."

(ప్రస. 6–11)

రాముడు సీతాదేవిని చూడాలని, ఆమె మాటలు వినాలని ఆతురత పడుతాడు. ఇలా అనుకుంటాడు—"గోదావరి సంతోషంతో పొంగుతున్నది. కమలాలు తేలాడుతున్న గోదావరి తరగల లీలలు సీతాదేవి వచనామృతాన్ని జ్ఞప్తికి తెస్తున్నాయి, దానిని చూపుతున్నాయి. అలాటి వచనామృతాన్ని మళ్ళీ చెవులనే పుడిసిళ్ళతో తాగగలనా?

"తాన్యేవ వక్ష్మలదృశో వచనా మృతాని
భూయోపి కర్ణచుళుకై రహ మాపిబేయమ్,
యైర్మా మదర్శయ దసౌ వికచప్రమోదా
గోదావరీ కమలవీచి విచేష్టితాని."

(ప్రస. 6–12)

గురుకుల క్లిష్టుడైన మురారి కవి అనర్ఘ రాఘవ నాటకంలో గోదావరిని వర్ణించాడు ఈ వర్ణన రావణ సంహారానంతరం సీతారాముల తిరుగు ప్రయాణంలో ఉంది.

ఉన్మత్త రాఘవమనే 14వ శతాబ్దినాటి ప్రేక్షణకంలో రాముడు వెర్రి వాడుగా దర్శనమిస్తాడు. దీని రచయిత భాస్కరకవి. ఇతడు విద్యారణ్యుల లను ఉట్టంకించదంవల్ల విజయనగరంవాడయి ఉంటాడు. దీనిలో మన్మథ స్తోత్రం ఇలా ఉంది:

"యస్య మధురోమాత్యో
దక్షిణపవనో వరూథినీనాథః,
ప్రియభ్రమరానుచరః
స జయతు చిరం మన్మథో రాజా."

ఇక ప్రాకృత సాహిత్యంలో గోదావరి వర్ణన కొకొల్లలు.

వాల్మీకి రామాయణం చివర చెప్పినట్టు రామకథ కలకాలం ప్రవహిస్తూనే వుంటుంది; ఆ రామకథతో పునీతమైన గోదావరికూడ కలకాలం ప్రవహిస్తూనే ఉంటుంది.

# ప్రాకృత సాహిత్యంలో గోదావరి

ప్రాకృతం జానపద భాష. దీనిని బౌద్ధులు, జైనులు తమ మత ప్రచారానికి సాధనం చేసుకున్నారు. కాని మత ప్రసక్తిలేని ప్రాకృత సాహిత్యమూ కొల్లగా ఉంది. అలాటి సాహిత్యానికి పుట్టినిల్లు గోదావరీ తీరం. గోదావరి తరగలనాదాలు, నదిమీదినుంచి వీచిన పిల్లగాలుల గుసగుసలూ గోదావరీతీరవాసులైన జానపదులు గొంతెత్తేట్టు చేశాయి. వారు ఝుమ్మని గాథలు ఆలపించారు.

అగాథలలో వారు గోదావరిని పవిత్రంగా, దూరదూరంగా, భయం భయంగా చూడలేదు. ఆత్మీయంగా, సన్నిహితంగా, తమ ఇంటి సరిహద్దుగా తమ శృగారాల సంకేత స్థలంగా చూచారు. తమ విలాసాలను, విలాపాలను' గోదావరికి చెప్పుకొన్నారు. దాని గట్లమీద తెగతిరిగారు, తమ సంకేత స్థలాలను కనుగొన్నవారిని తిట్టుకున్నారు. ఎంత గొప్ప గోదావరి! - అని అనుకున్నారు. వారి భావనలో ఆశ్చర్యం లేదు; ఆతురత లేదు. ప్రశాంతత ఉంది; తాదాత్మ్యం ఉంది.

ఇలాంటి గాథలను సేకరించిన సహృదయుడు హాల చక్రవర్తి. ఇతని గాథా సప్తశతిలో గోదావరిని ప్రస్తావించిన ఎనిమిది గాథలున్నాయి. ఈ గాథలు ప్రధానంగా శృంగార రస నిష్యందినులయినా, జానపదుల సహజ జీవితాన్ని మరుగుపరిచేవి కావు. నిజానికి గాథాశప్తసతిలోని గాథలన్నీ సహజ జీవితాన్ని వర్ణించేవే. ఆలంకారికులు అన్నిటికీ స్రృంగార రసం పులిమి ఆభాసు చేశారు. సహజ జనపద జీవిత దృష్టితోనూ వాటిని మనం ఆనందించవచ్చు. అలాటి అనావిద్ధ రత్నాలివి :

తెల తెలవారుతున్నది. ఉషస్సుషమ గోదావరి తరగలపై మిలమిల లాడుతున్నది. అప్పుడే నిద్ర నుంచి లేస్తున్నారు. కొందరు ముత్తైదువులు పసుపు పూసుకొని స్నానం చేయడం వల్ల గోదావరి గట్లు పచ్చగా బంగారు అలది నట్లున్నాయి. అప్పుడే ఒక ప్రియురాలి ప్రియుడు ప్రవాసానికి వెళ్ళుతున్నాడు.

అజ్జ వ్వేవ వడిత్తో
ఉజ్జాఅరయో జణస్స అజ్జేఅ.
అజ్జేఅ హలిద్దా పింజరాఇ
గోదాణఈ తడాఇఁ. (1.58)

అద్యైవ ప్రోషితః
ఉజ్జాగరకో జనస్యాద్యైవ,
అద్యైవ హరిద్రాపింజరాణి
గోదానదీ తటాని.

గోదావరి గట్టున ఇప్పచెట్టు విరగబూచింది. పూవుల బారంతో వంగి పోయింది. ఇప్పపూవులు ఏరడం గ్రామంలో నేటికీ వృత్తి. కనుక వాటిక ప్రాముఖ్యం.

ఒక జానపద మహిళకు బుద్ధి పుట్టింది, పూవులన్నిటినీ తానే ఏరుకుందామని ఇతరులు వచ్చేలోగా. కనుక ఇప్పచెట్టును వేడుకుంటున్నది. "గోదావరి తీరంలో వంకర టింకరగా పెరిగిన ఓ మధూకవృక్షమా! ని కొమ్మలు పూవుల బరువుతో నేల వరకూ వంగాయి. నా మాట విను, పూవులను నెమ్మదిగా రాల్చు. నేనొక్కతినే ఏరుకుంటాను."

బహుపుప్ఫభరోణామిఅ
భూమీగఅసాహ సుణహు విణ్ణత్తిం,
గోలా తడ విఅడకుడంగ
మహుఅ సణిఅం గలిజ్జాసు. (2.3)

బహు పుష్ప భరావనామిత
భూమీగతశాఖ శృణు విజ్ఞప్తిమ్,
గోదాతట వికటకుడంగ
మధూక శనై ర్గలిష్యసి.

మంచి ఇల్లాళ్ళు పెద్దలుగాని, దుష్టులుగాని ఎక్కడయినా తారసపడితే, తప్పుకొని తిరుగుతారు. ఒక కర్షకుని కోడలు నీటికోసం గోదావరి గట్టుకు వచ్చింది. అక్కడ అందరూ దిగే నీలాటి రేవులో గృహవతి (పెద్దకాపు) కుమారుడు ఉండడం చూచింది. ఆ రేవులో దిగడానికి సిగ్గుపడింది. కనుక మెట్లు దిగడం కష్టమయినా మరొకరేవు గుండా దిగి నీళ్ళు ముంచుకొని గుట్టుగా వెళ్ళిపోయింది.

గోలా అడట్టిఅం పేఛిఊణ
గహవఇసుఅం హలిఅ సోహ్ణా,
అఢత్తా ఉత్తరిఉం
దుఃఖుత్తరావ్ఁ పఅవీఏ. (2-7)

గోదా తటస్థితం ప్రేక్ష్య
గృహపతి సుతం హలిక స్నుషా,
అరబ్ధా ఉత్తరితుం
దుఃఖోత్తరయా పదవ్యా.

ఒక చెడిపె గోదావరి గట్టుమీది ఒక పొదరింటిని తన ప్రియుడికి సంకేత స్థానంగా పెట్టుకుంది. కాని, ఆ సంగతి తెలియని ఒక ధార్మికుడు (సనాతన ధర్మ పరాయణుడు) ఏకాంత స్థలం గదా అని ధ్యానం చేసుకోన డానికి వచ్చేవాడు. ఇది ఆ చెడిపెకు ఇబ్బంది కలింగించింది. కనుక అతనిని భయపెట్టడానికి ఇలా అంటున్నది:— "ఓ ధార్మికుడా! ఇప్పుడు ఈ గోదావరి గట్లల్లో హాయిగా తిరుగు. నిన్ను చూచి మొరిగే కుక్క కూడ చచ్చింది. దానిని గట్టుమీది పొదల్లో పొంచి ఉన్న కొవ్విన సింహం చంపింది."

భమ ధమ్మిఅ వీసత్థో
సో సుణఓ అజ్జ మారిఓ తేణ,
గోలా తడ విఅడ కుడంగ
వాసిణా దరిఅ సీహేణ. (2-75)

భ్రమ ధార్మిక విస్రబ్ధః
స శునకోద్య మారిత స్తేన,
గోదాతట వికటకుంజ
వాసినా దృప్త సింహేణ.

సాధారణంగా నదుల స్నాన ఘట్టాలలో ప్రమాదాలు జరుగుతుంటాయి. స్నాన ఘట్టాలలో దిగుడుదారి సరిగా లేకపోతే జారిపడడం, పక్కన ఉన్న వాళ్ళు పట్టుకోడం, ఇతరులు నవ్వడం, కొందరు కోప్పడడం, భయపడడం మున్నగు హావభావాలన్నీ సంభవిస్తుంటాయి, కాని, కొందరు విలాసినులు ఏదో ప్రమాదం జరిగినట్లు నటనలూ చేస్తుంటారు; జారిపడినట్లు నటిస్తారు.

అలాటి సంఘటనల కోసం సిద్ధంగా ఉండే దుండగులు వారిని పడతుండా పట్టుకున్నట్టు నటించి, తమ ఆశలు తీర్చుకుంటారు, కొంగు తగిలితే కొంత మేలు అన్నసామెతగా.

ఆమె జాణ, తన ప్రియుని కలుసుకోవాలి. అతని శరీర స్పర్శలేనిదే వేడి చల్లారదు. కనుక ఒక యుక్తి చేసింది. అతనిని గోదావరి గట్టున వేచి ఉండమంది. అతడు వచ్చి వేచి ఉన్నాడు. మెట్లు ఎగుడుదిగుడుగా ఉన్న సీలాటి రేవులో మీదినుంచి దిగుతూ పడబోయింది. ఇంతలో ఈ తరుణం కోసమే కాచుకొన్న ప్రియుడు చటుక్కున వచ్చి పట్టుకున్నాడు. ఆమె అతని రొమ్ముపై వాలింది. అతడు హాయిగా, గట్టిగా కౌగలించుకున్నాడు. ఆపత్కాలంలో ఆదుకోడంలో పట్టుకున్నాడేగాని, మరొక భావం లేదుగా! కనుక ఎవరూ ఏమీ అనుకోలేదు, తప్పుగా భావించనూ లేదు.

గోలా విసమోఆర
చ్ఛలేణ అప్పా ఉరమ్మి సే ముక్కో,
అణుఅంపా ణిద్దోసం
తేణ వి సా అఢ ముపఊఢా. (2.93)

గోదా విషమానతార
చ్ఛలేన ఆత్మా ఉరసి తస్య ముక్తః,
అనుకంపా నిర్దోషం
తేనాపి సా గాఢ ముపగూఢా.

ఒక ప్రేమికురాలు తన వయసులో తన ప్రియుడికోసం ఎన్నో సాహసాలు చేసింది. వయసు మళ్ళిన తరువాత వాటిని స్మరించుకుంటూ తన నెచ్చెలులకు ఈ విధంగా చెబుతున్నది: "సఖులారా! ఏమని చెప్పను అతని సౌభాగ్య వైభవాన్ని? అతనిచెలువం నన్ను స్త్రీ సహజం కాని సాహసాలకు ప్రోత్సహించేది. నేను అలాంటి సాహసాలు చేసేదాన్ని. ఆ సాహసాలు, అతని సౌభాగ్యగుణం గోదావరి ప్రవాహానికి, వర్షకాలపు రాత్రులకు, అర్ధరాత్రులకు తెలుసు." అంటే ఇద్దరూ అర్ధరాత్రులలో, వర్షాకాలంలో గోదావరీ ప్రవాహాన్ని ఈది కలుసుకునేవారన్నమాట.

తస్స అ సోహగ్గ గుణం
అ మహిల సరిసం అ సాహసం మజ్ఞ,

జాణఇ గోలా ఊరో
ఖాసారత్తోద్దరత్తోఅ. (3.31)

తస్య చ సౌభాగ్య గుణమ్
అమహిళా సదృశం చ సాహసం మమ,
జానాతి గోదాపూరో
వర్షారాత్రార్ధరాత్రశ్చ.

భార్యను చూడడానికి నిండుగా పారుతున్న నదిని తులసీదాసు ఈదుకొని పోయినట్టు చెబుతారు. ప్రేమ బలం అలాటిది. సాహసం పరిణామం ఏ విషయానికైనా ఒకటే. అది సవ్యమార్గంలో పడితే ప్రపంచానికి లాభదాయకమై కీర్తి కలిగిస్తుంది. దారితప్పితే అపకీర్తికి భాజనమవుతుంది.

ప్రేమ ఎంతటి సాహసానికైనా కారణమవుతుంది. ప్రేమికులు తమకు ఇష్టంలేని పనులనైనా పరస్పర సంతోషం కోసం చేస్తారు. విరుద్ధ గుణాలను, చర్యలను సహించి సర్దుకుంటారు.

ఆమె చాల సుకుమారి. తాకితే కందిపోయేట్టు ఉంటుంది. కాని ప్రియుడంటే పడి చస్తుంది. కనుక అతనికి ఇష్టమయిన పనులన్నీ చేస్తుంది. అతడు నేరేడు పట్ట పొడి ఒంటికి రాచుకుంటాడు గోదావరిలో స్నానం చేసేటప్పుడు. ఆ పొడి గరుకు గరుకుగా ఉంది. ఆమె సుకుమార శరీరం ఆ పొడి, దాని కషాయంతో కందిపోతుంది. అయినా అతడు రాచుకోగా మిగిలిన ఆ జంబూ కషాయ అంగరాగశేషాన్ని తానూ రాచుకొని గోదావరిలో స్నానం చేసింది అంతటి అనురాగం మరి!

తుజ్ఝంగరాఆ సేసేణ
సావలీ తహ ఖరేణ సోమారా,
సా కిర గోలా ఊరే
ణ్హాఆ జంబూ కసాఏణ. (2.89)

తవాంగరాగ శేషేణ
శ్యామలా తథా ఖరేణ సుకుమారా,
సా కిల గోదా కూలే
స్నాతా జంబ్వా కషాయేణ.

గోదావరీ తీరాలలో మంచీ జరుగుతాయి, చెడూ జరుగుతాయి. కాని, ఒక ముసలమ్మ చెడ్డ విషయాలే ఎక్కువగా చూచిందేమో! కనుక ఒక సదాచార వరాయణునికి ఇలా ఉపదేశిస్తుంది: "అబ్బాయి! నీకు పూవులంటే చాలా ఇష్టం. పూవులు కోసుకోడానికి గోదావరి గట్టుకు పోతావు. కాని, నాయనా, దేవతలకు ఇంటిలోని పూవులతో అర్చన మిచ్చినా నీటితో అర్ఘ్యమిచ్చినా చాలు. సంతోషపడుతారు. గోదావరి గట్లకు మాత్రం పూవుల కోసం వెళ్ళకు. ఆ గట్లు నీ శీలాన్ని మొదలంట పాడుచేస్తాయి సుమా!"

మా వచ్చ పుప్ఫలావిర
దేవా ఉఅఅంజలీహిం తూసంతి,
గోఆఅరీఅ వుత్తఅ
సీలుమ్మూలాఇ కూలాఇ. (4.55)

మా వ్రజ పుష్పలవనశీల
దేవా ఉదకాంజలిభిః తుష్యంతి,
గోదావర్యాః పుత్రక
శీలోన్మూలాని కూలాని.

ఈ ముసలమ్మ గోదావరి గట్లను 'శీలోన్మూలా'లని నిందించింది కాని, గోదావరి పుట్టినదిమొదలు సముద్రునిలో లీనమయ్యే వరకు మంచినీ, చెడునూ చూస్తూ సాగి వచ్చింది. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః' అన్నట్టు మనసును బట్టే మంచీ, చెడు ఉంటాయి.

ప్రాకృత సంకలన కావ్యాలలో గాథాసప్తశతి తర్వాత చెప్పుకోదగ్గది వజ్జాలగ్గ. దీనిని జయవల్లభుడనే కవి సేకరించాడు. ఇతడు కూడ కొన్ని గాథలు రచించి ఈ సంకలనంలో చేర్చాడు. ఇతడు క్రీస్తు శకం తొమ్మిదవ శతాబ్దం వాడు. వజ్జాలగ్గ అంటే కొన్ని పద్ధతుల సమూహం అని అర్థం.

ఈ సంకలనంలో గోదావరి ప్రసక్తి ఒకచోట మాత్రమే కానవస్తుంది. ఇది కులసతుల పద్ధతిలో ఉంది.

"మహిళలు సతులు, అసతులు కావడం భర్తలను బట్టి ఉంటుంది. కొందరు భర్తృ ప్రేమ బద్ధలు భర్త పోయినా, భర్తయిల్లు వదలిపోరు. ఈ గుణం కులాన్ని బట్టి ఉండదు. చూచారా? హాలుడు స్వర్గానికి వెళ్ళిపోయాడు. కాని. గోదావరి అతనినే ఆశ్రయించుకొన్న గోదావరి అతని రాజధాని అయిన ప్రతిష్ఠానపట్టణాన్ని వదలిపెట్టడంలేదు." అంటాడు ఒక ప్రాకృతకవి,

పురుస విసేసేణ సఇ
త్తణాఇ ణ కులక్క మేణ మహిలాణం,
సగ్గం గఏ వి హాలే
ణ ముంచఇ గోలా పఇట్ఠాణం. [468]

పురుష విశేషణ సతీ
త్వాది న కుల క్రమేణ మహిలానామ్,
స్వర్గం గతేపి హాలే
న ముంచతి గోదా ప్రతిష్ఠానమ్.

లీలావఈ కహా [లీలావతీ కథా] లోను గోదావరి- సప్తగోదావరం ప్రస్తావన ఉంది. ప్రాకృత కవులు గోదావరిని ఆత్మీయంగా, జీవితంలో భాగంగా భావించారనడానికి స్థాలీపులాక న్యాయంగా కొన్ని గాథలు ఉదాహరించాను.

# మాఘుని జ్యోతిశ్శాస్త్ర పాండిత్యి

"మాఘే మేఘే గతం వయః" — అని మల్లినాథసూరి అన్నట్టు చెబుతారు పండితులు. మాఘంలోని — అనగా శిశుపాల వధ కావ్యంలోని శాస్త్ర విషయాలు తెలుపడం, మేఘదూతలోని వ్యంగ్యార్థాలు — అనగా ధ్వనులు తెలుపడం కష్టమని తాత్పర్యం.

"ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్ ।
దండినః పదలాలిత్యమ్ మాఘే సంతి త్రయోగుణాః."

అని ఎవరో అజ్ఞాత విమర్శకుడు ఇచ్చిన బిరుదం; కాళిదాసు రచనలలోని ఉపమాలంకారం, భారవి కిరాతార్జునీయంలోని అర్థగౌరవం, దండి దశకుమార చరిత, అవంతి సుందరీ కథలలోని పదలాలిత్యమూ ఈ మూడూ మాఘుని శిశుపాల వధలో వున్నవని ఈ విమర్శకుని యోగ్యతాపత్రం. శిశుపాల వధ చదివినవారికి మాఘుని పాండిత్య ప్రకర్ష స్పష్టమవుతుంది. వివిధ కవితా ప్రయోగాలూ అతడు చేయడంతోపాటు పెక్కు శాస్త్రాల రహస్యాలు సందర్భానుసారంగా జోడించాడు. జ్యోతిశ్శాస్త్ర పరిచయం కూడ అతనికి బాగా వున్నదని అతని కావ్యంవల్ల స్పష్టమవుతున్నది. దానికి కొన్ని ఉదాహరణాలు ఉట్టంకిస్తాను.

శిశుపాలుని దుండగాలు మితిమీరాయి. వానిని శిక్షించడం అవసరం. ధర్మరాజు రాజసూయయాగం చేయదలచి పార్థునితో సందేశం పంపాడు. రెండు పనులూ ముఖ్యం. కనుక ఉద్ధవ బలరాములతో ఆలోచిస్తాడు కృష్ణుడు; ఈ ఆలోచనకోసం ఆలోచన మందిరానికి వాళ్ళవెంట వెళ్ళుతాడు. ఈ కార్యం సఫలమవుతుందని సూచించడం కవి ఉద్దేశం కనుక గురు శుక్రులతో కలిసిన చంద్రుడిలాగ ఉన్నాడు కృష్ణుడని వర్ణిస్తాడు.

"సార్థ ముద్ధవ సీరిభ్యా మథాసా వసదత్ సదః,
గురు కావ్యానుగాం బిభ్రత్ చాంద్రీ మభినభః శ్రియమ్."

ఆకాశం చంద్రుడు, గురు శుక్రులతో కలిసినప్పటి శోభ పొందింది కృష్ణుడు ఉద్ధవ బలరాములతో సదస్సులో వున్నప్పుడు. జ్యోతిశ్శాస్త్రం ప్రకారం ఏ భావంలోనన్నా ఒక్క శుభగ్రహం వున్నా మంచి ఫలమిస్తుంది; మూడు శుభగ్రహాల యోగాన్ని జ్యోతిర్వేత్తలు ఎంతగానో వర్ణించారు.

"భాగ్యభా గ్భవతి మానవ స్సదా
చారుకీర్తి మతి వృత్తి సంయుతః,
భార్గవేందు సురరాజ పూజితాః
సంయుతా యది భవంతి సంభవే."

అని ఢుండిరాజు జాతకాభరణం (35-25) లో ఈ శుభగ్రహ త్రయ యోగాన్ని వివరించాడు. జన్మసమయంలో శుక్ర చంద్ర గురులు ఏకరాశి స్థితులయితే మానవుడు భాగ్యవంతుడు, కీర్తిమంతుడు, మతిమంతుడు, సద్వృత్తి గలవాడు అవుతాడు అని యోగం ఫలం.

కృష్ణుడు ఇంద్రప్రస్థానికి వెళ్ళుతాడు రాజసూయ యాగం కోసం. అర్జునుడు సవినయంగా దారి చూపగా, భీముడు వెంట నడువగా కృష్ణుడు ఇంద్రప్రస్థం చేరినప్పుడు రెండు గ్రహాల మధ్య ఉన్న చంద్రుడిలాగ దురుధరా యోగం కలిగించాడట.

"పవనాత్మజేంద్రసుత మధ్యవర్తినా
నితరా మరీచి రుచిరేణ చక్రిణా,
దధతేవ యోగ ముభయ గ్రహాంతర
స్థితి కారితం దురుధరాఖ్య మిందునా." (12-22)

చంద్రునికి పన్నెండవ ఇంట్లో సూర్యుడు తప్ప ఏ గ్రహమున్నా సునఫా యోగమని, రెండవ ఇంట్లో వుంటే అనఫాయోగమని, చంద్రునికి ఇరువైపుల- పన్నెండవ ఇంట్లోను, రెండవ ఇంట్లో ను గ్రహాలుంటే దరుధరాయోగమమని జ్యోతిశ్శాస్త్ర పరిభాష. కృష్ణునికి ముందు వెనుక అర్జున భీములు వుండడం ఈ యోగంతో పోల్చాడు కవి. చంద్రునికి ముందు వెనక సూర్యుడు తప్ప ఏ గ్రహమున్నా శుభం. రెండువైపులా వుంటే మరీ మంచిది. రెండు వైపులా ఏ గ్రహమూ లేకపోతే కెమద్రుమ మనే యోగం పరమదరిద్రమైనది. కల్యాణ వర్మ సారావళిలో ఈ యోగాలను ఇలా చెప్పాడు :

రవి వర్జం ద్వాదశగై రనఫా
చంద్రాద్ద్వితీయగై స్సునఫా,

ఉభయస్థితైర్ధురుధరా
కేతుద్రుమ సంజ్ఞకో తోన్యః."

రాహు కేతువులకు జ్యోతిశాస్త్రంలో విశేషప్రాధాన్యముంది. ఈ రెండు గ్రహాలు ఎవరి స్థానంలో వుంటాయో, ఆ గ్రహాల ఫలాలు ఇస్తాయి. భూమి ఛాయగనుక ఛాయాగ్రహాలనీ ఈ రెండు గ్రహాలను అన్నారు. రాహువు ఆకారం కేవలం శిరస్సు; దేహం లేదు; కేతువుకు తలలేదు; కేవలం మొండెమే వుంటుంది. మాఘుడు శిశుపాలుని శిరశ్ఛేద ఘట్టాన్ని వర్ణిస్తూ, రాహువుతో పోల్చాడు శిశుపాలుని శిరస్సును. రాహువుకు శరీరం లేదు. కనుక అతని ప్రేయసీమణుల శరీరపు వొంపుసొంపుల ఆలింగన భాగ్యం లేనందున వ్యర్థమయింది. రాహువుఅంతఃపుర స్త్రీల స్తన కార్కశ్యాన్ని వ్యర్థం చేసిన శ్రీకృష్ణుని చక్రం శిశుపాలుని తల నరికి వేసింది. అలనాడు అమృతమథన సమయంలో రాహువు తల నరికి వేసినట్టే, ఈనాడు శిశుపాలుని తలను తెగవేసింది.

"రాహుస్త్రీ స్తనయో రకారి సహసా
యే న శ్లథాలింగన
వ్యాపారైక వినోద దుర్లలితయోః
కార్కశ్య లక్ష్మీః వృథా,
తేనాక్రోశత ఏవ తస్య మురజి
త్తత్కాల లోలానల
జ్వాలా పల్లవితేన మూర్ధవికలం
చక్రేణ చక్రే వపుః."

మాఘుడు తన కావ్యంలో సూర్యచంద్ర గ్రహణాలను గురించి చాల చోట్ల ప్రస్తావించాడు. కృష్ణ శిశుపాలుల యుద్ధ ఘట్టం.

"సవిషశ్వసనోద్ధతోరు ధూమ
వ్యవధి మ్లాన మరీచి పన్నగానామ్,
ఉపరాగవతేవ తిగ్మభాసా
వపు రౌదుంబర మండలాభమూహే." (20.45)

శిశుపాలుడు ప్రయోగించిన నాగాస్త్రంవల్ల జనించిన పాముల ఫూత్కార ధూమానికి సూర్యబింబం కాంతి మందగించి మేడిపండ్ల గుత్తిలాగ వుందట. అంటే రాహుగ్రస్త గ్రహణంలాగ.

మరొకచోట చంద్రగ్రహణం వర్ణించాడు మాఘుడు. శత్రువు ఒక్కడు ప్రాణాలతో ఉన్నా సుఖముండదు. రాహువు దేవతలందరి ఎదుటే చంద్రుణ్ణి బాధపెడుతాడు గదా! - అని బలరాముడు సలహా యిస్తాడు కృష్ణునికి.

ధ్రియతే యావ దేకోపి రిపు స్తావ త్కుతస్సుఖమ్,
పురః క్లిశ్నాతి సోమం హి సైంహికేయో సురద్విషామ్.

(2-35)

తోకచుక్కలను కూడా మాఘుడు తెలిపాడు. తోకచుక్కలు అశుభమని చాల దేశాలు భావిస్తాయి బృహత్సంహిత ఎన్నో తోకచుక్కలను తెలిపింది. పదకొండవ అధ్యాయం పూర్తిగా ధూమ కేతువులదే. వీటిలో కొన్ని శుభకర మైనవి కూడ వున్నవి.

శిశుపాలుని దుండగాలను నారదుడు కృష్ణునికి పూసగుచ్చినట్టు చెప్పాడు; గగన మార్గంలో చంద్రునిలాగ వెళ్ళిపోయాడు. కృష్ణునిముఖం బొమముడితో గంటువడింది ఆ బొమముడ ఎలా వుందంటే, ఆకాశంలో కనిపించిన తోక చుక్కలాగ వుంది ఈ తోకచుక్క వినాశకరమే.

"ఓమిత్యుక్తవతో థ శార్ఙ్గిణ ఇతి వ్యాహృత్య వాచం నభః
తస్మిన్నుత్పతితే పురస్సురమునా విందో శ్శ్రియం బిభ్రతి,
శత్రూణామనిశం వినాశపిశునః క్రుద్ధస్య చైత్యం ప్రతి
వ్యోమ్నీవ భ్రుకుటిచ్ఛలేన వదనే కేతుశ్చకారాస్పదమ్."

(1-75)

జ్యోతిశ్శాస్త్రంలోని ముహూర్తభాగంలో ప్రయాణానుకూల ప్రతికూల ముహూర్తాలు ఉన్నాయి. కాని, చంద్రుడు పుష్యమీ నక్షత్రంలో వున్నప్పుడు స్వస్థానమయిన కటకంలో వుండడంవల్ల ఏ దిక్కుకు యాత్రచేసినా శుభం. అలాగే అనూరాధా, హస్త, అశ్వినీ నక్షత్రాలలోను యాత్ర ఏ దిక్కుకు చేసినా శుభమేనని ముహూర్త చింతామణి అంటున్నది

"మైత్రార్క పుష్యాశ్వనభై ర్నిరుక్తా
యాత్రా శుభా సర్వదిశాసు తజ్జ్ఞైః" (11-38)

కృష్ణుడు నారదుని మాటలు విన్నతర్వాత బలరామోద్ధవులతో మంతనా లాడి రథమెక్కి ఇంద్రప్రస్థానికి బయలుదేరుతాడు. అతడెక్కిన రథం పేరు క్షిప్రమనేక్రీడారథం - పుష్యరథం. దానికి ఏ దిక్కునా అడ్డులేదు. కృష్ణుడు

ఎలా వున్నాడంటే, పుష్య నక్షత్రయుక్తుడైన చంద్రునిలాగ ఉన్నాడు. కవి కృష్ణుని యాత్ర సఫలమవుతుందని సూచించాడు.

"రరాజ సంపాదకమిష్టసిద్ధేః
సర్వాసు దిక్ష్వప్రతిషిద్ధ మార్గమ్,
మహారథః పుష్యరథం రథాంగీ
క్షిప్రం క్షపానాథ ఇవాధిరూఢంః" (3.22)

ఈవిధంగా మాఘకవి జ్యోతిశ్శాస్త్ర ప్రతిభకు ఎన్నైనా ఉదాహరణలు చూపవచ్చు. మచ్చుకు కొన్ని చూపినాను. పంజాబ్ విశ్వవిద్యాలయాచార్యులు శశిధరశర్మ వాచస్పతి జ్యోతిష్మతి పత్రికలో మాఘుని కొన్ని జ్యోతిశ్శాస్త్ర విషయాలను తెలిపారు. వాటిని కూడా ఈ వ్యాసంలో గ్రహించాను.

# తెలుగులో తమిళ, కన్నడ పదాలు

తెలుగు సాహిత్యం కన్నా కొన్ని శతాబ్దాలకు పూర్వమే కన్నడంలో సాహిత్యం విరిసింది. కాని తెలుగులో సంస్కృత ప్రాకృత ప్రభావంతోనో, మరేకారణంతోనో సాహిత్యం వెలువడడం ఆలస్యమయింది. తెలుగులో తొలి విడత సంపూర్ణ భాషా స్వరూపం ఎరుకల్ ముత్తరాజు శాసనమే ఇది క్రీస్తు శకం 575 నాటిది. మనకు తెలిసిన తొలి తెలుగు కావ్యం పద్మకవి (పంప మహాకవి) జనేంద్ర పురాణం. అది ఖిలమయింది కనుక ఉపలబ్ధమయిన తొలి కావ్యం నన్నయ్య భట్టారకుని భారతమే.

తెలుగుకు ఆరవ శతాబ్దం నుంచి ప్రత్యేకత ఏర్పడినట్టు శాసనాధారం ఉండడం వల్ల తమిళ కన్నడాల ప్రభావం అటు తర్వాత తెలుగుపై ఎంత వరకు పడిందో చూద్దాము. ఈ ప్రభావాన్ని మనం రాజకీయంగాను, సారస్వతంగాను, మతదృష్టితోను వింగడించుకుందాము.

తెలుగు దేశాన్ని పల్లవులు, చాళుక్యులు, చోళులు పాలించారు కనుక రాజకీయంగా తమిళ కన్నడాల పరిపాలన పదాలు తెలుగులో చేరాయి. వాటి సాహిత్య ప్రభావంతో కొత్త సాహిత్య ప్రక్రియలు వెలువడ్డాయి. మత సంబంధంతో వీరశైవ, వైష్ణవ మత సంప్రదాయ పదాలు కొన్ని చేరాయి, కొన్ని గ్రంథాలు ఉద్భవించాయి. పరిపాలనరీత్యా కొన్ని తమిళ బిరుదులు, పన్నులకు సంబంధించిన పదాలు తెలుగులో చేరాయి.

ద్రాక్షారామ శాసనమొకటి 1100 నాటిది. దానిలో పేర్మానడిగళు అనే మాట వుంది. అంతకు పది సంవత్సరాల పూర్వందైన సర్పవరం శాసనంలోను పేర్మాడిదేవర అనే పదం కనిపిస్తుంది. ఇది బిరుదమో, పేరో కాని తమిళ పదం. పేర్మాన్ అనగా పెద్దవాడు.

అడిగళ్ గౌరవ వాచకం. సంస్కృతంలో పెద్దలకు గౌరవసూచకంగా వాడే శ్రీపాదాః, శ్రీచరణాః వంటిది. పేర్మానడిగళ్ పేర్మాడి అయింది. దానికి మరొక గౌరవవాచకం దేవర కలిసింది. పేర్మాడిదేవర అయింది.

శైవ, వైష్ణవ మతాల సంబంధంతో కొన్ని తమిళ సంప్రదాయ పదాలు తెలుగులో చేరాయి. తిరుకాళహస్తీశ్వరుడు — తిరుక్కాళయ్య, త్రిక్కయ్య, తిక్కయ్య, తిక్క అయినాడని కొందరి వాదం. కాని శిష్య అనే

పదం తిక్క అయిందని నేను భావిస్తున్నాను తిష్యశబ్దం ప్రాకృతంలో తి త్తిఖ అవుతుంది. దీని తద్భవం తిక్క. తిష్య, పుష్య అనే పేర్లు తెలుగునాట పూర్వం బాగా వాడుకలో వుండేది.

తిరు అనే పదం శ్రీ నుండి పుట్టింది. తెలుగులో శ్రీ సిరి కాగా, తమిళంలో తిరు అయింది. ఈ శ్రేష్ఠవాచక పదం వైష్ణవ సంప్రదాయంలో ప్రతి పనికీ, ప్రతివస్తువుకూ చేర్చడం పరిపాటి అయింది. తిరు - ఆరాధన తిరువారాధన, దేవపూజ. తిరు - అధ్యయనం తిరువధ్యయనం, - తద్దినం, తిరు - మడప్పళ్ళి - దేవాలయ పాకశాల. తళిగ తళిగై వికృతి. మళిగ - మళిగై వికృతి. తిరు - మాళిగ - పెద్ద ఇల్లు - మిద్దె, క్రమంగా గది, దుకాణాల అరలు అనే అర్థాలు ఏర్పడ్డాయి. నంబి - దేవాలయాన్నే నమ్మినవాడు - పూజారి. తంబళ్ళు - శివాలయ పూజారి. తమిళ పల్లవ చోళ రాజులవెంట అష్టాదశ వర్ణాల వారు మన ప్రాంతానికి వచ్చారు. వారు తమిళులు కావడంవల్ల తంబళ్ళ లయ్యారు. తంబళ్ళ తమిళ పద వికృతి. తంబి - తమ్ముడు, ఆళావరు - ఆళ్వార్ — భక్తుడు. వైష్ణవ సంప్రదాయంలో పన్నిద్దరాళ్వార్లున్నారు. జియ్యరు, జియ్యంగారు - సన్యాసి. నాంచారు - దేవి, నాచ్చియార్ వికృతి ఆండాళ్ - గోదాదేవికి రూఢమయింది. తిరునాళ్లు - జాతర. తిరుశ్రేష్ఠమైన నాళ్లు — దినాలు, శ్రేష్ఠమైన దినాలు, పవిత్రమైన దినాలు. దేవతోత్సవాలు పవిత్ర మైనవి, శ్రేష్ఠయినవి గనుక. తాయి - తల్లి, తాయ్‌కి వికృతి. కైంకర్యం సంస్కృత పదమైనప్పటికీ, తమిళ సంప్రదాయం ద్వార వచ్చింది గనుక తమిళ పదంగానే గ్రహిద్దాము. కైంకర్యమంటే భగవంతునికి కింకరభావంతో భక్తి నెరపడం. ఇది వైష్ణవుల శరణాగతికి దగ్గరిది. కాని, ఆళ్వారులలో ఒకరైన తిరుమంగై యాళ్వారు వైష్ణవుల సమారాధనలకోసం దొంగతనాలు గూడా చేసేవారని కట్టుకథలు. కనుక, కైంకర్యం - తిరుమంగయాళ్వారు కైంకర్యం అంటే, దొంగతనం అని అపార్థం వ్యాపించింది. తైరు - పెరుగు. ఇప్పుడు ఒకరిని మెప్పించడానికి వాడే తైరు కొట్టడం ఈ తైరునుంచి వచ్చింది కాదు. టహర్‌నా-ఒకరి వద్ద వేచి వుండడం, పడిగాపులు కాయడం అనే అర్థ మిచ్చే పథం తైరు కొట్టడం అయింది. సాదం - అన్నం. ఇది కూడా సంస్కృతపద వికృతే. వైష్ణవ పరిభాషలో అన్నం - భగవత్ప్రసాదం. ప్రసాదంలోని ఉపసర్గ ప్ర రాలిపోయి, సాదం మిగిలింది. సాపాటు - భోజనం, తినడం, శాప్పాడు వికృతి. శాప్పిడు - తిను అనే తమిళక్రియ సాపడు, ప్రసాపడు అనే రూపాలు పొందింది. సంబళం - జీతం, సాంబారు - ముక్కలు వేసిన పప్పు పులుసు. దీనికి సంస్కృత సంభార శబ్దం మూలమయినా, మన

క్కిది తమిళం ద్వారా వచ్చినది. పిరాట్ల అనే ఇంటిపేరుగల వారున్నారు. పిరాట్టీ రాణి. పిరాన్ - రాజు. ఏ రాణి పరివారంతోనో వీరు ఆరణంగా వచ్చి వుంటారు. కనుక పిరాట్లవారయారు.

తిరుపతి వేంకటకవులలో వేంకటశాస్త్రిగారి ఇంటిపేరు చెళ్ళపిళ్ళ. ఇది శెల్వప్పిళ్లై అనే తమిళ పద తద్భవం. శెల్వప్పిళ్లై అంటే సంపత్కుమారుడు. భగవద్రామానుజులు హరిజనులకు దేవాలయ ప్రవేశం కలిగించిన మొదటి క్షేత్రం కర్నాటక రాష్ట్రంలోని మేల్కోటె. దీనిలో ప్రధానాధి దైవతం సంపత్కుమారస్వామి. దాని తమిళీకరణం శెల్వప్పిళ్ళ. వెంకట శాస్త్రిగారి పూర్వులు అక్కడి నుంచి వచ్చారనివారే చెప్పుకున్నారు.

వీరశైవ సంబంధం వల్ల చాల కన్నడ పదాలు, సాహిత్యమూ తెలుగులోకి వచ్చాయి. బూది-విభూతి. లింగపసాయితం - లింగప్రసాదితం. బసవగడ్డలు - ఉల్లిగడ్డలు, లింగపూజ - అభిషేకం, శివపూజ - స్నానపూజానంతరం భోజనం చేయడం సంప్రదాయం గనుక క్రమంగా ఈమాట భోజనానికి పర్యాయమయింది. అయ్యనవరు - అయ్యవారు. లింగధారులు - జంగములు. బసవేశ్వరుని అవతారంతో వీరశైవం వల్ల తెలుగులో ఒక దేశి శాఖే వెలువడి వెల్లువై పారింది.

ఇవికాక సామాన్యమైన కన్నడ పదాలు ఎన్నో చేరాయి. హకారాదిగా వుండేవన్నీ కన్నడ పదాలే. హెచ్చు - ఎక్కువ. హెగ్గడి - ద్వారపాలకుడు. హెగ్గన - ప్రగడ, హెగ్గడికత్తె, హొన్ను - పొన్ను. అరసు - రాజు. కెలసము - పని, గండపెండేరం, బేడలు - పప్పు, బేశె మూలరూపం. సాకు - చాలు. బేకు - కావాలి. పల్లె - కూర. రాయడు-రాజు. బిడారం-వర్తకసమూహం. ఇల్ల - లేదు. హుళక్కి-అబద్ధం.

సారస్వతంగా తెలుగులోని మార్గ దేశి సంప్రదాయాలు కన్నడం నుంచే వచ్చాయి. ఇవి కన్నడానికి ప్రాకృత సాహిత్యంనుంచి సంక్రమించాయి. జైన ప్రబంధమార్గం, శైవ వచన వాఙ్మయం కన్నడం నుంచి వచ్చినవే. కవితలకు వెన్నముద్దలయిన బసవేశ్వరుని వచనాలు, నీలమ్మ వచనాలు తెలుగులో కృష్ణమాచార్యుల వచనాలు, వేంకటేశ్వర వచనాలు వంటి భక్తి వచన గీతాలకు దారి చూపాయి.

తెలుగు భక్తకవులపై విజయనగరకాలంనాటి కన్నడ భక్తకవులయిన శ్రీపాదరాయరు, వ్యాసరాయరు, పురందరదాసు, కనకదాసుల ప్రభావం పడలేదు గాని, పరస్పర ప్రశంసలుండేవి.

కర్నాటక సంగీతంలో ప్రారంభ పాఠాలు పురందరదాసు పిళ్ళారి గీతాలు - లంబోదర లకుమికర, కెరెయనీరను కెరెగె చెల్లి మున్నగు వాటితో ప్రారంభమవుతాయి.

అనంతపురం, బళ్లారి, రాయచూరు, గుల్బర్గా, మహబూబ్‌నగర్ జిల్లాలలో స్త్రీల పాటలు, ముఖ్యంగా పెండ్లి పాటలు, శ్రావణ శుక్రవార వ్రతం పాటలు కన్నడంలో పాడుతారు. హరసకుమారాన చరణాకనులగళి గెరగి శారదెగె వందిసువె - అని నా శ్రీమతి అనంతలక్ష్మి పాడుతూండడం తరచు వింటుంటాను.

ఈ విధంగా తమిళ కన్నడాల ప్రభావం రాజకీయ మత సారస్వతాల ద్వారా తెలుగుపై పడింది.

# ఆర్యజాతి చరిత్ర పరిణామ దశలకు దీపావళి - దీపావళి

ఆశ్వయుజ బహుళ త్రయోదశి, చతుర్దశి, అమావాస్యలలో విష్ణువు బలిచక్రవర్తి భూమి దానంచేయడంవల్ల మూడడుగులతో భువనత్రయం ఆక్రమించాడు. అతడు తర్వాత సంతుష్టుడై "నీకు ఇష్టమయిన వరం కోరుకో!" అని బలిచక్రవర్తిని అడిగాడు. బలిచక్రవర్తి 'స్వామీ, నా సర్వస్వం నీకు అర్పించాను. నాకోసం కోరదగిందేదీ లేదు. కాని, లోకం కోసం ఒక్క వరమడుగుతున్నాను. నీకు సామర్థ్యం వుంటే, అనుగ్రహించు. నేను ధానమిచ్చిన భూమిని మూడు నాళ్ళు, మూడు పాదాలతో వామనుడనే ఛద్మరూపంతో ఆక్రమించుచున్నావు గనుక, ఈ మూడు దినాలు బలిరాజ్యం అగుగాక! నా రాజ్యంలో దీపదానం చేసేవారికి లక్ష్మి శాశ్వతంగా వుండుగాక! నా రాజ్యంలో ఎవరి ఇంట అంధకారం వుంటుందో, జ్యేష్ఠాదేవితోపాటు వారికి ఎల్లకాలం చీకటి అగుగాక!" అని కోరాడు. చతుర్దశినాడు, నరకనివారణార్థం దీపదానం చేసేవారి పితృగణం నరకం నుండి స్వర్గానికి పోతుంది. బలి రాజ్యంతో దీపావళి వెలిగించనివారి యిండ్లలో దీపం ఎలా వెలుగుతుంది?

ఇవి వామనపురాణ, భవిష్యోత్తర పురాణాలలో దీపాళికి సంబంధించిన అంశాలు.

"ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు బలిరాజ్యం ఏర్పడవలెనని యాచించాలి. పూర్వం విష్ణువు వామనరూపంతో బలివద్దకు అతిథిగా వెళ్ళి, అతనిని యాచించి, ఈ భూమిని మూడు అహోరాత్రాలలో ఆక్రమించి, బలిని పాతాళవాసిగా చేశాడు. కనుక ఈ మూడు దినాలు మహోత్సవం జరపాలి. మునీశ్వరులారా, మహారాత్రి — దీర్ఘరాత్రి ప్రారంభమైంది. కనుక ఈ వుత్సవం చేయాలి"

ఇది నారద పురాణంలో నరక చతుర్దశి, దీపావళులను గురించి వున్న మాటలు.

"ఆశ్వయుజ బహుళ త్రయోదశినాడు అపమృత్యు నివారణార్థం నూనెతో దీపాలు వెలిగించి, వానిని పూజించి, ఇంటికి ఎదుటను, వెలుపలి భాగంలోను వుంచాలి. దీనిని యమదీపం అంటారు. ఇది యముని అనుగ్రహం కోసం పెట్టాలి. చతుర్దశినాటిరాత్రి తృతీయ యామానంతరం నరక భయ నివారణార్థం. అభ్యంగ మంగళ స్నానం చేయాలి. సర్వసామాన్యంగా ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమనాడు అశ్వినీ నక్షత్రం రావాలి. ఆనాడు అశ్వినీ నక్షత్రమయితే, బహుళ చతుర్దశి నాటికి స్వాతీ నక్షత్రం అవుతుంది. ఒక్కొక్క సమయంలో స్వాతీ నక్షత్రం వెనక ముందుగా రావడం కూడ వుంది. చతుర్దశి, అమావాస్య, పాడ్యమి — ఈ మూడు దినాలలో ఏ రోజు స్వాతీనక్షత్రం వస్తుందో ఆనాడు అభ్యంగ మంగళస్నానం చేయాలి. ఇది సకలైశ్వర్యదాయకం. చతుర్దశినాడు నూనెలో లక్ష్మి, నీటిలో గంగ అధివసించి వుంటారు. కనుక చతుర్దశినాడు వుదయాత్పూర్వమే చంద్రోదయ సమయంలో తలంటి పోసుకోవాలి ఆ సమయంలో వుత్తరేణి, సార, తగిరిస ఆకులను తలమీద పెట్టుకుని, త్రిప్పుకొని పారవేయాలి. పిదప యేటిలో తర్పణం ఆచరించి నరకుని కోసం నాలుగు వత్తులతో దీపదానం చేయాలి. ఆ దినం మినపాకు కూరతో భుజించాలి. సాయంకాల దేవాలయాలలోను, మఠాలలోను దీపాలు వెలిగించాలి. మరుసటి దినం అమావాస్య. ఆదినం ప్రత్యూషకాలంలో అభ్యంగస్నానం ఆచరించాలి. ఆస్నానం పంచత్వక్కులు - చంద్ర, మామిడి, అత్తి, జువ్వి, నేరేడువట్టలను నీటిలో వేసి, స్నానం చేయడం శుభదాయకం. ప్రదోషకాలంలో దీపదానంచేసి, ఉల్కలను — కొరువులను త్రిప్పాలి. అనంతరం లక్ష్మి నివాసార్థం లక్ష్మి పూజచేయాలి. దేవాలయాలలో, చతుష్పథాలలో, శ్మశానాలలో, నదులలో, కొండలమీద, వృక్షమూలాలలో, పశువుల కొట్టాలలో, ఇండ్ల ముంగిళ్ళలోను దీపాలను, దీపవృక్షాలను వెలిగించాలి (కర్రలతో చెట్లవలె కట్టి, వాటిమీద దీపాలు పెడతారు. వీటిని దీపవృక్షాలంటారు. దేవాలయాలలో ఇత్తడి దీపవృక్షాలుంటాయి.) ఆకులతో దొన్నెలు కట్టి, వాటిలో దీపాలుంచి, నదులలో, చెరువులలో, కొలనులలో, నూతులలో తేలవిడువాలి. ఇతర స్థలాలలో దీపమాలిక లుంచాలి. మార్గపాలి బొమ్మలు (గడ్డితో) దారిచూపడానికి కట్టాలి. నూతన వస్త్రాలు ధరించాలి. అన్నార్థులకు ఇష్ట మృష్టాన్నదానం చేయాలి. పగలు భుజించక రాత్రి భోజనం చేయాలి. అర్ధరాత్రివేళ ఊరిలో వుండే స్త్రీలు చేటలు, తప్పెటలు వాయిస్తూ, సంబరంతో అలక్ష్మిని-జ్యేష్ఠాదేవిని-పెద్దమ్మను-ఇండ్ల నుంచి తరిమివేయాలి. పిదప ఇంటి శవంతిలో ముగ్గులు తీర్చి బలి

చక్రవర్తిని స్థాపించి పూజించాలి. పాడ్యమినాడు బలిచక్రవర్తి వుత్సవం చేయాలి. బలి పాడ్యమినాడు జూదం ఆడాలి. ఆనాడు జూదంలో గెలిచినవార్లు ఆ సంవత్సరమంతా జయంతో వుంటారు. పిదప గోవర్ధనపూజ చేయాలి. గోవులను, గరిసెను, పాలు పితికే పాత్రలను పూజించాలి. ఆవులను అలంకరించి యథేష్టంగా ఆడుకోనివ్వాలి. విదియనాడు యమ ద్వితీయ లేక భ్రాతృద్వితీయ. ఆరోజు తమ యింట్లో భోజనం చేయరాదు. చెల్లెయింటిలోనో, చెల్లెలు లేకపోతే చెల్లెల వంటివారి యింట్లోనో భుజించాలి. యమునాదేవి ఈరోజే తన సోదరుడయిన యమునికి విందు చేసింది. చెల్లెండ్లు అన్నలకు వస్త్రదానం చేయాలి."

ఇది మన వ్రత గ్రంథాలలో దీపావళి అయిదురోజుల వుత్సవాన్ని గురించి వున్న విషయాల సారాంశం.

దీపావళి వెనుకటి దినం నరకచతుర్దశి. ఈ నరకచతుర్దశినాడు కృష్ణుడు నరకుని సంహరించినట్టు చెప్పే నరకాసుర గాథ భాగవత, హరి వంశాలలో విశేషంగా అభివర్ణితమైంది. ఈ దేశమంతా నేడు వ్యాపించింది కూడ. కాని వ్రత గ్రంథాలలో నరకాసుర వధ ప్రసక్తే కనిపించదు. ఈ విషయం పైన ఉదాహరించిన వివరాలను బట్టి ఎవరైనా స్పష్టంగా గ్రహించవచ్చు.

పైన పేర్కొన్న విషయాలను బట్టి దీపావళి కేవలం పితరులను నరక విముక్తులను చేయడానికి ఏర్పడిన ఆచారమనడం నిస్సంశయం. దీనిని మరి కొంత చర్చిస్తే, మరికొన్ని విషయాలు స్పష్టమవుతాయి.

మనం ఈ సందర్భంలో ఆరునెలలు చీకటి, ఆరునెలలు పగలు వుండే దేవమానదినం, కాలం వూహించాలి. ఉత్తరాయణం ఒకప్పుడు మేషం నుంచి, దక్షిణాయనం తులనుంచి ప్రారంభమయ్యేవని వరాహమిరుడు బృహత్సంహితలో తెలిపాడు. ఈ అయనాలు పెక్కుసార్లు మారుతూ వచ్చినట్టు తెలుస్తున్నది. దేవతలకు తులా సంక్రమణం నుంచి రాత్రి ప్రారంభమయ్యేదని "మహారాత్రిస్సముత్పన్నా చతర్దశ్యాం మునీశ్వరాః" అని నారద పురాణ వాక్యం కూడా తెలుపుతున్నది. దక్షిణాయనమంటే ఆరునెలలు చీకటి, చలి, వ్యాధుల బాధలు. ఈ ఆరునెలల రాత్రిలో తమకు దారితెన్ను తెలియడానికి, తమ పితరలకు సద్గతులుకలుగడానికి దీపావళినాడే కాక, కార్తికమాసమంతా దీపాలుపెట్టే ఆచారం ఏర్పడింది. ఉల్కాలు తిప్పడానికి మారే నేటి ఉప్పు పొట్లాలు, గోగువత్తులు, టపాకాయలున్నూ.

బలిచక్రవర్తి గాథవల్ల కూడ మనకిది మహారాత్రికి సంబంధించిన సంఘటనమనే స్పష్టమవుతుంది. బలిచక్రవర్తిని విష్ణువు మూడుపాదాలతో పాతాళానికి అణగద్రొక్కాడు గదా! విష్ణువంటే సూర్యుడు. ఇతని మూడు పాదాలు ఉదయ మధ్యాహ్న సమయాలు అని తిలక్ తెలిపారు. ఈ పాదాలలో రెండు మాత్రం కనిపిస్తాయని మూడవది కనిపించదని ఋగ్వేదంలో వర్ణితమైనదని కూడ తిలక్ తెలిపారు. విష్ణువు బలిని పాతాళానికి అణగద్రొక్కి అతనికి ద్వారపాలకుడుగా వున్నాడని కథలో వున్నది. అంటే. సూర్యుడు క్షితిజం క్రిందికి మునిగిపోయి, దీర్ఘరాత్రి ఏర్పడిందని భావం.

తాము కనుగొన్న జ్యోతిర్విషయాలను ప్రాచీనేతిహాస పురాణ గాథలతో జోడించి ప్రచారం చేయడం ప్రాచీనుల ఒక పద్ధతి. ఇది ఒకొకప్పుడు క్లిష్టమయిపోయి, అర్థంకాక అభాసమవుతుండడం కూడా వుంది. దీనికి బలిచక్రవర్తి గాథ ఒక ఉదాహరణ. మరొకటి నరకాసుర గాథ.

ధర్మశాస్త్ర. వ్రతగ్రంథాలలో ఏమూలా కనిపించని నరకాసుర గాథ ఇంత ప్రచారం పొందడానికి జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన ఒక రహస్యం తప్ప మరొకటి కనిపించదు. నరకాసుర వధ గాథ ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు ఆకాశంలో రాశుల స్థితిని తెలిపేటటువంటిది. తులారాశి పూర్వక్షితిజంపై వుదయిస్తుండగా, పశ్చిమక్షితిజం మీద మేషరాశి అస్తమిస్తూ వుంటుంది. ఈ మేషరాశి భౌమరాశి. భౌముడు కుజుడు. నరకుడు భూమిదేవిపుత్రుడు మేషం స్వభావతః సాదువే అయినా పట్టుదలకు, మూర్ఖత్వానికి పెట్టింది పేరు. నరకుడు అలాటి వాడే. అందువల్ల అతని పరిపాలన అంధకార బంధురమైంది అంటే మేషరాశి సూర్యాస్తమయ సమయంలో ఉదయిస్తున్నదన్నమాట మళ్ళీ అస్తమించే వరకు చీకటే. మేషరాశి అస్తమించే వేళకు తులారాశి తూర్పుదిక్కున క్షితజం మీదికి వస్తుంది. స్వాతీనక్షత్రానికి అధిష్ఠానదేవత వాయువు. ఇదే వాయువేగంతో పోయే గరుత్మంతుని అధిష్ఠించి నరకుని - భౌముని మీదికి యుద్ధానికి బయలు వెడలడం. కృష్ణుడు సూర్యుడు. సత్యభామ చంద్రుడు బహుళ చతుర్దశి గనుక చంద్రసూర్యులిద్దరు దాదాపు కలిసే వుంటారు. నరకుడు పడిపోగానే, ఆకాశపు అంచులమీద దీపచ్ఛాయలతో వున్న కన్యారాశి (కన్యల గుంపు, నరకాసురుడు బందెలో వేసిన 16 వేల కన్యలు) నరకుని బందె నుంచి విడివడి తమను విడిపించిన సూర్యుని - కృష్ణుని నాయకునిగా చేసుకున్నది. ఈ ఖగోళ సన్నివేశం పురాణగాథలో శృంగారరసంతో రంజితమై వ్యాప్తిపొంది, సత్యానికి చాలా దూరమైపోయింది.

దీపావళితో సంబంధించిన ప్రతివిధి మనజాతి ఆదిమ దశనుంచి చారిత్రక కాలంవరకు జరిగిన పరిణామానికి తార్కాణమని మనం గ్రహించవచ్చు. బలిచక్రవర్తి గాథ మన పూర్వుల ఉత్తరధ్రువ ప్రాంత నివాసాన్ని, అక్కడి నుంచి తరలడాన్ని, నరకాసురగాథ భారతదేశంలోని అనాదిజాతులతో మన పూర్వుల సమ్మేళనాన్ని, మహావీరుని నిర్వాణ గాథ మన ప్రాగైతిహాసిక దశను విక్రమార్కుని సింహాసనాధిరోహణ గాథ మన విస్పష్ట చారిత్రక దశను సూచిస్తున్నాయి.

# గణపతి - ఉడుగణపతి

"నన్ను చూచి విరగబడి నవ్వావే! దానికి తగిన శాస్తి అయింది! ఇప్పుడు జనం రాకెట్లతో నిన్ను పొడిచేస్తున్నారు. రేపు నీమీద అణ్వస్త్రాలు కురిపించి గోతులు తవ్వి ఇళ్ళూ, వూళ్ళూ కట్టుకుంటారు! నీ దేవత్వం ఎగిరి పోయింది." అన్నాడు వినాయకుడు పొట్ట సవరించుకుంటూ చంద్రుణ్ణి చూచి.

"ఎంతటి అభాండాలు వేస్తున్నావు? నేను నవ్వానా? నేను ఒకరిని అంటిపెట్టుకుని బతికేవాడిని. మరొకరిని చూచి నవ్వడమూనా? బాగా చూడవోయ్! భాద్రపద శుద్ధ చవితినాడు నా ముఖం భూమిమీదినుంచి పడిన సూర్యకాంతితో గుండ్రంగా కనిపిస్తుంది. ముఖం కిందిభాగంలో చంద్రవంక. దానిని చూచి నీవు నేను నవ్వినట్టు అపోహపడ్డావు. దానికి తగినట్టు కొంచరు పండితమ్మన్యులు కథలూ అల్లారు. దానికి నన్నేమి చేయమంటావు?" అన్నాడు చంద్రుడు.

"నిజంగా అంతే నంటావా?"

"వెర్రి వినాయకుడా? నభోమండలంలో కనిపించే దృశ్యాలకు ఏవో పాత గాథలకు ముడిపెట్టడం, వాటినిబట్టి కొన్ని గథలను కల్పించడం జనం స్వభావం. ఏదో అతికించి కథలు అల్లుకుని అనుకుందేగాని వారికి సంతృప్తి ఉండదు. నేను నిన్ను చూచి నవ్వానని, దానిమీద నీవు వినాయక చవితినాడు నన్ను చూడడంవల్ల లేనిపోని అపవాదులు వస్తాయని శపించినట్టు కథలు అల్లారు. దానిని శమంతకోపాఖ్యానం అంటారు."

"నాకు తెలియని శాపం! నేను పెట్టని శాపం! మరీ వింతగా వుందే?"

"నీవు పుట్టినట్టు చెప్పే పండుగ సూర్యుడు సింహరాశిలో ఉన్నప్పుడు చేస్తారు. ఈ విషయం మనస్సులో గట్టిగా నిలవడానికి, ఖగోళ సన్నివేశాలు, ప్రకృతి దృశ్యాలు కలిపి కథగా చెప్పారు. శుష్కంగా విషయాలు చెబితే జ్ఞాపకం ఉండవు. కథగా చెబితే జ్ఞాపకం వుంటాయి. శమంతకోపాఖ్యానంలో శమంతకమణి సూర్యుడు. సింహం సింహరాశి. జాంబవంతుడు సప్తర్షి మండలం. శమంతకమణి కృష్ణునికి దొరకడం అంటే సూర్యుణ్ణి కనుగొనడం. ఆ సూర్యుడే కృష్ణావతారం. అనాటి సూర్యుడు విష్ణువయి, క్రమంగా విష్ణువు అవతారాలు అయ్యాడు.

"ఎందుకింత తిరుగుడు? సూటిగా చెప్పరాదూ?"

"ఎంత చిక్కగా విషయాలుంటే అంత పాతవి అన్నమాట. ఎప్పటి కప్పటికి ఏవో కొత్త విషయాలు చేరుతూ, పాతవి కొంత మిగులుతూ, ఆ మిగిలిన దేదో దానితో అర్థంకాని స్వరూపం ఏర్పడుతుంది. నీ సంగతే చూద్దాం. నీ రూపం ఎన్ని విధాలుగా మారిందో: నా దేవత్వం ఎగిరిపోయిం దన్నావే? నీ దేవత్వమూ అంతే. కేవలం కల్పితం. ఎందరెందరి భావాలో ఒక్కటయి మారి మారి ఈ రూపానికి వచ్చావు."

"నీవు రోజూ మారుతున్నావుగా: నన్నంటావేమిటి, సిగ్గులేక?"

"నా మారడం వేరు. నేను ఈ విశ్వంలో ఒక రూపంలో వున్నాను. మారుతూవుంటాను. నా స్వరూపం కృత్రిమం కాదు. సహజం. నీవు వట్టి కట్టు కథల పుట్ట. ఆ కథలను విడదీస్తే నీవు లేవు, లేనేలేవు."

"నేను సాక్షాత్తు పరమేశ్వరుని ఔరస పుత్రుణ్ని తెలుసా?"

"తెలుసులేవోయ్: నీవు కేవలం రైతుల వూహాదేవతవు. రైతులకు తమ కష్టార్జితమైన పంటే దేవుడు. పండిన ధాన్యాన్ని గాదెలలో, పురులలో నింపు తారు. గాదెలు, పురులు గట్టిగా వుండడానికి వగ్గాలు, గడ్డివెంట్లతో బిగిస్తారు. వర్షాలు శ్రావణ భాద్రపదాలలో పడినతర్వాత ధాన్యం బాగా పండాలని కోరుతూ గాదెలకు పూజలు చేయడం మొదలయిన ఆచారాలు, ఊడ్పుల తర్వాత తూర్పారబట్టడం, వాటికి అవసరమైన చేటలు, ఒంటిపంటి నాగలి మొదలయిన సాధనాలు అన్నీ కలిసి నీ స్వరూపం ఏర్పడింది. పాములు, ఎలుకలు వంటి హింస జంతువులను చంపి, వాటి నుంచి అపాయం తొల గించుకున్న తర్వాత మానవులు వాటిని తమ దేవతలకు ఆభరణాలుగా, వాహ నాలుగా చేశారు. మంచి ఊహే. ఆవిధంగా నీకూ అవి దొరికాయి."

"నీ ధోరణిచూస్తే నా తలకాయకు కూడా ఏదో కథ అతికించేట్టున్నావే!"

"కాదూ మరి? నీ తలకాయ అతుకుల కాయే. మానవులు రోజులకు లెక్క గట్టేటప్పుడు నేనూ, సూరన్నయ్యా, వెళ్ళే దారిలోని నక్షత్రాలనుబట్టి రాశులనీ అదనీ ఇదనీ గుర్తులు పెట్టుకున్నారు. కోటాను కోటి నక్షత్రాలలో ఏవో కొన్నిటిని ఏవేవో రూపాలతో అనుకుని చిత్రాలు గీసుకున్నారు - ఆడవారు చుక్కల ముగ్గులు పెట్టుకున్నట్టు. పూర్వం ఆర్ద్ర అనే నక్షత్రాన్ని వృషభ రాశిలో చేర్చి ఉంచేవారు. తర్వాత అది సరికాదని ఆర్ద్రను విడదీసి మిథునంలో చేర్చారు. రోహిణి మృగశిర ఆర్ద్రా నక్షత్రాలు, మరికొన్ని నక్షత్రాలున్న ప్రాంతాన్ని గజవీథి అన్నారు. గజవీథినుంచి దానిని తీసి మరొక రాశిలో చేర్చడం గజాసుర సంహారం. తర్వాత నీకు ఏనుగుతల కల్పించారు. ఇలా

ఖగోళ చిత్రాల వూహలు, తక్కిన పురాణ గాథలు చేరి నీవయ్యావు. పూర్వం వానకాలం నాలుగు నెలలూ జనం ఇంట్లోనే వుండి తమ పనులు చేసుకునేవారు. ఎక్కడికి కదిలేవారు కారు. దానినే చాతుర్మాస్యం అన్నారు. ఆ యా కులాల వారు తమ పనిపాట్లు చేసుకునేవారు. చదువు చెప్పేవారు తమ చదువులను వల్లె వేసేవారు. నీవు పెద్దవాడివయ్యాక పంటల దేవత కావడమేమిటి, తమ దేవత కూడానని చదువులవారు నిన్ను తమ గణపతిని చేశారు. గణాలు అంటే మాటలు, చదువులు. నిన్ను విద్యాదేవత అన్నారు గనుకనే భాద్రపద చవితి నాడు సామవేదం అనుసరించేవారు ఉపాకర్మ చేస్తారు. నీవు తర్వాత శైవుల చేతుల్లో పడ్డావు. గణాలు అంటే మాటలే కాదు; శివ గణాలు అని వారు నిన్ను పెద్ద గణసైన్యానికి అధిపతిని చేశారు. చదువు, పని నిష్ఠతో జరుగాలి గనుక అలాటి నిష్ఠాపరులు నిన్ను బ్రహ్మచారి అంటే, మరి కొందరు ఇద్దరు భార్యలను, అష్టమహిషులను అంటగట్టారు."

"నీకు మాత్రం లేరూ? నీవు తారానాథుడిని కదూ! రోహిణి నీకు ఇష్ట మయిన మహిషి కాదూ?"

"పిచ్చివాడా? అది కూడా ఊహా కల్పనే. ఆకాశంలో మినుకు మినుకు మనే కోటాన కోటి నక్షత్రాల మధ్య నేను మందలోని ఆబోతులాగ కనిపించా నేమో! నేను రాజునని తారలు రాణులని ఊహ చేశారు. రోహిణీ నక్షత్రం చూచావూ? బండి ముందుభాగంలాగ కోనుగా, వాలిన గోపురంలాగా వుంటుంది. ఆ నక్షత్రం మధ్యన ఉన్నప్పుడు ఏ వాల్మీకి వంటి కవో చూచి మహా అందంగా వుందిరా దృశ్యం అనుకోవుంటాడు. రోహిణి మధ్య నేనున్నప్పుడు రెండు కొనలు కలిపిన దండమధ్యలోని పతకంలాగ సరిగ్గా అతికిపోయి వుంటాను. దానిని ఉత్తమ దాంపత్యానికి చిహ్నంగా వర్ణిస్తే నేనేమి చేయను? విషయం మంచిదే కదా?"

"నేనూ అంతే. బుద్ధి సిద్ధి అనేవి మానవులు కావాలనుకునే ఫలాలని అనుకోరాదూ? నా భార్యలుగా వాటికి రూపకల్పన చేస్తే నేను ఏమని వారించను? మరొక సంగతి. నాకు రూపమే లేదన్నావే? భాద్రపద శుక్ల చవితినాడు సూర్యోదయానికి ముందు ఏనుగు ఆకారంగల, నా వాహనమైన ఎలుక ఆకారం గల నక్షత్రాల గుంపులు తూర్పున కనిపిస్తాయని, ఫాల్గున శుద్ధచవితినాడు ఈ స్వరూపాలు సూర్యాస్తమయం తర్వాత తూర్పున కనిపిస్తాయిని నీకు తెలీదూ? నాకూ నక్షత్రవీథిలో చోటువుంది సుమా?"

"ఆ గుంపులకు, నీకూ నీ వాహనానికి సంబంధ మేమిటోయ్? ఆ స్వరూ

పాలకు నీ కథలు, స్వరూపాలు తర్వాత అతికించారు. నీకే కాదు. నీ తండ్రి అని చెప్పే పరమేశ్వరుని స్వరూపమూ ఊహే."

"పరమశివునికే ఎసరు పెట్టావూ?"

"వినవోయ్. ఎసరేమిటి? ఎర్రనికాంతితో కనిపించే భూగోళమంతా బ్రహ్మ స్వరూపం. విష్ణుభక్తులకు విష్ణుస్వరూపం. శివభక్తులకు శివస్వరూపం. భూగోళం నుంచి తలయెత్తి పైకి చూడు. ఆకాశ మండలం నల్లగా పెద్ద చుట్టలాగా కనిపిస్తుంది. దానిని విశ్వమయుడయిన పరమేశ్వరుని జటాజూటమని వూహించాడు ఎవడో కవి. ఆ సిగకు పూవును నేనట. పాలవెల్లి ఆకాశ గంగట. అది శివుని జటాజూటంనుంచి ప్రవహిస్తుందట. ఈ దృశ్యమే, భూమిమీద గూడ కల్పించుకున్నాడు. ఆధారంలేని కల్పన కాదులే ఇది. ఉన్న స్వరూపానికి మనసులోని ఊహల జోడింపు. ఆకాశమంటుతున్న హిమనగం శివస్వరూపం, దానిమీదినుంచి పారే నదులలో మిన్న గంగ. ఇంతతో ఆగలేదు. తనకు కనిపించే, తాను అనుభవించే విషయాలన్నీ పురుషుని (ఏ కాలంలో ఏ పురుష స్వరూపం గొప్పదయితే వాని) ఆకారమని చెప్పుకున్నారు. మనస్సు అన్నిటికీ మిన్న గనుక దేహంలో వెన్న ముద్దలాగ తేలుతూ వుంటుందనే తలంపుతో దానిని నాతో పోల్చారు. వాయువు తనకు లాగే ఆ పురుషుని ప్రాణమన్నారు. పాదాలు భూమి అన్నారు. భూమి కిందవుంది కదూ మరి. సూర్యుడు కన్ను అన్నారు. అంతే కాదు. మానవులు తమకాలంలో స్థిరపడిన సంఘ వ్యవస్థను గూడ ఆ దేవతా స్వరూపంగా ఊహించి. దానికి చేతులూ కాళ్ళూగా సంఘంలోని వర్గాలను అతికించారు. చదువుచెప్పేవర్గం ముఖమని, రక్షించేవర్గం చేతులని, సంఘానికి మూల స్తంభాలయిన కృషి వాణిజ్యాలునడిపే వర్గం ఊరువులని, పీటవంటి నిలబడడానికి కారణమైనట్టి వర్గం పాదాలని చెప్పారు. దీని అంతర్యం గ్రహించలేని మూర్ఖులు, అధికారమత్తులు ఆ మాటలకు అపార్థం కల్పించి తమ గొప్పదనం చాటడానికి వినియోగించుకున్నారు. తమ స్వభావాన్ని దేవతలకూ అంటగట్టారు. నీవు ఏనుగుతలవాడివని ఎప్పుడు అనుకున్నారో ఏనుగు స్వభావమంతా నీకు అంట గట్టారు. ఏనుగు నిలబడడం కష్టం. మహోల్లాసం కలిగినప్పుడు రెండు కాళ్ళమీద నిలబడుతుంది. ఇలాటిది నీకు అంటగట్టి నిలబడిన విగ్రహాలు చెక్కి ప్రసన్న వినాయకుడన్నారు. పూర్వం ఒంటికొమ్ము ఏనుగులు, నాలుగు దంతాల ఏనుగులు అపూర్వంగా ఉండేవి. చతుర్దంతాలున్న ఏనుగును ఒకరు గొప్పదంటే, ఏకదంత రూపం నీకు కల్పించి దానికొక కథ కల్పించారు. నీకే కాదోయ్! నాకూ అలాటివి అంటగట్టారు. నేను నా ప్రయాణంలో ధిన ఘొక నక్షత్రంవద్ద వుంటాను.

ప్రజలు తమ శృంగార స్వభావాన్నిబట్టి రోజుకొక భార్యవద్ద ఉంటానని, నాకు 27 గురు భార్యలని అన్నారు. గురుడు పెద్ద గ్రహమని కనిపెట్టిన తర్వాత అతనే గ్రహరాజు; గురుడు; బృహస్పతి. కాని గురుడు సంవత్సరానికొకసారి కదులు తాడు. నేను దినమూ తిరుగుతూనే వుంటాను. గురుడున్న నక్షత్రంవద్ద నన్ను చూచి, గురువు లేనప్పుడూ నన్ను చూచి, నేను గురుద్రోహం చేసినట్టు అనుకుని తారా శశాంకంవంటి పచ్చి శృంగార కథలు పుట్టించారు. నేనెక్కడ? గురు డెక్కడ? తార లెక్కడ? నేను అందుకోడం ఏ యుగానికైనా సాధ్యమా?"

"నీకు తగిన కథే లేవోయ్! బేషుగ్గా వుంది."

"ఛీ! ఉచ్ఛిష్ట గణపతీ! నీ తలకాయకు తగిన బుద్ధే నీది."

"చాలు చాల్లే. ఒక్క మాట చెబుతాను విను. నేను ఉచ్ఛిష్టుడైనా, సచ్ఛిష్టుడైనా నన్ను మానవ జాతి ఏదో రూపంలో పూజిస్తూనే వుంటుంది. నేనూ ఆనందంగా దాని ఊహలనుబట్టి రూపాలు స్వీకరిస్తూనే వుంటాను. నీకు మాత్రం పూజ ఏనాటికీ ఉండదు. నీ శరీరాన్ని తవ్వి, తీసి నీ అంతు చూస్తారు."

"అంతే. ఈ మానవ లోకం తీరే అంత. ఉపయోగపడేవారిని, సహాయ పడేవారిని ఉపేక్షిస్తారు. ఊహా కల్పితులను ఊరేగిస్తారు."

# మధ్యతరగతి భాష

ఏ రచయిత అయినా తన సామాజిక చైతన్యాన్ని, అవగాహనను స్వకీయ భాషలోనే సమర్థంగా వ్యక్తీకరించగలడు. స్వకీయ భాష అంటే, ఏ వర్గానికి చెందినాడో ఆ వర్గపు భాష అని అర్థం. ఒక మధ్య తరగతి రచయితను గూర్చి చెప్పవలసివస్తే, అతడు తన వర్గ భాషలో భావవ్యక్తీకరణ చేసినంతగా, ఇతర వర్గభాషలో చేయడం కష్టం. చేసినా, అది స్వీయభాషలో చేసినంత సమర్థంగాను, సహజంగాను, రంజకంగాను ఉండదు. ఎవరో క్వాచిత్కంగా సఫలుడు కావచ్చు. ఉదాహరణకు ఒక జాలరి ఇతివృత్తం తీసుకొందాం. రచయిత ఆ వర్గం వాడైతే రంజకంగా చిత్రించినంతగా అన్య వర్గీయుడయితే చిత్రించలేడు. చిత్రించినా, ఆ జీవిత విషయాలు నేర్చుకొని చిత్రించినట్టే ఉంటుంది. కేరళ రచయిత శివశంకరన్ పిళ్ళై "శెమ్మీన్" నవల మనందరికీ తెలుసు. అతడు కూడ శ్రమపడి ఆ జీవిత విశేషాలు తెలుసుకొని రచించినట్టిదే. పరిశ్రమే దానిలో హెచ్చు. ఈ ఇతివృత్తాన్ని చాల సమర్థుడైన తెలుగు రచయిత ఏ మాధవపెద్ది గోఖలే వంటివాడో చిత్రించదలిస్తే శ్రమపడి — తెలుగుదేశపు జాలరుల జీవితాదులను బాగా ఆకళించుకొన్నవాడు గనుక-కేరళ ప్రాంతపు జాలరుల సంగతి తెలుసుకొని చిత్రించవచ్చు. కాని, కృత్రిమంగానే వుండిపోతుంది. ఇంతకూ పరిశీలనలో, ఆయా వర్గంవారు తమకు పరిచితమైన భాషలోనే తమ పరిసర సంఘ చైతన్యాన్ని చిత్రించడం సులువని తేలింది. ఈ దృష్టితో ఇప్పుడు ఒకరిద్దరు రచయితల రచనను వివరించడానికి ప్రయత్నిస్తాను.

'మంజుశ్రీ' అనే పేరుతో వ్రాస్తున్న డాక్టరు అక్కిరాజు రమాపతిరావు రచనలే తీసుకుందాం. ఈయన మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబంవారు. ఇతని రచనలలో ఆ వర్గ సంస్కారం ప్రతిబింబిస్తుంది. ఈయన పదినవలలూ, ఐదు కథా సంపుటాలు ప్రచురించారు. వీటిలో ఇతివృత్త భేదం ఎంత ఉన్నప్పటికీ భాషమాత్రం మధ్యతరగతి భాషే. ఈతని నవలలో ఒకటి "నూరు శరత్తులు." సుఖమయినా, దుఃఖమయినా, నూరేళ్ళు బతికితే గాని తెలియదు. అందువల్ల నూరేళ్ళు బతకాలి - అనే ఆశావాదాన్ని ప్రతిపాదించే నవల

ఇది. దీనిలోని సన్నివేశాలను పరిశీలిస్తే రచయిత తనవర్గం భాషను ఎట్లా వాడాడో తెలుస్తుంది. ఈయన ఈ నవలపేరును వాల్మీకి రామాయణంలో సుందరకాండంలోని "కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే, ఏతి జీవంత మానందో నరం వర్ష శతాదపి" అనే శ్లోకంతో ప్రభావితుడై పెట్టినట్టు నాకు తోస్తుంది.

"ఈ అగ్రహారం తాలూకు ఆరు వందల యకరాల సుక్షేత్రమైన భూమి శ్రీమాన్ పరమ భాగవతోత్తమ, ఉభయ వేదాంత ప్రవర్తక, తిరుమల. లక్ష్మీ నరసింహ తాతాచార్యులవారికి ఉయ్యూరు ప్రభువులచే కైంకర్యార్థ పూర్వకంగా ఒసగబడినట్టిది. వారి సంతతివారు పెక్కు సంవత్సరాలుగా ఆ అగ్రహారాన్ని అనుభవిస్తూ, దేశంలో ప్రపత్తి సంప్రదాయాన్ని చక్కగా అనుపాలించారు.... తల కొక్క ముక్క చెక్కగా పంచుకోవడంవల్ల, శుభాశుభకార్యాల ఒత్తిడి వల్ల కొన్ని కుటుంబాలు మరీ బీదపడిపోయాయి ఆస్తులతోపాటుగా దేశంలో శిష్య వర్గాన్ని కూడ వంతులు వేసి పంచుకోవడంవల్ల సంపన్నులైన శిష్యులను ఉద్ధరించడానికి కొందరు సకుటుంబంగా తమ స్వస్థలాన్ని వదలిపోయారు." (నూరు శరత్తులు : పుట - 21.)

దీనిలో రచయిత తనవర్గం సంప్రదాయాన్ని తెలిపాడు. దానికి అనుగుణమయిన భాషా దొర్లింది. ప్రపత్తి సంప్రదాయం, శుభాశుభ కార్యాలు, కైంకర్యం మొదలయిన పదాలను, పదబంధాలను ఈయన మధ్యతరగతి సంస్కారానికి ఉదాహరించవచ్చు.

ఇతనిదే మరొక నవల "దూర తీరాలు." దీనిలో రంగస్థలం రైల్వే కాలనీ. ఇతివృత్తానికి తగినట్టుగానే 13 అప్, 14 డౌన్, 222 డౌన్ మొదలైన రైల్వే సంకేతాలతోనే కథంతా నడుస్తుంది.

"ఈ ఊరు రైల్వేకాలనీ. స్కూలులోని ఏ తరగతిలోనైనాసరే, ఏ పి[illegible] వాణ్ణయినాసరే నిలుచోబెట్టి అడిగితే, వాళ్ళనాన్న ఫిట్టరనో, డ్రైవరనో గార్డనో, అండర్‌గార్డనో ఏదో రైల్వే ఉద్యోగమే చెబుతాడు. నూటికి 9[illegible] మంది పిల్లే. ఆంగ్లో ఇండియనులు, పఠానులు, క్రిస్టియనులు, ముస్లిములు అందరూ ఉన్నారు" (దూరాతీరాలు : పుట - 5)

ఈ వాక్యాలవల్ల రచయిత తను చిత్రించదలచిన విషయానికి అనుగుణమయిన వాతావరణం కోసం రైల్వే పరిభాషను వాడడం మాత్రమే జరిగిందిగాని, చిత్రణలో అంత సహజత లేదు. కారణం - అది ఇతని వర్గం ఇతివృత్తం కాదు.

ఈయన ఒక కథా సంపుటి పేరు "మంచు కురిసిన రాత్రి." దీనిలోని ఒక కథ "అంతర్యం—అభిమానం." దీనిలో ఒక డాక్టరు పట్టణ జీవితానికి విసిగిపోయి పల్లెటూళ్ళో ప్రాక్టీసు పెట్టుకుందామని ప్రయత్నిస్తాడు. అతడు బ్రహ్మచారి. అతనిని గురించిన ఒక ప్రచారం సాగుతుంది. గ్రామంలో ఉండే నాటు వైద్యుడు తన స్వార్థంతో డాక్టరుపై ఏవేవో అపవాదాలు వేస్తాడు.

"ఇంతకూ నాకు పెళ్ళి పెటాకులు కాలేదన్న సంగతి వారికి ఎలాగో తెలిసింది. అప్పటినుంచి ఒక ప్రచారం సాగింది. ముప్పై ఏండ్లు పైబడ్డ ఇతనికి ఇంతవరకు పెండ్లెందుకు కాలేదు? ఇలాటి పల్లెకు ఎందుకు వచ్చాడు? ఏదో కథ వుండివుంటుంది. దీనికితోడు ఆ వూళ్ళో నేటివ్ డాక్టరు శరభాచారి. 'అతని సంగతి నాకు బాగా తెలుసు. కాలేజీలో గోల పెడితే, ఒక సంవత్సరం ఇతణ్ని ఇంటికి పొమ్మన్నారు. ఇంతకూ ఇతని ప్రవర్తన మంచిదికాదనే కాలేజీ అధికారులు అలా చేశారట. ఋజువర్తనలేనివాడు' అని అక్కడక్కడా చెబుతూ వచ్చాడట. పాపం అతని భయం అతనిది. కేవలం భగవంతుని మీదభారం వేసి ఆయుష్షులేకపోవడం, ఋణం తీరిపోవడంలాంటి మాటలు తరచు ఉపయోగిస్తూ, వైద్యం చేసే అతడు నన్నుచూసి ఈర్ష్య అసూయ క్రోధం లాంటివి పెంచుకోవడంలో ఆశ్చర్యమేమీలేదు." అనుకుంటాడు డాక్టరు. (మంచుకురిసిన రాత్రి : పుట-40)

దీనిలో అపవాదులు వ్యాపింపజేయడంలో వాడిన పెళ్ళిపెటాకులు, అయుష్షు లేకపోవడం, ఋణం తీరిపోవడం వంటి పదాలు సన్నివేశగతమైన స్ఫూర్తిని తెలియపరుస్తున్నాయి. ఇది పూర్తిగా ఇతని వర్గ భాషే.

శ్రీ మధురాంతకం రాజారామ్ కథలు తీసుకుందాం. ఈయన ఆంధ్ర ప్రదేశ్‌లోని సుప్రసిద్ధ కథకుల్లో ఒకడు. ఈయన సామాన్య మధ్య తరగతి ఉపాధ్యాయుడు. గనుక ఆ వర్గం మనస్తత్వం బాగా తెలిసినవాడు. కథలకు చివర ఓ.హెన్రీవలె చక్కని మలుపు ఇస్తాడు. ఇతడు తన ఊహలకు, ఉపమానాలకు తగిన పదాలను, పోలికలను సృష్టిస్తాడు. ఉదాహరణకు "వ్యవస్థ" అనే కథలో శకుంతల అనే పాత్ర జీవితాన్ని వర్ణిస్తూ, "నూలు వుండలాంటి జీవితంలో ఒకచోట ఏర్పడిన చిక్కు ఆనాటి మరికొన్ని చిక్కులకు దారితీస్తుంది. శకుంతల విషయంలోను జరిగిందిదే" అంటాడు. (రాజారాం కథలు-పుట 25.)

దీనిలో రచయిత నూలువుండను జీవితంతో పోల్చాడు. ఒక చిక్కును తీయబోతే మరొక చిక్కు ఏర్పడడం మనందరికీ తెలిసిందే. అందరికీ తెలిసినా దీనిని రచయిత అపూర్వంగా వాడాడు. మధ్య తరగతి వ్యక్తి అనుదినం చూస్తున్న వస్తువు నూలువుండ వంటివి.

"మిథ్య" అనే పదం వేదాంత పరిభాషకు సంబంధించినది. "బ్రహ్మ సత్యం, జగన్మిథ్య" అనేది ప్రతి భారతీయుడూ (ఇంతో అంతో చదువుకొన్న వాడు) విన్న మాటలు. రాజారామ్ 'మిథ్య' అనే కథలో ఈ పారిభాషిక పదాన్ని వ్యంగ్యంగా మరొక అర్థంలో వాడి, తన కథనానికి బలం చేకూర్చాడు.

"ఏముంది నాయనా? అంతా మిథ్య - అంటుంటారు చలమయ్యగారు.... చెప్పే మాటలకు, చేసేపనులకు పొంతన లేకపోతే, అట్టి వ్యక్తిని గురించి లోకంలో విమర్శలు చెలరేగడం సహజం. చలమయ్యగారిని గురించి నలుగురూ నాలుగు మాటలనుకుంటారు. పైగుడ్డ భుజాన వేసుకొని భార్యబిడ్డలతో ఆయన కాందిశీకుడిలా లింగాపురంలో ప్రవేశించడం మిథ్య కాదే? ఆనాటికి చేత చిల్లిగవ్వయినాలేని ఈ ఆసామీ కాలక్రమాన అంచెలంచెలుగా దారిద్ర్యాన్ని నిర్మూలించి మెట్లు మెట్లుగా ఐశ్వర్యశిఖరాన్ని అధిరోహించడం మిథ్య కాదే! ఇస్తున్న చేతికీ, పుచ్చుకొంటున్న చేతికీ తప్ప మూడోవ్యక్తికి తెలియకుండా నమ్మకంగా సాగించుకుపోతున్న వడ్డీ వ్యాపారం మూలంగా ఈయన ఇంట శ్రీదేవి పాద నూపురాల గలంగలలు వినిపించడం మిథ్య కాదే? అయితే, ఆయన మిథ్య మిథ్య అంటున్నదేది?" (రాజారామ్ కథలు - పుటలు 91)

పై ఉదాహరణలవల్ల మనం ఒక్క విషయం స్పష్టంగా చెప్పవచ్చు. మధ్య తరగతి రచయిత లేక పై వర్గం రచయిత తన భాషకోసమో, పద బంధాల కోసమో సకృత్తుగా ప్రయత్నించినా, పాత్రల మనోభావ విశ్లేషణం కోసమే ప్రయత్నిస్తాడు. జానపద జీవితాన్ని జానపదుల భాషలో చిత్రించే రచయిత దృష్టి చాల వరకు వారి భాషమీద, నుడికారంమీద, వరిసరాలమీద కేంద్రీకృతం కావడంవల్ల మానసిక ప్రవృత్తిని అంతగా చిత్రించడు. పఠితలు భాషా పరిసరాలలో పడి ఆనందిస్తారు గాని, పాత్రల మానసిక స్థితిని అంతగా పట్టించుకోరు. జానపద వర్గం రచయిత భాషతోపాటు, భావవ్యక్తీకరణతో పాటు జానపదుల మనోవిశ్లేషణకు ప్రయత్నిస్తే విజయం గురించి చెప్పనక్కర లేదు.

ఇంతకూ, ఆధునిక సర్జనాత్మక రచనలలోని ఆయావర్గంవారు ఎంత జాగ్రత్తగా ప్రవర్తించినా తమ వర్గం భాషా పరిధిని దాటడం కష్టమని, ఒక వేళ దాటినా, అది కృత్రిమంగా, ప్రయాసపలంగా ఉంటుందని నేను భావిస్తున్నాను.

# సంగీత వాద్య నిర్మాణ కేంద్రం

హైదరాబాద్ నగరం ఔత్తరాహ, దాక్షిణాత్య సంస్కృతుల సంగమ స్థలి. అలాటిచోట ఏ సంస్థను నెలకొల్పినా, దేహళీదీపన్యాయంగా వినియోగ పడుతుంది. చెన్నపురిలో వున్నట్టి సంగీత వాద్యాలయంవంటి సంగీత వాద్య నిర్మాణ కేంద్రాన్ని హైదరాబాద్‌లోను స్థాపిస్తే, స్థానిక వాద్యశిల్పులకు ప్రోత్సాహకరంగాను, కళాప్రియులకు ఉపకారకంగాను వుంటుంది.

"దేశంలో ఇలాటి సంస్థ ఇదొక్కటే. ఇలాటి సంస్థలు ఆయా ప్రాంతాలలో వుండడవల్ల స్థానిక శిల్పులకు చాల ప్రోత్సాహకరంగా ఉంటుంది. కనుక కేంద్ర ప్రభుత్వం ఇలాటి సంస్థలను ప్రతి రాష్ట్రంలోను నెలకొల్పడం అవసరం" అన్నారు చెన్నపురి కిల్పాకులోని సంగీత వాద్యాలయం డైరెక్టర్ శ్రీ బాలకృష్ణమిశ్ర.

శ్రీ మిశ్ర సంగీత వాద్యాలయంలోని వివిధ వాద్యాల నిర్మాణాన్ని గురించి, వాటి చరిత్రను గురించి చెబుతూ, వాటిని చూపుతున్నంత సేపు ఏగంధర్వలోకంలోనో విహరించినట్టే తోచింది.

ఈ సంగీత వాద్యాలయం, సాంఘిక భద్రతా మంత్రిత్వశాఖ తాలూకు అఖిలభారత చేతిపనుల బోర్డువారి యాజమాన్యాన నెలకొల్పబడింది. ఈ బోర్డుకు శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయ అధ్యక్షురాలు. మేలిరకం సంగీత వాద్యాలను, తదనుబంధ పరికరాలను తయారుచేసి అందుబాటు ధరలకు సరఫరా చేయడం ఈ విద్యాలయం ప్రధాన లక్ష్యం.

శ్రీ బాలకృష్ణమిశ్ర ఆంగ్ల సాహిత్యంలో ఎం.ఎ.పరీక్షలో ప్రథమునిగా ఉత్తీర్ణులయారు. సంగీతాచార్య, సంగీత ప్రవీణ పరీక్షలలోను ఉత్తీర్ణులు. శ్రీ మిశ్ర పెక్కేళ్ళు ఆగ్రా విశ్వవిద్యాలయంలో ఆంగ్లశాఖ ప్రాచార్యులుగా పనిచేశారు. కాని, ఆయనకు సహజంగావున్న సంగీత విద్యాసక్తివల్ల ఆ పదవి వదలి తర్వాత కాన్పూరులోని గాంధీ సంగీత మహావిద్యాలయం ప్రిన్సిపాలుగా

వున్నారు; మరికొన్ని విద్యాలయాలలోను పనిచేశారు. శ్రీ మిశ్రా యాజమాన్యంలో ఈ సంగీత వాద్యాలయం నూతన పరిశోధనలను మహోత్సాహంతో జరుపుతున్నది.

ఈ వాద్యాలయంలో నాలుగు ప్రధాన విభాగాలున్నాయి :

(1) పాత, కొత్త వాద్యాల సంకలనం. వాద్యాలయమే ఒక సంగ్రహాలయంగా కనిపించింది.

(2) వాద్య నిర్మాణంలో శిక్షణ. ఇది సంవత్సరం కోర్సు. శిక్షణ పొందగోరేవారికి విద్యార్థివేతనం కూడ ఇస్తున్నారు. పాతవాటి మరమ్మత్తు కూడ జరుగుతుంది ఇక్కడ.

(3) వాద్య పరిశోధన.

(4) వాద్యాల విక్రయం.

ఈ నాలుగు విభాగాలతోను వాద్య పంశోధన విభాగం కృషి అపూర్వమూ, అసదృశమూను. కొత్త వీణలు, కొత్త వయొలిన్లు, కొత్త తంబురాలు, కొత్త సితార్లు తయారుచెస్తున్నారు. వాద్యాల ఆకారంలో మార్పులు కలిగించినా ధ్వని భేదం ఉండని విధంగా ప్రయత్నిస్తున్నారు. ఉదాహరణకు: కొత్తరకం తంబూరా, కొత్తరకం వీణ. తంబురా తుంబకంను (కుండను – ధ్వని పేటికను) కర్ర మొద్దు తొలచి వేయాలి. ఒక చోటినుంచి మరొక చోటికి తీసుకుపోవడం యాతన. త్రికోణాకారంతో, పిరమిడ్ రూపంతో కూచిగా మూడు పలకలు జతపరచి కుండను తయారుచేసి, పరిశోధన జరిపారు. ఈ ధ్వని పేటికతో వాయు పరిణామంబట్టి ధ్వని హెచ్చు తగ్గులు ఏర్పడుతాయి. ఈ వాయు పరిమాణం లెక్కలు గట్టి పిరమిడ్ ఆకారపు ధ్వని పేటికలలో ఇలాటి వాయు పరిమాణం ఉండేట్టు చూశారు. రెండు రకాల తంబురాలను తులనాత్మక దృష్టితో పరిశోధన జరిపి లోపాలు తెలుపడానికి నేషనల్ ఫిజికల్ లేబరేటరీస్‌కు పంపారు. వారు పరిశోధన జరిపి తేడా ఏమీ లేనట్టు తేల్చారు.

"ఈ పద్ధతివల్ల తంబూరా బరువు తగ్గిపోతుంది. తీసుకుని వెళ్ళడానికి సులువు. ఎప్పుడూ పట్టుకొనే కూచోనక్కరలేదు. మామూలుగా నేలమీద నిలబెట్టవచ్చు. చౌక. వంద రూపాయలకు తంబూరా వస్తుంది" అన్నారు శ్రీ మిశ్ర.

"ఈ పిరమిడ్ ఆకారం అందంగా ఉందా?" అని ప్రశ్నించాను. "సౌందర్యమనేది మన దృష్టినిబట్టి ఉంటుంది. మనకు బహుకాలంగా ఆ రూపం అలవాటయింది. దానిని మారిస్తే కొంత ఎబ్బెట్టుగా ఉంటుందనేది నిజమే. కాని, నిర్మాణవ్యయం, తక్కువ సౌలభ్య సౌకర్యాలు, దేశంలో అభివృద్ధి అవు

తున్న సంగీత ప్రియత్వానికి తగినట్టు వాద్యాలను చౌకగాను, సమర్థంగాను సరఫరా చేయడం మొదలయిన విషయాలను మనం గుర్తుంచుకోవాలి" అన్నారు శ్రీ మిశ్ర.

వీణ విషయంలోను పరిశోధనలు జరిపారు. వీణను పనస కర్రతో తయారుచేస్తారు. దాని తుంబకం – స్వర పేటిక – తయారుకావడానికి కర్ర మొద్దును తొలిచి పరిశ్రమచేయాలి. దీనికి కాలం, ధనం, ఎంతో వ్యయమవు తుంది. కనుక దీనిని సులువుగా ఎర్రదేవదారుజాతి (రెడ్ సిడార్) పలకలతోను తక్కిన కర్రలతోను తయారుచేశారు. ఎంతో తేలికగా అయింది. ధ్వని పేటిక రూపం మారలేదుగాని, తేలిక అయింది. ధ్వనిలో తేడా ఏమీలేదు. వైజ్ఞానికులూ పరిశోధించారు.

వీణాదండంకింద సొర్రకాయ పెట్టడం వీణను కదలకుండా నిలపడానికే పూర్వం వుద్దేశించారు. దాని స్వరూపం మార్చడానికి, అవసరమైతే, దానిని తీసివేయడానికి ప్రయత్నాలు జరుపుతున్నారు. ఆ సొర్రకాయకన్న అందంగా వుండే మరొక స్వరూపాన్ని గురించీ ఆలోచిస్తున్నారు. ఆ సొర్రకాయను కూడా కేవలం అసరాగా ఉండనీక, రంధ్రంవేసి అతికించి స్వర పేటికగా ఉపయోగ పడేట్టు చేస్తున్నారు. దీనివల్ల వీణ ధ్వనికి మరింత గాంభీర్య గౌరవాలు ఏర్పడు తాయని శ్రీ మిశ్ర అన్నారు.

సితారునుకూడా పిరమిడ్ ఆకారంలోను, ఎర్ర దేవదారుజాతి కర్రతోను తయారుచేశారు.

"ఇంతబాధ ఎందుకు? ఆ మధ్య సంగీత వాద్యాల ప్రదర్శనంలో ఎలెక్ట్రిక్ స్విచ్‌తో శ్రుతి సారించే తంబూరాను చూచాను. అలాటి వాటిని అభివృద్ధి చేస్తే సమస్య తీరిపోదా?" అని ప్రశ్నించాను.

"మెకానికల్‌గా ఎన్నో చేయవచ్చు. హస్తకళలోని సున్నితం, సౌకు మార్యం దానిలో వస్తుందా? ఆ మెకానికల్ శ్రుతిలో హెచ్చుతగ్గులు చేయడం త్వరగా సాధ్యంకాదు. విద్యుచ్ఛక్తి ప్రసారాన్నిబట్టి దాని వేగ మాంద్యాలు ప్రవర్తిస్తే వికార స్వరాలు, అపశ్రుతులూ ఏర్పడుతాయి. ఇంతకూ, హస్త కళను, వాద్యనిర్మాణ కళను ప్రోత్సహించడం ఈ పథకం లక్ష్యం" అన్నారు శ్రీ మిశ్ర. ఈ సమాధానం కళాదృష్టిలో సహేతుకంగానే వుంది.

"వయొలిన్‌లోను కొత్త పరిశోధనలు జరుపుతున్నాము...." అని ఆయన అనబోగా "వయొలిన్ మనదేశవాద్యం కాదు గదా! దానిలో మన పరిశోధన ఎందుకూ?" అన్నాను.

"నిజమే. అది విదేశీయమే. కాని, ఒక శతాబ్దిపైగా మనదేశంలో సంగీత విద్వాంసుల ఆదరణ పొందుతూంది. మన గాత్ర సంగీతానికి ఉపాంగంగా అమరిన చక్కని వాద్యం వయొలిన్. ఉత్తరాపథంలో సారంగి మొదలయిన వాటిని వాడుతారు పక్కవాద్యంగా. దక్షిణాపథంలో పూర్వం "కొంచుకోలు" అనే పద్ధతి ప్రధాన పక్కవాద్యంగా చాల వ్యాప్తిలో వుండేది. నేటికీ అక్కడక్కడ వుంది. కొంచుకోలు అంటే, తాళాది జ్ఞానం గల మరొకరు నోటితో మృదంగ ధ్వనులు కలిగిస్తూ, పక్కవాద్యంగా వినియోగపడడం. వయొలిన్ మన దేశానికి వచ్చిన తర్వాత దానిని చక్కని పక్కవాద్యంగా వినియోగించుకొన్నారు మన విద్వాంసులు. దానిని మన సంప్రదాయానికి అనుగుణంగా సాధన చేసుకున్నాము. కనుక దానిలో పరిశోధన కూడా అవసరం" అంటూ ఆయన పరిశోధనల వివరాలు తెలిపారు.

వయొలిన్‌ను తెల్లదేవదారు జాతి కర్రతోను, పైన్ (అనాస)జాతి కర్రతోను తయారుచేస్తారు. వాతావరణంలోని మార్పులవల్ల ఈ కర్ర బీటలువారి విడిపోతుంది. అలాటిది జరుగకుండా ధ్వని పేటికలోపల ఈ కొసనుంచి ఆ కొసకు ఒక కర్ర అమర్చారు. దానివల్ల ధ్వనిపేటిక దృఢపడడమేకాక ధ్వన్యాత్మకగుణం కూడ ఎక్కువయింది.

వయొలిన్ కమానును స్నేక్‌వుడ్‌తో (పాముచారలున్న ఒక రకం కర్రతో) తయారుచేసి పరిశీలన జరుపుతున్నారు.

తబల, మృదంగం మొదలయిన ఆనద్ధ (కొట్టిపలికించే) వాద్యాలలోను పరిశోధనలు జరిపారు. తబలాలో మధ్యనవుండే నలుపు చేయిరాపిడివల్ల ఎగిరిపోతూవుంటుంది. అది గట్టిగా అతుక్కునివుండే ప్రయత్నాలు చేస్తున్నారు. మృదంగాన్ని రోజ్‌వుడ్‌తోను తయారుచేశారు.

ఈ వాద్యాలయం ప్రాయశః అన్ని రకాల భారతీయ వాద్యాలు తయారుచేస్తున్నది. తంబూర, సితార్, వీణ, తబలా, ఢోలక్, ఇస్రాజ్, మృదంగం మొదలయినవి. నాగస్వరం తయారుచేయడంలేదు. శ్రీ మిశ్ర ఈ వాద్యాలయం డైరెక్టర్ పదవి స్వీకరించిన తర్వాత తయారుచేసే వాద్యాల నైపుణ్యం, నాణ్యం విషయంలో ప్రత్యేకంగా శ్రద్ధవహిస్తున్నారు. మంచి తబలా, మంచి సితార్ తయారుచేశారు.

శ్రీ మిశ్ర పేరుకు తగినట్టు, పదవికి తగినట్టు సౌజన్య సౌకుమార్యాల మిశ్రమం. ఆయన ఎంతో శ్రద్ధతో ప్రతిదీ వివరించినంతసేపూ విని, ఎన్నో అపూర్వ విషయాలు గ్రహించి సెలవు తీసుకుని వస్తున్నప్పుడు, ఆంధ్రప్రదేశ్

రాజధాని అయిన హైదరాబాద్‌లోను ఇలాటి కేంద్రంవుంటే ఎంతో బాగుం డును అనిపించింది.

హైదరాబాద్ నైసర్గికంగా భారత మధ్య భాగంలో వుంది. ఉత్తరాపథ దక్షిణాపథ సంస్కృతుల సంగమస్థలి. అక్కడ దాక్షిణాత్య సంగీతంతోపాటు ఔత్తరాహ సంగీతానికి ప్రచారం ఎక్కువగా వుంది. అలాటిచోట ఇలాటి సంగీత వాద్యాల అభివృద్ధి కేంద్రం నెలకొల్పితే, ఎంతో ప్రయోజనం ఉంటుంది. ఈ వాద్యాల నిర్మాణానికి అవసరమైన సాధన సామగ్రికి, కళాకారులకు ఆంధ్ర ప్రదేశ్‌లో కొరతలేదు. "అలాటి కేంద్రం హైదరాబాద్‌లో నెలకొల్పితే, నేను, మరికొంతమంది కావలసినంత సహాయం చేస్తాము" అని హామీ ఇచ్చారు శ్రీ మిశ్ర.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు, అఖిల భారత చేతివృత్తుల బోర్డువారు ఈ విషయం పరిశీలించి, వాద్య నిర్మాణ కేంద్రం-వాద్యాలయం హైదరాబాద్‌లో నెలకొల్పడానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

# ఏలూరు, వరంగల్ తివాచీలు

ఇంటికి ఎవరైనా దయచేస్తే చాపపరిచి కూర్చోమనడం ప్రాచ్యదేశాలంతటా ఉన్న మర్యాద. చలికాలమయితే కంబళో, దుప్పకంబళ్లో (లావుపాటి కంబళ్ళో) పరచడం అలవాటు. చాపను అనాచారమని అనుకునేవారికి, వెచ్చదనం కోరేవారికీ ఈ కంబళ్ళపై కూర్చోడానికి ఆక్షేపణ వుండదు. ఈ కంబళ్ళలో, దుప్పకంబళ్ళలో మరికొంత పైమెట్టువి తివాచీలు. మన్నిక, అందం మొదలయిన కారణాలనుబట్టి తివాచీలకు జనాదరం ఎక్కువయింది.

తివాచీలు ఆంధ్రప్రదేశ్‌లో ఏలూరు, వరంగల్ పట్టణాలలోను, మరికొన్ని ప్రాంతాలలోను నేస్తారు. కొన్ని శతాబ్దాలుగా ఈనేత చిన్న పరిశ్రమగా పెంపొందుతూ వుంది. ఏలూరు, వరంగల్ తివాచీలకు భారతదేశంలోనే కాక విదేశాలలోను ఎక్కువ గిరాకీ వుంది. దీనికి కారణం — ఇవి తక్కిన తివాచీల కన్నా చౌక. రంగులు కూడా కృత్రిమంగా వుండవు. ఉన్నికి వున్న రంగుతోనే వాడతారు. ఆ రంగును పోగొట్టి మరొక రంగును పులమడం వంటిది వుండదు. దానివల్ల రంగు వెలిసిపోతుందనే భయంలేదు. ఆధునిక పద్ధతులతో చక్కబరచడం మొదలయినవి లేనందున ఈ ఉన్నిలో వెచ్చదనం ఎక్కువగా వుంటుందనీ అంటారు. చలి విపరీతంగా వున్న పాశ్చాత్యదేశాలలో, ముఖ్యంగా జర్మనీ వంటి దేశాలతో ఏలూరు, వరంగల్ తివాచీలంటే మోజు చాల హెచ్చుగా వుంది. వీటిధర చదరపు అడుగు ఆరురూపాయలు మొదలు 250.00 రూపాయల వరకు పలుకుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లో — భారతదేశంలోనే అందాము — శతాబ్దాలుగా వున్న ఈ తివాచీ నేత పరిశ్రమ చరిత్ర మాత్రం మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. నేత మనకు అత్యంత ప్రాచీనమైన పరిశ్రమ. కంబళ్ళ నేత కూడా చాల ప్రాచీనమైనదే. కాని, నేడు వ్యాప్తిలో వున్న తివాచీ నేత మాత్రం మనదేశ సంప్రదాయం కాదు, పారసీకం నుంచి దిగుమతి అయింది.

దీని చరిత్ర 16వ శతాబ్దం నుంచి ప్రారంభమవుతుందని అనవచ్చు. పూర్వపు రాజులు, శ్రీమంతులు తివాచీలను పారసీకం నుంచే తెప్పించుకొనేవారు. కాని అక్బర్ చక్రవర్తి క్రీస్తుశకం 1580 ప్రాంతంలో పర్షియా నుంచి

కొందరు తివాచీ నేతపనివారిని భారతదేశానికి పిలిపించి, పర్షియా తివాచీలతో సమానమైన తివాచీలు నేయవలసిందని వుత్తరవు చేశాడు. అప్పుడు తయారయిన తివాచీలు కొన్ని పాశ్చాత్యదేశాల మ్యూజియంలలోను, కొందరు శ్రీమంతుల వంశాల వారి వద్దా నేటికీ వున్నాయి. వాటిని చూస్తే మన చేనేత కార్మికులకై వాడం ఎంత గొప్పదో తెలుస్తుంది. అక్బరు చక్రవర్తి తర్వాత జహాంగీర్, షాజహాన్ ఈ సంప్రదాయాన్ని కాపాడారు. ఆగ్రా, ఢిల్లీ, లాహోరు నగరాలలోను, కాశ్మీర్‌లోను తివాచీ నేత కర్మాగారాలు నెలకొల్పారు. కాశ్మీర్‌లో 15వ శతాబ్దం ముందు నుంచే దేశవాళీ తివాచీల నేత వుంది; మొగల్ సామ్రాజ్య కాలంలో మరింత అభివృద్ధికి వచ్చింది. 20వ శతాబ్దం ప్రారంభం వరకు కూడా ఇది అభివృద్ధిలో వుంది. తివాచీ నేత పనివారు ప్రాచీన పారసీక సంప్రదాయాలను, పాత పారసీకపు పేర్లను కూడా భద్రపరుచుకుంటూ వచ్చారు.

మొగల్ సామ్రాజ్య కాలంలోనే ఆంధ్రప్రదేశ్‌లోను తివాచీ నేత ప్రారంభమయింది. తెలుగు పనివారు తమకు సహజమైన భావుకతను, మౌలికతను పారశీక సంప్రదాయానికి జోడించారు. తమ చుట్టుపట్లలో దొరికే ఉన్నితోనే తివాచీలు నేసేవారు. సహజమైన రంగులు వాడేవారు. భారతీయ సంప్రదాయాలను, చిత్రవిచిత్రమైన పుష్పలతలను, పురాణగాథలను, చారిత్రక ఘట్టాలను—చిత్రించడంతో పారశీక, భారతీయ, ఆంధ్రరీతుల మేలుకలయికను సాధించారు. తివాచీలలో కసూతీ పనితనం కూడా మెరుగులు దిద్దుకుంది.

రాజస్థాన్‌తో — ముఖ్యంగా టోంక్ అనే పట్టణంతో "నామ్దా" అనే ఒకరకం తివాచీ నేత అభివృద్ధి అయింది. నామ్దా అంటే పత్తిలోపల కూరి బండీలు అనబడే చొక్కాలు కుట్టినట్లు — చలికి తట్టుకోడానికి ఉన్నిని లోపల కూరి తయారుచేసే తివాచీలు. వీటిలో రకరకాల రంగుల ఉన్నితో చిత్రవిచిత్రపు అలంకరణల పనితనం రాజస్థాన్‌లోని మాల్పురా అనేచోట అభివృద్ధి చెందింది. కాశ్మీర్‌లో నామ్దాలు, గబ్బాలు, గొలుసుకుట్టు రగ్గులు పనివారి ప్రత్యేకత అయినట్లు మద్రాసు, మైసూరులలోను, ఆంధ్రదేశంలోను కూడా జనపనార పట్టపై ఉన్నినేత తివాచీలు, దరీలు (జంబుఖానాలు), తుక్కువున్నితో తయారయ్యే చవకరకం తివాచీలు కూడా జనసామాన్యం ఆదరం పొందకపోలేదు. నేత అన్నది ఎప్పుడో సహస్రాబ్దాల క్రితమే, మనదేశంలో అన్నిప్రాంతాలకూ తెలుసునని మొదట్లోనే మనవి చేశాను. నూలుజంబుఖానాలు, పట్టు అస్తరణాలు రంగురంగుల అలంకరణలతో నేయడం చరిత్ర తెలిసిన నాటికి ముందు నుంచే మనదేశంలో వ్యాప్తిలో వుంది.

మొగల్ సామ్రాజ్యం అస్తమించడంతో తక్కిన పెక్కు పరిశ్రమలలాగే తివాచీ నేత పరిశ్రమ కూడా క్షీణదశకు వచ్చింది.

బ్రిటిష్‌వారి హయాములో కారాగారాలలో దీర్ఘకాలపు శిక్ష అనుభవించే బందీలకు తివాచీనేతను వృత్తిగా నేర్పడం మొదలయింది. దీనివల్ల ఈ చేతిపని మరింత అధోగతి పాలయింది. దీనికి తోడు పాశ్చాత్యదేశాల వారు తమకు ఇష్టమైన డిజైనులను నేయవలసిందని బలవంతం చేయడం కూడా మితిమీరి, కార్మికులలో సహజోత్సాహం సన్నగిల్లింది. రకరకాల నకిలీ తివాచీలు అమ్మకానికి వచ్చాయి. ఇవన్నీ శతాబ్దాలుగా సంప్రదాయ సిద్ధంగా వస్తున్న తివాచీ నేతపరిశ్రమకు గట్టిదెబ్బ అయ్యాయి.

కాని, బ్రిటిష్ ప్రభుత్వం ఒక్క సహాయం చేసింది. 1851లో లండన్‌లో తివాచీల ప్రదర్శనం ఏర్పాటు చేసింది. దీనివల్ల ప్రపంచ ప్రజలకు, ముఖ్యంగా పాశ్చాత్య కళాభిమానులకు తొలిసారిగా భారతదేశం తివాచీలు పరిచయం అయాయి. పలువురికి వాటిపైన మోజు కూడా ఏర్పడింది. ఈ వ్యాపారంలో ఆసక్తిగల విదేశీయులు శ్రీనగర్, అమృతసర్, మీర్జాపూర్‌లలో కార్ఖానాలు నెలకొల్పారు.

దేశంలో స్వాతంత్ర్య భానూదయంతో ఈ పరిశ్రమకు కూడా అభ్యుదయోదయం అయింది. భారత ప్రభుత్వం తక్కిన హస్తకళల విషయంలో శ్రద్ధ తీసుకున్నట్టే, తివాచీ పరిశ్రమపట్ల కూడా విశేష శ్రద్ధ వహించింది. వాణిజ్యశాఖ అఖిలభారత చేతిపనుల బోర్డును నెలకొల్పింది.

విదేశీద్రవ్యం సంపాదించే చేతిపనుల వస్తువులలో తివాచీలది అగ్రస్థానం. ఏటా దాదాపు ఆరుకోట్ల రూపాయల విలువగల తివాచీలు విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి. ఎగుమతి ఎక్కువ కావడానికి, బోర్డు ఈ పరిశ్రమాభివృద్ధికి పెక్కుచర్యలు తీసుకుంది. కొత్త డిజైనులు, రంగుల కలయికలు ప్రవేశ పెట్టింది. పాత సంప్రదాయం డిజైనులు కూడా పునరుద్ధరింపబడ్డాయి. కార్మికులకు హస్తకళా నిపుణుల వద్ద ఉన్నత శిక్షణ ఇప్పించడానికి చర్యలు తీసుకోబడ్డాయి. దేశంలోని రకరకాల తివాచీలను, ముతక కంబళ్ళు, దుద్దు కంబళ్ళు, నామ్దాలు, జాజిమ్‌లు మొదలయిన వాటిని, గొలుసుకుట్టు బుటేదారి పని గల వాటిని జంబఖానాలను జనం కోసమూ, వ్యాపారుల సౌకర్యంకోసమూ ఒకచోట ప్రదర్శించే ఏర్పాట్లు జరిగాయి.

ఈవిధంగా దేశంలో తివాచీ పరిశ్రమ అభివృద్ధి చెందింది. నేడు ఉత్తర దేశంలోని భదోహి, మీర్జాపూర్ పట్టణాలు దేశంలో తివాచీల పరిశ్రమకు పెద్ద

కేంద్రాలు. ఇక్కడ 33 వేల మందికి పైగా తివాచీ కార్మికులు పనిచేస్తున్నారు. ఇక్కడ తయారయ్యే తివాచీలన్నీ ఎగుమతి కోసమేనా అన్నంతగా ఎగుమతి అవుతున్నాయి.

దేశంలో జనానికి వీటిపట్ల మరింత ఆసక్తి కలిగించడం కోసం అఖిల భారత హస్తకళా బోర్డు సంచార ప్రదర్శనం ఏర్పాటు చేసింది. ఈ సంచార ప్రదర్శనం నిరుడు 1960 మార్చి నెలలో ఢిల్లీలో ప్రారంభమైంది. తర్వాత శ్రీనగర్, నైనిటాల్, చండీగఢ్, జైపూర్, అహ్మదాబాద్, బొంబాయి, భోపాల్, హైదరాబాద్, బెంగుళూరు నగరాలలో తిరుగుతూ ప్రస్తుతం—ఫిబ్రవరి మొదటి వారంలో—మద్రాసులో మెమోరియల్ హాలులో అందరినీ ఆకర్షిస్తున్నది. తర్వాత ఈ ప్రదర్శనం కలకత్తా, పాట్నా నగరాలకు తరలి వెళ్ళుతుంది.

ఈ సంచార ప్రదర్శనంలో ఒక సంవత్సరం ఒక చేతిపనుల వస్తువులను ఎన్నుకొని ప్రచారం చేయాలని బోర్డు నిర్ణయించింది. కొన్ని ఉత్తమోత్తమమయిన కళాఖండాలను ఎన్నుకొని ప్రదర్శిస్తారు. మ్యూజియంలలోని పాత కళాఖండాలకు, వ్యక్తులు సేకరించిన వాటికి నమూనాలు తయారుచేసి ఈ ప్రదర్శనంలో పెడుతారు. ఈ విధంగా బోర్డు ఇంతవరకు చేతి అద్దక వస్త్రాలు, లోహ పాత్రలు, వెదురు, లక్క వస్తువులు, చీరలు, బుదేదారీ పనులు, శాలువలు, నగలు—వీటి సంచార ప్రదర్శనలు జరిపింది.

మద్రాసులో సంచార ప్రదర్శనంలో ఐదు రూపాయలు మొదలు దాదాపు రెండు వేల రూపాయల వరకు విలువగల తివాచీలున్నాయి. రంగురంగుల రత్నగంబళాలు వర్ణ వైవిధ్యంతో, పనితనంతో, నాణ్యంతో, కనులవిందుగా వున్నాయి. కేవలం నలుపయితే అన్ని రంగులనూ తినేస్తుంది. తెలుపు తక్కిన రంగులను ఎత్తిచూపుతుంది. అలాటి తెలుపు మీది నల్లపూవుల తివాచీలు చాల అందంగా వున్నాయి. 17వ శతాబ్దపు పత్రాలున్న తివాచీ నమూనా ఒకదాని వెల రు. 927-80.

ఏమైనా పాశ్చాత్యదేశాలలో పర్షియా తివాచీలది అగ్రస్థానమని, మనది ద్వితీయ స్థానమని సంచార ప్రదర్శనం అధికారి శ్రీ మోహన్‌సింగ్ అహులువాలియా, హాండిక్రాఫ్ట్స్ బోర్డు ప్రాంతీయ డిప్యూటీ డైరెక్టరు శ్రీ హెచ్. రామచంద్రరావు అన్నారు. పాశ్చాత్య దేశాల ఫ్యాషనులను, ముఖ్యంగా అమెరికా వారి అభిరుచిని ఆకట్టుకొనడానికి ఎప్పటికప్పుడు ప్రయత్నాలు జరుపుతున్నామని, పాశ్చాత్య దేశాలనుంచి కళాకారులను, డిజైనర్లను పిలిపించి, వారితో రకరకాల డిజైనులు వేయించి, ఆ విధంగా తివాచీలు వేయిస్తున్నామని కూడా

వారు అన్నారు. మాంట్రేల్‌లో జరిగే ప్రపంచ ప్రదర్శనలలో మనదేశం చేతివస్తువులతోపాటు తివాచీలు కూడా పెడతామని, అవి ప్రపంచ దృష్టిని విశేషంగా ఆకరించగలవని శ్రీ అహూలువాలియా తెలిపారు.

"కళాకారులు, వృత్తి నిపుణులు పూర్తిగా భావుకులు. వారిని మనం ఒత్తిడి చేయలేము. నిర్బంధిస్తే వారు సరిగా పని చేయలేరు వారికి స్వాతంత్ర్యమిస్తే ఎంతైనా అందమైనవి తయారవుతాయి" అని శ్రీ రామచంద్రరావు తెలిపారు.

వరంగల్, ఏలూరు తివాచీలు చేతితో వడికిన ఉన్ని దారంతో. సహజమైన రంగుతో తయారు కావడంవల్ల విదేశాలలో ఎక్కువగా ప్రీతిపాత్రమవుతున్నాయని, వాటికి ఇకముందు కూడా విశేషమయిన గిరాకీ వుండగలదని, వుండే విధంగా అన్ని ప్రయత్నాలు చేస్తున్నామని, నిపుణులకు కార్మికులకు వేయి మొదలు రెండువేల రూపాయల వరకు పరపతి సౌకర్యాలు కలిగిస్తున్నామని శ్రీ అహూలువాలియా తెలిపారు.

ఆంధ్ర, మద్రాను, కేంద్ర ప్రభుత్వాల ఉమ్మడి ప్రయత్నంపై వినా మంగళం పట్టణంలో ఉన్ని పారిశుద్ధ్య కేంద్రం నెలకొల్పబడిందని, ఇది తివాచీలకు కావలసిన ఉన్నిని సిద్ధపరచి సరఫరా చేస్తుందని శ్రీ హెచ్. రామచంద్రరావు అన్నారు

"ఇంత ధర పెట్టి సామాన్యులు భారతప్రజ తివాచీలు కొనడం సాధ్యమా?" అని ప్రశ్నించాను. "ప్రతివారికీ, అందంగాను, శుభ్రంగాను ఉండడానికి ప్రయత్నిస్తున్నట్టే, తన ఇంటిని అందంగా వుంచుకుందామనే కళాదృష్టి వుంటుంది. అలాటి వారితో పాటు జన సామాన్యానికి కళా దృష్టి కలిగించడం మా లక్ష్యం. సహస్రాబ్దాలుగా మనదేశంలో వున్న ఇలాటి చేతిపనులు పూర్వం రాజుల, శ్రీమంతుల పోషణలో పెరిగాయి. నేడు ప్రతివారుని జీవన స్థాయి ఎక్కువవుతున్నది గనుక, కళాభిరుచి కూడా పెరుగుతున్నది. ప్రతివారు నేడు టెర్లిన్ దుస్తులు వేసుకోడం లేదా? అలాగే ఇలాటి వస్తువులతోను, వున్నంతలో చౌకగా దొరికే వాటితో ఇంటిని అలంకరించుకోడంలో ఆక్షేపణ ఏమిటి?" అన్నాడు శ్రీ అహూలువాలియా.

ఆయన అన్నట్టు కళాభిరుచి మంచిదే. జీవన ప్రమాణం పెరిగిందనడమూ నిజమే. అయినా, అందరూ, ఇలాటి కళాఖండాలను కొని అనుభవించే కాలం వచ్చిందా?—అంటే చెప్పలేము. వచ్చుగాక!

# కోడూరు రామమూర్తి కళాఖండాలు

దేశోద్ధారక, కళా ప్రపూర్ణ, విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారికి అంకితంగా 1979 డిసెంబరు 12, 13 తేదీలలో మద్రాసు మ్యూజియం లోని సెంటినెరీ హాలులో ఒక చిత్ర కళా ప్రదర్శనం జరిగింది. క్షణక్షణానికీ, లిప్త లిప్తకూ మారిపోతున్న నేటి యిజాలలో దిఙ్మూఢులయిన కళాభిమానులకు, 20వ శతాబ్దం ప్రాచీన లలిత కళా సంప్రదాయ రీతులకు భరత వాక్యం పలుకు తుందా అని శంకించే వారికి ఈ చిత్రకళా ప్రదర్శనం ఊరట కలిగించింది. ఈ చిత్రాలు కోరావి [శ్రీ కోడూరి రామమూర్తి గారివి].

ప్రదర్శనశాలలో అడుగు పెట్టీ పెట్టగానే చూపరులను మొట్టమొదట ఆకట్టి వేసింది ఎదుట దేవాలయం. ఇది నిజమయిన లఘు దేవాంయమనే భ్రాంతి కలుగుతుంది ఎంతటి వాస్తువేత్తలకయినా. కాని కాదు. దేవాలయాల లోని వివిధ దారు శిల్పాల - గవాక్ష వలభీ ప్రతోళికా ద్వారకవాటాల అవశేషా లన్నిటినీ జోడించి నిర్మించిన దేవాలయ మిది. ద్వారకవాటాల మీది చతురస్రాల మధ్య దశావతారాదులు చెక్కిన తామ్ర, కాంస్య ఫలకాలు పొదిగారు. ఐదంతస్తుల గోపురం, పశ్చాద్భాగం పార్శ్వాలు—అన్నీ ప్రాచీనావశేషాలు జోడించి సిద్ధపరచబడినట్టివే. ఇలాంటి మరొకశిల్పం—రథం. శిథిలాలయి, చిద్రుపలుగా పడిన అనేకానేక దారు శిల్ప భగ్నఖండాలను ఎంతో జాగరూకతతో, చూపరులకు కృత్రిమమయినవి, విభిన్న రీతులని అనే భేదం తెలియకుండా జోడించబడిన తేరిది.

ఈ ప్రదర్శనంలో దాదాపు 30 చిత్రాలు ప్రదర్శించబడ్డాయి. వీటిలో హెచ్చు భాగం కలంకారీవి. కొన్ని నీటిరంగులవి. కొన్ని తంజావూరు రీతిని— అంటే రంగులు నూరిపూతలు పూసినట్టు, రంగు ముద్దలు మెత్తినట్లు మెత్తినవి.

కలంకారీ అంటే కలం పట్టుకొని వ్రాసింది అని అర్థం. దీనిని పూర్వం కాళహస్తి మొదలయిన ప్రాంతాలలో వ్రాతబొమ్మలు అనేవారు. ఒంగోలులో, బందరులో కలంకారీలు అనేవారు—కలంతోనో, ఇనుప మేకుతోనో, పుల్లతోనో వ్రాసినట్టుగా బొమ్మలు వ్రాయడం, బొమ్మల కింద వాటి వివరణన్న

అక్షరాలతో వ్రాయడం, లేక జానపద గీతాలను ఉదాహరించడం. ఇదే క్రమంగా అద్దకానికి దారితీసింది. కలంకారీ కళాకారులు వాడేరంగులు—మూలవర్ణాలు—నాలుగు. వీటికి ఉపయోగించే మూలద్రవ్యాలు మరీ అందరికీ బట్టబయలుగా తెలిసినట్టివే. నలుపునకు కరక్కాయ, ఎరుపునకు మంజిష్ఠ, పసుపుపచ్చకు కరక్కాయ పూవులు, నీలవర్ణానికి నీలిమందు.

ఈ నీలం, పసుపుపచ్చ, ఎరుపు ఎంత కాలానికయినా ఎగిరిపోకుండా పటిక మొదలయిన రసాయన ద్రవ్యాలు చేర్చి మరికొన్ని కూరగాయల, పచ్చి ఆకుల రసాలు కలిపి నూరి రకరకాల పరిశోధనలు జరిపి, తమ చిత్రాలకు వాడారు.

కోరా గీచిన కలంకారీ పద్ధతిలోని 'మొదటి ముద్దు' చిత్రం సరళ సుందరం. దీనిలో కరక్కాయ సిరా గీతలు—చిన్నవి, పెద్దవి—తప్ప మరొకటి లేదు. ఆ గీతలే మొదటి ముద్దులోని ఆసక్తిని, బిడియాన్ని, తన్మయ తను అపూర్వంగా వ్యక్తం చేశాయి.

ఇలాటిదే మరొక కలంకారీ చిత్రం స్నానానికి ముందు. ఎవరూ చూడని స్నానాగారంలో యువతులు యథాలాపంగా తమ వలువలు, కంచుకాలు తీరికగా వూడ్చి వేసిన తర్వాతి సోయగం దీనిలో అసభ్యతకు అతిదూరంగా చిత్రించ బడినది. చిత్రకారుని దృష్టి దినమొలతో వున్న వనిత కటి పశ్చాద్భాగాన్ని చూపించడం కాక, వలువలు వూడ్చి వేస్తున్నప్పుడు, ఊడ్చి వేసిన తర్వాత మెరుపులాగ కనిపించే కమనీయతను భాసింపజేయడం.

కలంకారీ రీతిలాగే నీటిరంగు చిత్రాలూ ప్రకృతి సౌందర్యాన్ని చూపరులకు బాగా పంచిపెట్టాయి. వాటిలో ఇష్టంలేని పెళ్ళికూతురు అసదృశం. పెండ్లిలోని తీయదనం కోరే కుతుకం, ఇష్టం లేకపోవడానికి తెలిపే తమకం, చూపులలో తొణికిసలాడుతున్న వధువు మనసు చాలసేపు ఆకట్టివేసింది. దానిని చూస్తూ చూస్తూ కదలడానికి మనకూ ఇష్టంలేక కదలి, మరొక చిత్రానికి వెళ్ళుతాము.

మరొక నీటిరంగు చిత్రం సంధ్యారాగం ప్రేక్షకులను పరవశింపజేసే చిత్రమే. సూర్యుని లాగ రంగులు దిద్దే చిత్రకారుడు బ్రహ్మాండంతో మరొక రున్నారా? సాయంసంధ్యా, ఉదయసంధ్యా మానవజాతినే పరవశం చేయించి, పరవళ్ళు తొక్కించి, ప్రపంచ వాఙ్మయాన్ని అనర్గళకవితలతో నింపివేయించి నట్టివి. ఆ మహాచిత్రకారునితో పోటీ పడడం, మానవ మాత్రునికి సాధ్యమా? కాని, కోరా 'సంధ్యా రాగం' ఆ ప్రకృతి రామణీయకాన్ని భాసింపజేసింది

శ్రీ కోడూరు రామమూర్తి కుంచెను ఎలా కదం తొక్కించగలరో, ఉలిని అలాగే వెలయించగలరు. దానికి ఆయన చెక్కిన, చెక్కించిన, అమర్చిన దేవాలయాలు, రథాలు, ప్రాచీన శిల్పాలు, దారుప్రతిమలు సాక్షి.

శ్రీ రామమూర్తికి ప్రాచీన సంప్రదాయంలో ఇంత ఆసక్తి కలగడానికి కారణం వుంది. ఆయన తాతముత్తాతలు వైదిక సంప్రదాయానికి చెందిన ఇనాందార్లు. మాతామహులు పారనంది అప్పాశాస్త్రిలుగారు వాగ్గేయకారులు. ముత్తాత వాలాజానవాబు దర్బారులో జ్యోతిష్కులు. తండ్రి శ్రీ వెంకట రామయ్య కళాభిమాని, దానికి తగిన ఉపపత్తి వుండే ఇనామ్‌దార్. శ్రీ రామ మూర్తి చిత్తూరు జిల్లా కువ్వం తాలూకా వేపనపల్లి గ్రామంలో పుట్టారు. తిరు పతిలో ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం, సెకెండరీ గ్రేడ్ ఉపాధ్యాయ శిక్షణ పొందారు. కాని ఆయన కళా హృదయం ఉపాధ్యాయ వృత్తికి ఇష్టపడక ఆయనను మద్రాసు లలితకళా పాఠశాలకు లాగింది. 1937 నుంచి ఐదు సంవత్సరాలు శ్రీ రాయ్ చౌదురీ వద్ద—లలితకళా పాఠశాలలో చిత్రలేఖనం, దారు శిల్ప రచన మొదలయినవి అభ్యసించారు.

కాళహస్తిలోని కలంకారీ చిత్ర పద్ధతి ఆయనను విశేషంగా ఆకర్షించింది. వాటి రీతులు తెలుసుకొనడానికి దక్షిణాపథమంతా తిరిగారు. ఈ తిరుగడంలో ఆయనకు మరొక సత్యం తెలిసింది. దక్షిణాపథంలోని కళాకారుల తెగవారంతా తెలుగువారేనని. తెలుగు దేశంలోనివారు సరేసరి. మైసూరులో జీనిగార్లనబడే క్షత్రియులు, తంజావూరు జిల్లా చిక్కనాయకన్ పేటలోని వారు, మహారాష్ట్ర, కన్నడ ప్రాంతాలలోని ముచ్చిలివారు అనబడే దారు శిల్పులు—అంతా తెలుగువారే. దీనితో తెలుగు సంప్రదాయాన్ని, ముఖ్యంగా కలంకారీ పద్ధతిని నవీనరీతిలో ప్రపంచానికి తెలుపడం, అవసరమని తోచింది. అదే జీవిత పరమావధిగా పెట్టుకున్నారు.

చిత్రాన్వేషణలో దక్షిణార్కాటు జిల్లా పనమలై కొండలో మరుగున పడివున్న పార్వతీదేవి అపూర్వ చిత్రం శ్రమపడి కనుగొని ప్రతికృతి వ్రాశారు. పెక్కు దక్షిణాది దేవాలయాల కప్పుల లోపలి చిత్రాలు నకలు చేశారు. కింద అద్దం పెట్టుకుని, కప్పుల చిత్రాలు (సీలింగ్ ఫ్రెస్కోస్) నకలు చేయడం మంచిది కాదని ఈయన నమ్మకం. ఒక బల్ల నిచ్చెనపై వెల్లకిలా పరుండి ట్రేస్ పేపరుపై రేఖలు దించుకొని రంగులు నింపడం మంచిదని కోరా నమ్మకం. కళాక్షేత్రం ఎక్కడ వుందంటే అక్కడంతా తిరిగారు; నానావిధ రీతులు అకళించుకొన్నారు.

తర్వాత మేడం మాంటొస్సోరీ నిర్వహించిన ఇంటర్నేషనల్ నింగ్ సెంటర్ ఫర్ చిల్డ్రన్ సైకాలజీలో మూడు సంవత్సరాలు చిత్రకళో పాధ్యాయుడుగా, తెలుగు భాషా సమితిలో మూడు సంవత్సరాలు చిత్ర కారు డుగా, హాండ్ క్రాఫ్ట్ బోర్డులో కలంకారీ ట్రెయినింగ్ సెంటర్ (కాళహస్తి)లో చాల సంవత్సరాలు డైరెక్టరుగా, కార్యదర్శిగా పని చేశారు. ఎందరికో కలంకారీ పద్ధతిలో చిత్రరచన నేర్పారు. శ్రీ అడివి బాపిరాజు గారితో పాటు సింహళంలోని సిగిరియాకు వెళ్ళి చిత్రాలు నకలు చేశారు. ప్రాచీనవస్తువులను సేకరించడంలో ఆయనకుగల అనక్తి వర్ణనాతీతం. ఆయన ఇంటిలో అడుగు పెడితే చాలు—అదొక మ్యూజియం. పాత తోలుబొమ్మల గుట్ట ఒక వైపు, విరిగిన దారుశిల్పాల మేట ఒక వైపు, అద్దాలపై చిత్రాలు మరొక వైపు, తమ చిత్రాలు ఇంకొక వైపు ఇలా ఒక సుమారయిన మ్యూజియంగా కనిపిస్తుంది. వేల కొలది విలువ చేసే అపూర్వ కళాఖండాలు పడి వుంటాయి. శాసనాలూ, తాళపత్ర గ్రంథాలూ చెప్పనక్కరలేదు.

ఏటా ఢిల్లీలో చిత్రప్రదర్శన జరుపుతారు. వాటిలో తమవీ, పాతవీ ఎన్నో విదేశాల వారిని ఆకర్షిస్తాయి.

"మనకు నాలుగు వేల సంవత్సరాల కళా సంప్రదాయం ఉంది. మొహెంజోదారోలో దొరికిన నర్తకి బొమ్మ, గంగడోలు వేలాడుతూ గంభీరంగా నిలు చున్న వృషభముద్రిక మన ప్రాచీనుల కళా పిపాసకు తార్కాణలు. రంగుల విషయంలో అజంతా మొదలు సిగిరియా వరకు మనకు వైవిధ్యం ఉంది. శిల్పానికి త్రీ మూర్తి గండిరింపే పరమావధి అన్న పాశ్చాత్య దృష్టిని చెదరేట్టు చేసే అపూర్వ త్రీ మూర్తులూ మనకు వేలకువేలు ఉన్నాయి. కనుక మనం ఇతరుల ఇజానికి ఎందుకు వెళ్ళాలి? అయితే మార్పు తప్పదు గనుక పాత సంప్రదాయం విడనాడకుండా, నూతనత్వం వద్దన కుండా పాత కొత్తల మేలికలయికతో ముందుకు పోవాలి. పాత అన్నప్పుడు అంద్రులది అని నాభావం...." అంటారు

కోరాకు ఆయన సహోధ్యాయులు శ్రీ ఎం. బాలకృష్ణరావుగారు, లోక వ్యవహారదక్షులయిన శ్రీ వి. గోవిందరాజన్‌గారు సహాయకులు.

# వయసుమళ్లిన మగవాని మనసు మళ్లిన కారణం!

"మీరైనా చెప్పండి." అన్నది నా మిత్రుని భార్య.

నేను ఆలోచనలో పడ్డాను. ఏమి చెప్పమంటున్నదో! ఈమె కోసం మిత్రుణ్ని పోగొట్టుకోవడం మూర్ఖత్వం. కానీ, మిత్ర కుటుంబిని గోడుకూడ వినవలసిన అవసరం ఉంది. వారిద్దరి సుఖమే నా సుఖం. ఆలోచిస్తుండగానే ఆమె గొంతు మళ్ళీ వినిపించింది.

"ఆరుగురు పిల్లల తండ్రి కదా? పిల్లలు చిన్నవారా చిదిపివారా? జమా జెట్టీలవంటి వారు; పెద్ద చదువులు చదువుతున్నారాయెను? యాభై ఏండ్లు నిండుతుండగా ఈ పాడు బుద్ధు లేమిటండీ? నవ్వరూ? దేశంలో పేరూ, ప్రఖ్యాతులూ లేని వారు ఏ ఏడుపు ఏడిచినా బాగుండును? ఈయన కళాతపస్వి అనీ, అదనీ, ఇదనీ పేరుండె. ఏమి ఖర్మ చెప్పండి? పేరు కోసమన్నా కొంత గుట్టుగా ఉండవద్దూ? అయినా మనవళ్ళు పుట్టే కాలానికి ఇదేమి జబ్బండీ? నాకు మాత్రం పరపతి లేదా? మాచుట్టాలంతా పెద్ద పెద్ద హోదాలోవారే. నాకోసం ఏమన్నా చేయగలరు. చూచావా? పిల్లలు పెద్ద కావడంతో మొగుడిని చిన్న చూపుచూస్తున్నది - అని నన్నే అంటారని భయపడుతున్నా గాని మనస్సు గట్టి చేసుకున్నానూ అంటే విడిగా బతక్కపోతానా? ఇంత సంపాదిస్తున్నాడు. ఈ వయస్సులో ఈ తిరుగుళ్ళు, ఖర్చులు ఏమిటి చెప్పండి? ఇంట్లో ఆరుగురికి పైగా భోజనం చేయాలి గదా? ఏమి పెట్టను వారికి? ఇంతవరకూ పెద్ద హోదా కలవారి భార్యను కావడం వల్ల ఇతరత్రా పని చేయడం పరువూ కాదు, చేతా కాదు. ఇంతకూ, మీరే చెప్పండి అర్థమైన ఆడవాళ్ళనూ వెంటేసుకుని తిరగడం ఏమంత మర్యాద?"

ఆమె కొంచెం ఆగింది. నేను కొంచెం ఊపిరి తీసుకున్నాను. నిజమే ఈ గృహిణి వాదంలో న్యాయం ఉన్నట్టే తోస్తుంది. ఈ వయస్సులో నా మిత్రునికి ఈ పోకిళ్ళేమిటి? కామశాస్త్రజ్ఞుల సిద్ధాంతానికి విరుద్ధంగా ఉందే ఈతని ప్రవర్తన? గార్హస్థ్య జీవితం తొలినాళ్ళలో పురుషులకు కామ వాంఛ హెచ్చని,

పది పన్నెండేండ్లు కాపురం చేసిన తర్వాత—ప్రారంభ కాల పరిస్థితికి విరు ద్ధంగా—కామ వాంఛ తక్కువ అనీ శాస్త్రజ్ఞులంటారే! మరి, మా మిత్రునికి ఉత్తర వయస్సులో ఈ లాలసత్వం ఏమిటి? తీరని కోరికలు ఉత్తర వయ స్సులో కెలకవేస్తాయంటారు మనస్తత్వ వేత్తలు. అంతటి పెద్ద మనిషి ఇంత తెగించాడంటే ఏదో పెద్ద ఆఘాతమే తగిలి ఉండాలి? ఈమెను చూస్తే మహాసాధ్వి! దుర్మార్గానికి ఆస్కారం లేదు. దాదాపు ఇరవయ్యయిదు సంవత్స రాల కాపురం! ఆమెను అన్నవారు ఒక్కరూ కనిపించలేదు. ఈయనా అలాంటి వాడే. ఇద్దరికీ కామోపభోగంలో వైషమ్యం ఉందా అంటే, అరడజను మంది పిల్లలున్నారు. పోనీ సంతానానికి, సంప్రయోగంలో భావప్రాప్తికీ (తృప్తికీ) సంబంధంలేదనే కామశాస్త్రజ్ఞుల సూత్రం సమస్యయిద్దామా అంటే కలతలు క్రమేపీ తెలియాలి కదా. కలతపడుతున్నట్టు, రభసతో కాపురం కొనసాగిస్తు న్నట్టు, ఇంతవరకూ ఎక్కడా పొక్కలేదు. ఏమిటి పరిష్కారం? - అనుకుంటూ మిత్రుని వద్దకు నడిచాను.

ఎప్పటిలాగే, మహానందంతో ఆహ్వానించాడు మిత్రుడు. నా విషయంలో ఆయన ప్రవర్తన ఏమీ మారినట్టు కనిపించలేదు. నేను అంతఃపురం నుంచి వచ్చినట్టు కనిపెట్టాడేమో తానే ప్రస్తావించాడు నేను అడుగదలచిన విషయం.

"ఏమి చేయమంటావు మిత్రమా? విసిగెత్తిపోయాను, వేయిసార్లు చెప్పాను, లక్షసార్లు చెప్పాను, వినేవాళ్లెవరు?" అన్నాడు.

నాకు నిజంగానే గాభరా పుట్టింది. ఈయన ఆ సాధ్విపైన ఎలాం అభాండం మోపుతాడో! ఒకొక్కప్పుడు కొందరు తమ వాదం నిలబెట్టుకొనడం కోసం ఎంతటి దారుణానికైనా దిగజారుతారు. ఎలాగైనా అపఖ్యాతి రాక వచ్చింది, తీరా తెంపివేద్దామనే ధోరణిలో పడ్డాడా అనిపించి కొంచెం బెరుకు గానే చూశాను. ఆయన మాటలు చెవినిబడ్డాయి.

"ఏం? అలా చూస్తావు? తప్పంటే తప్పే. వ్యభిచారం మాత్రమే తప్పు కాదు. నాకు ఇష్టంలేని విషయం ఎంత చిన్నది చేసినా తప్పే. ఎన్నోసార్లు చెప్పాను - గట్టిగా మాట్లాడవద్దని, కాపురం పెట్టిన కొత్తల్లో గట్టిగా మందలిస్తే బాగుండదు. ఇంత కర్కోటకుడా అని అంటారని నెమ్మదిగానే చెప్పాను. సహించాను. ఒక సంతానమయింది. రెండు-మూడు - గొంతు తగ్గదే. ఎప్పుడూ తారస్థాయేనా? నా పనుల కిదంతా నేపథ్య సంగీతమా?"

ఏమిటి మిత్రుడు చెప్పే కారణం? నమ్మదగిందేనా? రోటరీ హాయిలు టెలిప్రింటర్ల రొదలో, బస్సుల బర్బరారావాలలో కవితలు, కథానికలు

పడుతున్నాయే? ఈయన తన గృహిణి గొంతుక ఎత్తితే సహించడా! పరిశీ లించి ఆనందించనివాడు కల్పనలేమి చేస్తాటు?-మరల మిత్రునివైపు చూచాను.

"ఇప్పుడేమో పిల్లల ఆసరాతో మరీ గొంతు గగనానికి అంటుతున్నది. చుట్టుపక్కలవారూ మనుష్యులేనన్న జ్ఞానం వద్దూ! ఇరవై నాలుగు గంటలూ గోలేనా? కొంతైనా శాంతి కలుగుతుందని దూరంగా ఉన్నాను మిత్రులతో."

ఔను. నేను ఈ గోల వినిపించాను గనుగ ఈ మహానుభావుడు బాధ పడుతున్నాడు. ఇలాటివారికి రైలుస్టేషనులలోను, పత్రికా కార్యాలయాలలోను ఒక్కరోజు కఠినవరకం విధించాలి. బుద్ధి తెచ్చుకుంటారు. అనుకుంటు మిత్రు నితో అన్నాను :

"ఇదేనా నీవు చెప్పే కారణం, కార్యకారణ భావం తెలిసినవారి కెవరికీ నీ కారణం నచ్చదు. నీ ప్రవర్తనకు గట్టిగా మాట్లాడడం కారణమంటే నవ్వరూ! నేనూ గట్టిగానే మాట్లాడుతున్నాను. మరి నన్ను మిత్రుడిగా పరిగ ణిస్తున్నావేం? రావద్దని అనలేకపోయావా?"

"నీవూ, ఆమే ఒక్కటేనా? బాగా ఉంది నీ వాదం?"

"గట్టిగా మాటాడే విషయంవరకూ ఇద్దరం ఒక్కటే; కొందరి గొంతులు పెద్దవి. కొందరు ముంగుల వలె సంగనాచులు. గొంతు పెద్ద దన్నంత మాత్రాన వదలివేసి అడ్డదారి తొక్కుతావా? ఏం న్యాయం? ఇంకే వైనా కారణాలు ఉన్నాయా?"

"ఇదే పెద్ద కారణం, కాలుజారినా నేను తప్పు పట్టుకోనుగాని, గోల మాత్రం భరించలేను. సంగీతంలా వుండవలసిన ఆడదాని గొంతు వెర్రెత్తిస్తే ఎలా? నా బాధను గుర్తించావనుకుంటాను."

గుర్తించడానికి ప్రయత్నిస్తున్నాను. చూడబోతే కారణం చిన్నదే. మిత్రుని మనస్సుకు మాత్రం వజ్రాఘాతమైంది. ఆమె కొంచెం పసితనంలో వస పెద్ద మోతాదులో పుచ్చుకున్న రకం. అంతమాత్రాన తప్పుకాదు. నా మిత్రుడు కాలు జారవలసినంత తప్పు అసలే కాదు. నా పని చక్కగానే నిర్వర్తించాను అనుకుంటూ:

"మిత్రమా, ఎన్నో విషయాల్లో ఔదార్యం చూపినవాడివి. ఆమె గొంతు విషయంలో కొంచెం హెచ్చు ఔదార్యం చూపు. సఖ్యం సాప్తపదీన మన్నారు గదా? దాదాపు ఏడు నాలుగు సంవత్సరాలు సహచరులు మీరు. ఆ సాహచర్యా నికి కళంకం రానీకు. నేను ఇంత చెప్పడమూ ఎక్కువే. హద్దులు మించాను, మన స్నేహంతోని బలాన్ని నమ్ముకుని" అంటూ తల ఎత్తాను.

మిత్రుని కళ్ళు చెమ్మగిలినట్టు లీలగా కనిపించింది.

# ఎంకి పాటలు : పాతవి, కొత్తవి

శృంగారం కేవలం కామక్రీడగాను, స్త్రీ వలపుల అచ్చులో పోసిన కులుకు మిటారి బొమ్మగాను ఉన్న సాహిత్యంలో నుంచి స్త్రీని ఉదాత్త మహిళా మణిగాను, శృంగారాన్ని ఉదాత్త ప్రేమగాను అందించే సాహిత్యశాఖ ఈ శతాబ్దం ప్రారంభంలో చిగిర్చింది. దాని తొలి ననలలో ఒకటి "ఎంకిపాటలు."

వస్తుప్రధానమైన కవిత్వంలో మెరుపులలాంటి ప్రత్యేక కవితా రామణీయక స్ఫోరకపదావళి చెదురుగా మాత్రమే కనిపించేది. పరిపూర్ణంగా కుదించిన ఒక్కొక్క అతిమాత్ర భావనకు కవితారూపాన్నిచ్చే — లిరికిజం — సాహిత్యాంకురం కూడా అప్పుడే ఆకులు తొడిగింది.

కవి కేవలం దాగి ఉండి ఏ నాయికా నాయకులతోనో మాట్లాడించడం కాక స్వయంగా తన హృదయాన్ని విప్పిచూపడం — ఆత్మాశ్రయత — కూడ అప్పుడే ఆరంభమైంది. అతిప్రాచీనకాలంలోను, అతిప్రాచీనకవితలోను ఇలాటి లక్షణాలున్న కావ్యాలు కొన్ని లేకపోలేదు. కాని ప్రబంధయుగం రోడ్‌రోలర్ వాటినన్నిటినీ తలనూపనీయలేదు. ఉత్తమోత్తమ కళాఖండాలుగా జనంలో అతిప్రచురంగా కనిపించే జానపద గీతాలకు ఆనాటి సాహిత్యం చొరరాని కంచుకోటయింది. ఇలాంటి దశలోసాగిన సాహిత్య నూతన పరిణామ ప్రగతికి మణిముకురం "ఎంకిపాటలు."

అమాయక జనపద హృదయం వెలువరించే రసధుని వెల్లువలై పారిన ప్రాకృతగాథలు పూర్తిగా మరచిపోయిన తెనుగువారికి కనువిప్పు కలిగించిన నండూరిసుబ్బారావుగారి "ఎంకిపాటల"కొక ప్రత్యేకస్థానం ఉన్నది.

ఎంకి, నాయడుబావలది స్వచ్ఛ సహజ సఖ్య ప్రేమ. ఇద్దరూ ఒకరి కొకరు ఆత్మార్పణం చేసుకొన్నవారు. నాయడుబావ "గుండె గొంతుకలోన కొట్లాడుతాది." ఎంకి "కరిగి నీరౌతాది." ముగ్ధ్దైన నాయడు "ఎంత సేపున్నాను ఇడిసిపెట్ట"లేడు. ఎంకి "తగువోళ్ళలో మనకి తలవంపులంటాది." నాయని నీడలోనే ఆ "యెల్తురుపిల్ల" కాపురం. నాయని "సొమ్ము గుండె నమిలి మింగిన పిల్ల" యెంకి. ఎంకి కనిపించని నాయడు "కడుపే సెరువౌతాది." నాయుడు బావికి

కలలోనూ ఎంకిరూపే. పడుకుంటే భ్రమపుట్టి "కడుపులో చేయేసి కలిపేసినా" దట. నాయడు దూరమైనప్పుడు ఎంకి మనసు అతనిపైనే. "దూరాన నారాజు కేరాయిడౌనో" అన్నదే ఆమె వ్యథ. ఆమెకు "కళ్ళకెదో మబ్బు గమ్మినట్టుంటాది. నిదురల్లె నావొల్లు నీరసిస్తున్నాది." "రాత్రి రేవ వ్యరంసీత్" అన్నాడు భవభూతి. శకుంతల కనుబొమల అందాన్ని దుష్యంతుడు చాటున వుండి తనకు లేఖ వ్రాసేప్పుడు మాత్రమే చూడగల్గాడు — ఉన్నమితైక భ్రూలత మాననం — అని. నాయడుబావ నిద్రపోతున్న ఎంకి కనుబొమ్మలలో తీయదనాన్ని, నునుసిగ్గును, సంబరాన్ని, సంభ్రమాన్ని చూచి కరగి కరువుతీరి కతలు చెప్పుకొనేవాడు. ఎంకి కృత్రిమాలంకరణలు అవసరంలేని సహజ సుందరి. మిరుమిట్లు గొలిపే ఆమె సౌందర్యాన్ని వెలుగులో చూడలేని నాయడు బావ 'ఆరిపేయవే దీపమూ, ఎలుగులో నీమీద నిలుపలేనే మనసు' అన్నంతటి 'రవలవెలుగులది' ఎంకి. నాయడన్నట్టు "యెంకొక దేవత." ఆమె కొంచెంసేపు కనుపించకపోయినా, ఆమెకు కొద్దిపాటి కష్టమయినా — శకుంతల అత్తవారింటికి వెళ్ళుతున్నప్పుడు మృగాలు దర్భకళ్ళు విడిచినట్లు, నెమళ్ళు నర్తనం వదలినట్లు, చెట్లు పండుటాకుల రాల్పుతో దుఃఖించినట్టు "గోవుమాలచ్చిమి" "తల్లిదుపిల్లల్లె తెల్లపోతాది." ఎంకి ప్రోషిత భర్తృక — చంద్రోపాలంభన చేయదు "మద్దె సెంద్రుడె మనకు పెద్దమనిసి" అనిన నాయడు రాలేదని "ఆనాటి నావోడు సెందురూడా; అలిగి రాలేదోయి సెందురూడా" అని విన్నవించుకుంటుంది. ఎందుకంటే ఆయన సాక్షి కదామరి! ఇంతకూ నాయడు ఆమె సొగసును ఆమెనన్నా "సూసుకోనీడు."

కాని కాలం ఒకేతీరుగా ఉంటుందా? ఇద్దరూ జీవితంలో రాటుపోటు తిని కరుకుదేరుతారు. తొలివలపుల పొంగు తగ్గుతుంది కాబోలు! "కొత్తపాటలు" పాడుకోవాలని బుద్ధిపుడుతుంది. కొంత పారమార్థిక చింతకూడ పుట్టుకు వచ్చిందేమో!

ఎంకి ఇప్పుడు నాయడుబావదగ్గరే ఉన్నా దూరదూరానే ఉంటుంది. "సూపుతో మాటాడి, వూపిరితో తెనిగించు; కనుబొమ్మతో నవ్వి మనసు కరగించు." "మన ఎంకియని, కానిసనువునకు పోరాదు — తొలిగినా కలిగినా దూరదూరానే!". అయినా "ఒక్క నేనే నీకు, పెక్కు నీవులు నాకు" అన్నది నాయడు నిశ్చయం. "పూలబాస తెలుసు ఎంకికీ, తోడిపూల మనసులు తెలుసు." ఆమె "పూలతో వియ్యాలు, పూలతో కయ్యాలు; మానల్లె నన్నుంచి తానే పూవౌనేమొ" అని నాయడు భయం. ఎంకి దూరానుండగా "ఏటికడుపున దాగి తోట నిదరోయింది." నాయడు సొదకు ఆలన పాలన

కోయిలపాటే. ఈవైపున ఉన్న ఎంకితీరు కూడ ఇదే. "యెలుతురంతా మేసి యేరు నెమరేసింది; కలవరపు నా బ్రతుకు కలతనిదరయ్యింది. ఈరేయి నన్నొల్లనేరవా రాజా?" అని పరితపిస్తుంది. ఇటు వెలుతురంతా మేసి యేరు నెమరేస్తే, భవభూతి గోదావరి గద్గదంగా నదించింది. కాశీ సంఘటన. "రవల మెరుగుల గంగ రమ్మంది. ఎంకి శివమెత్తి తానాలు చేసింది." "వెలుగు దేవతకు చక్కిలిగింత" పెట్టింది ఈ వెలుగురుపిల్ల. తానాల తర్వాత "కాసీ దేవుని ఎదుట గరవాన నిలిచింది. తల తడుముకొని తానే తబ్బిబ్బులైనాడు." ఈమె సౌందర్యం చూసి గంగే కాబోలుసని భ్రమిశాడు. కాళిదాసు పార్వతి అతిలోక సౌందర్యాన్ని "యదుచ్యతే పార్వతి పాపవృత్తయే న రూపమిత్య వ్యభిచారి తద్వచః. తథాహి, తే రూప ముదారదర్శనే తపస్వినాము ప్యుపదేశి తాంగతమ్" అన్నాడు. ఎంకి సుషమను చూచె నాయుడు చెప్పిన మరొక రమణీయ దృశ్యం ఎంకి ఊయల. "ఎంకి ఊగెను కొమ్మ వుయ్యాలా చంద్ర-వంక వూగెను బొమ్మవుయ్యాలా!" ఇద్దరూ బింబ ప్రతిబింబాలు. "మున్నీటియా జోడె ఆనాటికీనాడు."

ఇలా భావ భావానికీ కవితావతారమిచ్చే పలుకు బళ్ళను యెన్నైనా చూపవచ్చు.

కావ్యమంటే రసం. రసానుభూతిని కలిగించే కావ్య లక్షణాలు చిప్పిలుతూ ఉంటాయి ప్రాకృత గాథలలోను, గీతాలలోను. ఇట్టి ప్రాకృత గాథలను ప్రాచీనాలంకారికులు గ్రహించి వాటికి అత్యున్నతస్థాయి కల్పించారు. తెలుగు ఆలంకారికుల కాపాటి సహృదయతగాని, ఉదారతగాని లేదు. తెలుగులో ప్రబంధ యుగం తర్వాత ధోరణి మరీ మారింది. కనుకనే ఈ "యెంకి పాటలు" వచ్చిన రోజుల్లో ఔనని, కాదని "గాలిదుమారం" లేచింది. ఇప్పటి రోజుల్లో ఆలాటి వాదోపవాదాల ఆవశ్యకత లేదు. కారణం, వీనికి కావ్యత్వం ఉన్నదని చెప్పుకోవలసిన స్థితి దాటింది గనుక. ఎంకి పాటల పలుకుబడి చిలవలు పలవలై ప్రాకింది. తర్వాతివారు ఏ పాట పాడినా "ఎంకి కళ" అనే గేయంలో రచయిత స్ఫురింప చేసిన ధ్వనిలా — "ఎంకి పాటె యనేరు, ఏ పదములోనైన ఎంకి కళనె కనేరు!" అన్నస్థితికి వచ్చింది.

ఈలాటి దాంపత్య శృంగారానికి మధుర భక్తి మాటున — అతిలోకత ఆపాదించడానికి కూడా ప్రయత్నం జరిగింది. కాని అలౌకిక ప్రేమ, అతిలౌకిక ప్రేమ మాత్రమే ప్రేమకాదు. అత్యంత లౌకిక ప్రేమకూడా కావ్యత్వాపాదక మౌతున్నదన్నందుకు ప్రాచీనాలంకారికులు పనిగట్టుకుని ప్రాకృతగాథలను ఉదాహరించడమే పరమ ప్రమాణం. ప్రాచీనాలంకార గ్రంథాలలో ధ్వన్యుదాహృతులు చాల వరకు ప్రాకృత గాథలో, ముక్తకాలో, చాటువులో.

ఇట్టి రసమంజరియైన ఈ గేయ సంపుటిలో 35 గేయాలు పాతవి. 43 క్రొత్తవి గ్రథితాలు. మొదటి దశలో వ్రాసిన పాటలలోవున్న భావతీవ్రత, భావ శబలత తర్వాతి పాటలలో తగ్గి ఆలోచనా పరిణతి, శయ్యా గాంభీర్యం, భాషా సౌష్ఠవం కనబడుతున్నవి. ఇంతేకాక కొత్త పాటలలో ప్రకృతి పురుష లీలా విలాస స్ఫోరకతకోసం ప్రాకులాడడం జరిగిందా అనిపిస్తున్నది. ఉదాహరణకు "నేను తాను", "కలపోత", "సరాగాలు", "నటీనటులు" పేర్కొనవచ్చు. "కలపోతలో" "తలపోసి మా కళలు కలబోయవలెనంట, గౌరీశులకె బాగ గరవభంగము గాగ" అన్నప్పుడు "గరవ భంగము" కొంచెం శ్రవణ సుఖభంగంగా ఉన్నదేమో! "సరాగాలు"లో "నీవు నేనైతే! నిను నీలోనె కందు! నేను నేనుగనుంటె నీలోనె యుందు!" ఈ భావం కబీరు, రసఖాను మొదలు నేటి సూర్యకాంత త్రిపాఠీనిరాలాదాక ఉన్న మధురభక్తికవులందరూ భంగ్యంతరంగా చెప్పినదే. భావంలోనూ, భాషలోనూ, పాతకొత్త పాటలకు గల మార్పులు ఎవ్వరెన్నిసార్లు సమర్థించినా, కవిత్వంలోని ఉదాత్తతకు, ఉత్తమతకు ఎంత వరకు పోషకాలయ్యాయో చెప్పలేము. వయసులో భావుకత, వయసు మళ్ళి పొంగు చల్లారిన తర్వాత ఆలోచన పరిఢవిల్లుతాయని మన తత్వవేత్తలంటారు.

జీవితంలాగే సాహిత్యం కూడా బహుముఖం. "యెంకి పాటల" వంటి వానికి మహాకావ్యత్వం వున్నదన్నంత మాత్రంతో ప్రేమ తప్ప తక్కిన అంశాలు కావ్యవస్తువు కాదన్న అర్థం కాదు. ప్రేమ అపరిగ్రాహ్యమని కూడా కాదనడం చర్వితచర్వణం. జీవితంలో ఒకానొక భాగంగా వున్న ప్రేమను గురించి మాత్రమే యెంకి పాటల యుగంలోని సాహిత్యమంతా ప్రవర్తిల్లిన మాట నిజమే. ఆకారణంగా సువిశాలంగా వెల్లివిరియవలసిన సాహిత్య మహావటవృక్షం ఒకవైపు చిగిర్చి, మరొకవైపు మోడయిన మాటకూడా యథార్థమే. అందువల్లనే కవిత్వమంటే ప్రేమ కవిత్వమనే పేరువచ్చి కేవల విలాస వినోద ప్రియత్వంగా పరిగణించబడిన మాటకూడా సత్యదూరం కాదు. కాని ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క దారినిబడి కవులు నడవడం చరిత్రలో కానరాకపోలేదు.

ఈ దృష్టితో చూచినప్పుడు "యెంకి పాటలు" రసాలవాలమైన మహాకావ్యమని చెప్పాలి; చెప్పక తప్పదు.

పాత పాటలకు పీఠిక వ్రాసిన శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి మాటలలో "వెంకి పాటలు ఈ ఇరువదవ శతాబ్దిని మన యీ ఆంధ్రవాఙ్మయ కల్ప శాఖను ప్రసవించిన సర్వాంగ పరిపూర్ణ పరిణతి విలసితంబులగు దివ్య ప్రసూన రాజమ్ములు గాని, పూవ భేదంగుల ప్రచరించు పసర మొగ్గలుగావు."

# భాష ద్వేషానికి అతీతం

విద్వేషం పెచ్చుపెరిగి రెండు స్కంధావారాలుగా విడిపోతున్న నేటి విశ్వమానవాళిలో తొల్లింటి స్నేహసద్భావాలు సమకూర్చే పరమసాధనాలు భాషా సాహిత్యాలు. ద్రష్టశ్రోతృ హృదయాలను ఆకట్టివేసి వారిని ఏ లోకాలకో తీసుకొనిపోయే విశ్వజనీనత, అతిలోకత భాషాసాహిత్యాలలో నెల్లి విరిసి ఆత్మగుణ వ్యాప్తికి అవి వరమోపకరణాలు కాగలవన్న రహస్యం గుర్తించిన మన విద్వత్కవులు, శాంతిదూతలు నేలనాలుగు చెరగులా శాంతి సందేశంతోపాటు మనభాషా సాహిత్యాల, అమరకళల ముద్రవేశారు.

అట్లని వారు ఇతర సంప్రదాయాలను స్వీకరించి సొంతం చేసుకోక పోలేదు. ఆదాన ప్రదానాల కిటుకెరిగిన సహృదయులు వారు. ప్రాగైతిహాసిక కాలం నుంచి ఇతరదేశాల సంప్రదాయాలను గ్రహించి, మన పద్ధతులతో మేళ వించి దేశమంతటా నూతనరీతులకు దారి తీసినారు. కొన్నిచోట్ల ఎంతో ఇచ్చి కొంత పుచ్చుకున్నారు; మరికొన్నిచోట్ల కొంత యిచ్చి ఎంతో పుచ్చుకున్నారు.

కొన్ని సహస్రాబ్దాలుగా విదేశాలతో కలిగిన సాన్నిహిత్యంతో యవనశక సంప్రదాయాలు మొదలు నేటి పెక్కు పాశ్చాత్య "ఇజంల" వరకు మన సాహిత్యంలో పీటలు వేసుకున్నాయి. ఈ విధంగా కళా సాహిత్య రంగాలలో ఆదాన ప్రదానాలు, వినిమయ వినియోగాలు అనాదిగా సాగివస్తున్న సంప్ర దాయం.

కాని, స్వాతంత్ర్యానంతరం ఈ సంప్రదాయానికి విరుద్ధంగా పర భాషా సాహిత్యాలపై పగ సెగలువారుతుండడం విచారకరం. గుజరాత్ విశ్వ విద్యా లయం ఇంగ్లీషునకు ఉద్వాసన చెప్పాలని ఇటీవల నిర్ణయించింది. మద్రాసు విశ్వ విద్యాలయంలో ఇంగ్లీషును తొలగించి, తత్స్థానే తమిళును నెలకొల్ప డానికి ఒత్తిడి చేయాలని తమిళ్ వళర్చి సంఘం తీర్మానించింది. మదురలో ఒక కళాశాలలో తమిళ్‌లోనే అన్ని విషయాల అధ్యయనాధ్యాపనాలు ప్రారంభ మయాయి. ఉత్తరభారతంలోను మరొకచోట ఇట్లే ఆంగ్లాన్ని హిందీ తోసి రాజన్నది. ఇదంతా 1960 తర్వాతకూడా ఇంగ్లీషుకు అధికారభాషా గౌరవాన్ని ఇచ్చిన భారత ప్రభుత్వం దూరాలోచనను గుర్తించలేనితనం.

విజ్ఞాన శాస్త్రం వేయిరేకులుగా విడుగుతున్న నేడు ప్రపంచంలో ఏ మారుమూలమానిసులూ ఇంగ్లీషును కాదనరు. "ఇది విజ్ఞానశాస్త్రభాషా" అన్నంతగా ఇంగ్లీషు అభివృద్ధిపొందింది. అంతర్జాతీయ సభలలో మొదటి భాషగా ఇంగ్లీషును సోవియట్ యూనియన్ కూడా గుర్తించింది. ఇంగ్లీషును వలదనేవారు అనువాదాలతో సంపాదించుకొనే జ్ఞానం "సెకెండ్ హాండ్ జ్ఞానం" వంటిదని రాజాజీ చేసిన హెచ్చరికను మరువరాదు. భాషాతాత్పర్యమం ప్రారంభంలోనే గాంధీజీ "ఆధునిక జ్ఞానోపార్జనకు, నవీన సాహిత్యాధ్యయనానికి, ప్రపంచ విజ్ఞానావబోధకు ఇంగ్లీషుభాషా పరిచయం అవసరం. నేటి పరిస్థితినిబట్టి మనకు ఇష్టమున్నా, లేకపోయినా, ఇంగ్లీషు నేర్వకతప్పదు. ఇంగ్లీషు అంతర్జాతీయ భాష." అని చెప్పిన హితవును మన్నించడం అభ్యుదయకాములకు తగవు.

నేడు చదువరులంటే పలుభాషల వెరవెరిగి, విజ్ఞానం విస్తరింప జేసుకొన్నవారే. అలాంటప్పుడు కొన్ని భావాలపై మనకు వెగటుదనం ఉండవచ్చునేమో కాని భాషలపైకాదు; దోషాలపైనేకాని, మనిషిపై ద్వేషం లేనట్టు.

ముఖ్యంగా మనలక్ష్యం నవసమాజ నిర్మాణం; వసుధైక కుటుంబస్థాపన. రాజకీయంగా ఇది ఎప్పుడు సాధ్యమైనా, కళాసాహిత్య రంగాలలో దీనిని సాధించడం సులభం.

కళాసాహిత్యాలు దేశకాలదోషం పట్టని కమనీయ పదార్థాలు. ప్రపంచంలో అవి ఏమూల ఆవిర్భవించినా మనకు ఉష ఉదయమే.

# ఒకనాటి ఉగాదిపండుగే మహాశివరాత్రి

మాఘ బహుళ చతుర్దశి రాత్రిని శివరాత్రి అని పూర్వులు నిర్దేశించారు. ఇది భారతదేశమంతటా శివభక్తులు ఆదరించే గొప్ప పర్వం. శ్రీశైలంలో పూర్వం శివరాత్రినాడు జరిగే ఉత్సవాలను పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో విపులంగా వర్ణించాడు.

శివ స్కంద వాసుదేవ విగ్రహాల పూజ మనదేశంలో మూడు వేల సంవత్సరాలనుంచే వుంది. బుద్ధునికంటే మూడు వందల సంవత్సరాలకు ముందున్న పాణిని "జీవితార్థే చాపణ్యే" (5-3-96) అనే సూత్రానికి పతంజలి భాష్యం వ్రాస్తూ, "దేవలకానాం జీవికార్థాసు దేవప్రతికృతిష్విదం వాసుదేవః, స్కందః, శివః" అన్నదాన్నిబట్టి దేవకులు ఆ కాలంలో స్కంద శివ వాసుదేవాది విగ్రహాలను సిద్ధపరుస్తున్నట్టు స్పష్టం. లింగ పూజ ఐదారు వేల సంవత్సరాలనుంచే పెక్కు దేశాలలో ఆచారంగా వున్నట్టు ఈజిప్టు, బాబిలోనియా, అస్సీరియా, రోము, గ్రీసు దేశాల ప్రాచీన చరిత్రలూ తెలుపుతున్నాయి. మన దేశంలో హరప్పాలో వెలువడిన శిథిలాలవల్ల లింగ పూజ అతి ప్రాచీనమని రూఢి అయింది. లింగపూజ యజ్ఞాలలోని యూప స్తంభ స్తోత్రాలనుండి ఉత్పన్నమైనదని, ఆయూపస్తంభమే క్రమంగా శివలింగంగా వ్యవహరింపబడిందని పలువురు వాదించినా, శివుని దారుకావన విహారగాథను బట్టి ఇది పురుష చిహ్నం కాదనరానిదిగా తోస్తున్నది.

శివరాత్రి మాహాత్మ్యమును గురించి స్కందపురాణంలోను, లింగ పురాణంలోను, భవిష్యత్పురాణంలోను పెక్కు కథలున్నాయి. కాలోత్తరమనే శైవాగమ గ్రంథంలో రాత్రి నాలుగు యామాలలోను జరుపవలసిన పూజా విధులు వివరించబడి ఉన్నాయి. పురాణాలలో శివరాత్రి మాహాత్మ్యం తెలిపే కథను సంగ్రహంగా తెలుపుతాను :

ఒకప్పుడు, ఒక పర్వత ప్రాంతంలో హింసాప్రవృత్తిగల వ్యాధుడు ఒకడు ఉండేవాడు. ఉదయం వేటకు వెళ్ళి ఏ మృగాన్నైనా చంపి సాయంకాలానికి ఇంటికి తిరిగిరావడం వాని వృత్తి. ఒకనాడు యథారీతిగా అడవికి వెళ్ళాడు. ఒక మృగమైనా కంటబడలేదు. చీకటి పడుతూంది. వట్టిచేతులతో

తిరిగిపోవడానికి మనసు ఒప్పలేదు. కానీ ఏమిటి చేయడం? ఇంటికి తిరిగి వస్తున్నాడు. దారిలో ఒకచెరువు కనిపించింది. "మంచినీళ్ళు త్రాగడానికి ఏ జంతువైనా రాదా? అప్పుడు దానిని చంపి తీసుకుపోలేమా?" - అని చెరువుగట్టు మీది చెట్టెక్కి పొంచి కూచున్నాడు వ్యాధుడు. కంటికి అడ్డంగావున్న ఆకులు, కొమ్మలు విరిచి కిందపడవేయ సాగినాడు. చలికి "శివ శివ" అని వణుకుతూ, విల్లెక్కుపెట్టి కూచున్నాడు. మొదటిజాములో, ఒక పెంటిలేడి నీరు తాగడానికి వచ్చింది. వ్యాధుడు మహా సంతోషంతో దానిపై బాణం వదలబోయాడు. ఆ లేడి భయపడకుండా "వ్యాధుడా, నన్ను చంపకు. నేను గర్భిణిని. మరొక పెంటిజింక ఇక్కడికి వస్తుంది. అది బాగా బలిసింది. దానిని చంపు. లేకపోతే నా బిడారానికివెళ్ళి కని, నిసుగును భర్తకు అప్పగించి తిరిగివస్తాను" అని శపథం చేసి ఒప్పించి వెళ్ళిపోయింది. రెండవజాము గడిచింది. మరొకజింక వచ్చింది. దానిని బోయ చంపబోయాడు. అది "నేను విరహంతో కృశించి పోయి ఉన్నాను. నన్ను చంపినా నీకు ప్రయోజనం లేదు. ఇదిగో త్వరలో ఇక్కడికి బాగాబలిసిన ఒక పోతుజింక వస్తుంది. దానిని చంపు. అది రాక పోతే నేనే తిరిగివస్తాను" అని వెళ్ళిపోయింది. మూడవజామూ వచ్చింది. వ్యాధుడు ఆకలితో జింకకోసం కాసుకూర్చున్నాడు. ఇంతలో బాగా బలిసిన పోతుజింక రానేవచ్చింది. వ్యాధుడు వెంటనే వారిలాగి బాణం వదలబోయాడు. దుప్పి భయంతో తన రెండు పెంటి జింకలనూ వాడే చంపివుంటాడని అనుమా నించి "మహాబలుడా, రెండు పెంటిజింకలు ఇక్కడికి వచ్చాయా? వాటిని చంపావా?" అని అడిగింది. "రెండూ వచ్చి వెళ్ళి నిన్ను నాకు ఆహారంగా పంపాయని అనుకుంటున్నాను" అని వ్యాధుడు అన్నాడు. "నేను ఉదయం నీ ఇంటికే వస్తాను. నా భార్య ఋతుమతి. ఆమెతో గడిపి బంధుమిత్రుల ఆజ్ఞ పొంది మరలివస్తాను" అని వెళ్ళిపోయింది. సూర్యోదయం కావచ్చింది. వ్యాధుడు జింకలకోసం ఎదురుచూస్తూ ఉన్నాడు. ఒక హరిణి శిశుసమేతంగా అక్కడికి వచ్చింది. అది శిశువును అప్పగించివస్తానని వెళ్ళింది. తర్వాత నాలుగు జింకలూ వచ్చి "నన్ను మొదట చంపూ, నన్ను మొదట" అని అతని ఎదుట మోకరిల్లాయి. వ్యాధునికి వాటి సత్య నిష్ఠ ఆశ్చర్యం కలిగించింది. తన హింసా ప్రవృత్తిపై జుగుప్స కలిగింది. ధనుర్బాణాలు పారవేసి మృగాలకు ప్రదక్షిణం చేసి నమస్కరించాడు. ఆకాశంలో దేవదుందుభులు మ్రోగాయి. పుష్పవృష్టి కురిసింది. దేవదూతలు విమానం తెచ్చి అతనిని సశరీరంగా స్వర్గానికి పిలుచుకొని వెళ్ళారు. అతడు ఎక్కినది బిల్వవృక్షం. చెట్టుకింది గుబురులో స్వయంభులింగం ఉంది. యామయామానికి తనకి తెలియకనే బిల్వదళాలు

తుంచివేసి పూజచేశాడు. కనుక నక్షత్రపదం లభించింది. ఆ మృగకుటుంబమే ఆకాశంలో కనిపించే మృగశిరానక్షత్రం. దాని వెనుక ఉండేది. లుబ్ధక నక్షత్రం.

స్కాందపురాణగాథ లింగపురాణగాథకన్నా కొంచెం భిన్నం సూర్యోదయంవరకు వేచిఉన్న వ్యాధుడు రిక్తహస్తాలతో ఇంటికి తిరిగి రాగానే ఆకలితో అటమటిస్తున్న అతని ఆలుబిడ్డలు గుండెపగిలి మరణిస్తారు. వారికందరికి శివసాయుజ్యం లభిస్తుంది.

మహాభారతంలో శాంతిపర్వంలో చిత్రభాను దనే రాజు శివరాత్రి వ్రతం జరిపినట్టు, అతడు పూర్వజన్మలో సుస్వరుడనే వ్యాధుడైనట్టు ఒక గాథ ఉంది. తర్వాతి కథ లింగ స్కందపురాణాలలోని వ్యాధగాథను పోలినదే.

మృగశిరా నక్షత్రానికి, శివరాత్రికి సంబంధం ఏమిటి? లింగోద్భవ కాలం ఈనాడే ఎందుకు? మృగవ్యాధ కథలను దారుకావన విహారగాథను సమన్వయ పరచిచూస్తే శివరాత్రి వసంత ఋతు ప్రారంభోత్సవంగా కనిపిస్తుంది. ఈ విషయంలో పండుగల పౌర్వాపర్యాన్ని మనం కొంచెం పరిశీలిద్దాం. మాఘ శుద్ధపంచమి వసంత పంచమి. ఫాల్గుణ పూర్ణిమ హోలీ పండుగ. హోలీపండుగ బండుబూతుల పండుగ. (ఇలాటివి ప్రతిదేశంలోను ఉన్నవే.) ఒకప్పుడు వసంత విషువత్తు మృగశిరా నక్షత్రంలో వచ్చేదని పరిశోధకుల నిర్ణయం. కనుక శివరాత్రి కూడ ఒకప్పుడు వసంతోత్సవ విశృంఖలతను చూపే పండుగ అయివుండి, క్రమంగా శివలింగ పూజగా పరిణమించి పవిత్రమై పోయినదేమో!

శివరాత్రి వసంత విషువ దాగమన కాలమనడానికి ఐతరేయ సంహితలోని ఒక గాథను పేర్కొంటున్నారు. (దీనిని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి "ప్రాచీన ఖగోళం" నుండి గ్రహించాను.) కొన్ని ఋక్కుల కాలంలో పునర్వసు మృగశీర్షలు, తైత్తిరీయ సంహితా బ్రాహ్మణ కాలంలో కృత్తికా రోహిణులు, వేదాంగ జ్యోతిష కాలంలో ధనిష్ఠ, భారతకాలంలో శ్రవణం ప్రథమ నక్షత్రాలు—అంటే, వసంత విషువత్కాలం ఆరంభమయ్యే నక్షత్రాలు. ఐతరేయ బ్రాహ్మణంలోని గాథ ఇది :-

ఒకప్పుడు ప్రజాపతికి తన కూతురుమీద తలంపు కలిగింది. అతడు లేడి అయ్యాడు. అతని కూతురు ఆడలేడి అయింది. అతడు పాడుపని చేస్తున్నాడని దేవతలు ఒకభూతాన్ని సృష్టించి ప్రజాపతిని శిక్షించాలని కోరారు. ఆ భూతపతి ప్రజాపతి ఆకృతాన్ని బాణంతో కొట్టాడు. ఆకృతం బాణంతోపాటు పైకి ఎగసింది. దానినే మృగం అంటారు. దానిని వేసినవాడు మృగవ్యాధుడు. కూతురు రోహిణి. (ఐతరేయ-2, పంచిక-3, మంత్రం-33.)

ప్రజాపతి అన్నా, యజ్ఞమన్నా, సంవత్సరమన్నా ఒక్కటేనని ఈ బ్రాహ్మణం మాటిమాటికీ చెబుతుంది. ఏడాదిపొడుగునా సత్రం జరుగుతుంది కాబట్టి సంవత్సరమన్నా, యజ్ఞమన్నా ఒక్కటే. యజ్ఞం చేయకపోతే ప్రజాసృష్టి కాదు గనుక ప్రజాపతి అంటే యజ్ఞం. ప్రజాపతి కూతురు రోహిణి. ఈ రోహిణీ నక్షత్రంలో అప్పుడు నూతన సంవత్సరారంభం. ఆ కాలంలో వసంత విషువత్తు నుండి ఉగాది. వేదకాలంలో మరొక నక్షత్రంలో ఉగాది. బ్రాహ్మణాలకాలంలోని ఋషులకు ఇప్పుడు రోహిణిలో విషువత్తు రావడం వ్యభిచారంగా కనిపించింది. కనుక వారికి "అకృతంగా" — లోగడ జరగనిదిగా — కనిపించింది. మృగశిరనుంచి రోహిణిని విషువత్తుగా లెక్కగట్టడం అకృతం అనిపించింది. ఈ కథనుబట్టి కూడా శివరాత్రి వసంత విషువదాగమదిన మనడానికి విప్రవత్తి లేదు.

ఈవాదానికి బలంగా మరొకవాదం వుంది. మాఘామావాస్యను స్మృతికారులు యుగాదిగా పేర్కొన్నారు. విష్ణుపురాణం

"మాఘాసితే పంచదశీ కదాచిత్
ఉపైతి యోగం యది వారణేన,
ఋక్షేణ కాలః స వరః పితౄణాం
నహ్యల్పపుణ్యైః వృప లభ్యతే హి."

అని — మహా పుణ్యప్రదమైన యుగకాలమని — పేర్కొంటున్నది.

ఏతావతా శివరాత్రికి ముందు వెనుకలుగా వసంత ఋతు సూచకాలైన వసంత పంచమి, మాఘపూర్ణిమ, ఫాల్గుణపూర్ణిమ మొదలయిన పండుగలు వుండడాన్నిబట్టి, శివరాత్రి వసంత ఋతుప్రారంభోత్సవమేనని నావిశ్వాసం. బ్రాహ్మణాలలోని గాథలు తర్వాత తర్వాత ఆకరాలు తెలియని పురాణ కథలయినట్టే ఐతరేయ బ్రాహ్మణంలోని వసంత విషువన్నిర్ణయ గాథ శైవ పురాణంలోని మృగవ్యాధ గాథగా మారిందని, తర్వాత తర్వాత లింగోద్భవ వృత్తాంతం చేరివుంటుందని నమ్ముతున్నాను.

# గోటి నొక్కుల సంపత్కుమార్

"ముఖేముఖే సరస్వతీ" అంటారు పెద్దలు. కొందరు కవిపండితుల ప్రతిభావిశేషం చూచి. కాని, కొందరు గోటితో వాద్యాలు వాయించడం, చిత్రాలు గీయడం చూస్తూవుంటే కళగూడ సరస్వతీదేవి చిత్కళలలో ఒక్కటి గనుక "నఖేనఖే సరస్వతీ" అని కూడా అనవలసి వుంటుంది.

దంత నఖ వాద్యాలు, క్రియలు సదాచారోల్లంఘనమని స్మృతికారులు నిషేధించినా, మానవ చిత్తవృత్తి, కళాప్రవృత్తి వూరుకోలేదు. గోటితో చేసే దానికి గొడ్డలిని ఎందుకు వాడుతాడు చెప్పండి!"

ప్రియులు ప్రియతముల లేలేత చెక్కులపైన, పొంగే రొమ్ములపైన, మన్మథుని సొగటాలాట కట్టలాంటి వీపుపైన నఖప్రవాళాలతో మకరికా పత్రాలు రచించేవారని ప్రాచీన ప్రబంధాలతో వర్ణించడం అలా వుండగా, గోటిచిత్రాలు, గోటి నొక్కులతో గీచిన చిత్రాలు బుద్ధునికాలానికే ఉన్నట్టు జాతక కథలలో కనిపిస్తుంది. బుద్ధుని అనుంగు శిష్యుడు ఆనందుడు, తదితరులు, భక్తులను తనియింపజేయడానికి తామర రేకులపైన, మెత్తని ఆకులపైన గోళ్ళతో గౌతముని పాదకమలాలు, త్రిరత్నాలు చిత్రించి ఇవ్వడం పిటక ప్రవచనాలలో కనిపిస్తుందని పరిశోధకులు అంటారు.

ఇక మదనక్లిష్ట అయి, వడగాలికి మాడిన మాలతీలతవలె పసివాళ్ళాడిన శకుంతల "అస్మిన్ శుకోదర సుకుమారే నళినీపత్రే నఖైః నిక్షిప్త వర్ణం కురు" అని చెలుల ఆదేశంపై దుష్యంత నరపాలునికి నఖాలతో తామరాకుపై ప్రేమ లేఖ వ్రాయడం రసోపాసకులందరికీ తెలుసు.

దశకుమార చరిత్రలో ఒక రాజకుమార్తె చెలికత్తె ఆమె స్వప్నంలో కన్న రాజకుమారుని చిత్రాన్ని ఒక పత్రంపై గోటితో, పారాణితో చిత్రించడం ఆంధ్ర వాఙ్మయ ప్రేమికులందరికీ పరిచితమే.

ఒకప్పుడు మనదేశంలో వెలిసిన ఈ నఖచిత్ర లేఖనకళ కాలవశాత్ కనుమరుగైపోయింది. పాశ్చాత్య దేశాలలో నేటికీ పరిణతవ్యవస్థలో ఉంది అయితే ఇటీవల మనదేశంలోనూ మరల తలయెత్తి పరిణతికి వచ్చింది. ఈ నఖచిత్రకళలో పేరెన్నికగన్నవారు శ్రీ కౌతా రామమోహనశాస్త్రి, శ్రీ చిలకమ్మ

సంపత్కుమార్ మొదలయినవారు. శ్రీ రామమోహనశాస్త్రి గీసిన గాంధి, లెనిన్ నఖచిత్రాలు విశ్వవిఖ్యాతి పొందాయి. అట్టి ఖ్యాతినే శ్రీ సంపత్కుమార్ పొందారు, పొందుతున్నారు, ఇంకా పొందుతారు.

శ్రీ సంపత్కుమార్ రాజమండ్రిలో విద్వత్కుటుంబంలో జన్మించారు (23-2-23). తండ్రి శ్రీ బావనాచార్యులు నూజివీడు ఉన్నత పాఠశాలలో శిష్యప్రీతి పొందిన ఉపాధ్యాయులు. ఈయన తల్లి ఉయ్యూరు సంస్థాన గాయనీ మణి. కళారాధకులయిన తలిదండ్రులకు అలాటి పుత్రుడు జన్మించడంలో ఆశ్చర్య మేముంది?

శ్రీ సంపత్కుమార్ తెల్లటి కార్డు పేపరుపై గోటితో పెన్సిల్‌తో వేసేంత తేలికగా చిత్రాలు గీయడం చూచినప్పుడు చూపరులకు ఆశ్చర్యం కలుగుతుంది. ఈయన ఈ చిత్రకళను అభ్యసించిన తీరు మరింత ఆశ్చర్యకరం.

ఈయన 1941 లో గుడివాడవద్ద వానపాములలో పాఠశాలలో ఉపాధ్యాయుడుగా ఉన్నప్పుడు విద్యార్థి ఒకడు సిగరెట్టు పెట్టెలోని తెల్లకార్డుపై గోటితో లతలు వేయడం చూచారు. అప్పటినుంచి ఆకళపై ఆసక్తి కలిగింది. ఆనాటినుంచి నిర్విరామకృషి చేసి ఘనవిజయం సంపాదించారు. తామరతం పరగా అభివృద్ధి చేశారు. గవర్నర్లు, మంత్రులు మొదలయినవారి మన్ననలు పొందారు.

నఖరేఖా చిత్రకళలో తనంతటివారు లేడనిపించుకున్నారు ఈయన. ఎవరిరూపమైనా రెండు నిమిషాలలో గీసి చూపగలరు. ఐదు నిమిషాలలో తమ రూపు కాయితంమీద ముద్రకొట్టినట్టు రావడంచూచి గవర్నర్ డాక్టర్ బూర్గుల రామకృష్ణరావు అబ్బురపడ్డారు. ఆయన నఖకౌశలం చూస్తున్నవారు ముగ్ధులవుతారని మద్రాసు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్ అన్నారు. మాజీ సర్వసేనాపతి జనరల్ కరియప్ప ఆయన నఖవ్యాపారసరళి చూచి విస్తుపోయారు.

ఈయన నఖరేఖలు ఒకటి రెండు చిత్రాలు అడపాదడపా గీచడంతోనే సంతృప్తి పడలేదు, గాంధి జీవితాన్ని, అజంతా చిత్రాలను, వివిధాధునిక చిత్ర పరంపరను సృష్టించాయి. ఉత్తరహిందూస్తాన్‌లోని నాగపూర్, ఇండోర్, జైపూర్, జబ్బల్‌పూర్, గ్వాలియర్, ఉజ్జయినీ మొదలయిన నగరాలలో పెక్కుచోట్లను, ఆంధ్ర రాజధాని హైదరాబాద్‌లోను పలుచోట్లను, పలుమారు ప్రదర్శితాలై ప్రశంసితాలయాయి.

నఖచిత్రాలనేగాక, ఈయన ఛాయాచిత్రాలను (సిల్ హౌటీలను) నల్లటి కార్డునుంచి కత్తిరించి తీయగలరు. ఇదీని రెండున్నర నిమిషాలలో. ఈ కత్తిరింపును స్వయంగా ఇటీవల మద్రాసు గవర్నర్ శ్రీ విష్ణురాం మెయిధీ చూచి ఆశ్చర్యచకితులయారు.

శ్రీ రాజమన్నారు తాత్కాలికంగా మద్రాసు గవర్నర్‌గా వున్నప్పుడు ఈయన కళాచాతురికి సువర్ణ పతకం బహూకరించారు. మద్రాసులోని బ్రిటిష్ డిప్యూటీ హైకమిషన్ కార్యాలయంలో ఈయన అందరి సమక్షంలో ఎలిజెబెత్ రాణి చిత్రం తీర్చారు. చూచినవారంతా సంభ్రమాశ్చర్య భరితులయ్యారు. మైసూరు మొదలయినచోట్ల ప్రదర్శనాలలో వీరి చిత్రాలు అనేకం బహుమానాలు పొందాయి.

ఈయన కేవలం గోటితో చిత్రాలు మీటడమే కాదు. ఫిడేలుమీటి రాళ్లరగించే రాగాలాపనగూడ చేయగలరు.

నఖరేఖా చిత్రణంలో ఈయనొక గ్రంథం రచించారు. ఈ అపూర్వ కళను విద్యార్థులకు ఏడెనిమిది పాఠశాలలో నేర్పగలనని అంటారు. ఈయనకు ఈ విషయంలో ఎంతో కుతూహలంగా వుంది. విద్యాధికారులు దీనికి తగిన ప్రోత్సాహం కూడా యిచ్చారు. హైదరాబాద్, మద్రాసు నగరాలలో ఈయన పలువురు విద్యార్థులకు ఈ కళను బోధించారు కూడా. మద్రాసు, పార్క్ ఫేర్‌లో ఈయన ప్రదర్శనకు శాశ్వతమైన ఏర్పాట్లు చేశారు.

ఇలాటి అపూర్వకళను ఆసక్తితో అభ్యసించి ఈ కళలో పరాకాష్ఠ నందుకొని, ప్రవచిస్తున్న శ్రీ సంపత్కుమార్ చాతుర్యానుభవాలను ఆంధ్రావళి వినియోగించుకోడం అవసరం.

# కీర్తీషణ

దారేషణ పుత్రేషణ ధనేషణఃను ఈషణాత్రయ మన్నారు మనతత్త్వ వేత్తలు. కీర్తికాంక్షను కూడా ఈ ఈషణాల్లో చేర్చి ఈషణచతుష్టయమంటే బాగుండేది.

ఈ కీర్తి కాంక్ష ఇటీవల సాహిత్యరంగంలో మరీ దాహంగా, లాలసగా పరిణమించిందనడం అతిశయోక్తి కాదు. కీర్తీషణ రచయితలను ఈషణ త్రయంకన్నా బలంగా పెడదారికి లాగుతున్నదన్నా తప్పు కాదు. సాహిత్యాన్ని తనజీవికాహర్మ్యానికి మూలబంధంగా ఉపయోగించుకొందామన్న తలపు పొటమరించినప్పుడే ఈ కీర్తిదాహం దహించివేయసాగుతుంది.

ఏదో రణగొణ ధ్వనుల రచనలు చేయడం, పది మంది పండితుల శుశ్రూషచేసి పరిచయ వాక్యాలు వ్రాయించుకొనడం, పదవిలో ఉన్న ఏ పెద్ద మనిషినో మొగమోటపెట్టించి సభ ఏర్పాటుచేయడం, తమ రచనలను మరొక ఉన్నతాధికారితో ఆవిష్కరింప జేయడం, నలుగురితోను నలభై విధాలుగా పొగడికలు పొందడం, పత్రికల వారిని ప్రాధేయపడి వారి పత్రికలలో ఆవిష్కరణ సభావిశేషాలు ముచ్చటైన శీర్షికలతో ముద్రింపజేసుకొనడం—నేడు మితిమీరిపోతున్నది.

ప్రజల దృష్టిని ఆకర్షించడానికి దేనికైనా ప్రచారం అవసరమన్న మాట నిజమే; సరకు నాణెం ఎలాటిదైనా ప్రచారం ముఖ్యమన్నది సామాన్య వాణిజ్యసూత్ర మన్నమాటా వాస్తవమే. కానీ, 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నారు కాదా అభియుక్తులు.

పూర్వం కవులు, పండితులు ఏ రాజునో, తత్సామంతునినో ఆశ్రయించి ప్రచారం చేసుకోలేదా తమ కృతులకు? చేసుకున్నారు; వారూ ఆదరించారు. అయితే, తమ రచన ఉత్తమ శ్లోకుని ఆదరం పొందాలని రచయితలూ ఆశించేవారు; అలాటి రచనలను స్వీకరించి ధన్యుల మయ్యామని ఆశ్రయదాతలూ సంతసించే వారు. అప్పటికీ, ఇప్పటికీ ఇదే భేదం. సహృదయుడైన అధిపుడో, ధనాధిపుడో రచయితను కోరి ప్రార్థించి కృతికన్యను స్వీకరించేవాడు అప్పుడు. రచయితే తన రచనల సారాసారాలు గుర్తెరుగక వాటిని భుజానో నెత్తినో వేసు

కుని అధికారుల అనుగ్రహం కోసం, అభిప్రాయాలకోసం అంగలార్పడం ఇప్పుడు. అందువల్లనే సాహిత్యవేత్తలన్నా, సాహిత్య సభలన్నా ప్రచార ప్రహణనాలని ఈసడించే స్థితి ఏర్పడింది. బెర్నార్డ్‌షాకే కాబోలు—ఒకసారి ఒకరి రచనలను విని అభిప్రాయం ప్రకటించే అవసరం వచ్చిందట. కొంత సేపు విన్న తర్వాత షా తన గది కిటికీ తెరచాడట. "పక్క వారింటికి కూడా నా రచనా సౌరభం పాకాలనేనా మీరు కిటికీ తెరిచింది?" అని ఆ రచయిత ప్రశ్నించాడట. "అబ్బే! నిద్రపోయే ముందు నేను కిటికీ తెలుస్తాను" అని షా సమాధాన మిచ్చాడట.

రచనలో సత్తా ఉంటే, రచన ఎన్నటికైనా ప్రజల హృదయాలలో నివసించకపోదు. ఎందరి పద్యాలు, గేయాలు, వాక్యాలు మనలో అబాల గోపాలం అనుదిన వ్యవహృతాలు కావడంలేదు? అదే రచయిత కీర్తి. ఎమిలీజోలా రచనలు ప్రచురించిన వెంటనే ప్రభుత్వ గూఢచారులు తేనెటీగల్లా ముసిరేవారట వాటిపైన. అదీ రచయిత శక్తి.

వీలైనంత త్వరలో, చిట్కాలో చిరయశస్సును ఆర్జించుదామనే అపోహలు తొలగించుకొనడం ప్రతి రచయితకూ అవసరం. జీవితపు నిమ్నోన్నతాలు చూచి, నిరతిశయానందానుభూతి పొందిన రచయిత రచనలు ఎప్పుడూ మన్నన పొందుతాయి ప్రచారం, పరిచారం లేకనే. రచయితలతు—గుండె చేవగల రచయితలకు అవసరమైంది గుండెనిబ్బరం. ఈ నిబ్బరమే భవభూతితో

"ఉత్పత్స్యతే మమ తు కోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధిః విపులా చ పృథ్వీ."

అన్న అమరవాక్యాలు పలికించింది.

# ఏడుగురు అమెరికన్ కళాకారులు

విద్వేషం పెచ్చు పెరిగి రెండు స్కంధావారాలుగా విడిపోతున్న నేటి విశ్వమానవాళిలో తొల్లింటి స్నేహ సద్భావాలు సమకూర్చే పరమ సాధనాలు లలితకళలు. ద్రష్టృశ్రోతృ హృదయాలను ఆకట్టివేసి వారిని ఏ లోకాలకో తీసుకొనిపోయే విశ్వజనత, అతిలోకత లలితకళలలో వెల్లివిరియడం, ఆత్మ గుణ వ్యాప్తికి అవి పరమోపకరణం కాగలవన్న రహస్యం గుర్తించిన మన కళాకారులు, శాంతిదూతలయి నేలనాలుగు చెరగులా శాంతి సందేశంతోపాటు మన అమరకళల ముద్ర వేశారు.

అట్లని మనవారు ఇతరసంప్రదాయాలను సొంతం చేసుకోకపోలేదు. ఆదాన ప్రదానాలు పెరిగిన సహృదయులు మనవారు. ప్రాగైతిహాసిక కాలం నుంచి ఇతర దేశాల సంప్రదాయాలను గ్రహించి, మన పద్ధతులతో మేళవించి, నూతన రీతులకు దారితీసినారు. గాంధార శిల్పంలో భారతీయాధ్యాత్మిక భావనను పాశ్చాత్య సంస్కృతికి మూలకందమైన ప్రాచీన యవనకళలో కలిపి పోత పోశారు: యవ సుమిత్రా కాంభోజ దేశాలలో మంగోల్ ఖ్మేర్ స్వరూప స్వభావాలు అలవరచినారు. కొన్నిచోట్ల ఎంతో ఇచ్చి కొంత పుచ్చుకున్నారు: మరికొన్నిచోట్ల కొంత ఇచ్చి ఎంతో పుచ్చుకున్నారు.

వేయేండ్లుగా విదేశాలతో కలిగిన సాన్నిహిత్యంతో మొఘల్ సంప్రదాయం మొదలు నేటి పెక్కు పాశ్చాత్య 'ఇజాల'వరకు మన లలిత కళలలో పీటలు వేసుకున్నాయి. ఈవిధంగా కళాసాహిత్య రంగాలలో ఆదాన ప్రదానాలు వినిమయ వినియోగాలు అనాదిగా సాగివస్తున్న సంప్రదాయం.

అయినప్పుడు చెన్నపురిలో ప్రదర్శితమైన అమెరికా చిత్రకారుల నీటిరంగు చిత్రాలు కూడా సహృదయతే పరమావధిగా గల మన కళాకారులను ముగ్ధులను చేయకపోవు.

ఈ ప్రదర్శనంలో చార్లెస్ బర్చ్‌ఫీల్డ్, చార్లెస్ డిమత్, విన్‌స్లో హోమర్, ఎడ్వర్డ్‌హాపర్, మ్యారిస్‌ప్రెండర్‌గాస్ట్, జాన్‌మారిన్, యాండ్రూవయాత్-అనే ఏడుగురు చిత్రకారుల 62 నీటిరంగు చిత్రాలు ప్రదర్శించబడ్డాయి. ఈ ప్రదర్శ

నాన్ని అమెరికా ఫెడరేషన్ ఆఫ్ ఆర్ట్ ప్రోత్సాహంతో ఆల్ ఇండియా ఫైన్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ సొసైటీవారు ఏర్పాటుచేశారు. ఈ ప్రదర్శనం 1954 అక్టోబర్ 11వ తేదీన ఢిల్లీలోను, 1954 నవంబర్ 15వ తేదీన బొంబాయిలోను జరుపబడింది. ఆ వరుసలో చెన్నపురిలో ఏర్పాటు చేయబడింది మూడవది.

అమెరికా అనగానే మన ప్రాచీన పౌరాణికులు వర్ణించిన నాగలోకం, పాతాళలోకం స్ఫురణకు వస్తాయి. అమెరికాలో ముఖ్యంగా మెక్సికోలో భారతీయ భావనా సంప్రదాయాలు ఒకప్పుడు విస్తరించినట్లు, అవి యజ్ఞయాగాదులు యథేచ్ఛంగా ప్రవర్తిల్లేటంతవరకు వేళ్ళు తన్నుకున్నట్టు, ఆ అవశేషాలే నేటి శ్వేతేతర ఆదిమజాతులైనట్లు చరిత్రకారుల మతం. కాని నేటి అమెరికా సంస్కృతి వివిధ యూరోపియన్ జాతి సమాహారసంప్రదాయానికి ఆదిమవాసుల విశిష్ట ప్రభావ సంబంధంతో ఏర్పడిన సత్ఫలిత మనవచ్చు. ఈ పరిశీలనతోనే కాక ఎక్కడ, ఏమాత్రం మంచి కనిపించినా ముక్తకంఠంతో పొగడి, సహృదయంతో ఆదరించే మనం ఈ అమెరికా చిత్రావళి సొబగును, చిత్రకారుల చరిత్రను తెలుసుకొనడం అవసరం.

నీటి రంగులలో ఆలేఖ్య రచన ఈనాటిది కాదు. మొహెంజోదారో మృణ్మయ కలశాలమీద, ఈజిప్టురాజుల సమాధులలోని రెల్లు కాగితపుచుట్టల మీద, చైనా, జపానుల చీనాంబరాలమీద, పారసీక హస్త లిఖిత పుస్తకాలలోను నీటి రంగుల చిత్రాలు ఉండడమే ఈ రంగుల ప్రాచీనతకు తార్కాణ. నీటి రంగులలో తైలవర్ణంలోని గురుభావం లేకపోయినా, దానిలో లేని పెక్కు విశేషాలున్నాయి. శ్వేతభూమికపై నీటిరంగుల సామాన్య లేపనంతోనే అందాలు చిందించవచ్చు.

పాశ్చాత్య దేశాలలో మధ్యయుగాలలో శుద్ధమైన నీటి రంగులకు అంత ప్రాధాన్యం కనిపించదు. గడచిన శతాబ్దంనుంచి వీటికి ప్రాధాన్యం వచ్చింది. నీటి రంగుల చిత్రాలు రేఖాచిత్రాల పరిణామమే. యూరోప్‌లో పాత కళాకారులు తమ రేఖాచిత్రాలను ఒకేరంగుతో నింపేవారు తర్వాత ఇతర రంగుల వాడకం వచ్చింది. తర్వాత 18వ శతాబ్దంలోను, 19వ శతాబ్దం ప్రారంభంలోను ముద్రణ పద్ధతి వికసించడంతో నీటిరంగుల ప్రాధాన్యం హెచ్చింది. రాలెండ్‌సన్, బ్లేక్, టర్నర్, బామీర్ వంటివారు నీటిరంగులనే తమ చిత్రాలకు ప్రధానోపకరణంగా వాడినారు.

అమెరికాలోను నీటిరంగుల ప్రాముఖ్యం చాల ఇటీవలిది. నీటిరంగు చిత్రాలు తైలచిత్రాలతో పోటీబడలేకపోయాయి. 1860 నుంచి నీటిరంగులను

చిత్రకారులు ఆదరించసాగారు. వీటిలో నిరాఘాటంగా కుంచె సారించినవాడు విన్ స్లో హోమర్. నీటిరంగు చిత్రాలలో అదివరకు కనిపించిన సారళ్యం, స్వేచ్ఛ హోమర్ తెచ్చాడు. తర్వాత పలువురు ఆయనను అనుసరించారు. గడచిన 50 సంవత్సరాలుగా ప్రఖ్యాత అమెరికా చిత్రాలన్నీ నీటిరంగులవే.

అమెరికాలో నీటిరంగు చిత్రాలలో నూతన యుగకర్త అనదగినవాడు విన్ స్లో హోమర్. ఈయన 1836లో బోస్టన్‌లో జన్మించాడు. ఈయన నేర్చుకున్న చిత్రకళంతా స్వయంగా - గురుముఖతః కాకుండా నేర్చుకొన్నదే. 20 సంవత్సరాల ప్రాయం నుంచే చిత్రాలు గీయడం - బాగా గీయడం ప్రారంభించాడు. ఫ్రాన్స్, ఇంగ్లండు దేశాల్లో పర్యటించి "ప్రౌట్స్‌నెక్"లో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. మెయినేలో 1910లో మరణించాడు.

ఈయన చిత్రించింది ప్రత్యేకంగా ప్రకృతిని. ఈయన చిత్రాలలో కొన్నిటిలో ఫ్రెంచి ఇంప్రెషనిజం-అనుభూతివాదం ప్రభావం కన్పిస్తుంది. కాని ఇది అనుకరణ వల్ల వచ్చింది కాదు. స్వయంగానే యథాలాపంగా వచ్చినది. (ఇంప్రెషనిజం అంటే ప్రకృతిలో కలిగే మార్పును చిత్రించడం. ఎక్స్‌ప్రెషనిజం అంటే మానవ స్వభావ పరిణామాన్ని చిత్రించడం-విభావనావాదం) హోమర్ ఎప్పుడూ చిత్రకళా పరిభాషకోసం పాకులాడలేదు. ఈయన చిత్రాలలో వర్ణికా భంగం, రేఖాసౌందర్యం కొట్టవచ్చేట్టుంటాయి. ఈయన స్వాభావికవాది. ప్రకృతి సహజ స్వరూపం ఈయన చిత్రాల వస్తువు. ఈయన తర్వాతివారు క్రమంగా ఈ స్వాభావిక వాదాన్ని చాలవరకు విడనాడినా, అమెరికా నీటిరంగు చిత్రకళ ఈయనకు చాల ఋణపడివుంది.

మారిస్ ప్రెండర్‌గాస్ట్ 1859లో న్యూఫౌండ్‌ల్యాండ్‌లోనో, 1861లో బోస్టన్‌లోనో జన్మించాడు. మొదట పెయింటరుగా పనిచేశాడు. తర్వాత ప్యారిస్‌లో చిత్రకళా పాఠశాలలో చదివాడు. న్యూయార్క్‌లో 1924లో మరణించాడు.

1910 వరకు అమెరికాలో ఇంప్రెషనిజమే (ప్రకృతి స్వభావచిత్రణం) ప్రధానంగా వుండింది. దానితో వెలుతురు, వాతావరణం కాలానుగుణంగా వుండాలన్న సహజవాదం కూడా మిళితమై వుండేది. ఇంప్రెషనిజంపై ఫ్రాన్స్‌లో తిరుగుబాటు వచ్చి కళ ప్రకృతి అనుకరణగాకాక సంగీతంవలె జ్ఞానేంద్రియాలను తనిపేదిగా వుండాలనే వాదం బయలుదేరింది. ఈ వాదాన్ని అమెరికాకు తొలిసారిగా తెచ్చినవాడు మారిస్ ప్రెండర్‌గాస్ట్. ఈయన ఇంప్రెషనిజం కాలంవాడైనా ఈయన కళ తర్వాతికాలందనవచ్చు. పంచేంద్రియా

లను అలరింపజేసే రామణీయకమే ఈయన చిత్రాల విశిష్టత. ఈయనకు చిత్రం అన్నది రంగులతో రూపు తీసుకొని కట్టెదుట కనబడే వస్తువు.

నవ్యరీతులకు మార్గదర్శకుడైన ఈయన చాలాకాలం తన సోదరునితో పాటు ఫ్రేములు చేస్తూ పొట్టగడుపుకోవలసి వచ్చింది. ఈ నవ్యరీతులు అమెరికాలో 1913కు వ్యాప్తి చెందిన నాటికిగాని, ఈయనను గుర్తించినట్టులేదు.

జాన్ మారిస్ న్యూజెర్సీలో 1870 లో జన్మించాడు. ఈయన వాస్తు శాస్త్రం నేర్చుకొని ఫిలడెల్ఫియాలోను, న్యూయార్కులోను చిత్రలేఖనం నేర్చుకున్నాడు. చాలాకాలం యూరోప్‌లో గడిపాడు. వేసవిలో మెయిన్‌లో తరచు గడిపేవాడు. అక్కడి ప్రకృతే ఈయన చిత్రాల వస్తువు. 1952లో మరణించాడు.

అధునాతన చిత్రకళోద్యమంలో ప్రెండర్ గాస్ట్ తర్వాత పేర్కొనదగినవాడు జాన్ మారిస్. ఈయన చాలాకాలం యూరోప్‌లో గడిపినా, అమెరికాకు తిరిగి వచ్చిన తర్వాతగాని ఆధునిక చిత్రకళా పరిచయం ఈయనకు కలుగలేదు. ఈయన చిత్రాలలో క్యూబిజం (స్థూలతావాదం), అబ్‌స్ట్రాక్టషనిజం (వివిక్త వాదం) ఛాయలు కనిపించినా, ఈయన రచన పూర్తిగా వైయక్తిక భావప్రకటనమే. ఈయన చిత్రాలలో చాలాభాగం ప్రకృతి రామణీయక చిత్రణం. మెయినే సముద్ర తీరం ఈ చిత్రణకు కారణమై వుంటుంది. ఈయన నీటిరంగు చిత్రాలలోని ప్రకృతిలో జీవం తొణికిసలాడుతుంటుంది. ఈయన చిత్రాల్లో చెట్లు గాలికి తల లాడిస్తాయి. నీళ్ళు ఎండలో నాట్యం చేస్తాయి. వెలుగు మిరుమిట్లు గొలుపుతుంది. ఈయన ప్రధానంగా మానవ స్వభావ చిత్రణవాది: ఇంతేకాక ఈయన స్వాభావికవాదేకాని, శుద్ధ భావైక వాదికాడు. ఈయనలో స్వాభావికతను అంతగా పాటించని ప్రాచ్య కళా ప్రభావం కూడా అక్కడక్కడ కనిపిస్తుంది.

వర్ణికాభంగంలో సమకాలికులలో గొప్పవాడు మారిస్. ఈయన రంగుల భంగులు, రంగుల పొంగులు, రంగుల అంతరంగాలు ఎరిగినదిట్ట.

అధునాతన చిత్రకళలో తర్వాత గణనీయుడు చార్లెస్ డిమథ్. ఈయన పెన్సిల్వేనియాలో 1883లో జన్మించాడు. ఫిలడెల్ఫియాలోని పెన్సిల్వేనియా ఎకాడమీలో చదివాడు. చాలాకాలం పారిస్‌లో వుండి ఆధునిక చిత్రకళా సంప్రదాయాలు తెలుసుకున్నాడు. అమెరికాలో ఈయన ఆల్‌ఫ్రెడ్ స్టీజ్ లిట్జన్ వర్గం వాడు. 1935లో మరణించాడు.

తన కళా వస్తువులుగా అమెరికా వాస్తుశిల్పాలను, పరిశ్రమలను తొలిసారిగా గ్రహించినవాడు డిమథ్. క్యూబిజం (స్థూలతావాదం)తో ప్రభావితు

దైన అమెరికా చిత్రకారులలో ఈయనకూడా ఒకడు. కాని స్థూలతావాదం అనుసరించి రచించిన ఈయన చిత్రాలు పికాసో, లెగర్, బ్రాక్ చిత్రాలకన్నా భిన్నమైనవి. "జాన్ మారిన్, నేను ఫ్రెంచి ఆధునిక చిత్రకళనుంచే ప్రభావితులమైయాం. మారిన్ ఆ వాదాన్ని బకెట్లతో తెస్తూ అంతా ఒలకపోసుకున్నాడు. నేను చమ్చాలతో తెచ్చుకున్నాను. ఒలకపోసుకోలేదు." అని డిమథ్ ఛలోక్తి విసిరేవాడు.

ఈయన చిత్రాలు చిత్రకళా శాస్త్ర సంప్రదాయ దృష్టితో నిర్దుష్టాలు. ఈయన రేఖ కేవలం వస్తువునే తెలుపదు. దాని అంతరంగాన్ని, జీవాన్ని తెలుపుతుంది; ఈయన కుంచె ఆచి తూచి గీస్తుంది; అనవసరమైనదేదీ రానివ్వదు. ఈయన ప్రకృతినే ఆధారంగా చిత్రరచనకు పూనుకున్నా, ప్రకృతిని, కళను వింగడిస్తాడు. ఈయన ప్రాచీన సంప్రయానుయాయి. ఇలాటివాడు అమెరికా కళారంగంలో అరుదు.

1920లో అమెరికాలో ఆధునిక కళోద్యమానికి ప్రతికూలంగా కొన్ని వైఖరులు బయలుదేరాయి. ఆత్మాశ్రయతను, విశుద్ధభావైకవాదాన్ని ఈసడిస్తూ నూతన స్వాభావికవాదం పుట్టుకవచ్చింది. కొందరు దేశీయ వస్తువులనే అతి సహజంగా చిత్రించడం ప్రారంభించారు. వీరిలో ఎడ్వర్డ్ హాపర్ ప్రముఖుడు.

ఈయన న్యూయార్క్ రాష్ట్రంలోని న్యాక్‌లో 1882లో జన్మించాడు. న్యూయార్క్‌లోను యూరోప్‌లోను చిత్రకళాభ్యాసం చేశాడు.

ఈయన తన చిత్రకళకు వస్తువుగా అమెరికాభూమాతను తీసుకున్నారు ఈయన చిత్రాలలో మానవమూర్తులుంటాయి. కాని, అవి ఆ ప్రకృతి దృశ్యాలలో భాగాలు మాత్రమే. ఈయనకు ఇష్టమైంది దృశ్యరమణీయత. ఈయన నగరాలు, పట్టణాలు వేసిన చిత్రాలలో కనిపించేవి కిటకిటలాడే వీధులుగాని, కలకలలాడే ఇళ్ళు కాని, కావు. ఆర్చి దిద్దిన వీధులు, పెద్ద భవనాలు-రాత్రిందివం వివిధ రూపాలతో, ప్రతివాస్తవికవాదిలాగే ఈయన చిత్రాలలో ఎంత పరాశ్రయతవున్నా, ఆత్మాశ్రయతకు తావిచ్చే కవిత కానవస్తుంది. విన్ స్లో హోమర్ ప్రవర్తిల్లజేసిన స్వాభావిక చిత్రరచనా సంప్రదాయాన్ని నేడు కొనసాగిస్తున్నవారిలో హాపర్ అగ్రగణ్యుడు.

హాపర్ అమెరికా తూర్పు భాగాల నగరాలను, గ్రామసీమలను కళతో ఆదరిస్తే, చార్లెస్ బర్చ్‌ఫీల్డ్ చిత్రాలు పశ్చిమభాగంలోని మధ్య ప్రాంతాలకు వ్యాఖ్యలు. హాపర్ తన కవితకు చిత్రాలలో వాస్తవికతకు ప్రాధాన్యమివ్వగా,

బర్చ్‌ఫీల్డ్ కల్పనకు ప్రాధాన్యమిచ్చాడు. హోపర్‌లాగే ఈయనకూడ మానవ నిర్మితమైన అమెరికా దృశ్యాలనుంచే కళాసృష్టి జరిపినా, ఇతడు ఆత్మాశ్రయ వాది, హోపర్ విషయాశ్రయవాది.

చార్లెస్ బర్చ్‌ఫీల్డ్ ఓహియో రాష్ట్రంలో అష్టబులాలో 1893లో జన్మించాడు. ఈయన చిన్న వయసులోనే కల్పనలు చిందే నీటి రంగు చిత్రాలు రచించాడు. ఈయన బఫెలోలోను, న్యూయార్కులోను వాల్‌పేపరు డిసైనరుగాను, పెయింటర్‌గాను పనిచేశాడు. 1929 నుంచి గార్డెన్‌విల్లేలో చిత్ర నిర్మాణానికే జీవితాన్ని అంకితం చేశాడు.

ఈయన కుంచె పరిణతం కానుకాను, అంతకుముందు కనిపించిన వ్యంగ్యం వైదొలగుతూ వచ్చింది. కల్పనలో నాటకపద్ధతి, తరచు కరుణా తరంగితంగా కనిపించసాగింది. హోపర్‌కు ఇళ్ళు ప్రత్యేక స్వభావం గలవి. బర్చ్‌ఫీల్డ్‌కు ఇళ్ళు సజీవంతో వున్నవన్నమాట. ఈయన చిత్రించిన ఖాళీ ఇళ్ళు కొట్టవచ్చేట్టు భయంకరంగా వుంటాయి.

ఈయన 10 సంవత్సరాలుగా రచిస్తున్న చిత్రాలలో చిన్ననాటి కల్పన విశేష ప్రాభవంతో, ప్రౌఢతతో కనిపిస్తున్నది. ఇవి సమకాలిక కల్పనా చిత్రాలలో అగ్రగణ్యమైనవి.

ఈయన తైలవర్ణ చిత్రాలు కూడా రచించాడు. కాని నీటిరంగువే ఎక్కువ. ఈనీటి రంగులు తైలవర్ణాలకన్నా ఘనంగా వుంటాయి. ఈయన కుంచె కైవాడం నీటి రంగులకే కొత్తరంగు సంతరించి పెట్టింది.

యాండ్రువియాత్ 1917 లో పెన్సిల్‌వానియా రాష్ట్రంలోని చాడ్స్ ఫోర్డ్‌లో జన్మించాడు. అక్కడే నివసిస్తున్నాడు. వేసవిలో మెయినే కోస్తాలో గడుపుతాడు. ఈయన తండ్రి ఎన్. సి. వియాత్ గొప్ప చిత్రకారుడు. కనుక ఈయన వద్ద శిక్షణపొందిన యాండ్రూ చిన్న వయసులోనే చిత్రకారుడుగా పేరుపొందాడు. ఈయన 19వ ఏటనే తన చిత్రాల ప్రత్యేక ప్రదర్శనం జరిపారు.

సార్వకాలికమైన వస్తువులను ఈయన చిత్రకళా వస్తువులుగా ఎన్నుకున్నాడు. ప్రకృతి, గ్రామీణ ప్రజ, పాత వ్యవసాయ సాధనాలు, పాత వాగనులు, — అమెరికాలోని నేటి కొత్తదనం కనిపించేవి ఒక్కటీ వుండదు ఈయన చిత్రాలలో. ఒక శతాబ్దం ముందున్న — ఇప్పుడు కొన్ని ప్రాంతాలలో కనిపిస్తున్న, మరెంతోకాలం మనగల — గ్రామీణ జన జీవితం ఈయన చిత్రిస్తాడు. ఈ జీవితపు వివరాలన్నీ సాకల్యంగా చిత్రిస్తాడు. ఈయన శైలి కళా

హృదయాన్ని కోలుపోని సంపూర్ణ వాస్తవిక వాదం. పెక్కు నీటిరంగు చిత్రాలు రచించిన ఈయన హోమర్, హాషర్‌ల స్వాభావికవాద సంప్రదాయానికి చెందినా, ఈయన చిత్రాలలో ప్రతి విషయంలోను వ్యక్తిత్వం, ప్రత్యేకత వుంటాయి.

ఈ ప్రదర్శనంలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి మారిస్ ప్రెండర్‌గాస్ట్ రచించిన "రమణీయ ప్రకృతిలో రూపాలు" అన్నది, యాండ్రూవియాత్ రచించిన "ఎగిసే పొగ మంచు" అన్నది.

మన లక్ష్యం సమ సమాజ నిర్మాణం — వసుధైక కుటుంబ నిర్మాణం. రాజకీయంగా ఇది ఎప్పుడు సాధ్యమైనా, కళా సాహిత్య, సంస్కృతి రంగాలలో సహృదయులు ఈ లక్ష్యాన్ని సాధించడం సులభం. కళ కుల మత భేదాలు, కాలదోషం పట్టని సుకుమారభావం. ప్రపంచంలో ఏ మూలలో అది ఉదయించినా మనదే. ఇదే వాస్తవం కాకపోతే శాకుంతలం విని గోథె నర్తించడం, ఇబ్సన్ నాటకాలు చదివి మనం తలలూపడం, అజంతాను చూచి అందరూ ఆనందించడం పొసగదు.

# అత్యతిష్ఠత్ దశాంగుళమ్

సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్,

స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠత్ దశాంగుళమ్.

ఈ ఋక్కు పురుషసూక్తంలోని మొదటి ఋక్కు. పూర్వం యజ్ఞం ప్రధానమైనది గనుక యజ్ఞాన్ని, యజ్ఞపతిని, సమాజాన్ని విశ్వాకారుడు, విశ్వాత్మకుడు అయిన పరమ పురుషునితో అభిన్నంగా దర్శించి గానం చేసిన సూక్తం పురుష సూక్తం.

పురుషుడు - పరమ పురుషుడైన పరమేశ్వరుడు, వేయితలలు గలవాడు; వేయికన్నులు గలవాడు; వేయికాళ్ళు గలవాడు. వేయి అనే మాట అసంఖ్యాకం అనడానికి ఉపలక్షణం. అనగా అన్నీ చూచేవాడు; అన్నీ ఆలోచించేవాడు; అంతటా వెళ్ళేవాడు అని అర్థం. ఈ పురుషుడు భూమి అంతటా వ్యాపించినవాడు. ఇంతవరకు ఈ ఋక్కులో మూడు పాదాలకు అర్థం స్పష్టమయింది, నాల్గవ పాదంలోనే సందేహాలు కలుగుతున్నాయి, సరిగా అన్వయం కుదరక. ఈ పురుషుడు దశాంగుళప్రాంతం మీరి వ్యాపించినాడు అని అర్థం చెబుతున్నారు. సహస్ర శీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు అయిన పురుషుడు విశ్వాన్నంతా వ్యాపించి దానిని మించి, దానిచుట్టూ పదిఅంగుళాలమేర వ్యాపించడ మేమిటి? కనుక నాల్గవపాదం పై వాటిలో అన్వయించడం లేదు. సాయణాదులు ఏమి భాష్యం చెప్పినారో పరిశీలిస్తే సందేహం తీరుతుందేమో చూద్దాం.

"అత్యతిష్ఠద్దశాంగులం. స పురుషః భూమిం బ్రహ్మాండ గోల రూపాం విశ్వతః సర్వతో వృత్వా పరివేష్ట్య దశాంగులం దశాంగుల పరిమితం దేశ మత్యతిష్ఠత్, అతిక్రమ్య అవస్థితః. దశాంగుల మిత్యుపలక్షణం. బ్రహ్మాండాద్బహిరపి సర్వతో వ్యాప్యావస్థితః ఇత్యర్థః" అని సాయణులవారి భాష్యం. (ఋగ్వేద సంహిత, 29వ ప్రచురణం, మైసూరు)

ఆ పురుషుడు బ్రహ్మాండ గోలకరూపమైన భూమి నంతా వ్యాపించి, పరివేష్టించి, దానిమీద పదిఅంగుళాలమేర అతిక్రమించి ఉన్నాడు. దశాంగుళ

మనేది ఉపలక్షణం. బ్రహ్మాండానికి వెలుపలకూడ అంతటా వ్యాపించి ఉన్నా డని అర్థం.—ఇది సాయణులవారి భాష్యార్థం.

శ్రీ రంగనాథ బ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు రచించిన పురుష సూక్త భాష్యంలో ఇలా ఉన్నది:—

"....పురుష శబ్దోక్త వ్యాప్తిం విశదయతి భూమి మిత్యాదినా. భవతీతి భూమిరితి భూశబ్దేన సత్తాయోగి సకల పదార్థజాతం ఉచ్యతే యత్కించిజ్జగ త్యస్మిన్ దృశ్యతే శ్రూయతేపి వా, అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారా యణః స్థితః ఇత్యాది శ్రుత్యైకార్థ్యాత్ విశ్వతః సర్వప్రదేశావచ్ఛేదేవ వృత్వా అవృత్య వ్యాప్యేత్యర్థః, సర్వతః స్పృత్వేతి కేషాంచిత్ పాఠః. తత్ర ఛాంద సత్వాత్ స్పాదిత్వాద్వా విసర్జనీయశ్సః, అర్షశ్సమానః, దశాంగుళం దశ గుణం, ఉపలక్షణమేతత్. అనంతపరిమాణ మితి యావత్. అత్యతిష్ఠత్ అతి క్రమ్యాతిష్ఠ దిత్యర్థః. కేచిత్తు 'దశాంగుళం అతి అతిక్రమ్య' అర్థాన్నాభేరూర్ధ్వం దశాంగుళ మతిక్రమ్య హృదయపుండరీకే అతిష్ఠ దిత్యర్థః అత్రచ—అంగుష్ఠ మాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, అంగుష్ఠ మాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠ తీత్యాదయః శ్రుతి స్మృతయః ప్రమాణత్వేన ద్రష్టవ్యా ఇత్యాహుః." (పుట 4-5, బ్రహ్మవిద్యా విలాస ముద్రాక్షరశాల వనపర్తి ప్లవ కార్తిక శుద్ధ దశమి.)

పురుష శబ్దోక్తమైన వ్యాప్తిని భూమిం అనే దానితో విశదీకరిస్తున్నాడు. భవతీతి భూమిః అని వ్యుత్పత్తి గనుక ఉనికిగల సకల పదార్థ జాతమూ నని ఈ జగత్తులో చూడబడేది, వినబడేది ఏదయితే ఉన్నదో దాని లోపల, బయట అంతటా వ్యాపించి నారాయణుడు ఉన్నాడని శ్రుతి మరొకచోట ఈ విధంగానే చెప్పడంవల్ల సర్వప్రదేశమూ వ్యాపించి ఉన్నాడని అర్థం. దశాం గుళమంటే దశగుణమని అర్థం. ఇది ఉపలక్షణం మాత్రం. అనంత పరిమాణం అని అర్థం. లత్యతిష్ఠత్ అతిక్రమించి నిలబడ్డాడని అర్థం; కొందరు నాభికి మీద దశాంగుళ ప్రాంతం దాటి హృదయ పుండరీకంలో ఉన్నాడని అర్థం; అంగుష్ఠ మాత్రుడైన పురుషుడు జనుల హృదయంలో అంతరాత్మ డై నిరం తరమూ ఉంటాడు—అని, అంగుష్ఠ మాత్రుడైన పురుషుడు సర్వభూతాల హృద యంలో, ఆత్మమధ్యన ఉంటాడు—మొదలైనవి శ్రుతిస్మృతులు ప్రమాణంగా చూడాలి అన్నారు-అని ఈ భాష్యం తాత్పర్యం.

నవీనకాల భాష్యకారు లయిన దయానందులవారు ఏమి చెబుతారో చూద్దాం:-

"....అత్ర మంత్రే పురుష ఇతి పదం విశేష్యమప్తి. సహస్రశీర్షేత్యాదీని విశేషణాని చ. అత్ర పురుష శబ్దార్థే ప్రమాణాని—పురుషః పురిశయ ఇత్యాచక్షీరన్. ని.అ-1, ఖం-13. (పురి) సంసారే శేతే సర్వమభివ్యాప్య వర్తతే. స పురుషః పరమేశ్వరః పురుషః పురిషాదః పురిశయః పురయతేర్వా పురయత్యంతరిత్యంతక పురుష మభిప్రేత్య యస్మాత్పరం నావరమస్తికించిద్యస్మాన్నాణీయో న జ్యాయోస్తి కించిత్. వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః తేనేదం పూర్ణం పురుషేణ సర్వమిత్యపి నిగమో భవతి....స భూమిం సర్వతః స్పృత్వా—స పురుషః పరమేశ్వరః సర్వేభ్యో బాహ్యాంతర్దేశోభ్యో భూమిరితి భూతానాం ఉపలక్షణం. భూమి మారభ్య ప్రకృతి పర్యంతం సర్వం జగత్ స్పృత్వా అభివ్యాప్య, వర్తతే. అత్య-దశాంగుళమితి-బ్రహ్మాండ హృదయయోరుపలక్షణం. అంగుళ మిత్యవయవోప లక్షణేన మితస్య జగతోత్ర గ్రహణం భవతి. పంచస్థూల భూతాని పంచసూక్ష్మాణి చైత దుభయం మిళిత్వా దశావయవాఖ్యం సకలజగదస్తి. అన్యచ్చ - పంచప్రాణాః సేంద్రియ చతుష్టయం అంతఃకరణం సకలం జగదస్తి. ఏవమే వాన్యదపి-జీవస్య హృదయం దశాంగుళ పరిమితం చ తృతీయం గృహ్యతే. ఏతత్త్రియం స్పృత్వా వ్యాప్యాతిష్ఠత్, ఏతస్మాత్త్రయాద్ బహిరపి వ్యాప్తస్సన్ అవస్థితః. అర్థాత్ బహిరంతశ్చ పూర్ణో భూత్వా పరమేశ్వరః అవతిష్ఠత ఇతి వేద్యః" (ఋగ్వేదాది భాష్య భూమికా సృష్టి విద్యావిషయః పుట 156—157).

ఈ మంత్రంలో పురుష అనే పదం విశేష్యం. సహస్రశీర్ష మొదలైనవి విశేషణాలు. పురుష శబ్దానికి ప్రమాణాలున్నాయి:— పురుషః పురిశయ ఇత్యాచక్షీరన్ — నిరుక్తం 6-1, 210-13. పురి సంసారమందు శేతే అంతటా వ్యాపించి ఉన్నవాడు .......దయానందులవారు స భూమిం విశ్వతః స్పృత్వా అనే పాఠం గ్రహించి భాష్యం చేశారు. ఆ పురుషుడు-పరమేశ్వరుడు బాహ్యాంతర్దేశాలను అన్నిటిని వ్యాపించి, భూమి అనేది భూతాలన్నిటికీ ఉపలక్షణం. భూమి మొదలుకొని ప్రకృతి పర్యంతం సర్వజగత్తును వ్యాపించి ఉన్నాడు. అత్యతిష్ఠ ద్దశాంగుళ మనేది బ్రహ్మాండానికి హృదయానికి ఉపలక్షణం. అంగుళమనే మాటవల్ల అవయవోపలక్షణంతో కొలచబడిన జగత్తును గ్రహించాలి. స్థూలభూతాలు ఐదు; సూక్ష్మభూతాలు ఐదు — ఇవి రెండూ కలిసి దశావయవాలుగల సకల జగత్తని అర్థం. మరొక విధంగాను చెప్పవచ్చు; ఐదు ప్రాణాలు, ఇంద్రియ చతుష్టయం, అంతఃకరణం మొత్తం పదిగల సకల జగత్తు. మరొక విధంగాను చెప్పవచ్చు. జీవుని హృదయం దశాంగుళ పరిమితం. ఈ విధంగా ఈ మూడింటినీ వ్యాపించి ఉన్నాడు; ఈ మూడింటి

వెలుపల కూడ వ్యాపించి ఉన్నాడు. అనగా బహిరంతర్భాగాలలోను పూర్ణుడై పరమేశ్వరుడు ఉంటున్నాడు అని తెలుసుకోవాలి - అని సారాంశం.

ఈ మూడు భాష్యాలు చదివినా, భూమినంతా వ్యాపించిన పరమేశ్వరుడు పది అంగుళాలు మీరి ఎందుకున్నాడో స్పష్టంకాలేదు. భూమినంతా వ్యాపించి దానిమీద పది అంగుళాలు - పదివేళ్ళతో కొలవదగినంత ప్రదేశం వ్యాపించి ఉన్నాడని, దశాంగుళమనేది ఉపలక్షణమని, బ్రహ్మాండానికి వెలుపల గూడ అంతటా వ్యాపించి ఉన్నదన్న విద్యారణ్యులవారి భాష్యంలో అంగుళ శబ్దానికి స్పష్టమైన అర్థంలేదు.

దశాంగుళమంటే దశగుణం - పదింతలని, అనంత పరిణామానికి ఇది ఉపలక్షణ మాత్ర మని శ్రీ రంగనాథ బ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు వ్యాఖ్యానించారు. దశాంగుళమంటే, నాభికి మీద పది అంగుళాలు దాటిన తర్వాత హృదయపుండరీకంలో అధిష్ఠించి ఉన్నాడని కొందరన్నారని వీరు మతాంతరం ఉదాహరించి, దానికి ప్రమాణాలు తెలిపారు. వీరుకూడ అంగుళ శబ్దానికి స్పష్టమైన అర్థం చెప్పలేదు.

శ్రీ దయానందులవారు దశాంగుల శబ్దాన్ని వ్యాఖ్యానిస్తూ మూడువాదాలు ఉదాహరించారు. అవయవోప లక్షణంతో కొలవబడే జగత్తును గ్రహించాలి; అది స్థూల సూక్ష్మరూపాలతో పది గనుక దశావయవాఖ్యమైన సకల జగత్తు అన్నారు. పంచప్రాణాలు, ఇంద్రియ చతుష్టయం, అంతఃకరణం - ఏతదాత్మక మైన సకల జగత్తని రెండవ వాదం తెలిపారు. మూడవవాదం - జీవుని హృదయం దశాంగుళ పరిమితం గనుక దానిని ఆక్రమించుకొని ఉన్నపురుషుడు అని, ఈ విధంగా ఈ మూడింటినీ వ్యాపించి, దీని పైనగూడ - అనగా లోపల వెలుపల వ్యాపించి నిండి ఉన్నాడని తాత్పర్యం అంటారు. కాని, అంగుళశబ్దం సరిగా వ్యాఖ్యాతం కాలేదు.

ఎంత ఆలోచించినా, ఈ భాష్యార్థాలు ఎంత మననం చేసినా, భూమిని సర్వత్రా వ్యాపించిన సహస్రశీర్షుడు, సహస్రపాదుడు. సహస్రాక్షుడైన పురుషుడు దశాంగుళం మాత్రం ఎందుకు అతిక్రమించి ఉండాలి? ముగ్గురు భాష్యకారులు అంగుళశబ్దం ఉపలక్షణమనే అన్నారుగాని స్పష్టంగా వ్యాఖానించలేదు కనుక అంగుళశబ్దానికి మరొక అర్థం మంత్రంలోని మూడు పాదాలను నాల్గవ దానితో అన్వయించి సుబోధకమయ్యేది ఉందేమో చూద్దాం!

'అంగుళమితి దిక్' అని నిరుక్తంలో ఉన్నదని పండిత భూషణం శ్రీ పెరుమాళ్ళ గుండాచార్యులవారు (ఎం. ఎ) నాతో అన్నారు. కాని, నేను

"....అత్ర మంత్రే పురుష ఇతి పదం విశేష్యమప్తి. సహస్రశీర్షేత్యా దీని విశేషణాని చ. అత్ర పురుష శబ్దార్థే ప్రమాణాని—పురుషః పురిశయ ఇత్యాచక్షీరన్. ని. అ-1, ఖం-13. (పురి) సంసారే శేతే సర్వమభివ్యాప్య వర్తతే. స పురుషః పరమేశ్వరః పురుషః పురిషాదః పురిశయః పురయతేర్వా పుర యత్యంతరిత్యంతక పురుష మభిప్రేత్య యస్మాత్పరం నాపరమస్తికించి ద్యస్మాన్నాణీయో న జ్యాయో స్తి కించిత్. వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః తేనే దం పూర్ణం పురుషేణ సర్వమిత్యపి నిగమో భవతి....స భూమిం సర్వతః స్పృత్వా—స పురుషః పరమేశ్వరః సర్వేభ్యో బాహ్యాంతర్దేశేభ్యో భూమిరితి భూతానాం ఉపలక్షణం. భూమి మారభ్య ప్రకృతి పర్యంతం సర్వం జగత్ స్పృత్వా ఆభివ్యాప్య, వర్తతే. అత్య-దశాంగుళమితి-బ్రహ్మాండ హృదయయో రుపలక్షణం. అంగుళ మిత్యవయవోప లక్షణేన మితస్య జగతోత్ర గ్రహణం భవతి. పంచస్థూల భూతాని పంచసూక్ష్మాణి చైత దుభయం మిళిత్వా దశా వయవాఖ్యం సకలజగదస్తి. అన్యచ్చ - పంచప్రాణాః సేంద్రియ చతుష్టయం అంతఃకరణం సకలం జగదస్తి. ఏవమే వాన్యదపి-జీవస్య హృదయం దశాంగుళ పరిమితం చ తృతీయం గృహ్యతే. ఏతత్త్రియం స్పృత్వా వ్యాప్యాతిష్ఠత్, ఏతస్మాత్ త్రయాద్ బహిరపి వ్యాప్తస్సన్ అవస్థితః. అర్థాత్ బహిరంతశ్చ పూర్ణో భూత్వా పరమేశ్వరః అవతిష్ఠత ఇతి వేద్యః" (ఋగ్వేదాది భాష్య భూమికా సృష్టి విద్యావిషయః పుట 156–157).

ఈ మంత్రంలో పురుష అనే పదం విశేష్యం. సహస్రశీర్ష మొదలైనవి విశేషణాలు. పురుష శబ్దానికి ప్రమాణాలున్నాయి:— పురుషః పురిశయ ఇత్యాచక్షీరన్ — నిరుక్తం 6-1, 210-13. పురి సంసారమందు శేతే అంతటా వ్యాపించి ఉన్నవాడు .......దయానందులవారు స భూమిం విశ్వతః స్పృత్వా అనే పాఠం గ్రహించి భాష్యం చేశారు. ఆ పురుషుడు-పరమేశ్వరుడు బాహ్యాంత ర్దేశాలను అన్నిటిని వ్యాపించి, భూమి అనేది భూతాలన్నిటికీ ఉపలక్షణం. భూమి మొదలుకొని ప్రకృతి పర్యంతం సర్వజగత్తును వ్యాపించి ఉన్నాడు. అత్యతిష్ఠ ద్దశాంగుళ మనేది బ్రహ్మాండానికి హృదయానికి ఉపలక్షణం. అంగుళమనే మాటవల్ల అవయవోపలక్షణంతో కొలచబడిన జగత్తును గ్రహిం చాలి. స్థూలభూతాలు ఐదు; సూక్ష్మభూతాలు ఐదు — ఇవి రెండూ కలసి దశావయవాలుగల సకల జగత్తని అర్థం. మరొక విధంగాను చెప్పవచ్చు; ఐదు ప్రాణాలు, ఇంద్రియ చతుష్టయం, అంతఃకరణం మొత్తం పదిగల సకల జగత్తు. మరొక విధంగాను చెప్పవచ్చు. జీవుని హృదయం దశాంగుళ పరిమితం. ఈ విధంగా ఈ మూడింటినీ వ్యాపించి ఉన్నాడు; ఈ మూడింటి

వెలుపల కూడ వ్యాపించి ఉన్నాడు. అనగా బహిరంతర్భాగాలలోను పూర్ణుడై పరమేశ్వరుడు ఉంటున్నాడు అని తెలుసుకోవాలి - అని సారాంశం.

ఈ మూడు భాష్యాలు చదివినా, భూమినంతా వ్యాపించిన పరమేశ్వరుడు పది అంగుళాలు మీరి ఎందుకున్నాడో స్పష్టంకాలేదు. భూమినంతా వ్యాపించి దానిమీద పది అంగుళాలు - పదివేళ్ళతో కొలవదగినంత ప్రదేశం వ్యాపించి ఉన్నాడని, దశాంగుళమనేది ఉపలక్షణమని, బ్రహ్మాండానికి వెలుపల గూడ అంతటా వ్యాపించి ఉన్నదన్న విద్యారణ్యులవారి భాష్యంలో అంగుళ శబ్దానికి స్పష్టమైన అర్థంలేదు.

దశాంగుళమంటే దశగుణం - పదింతలని, అనంత పరిణామానికి ఇది ఉపలక్షణ మాత్ర మని శ్రీ రంగనాథ బ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు వ్యాఖ్యానించారు. దశాంగుళమంటే, నాభికి మీద పది అంగుళాలు దాటిన తర్వాత హృదయపుండరీకంలో అధిష్ఠించి ఉన్నాడని కొందరన్నారని వీరు మతాంతరం ఉదాహరించి, దానికి ప్రమాణాలు తెలిపారు. వీరుకూడ అంగుళ శబ్దానికి స్పష్టమైన అర్థం చెప్పలేదు.

శ్రీ దయానందులవారు దశాంగుల శబ్దాన్ని వ్యాఖ్యానిస్తూ మూడువాదాలు ఉదాహరించారు. అవయవోప లక్షణంతో కొలవబడే జగత్తును గ్రహించాలి; అది స్థూల సూక్ష్మరూపాలతో పది గనుక దశావయవాఖ్యమైన సకల జగత్తు అన్నారు. పంచప్రాణాలు, ఇంద్రియ చతుష్టయం, అంతఃకరణం - ఏతదాత్మక మైన సకల జగత్తని రెండవ వాదం తెలిపారు. మూడవవాదం - జీవుని హృదయం దశాంగుళ పరిమితం గనుక దానిని అతిక్రమించుకొని ఉన్నపురుషుడు అని, ఈ విధంగా ఈ మూడింటినీ వ్యాపించి, దీని పైనగూడ - అనగా లోపల వెలుపల వ్యాపించి నిండి ఉన్నాడని తాత్పర్యం అంటారు. కాని, అంగుళశబ్దం సరిగా వ్యాఖ్యాతం కాలేదు.

ఎంత ఆలోచించినా, ఈ భాష్యార్థాలు ఎంత మననం చేసినా, భూమిని సర్వత్రా వ్యాపించిన సహస్రశీర్షుడు, సహస్రపాదుడు, సహస్రాక్షుడైన పురుషుడు దశాంగుళం మాత్రం ఎందుకు అతిక్రమించి ఉండాలి? ముగ్గురు భాష్యకారులు అంగుళశబ్దం ఉపలక్షణమనే అన్నారుగాని స్పష్టంగా వ్యాఖ్యానించలేదు కనుక అంగుళశబ్దానికి మరొక అర్థం మంత్రంలోని మూడు పాదాలను నాల్గవ దానితో అన్వయించి సుబోధకమయ్యేది ఉందేమో చూద్దాం!

'అంగుళమితి దిక్' అని నిరుక్తంలో ఉన్నదని పండిత భూషణం శ్రీ పెరుమాళ్ళ గుండాచార్యులవారు (ఎం. ఎ) నాతో అన్నారు. కాని, నేను

నిరుక్తం చూడలేదు. కనుక సంస్కృత సజాతీయ భాషల సహాయంతో దీని అర్థం తెలుసుకొనడానికి ప్రయత్నిస్తాను.

ఇంగ్లీషుతో Angle అన్న పదానికి **A corner**, **The meeting place of two lines not in the same direction**, **A nook** అని అర్థం. మధ్యకాలపు ఇంగ్లీషులో **Any of the four houses at the cardinal points of the compass (M. E)** అని అర్థం. లాటిన్ భాషలో **Angule** ఫ్రెంచి భాషలో **Augnlam.**

పై అర్థాలనుబట్టి అంగులం అన్న పదానికి మూల, రెండు రేఖలు చేరే కోణం, కేంద్రస్థానాలు అనే అర్థాలున్నట్లు స్పష్టం కదా. కోణం, కేంద్రం. మూల దిక్కుగాక మరేమవుతుంది? ఈ సంస్కృత సజాతీయభాషల సమానార్థక పదాల అర్థాన్నిబట్టి అంగుళశబ్దానికి దిక్కు అని మనం అర్థం చెప్పుకుంటే, సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్ర పాత్తు అయిన పురుషుడు విశ్వమంతా వ్యాపించి దశాంగులం దశదిక్కులను దాటి, అతిక్రమించి నిలబడ్డాడు - అని అర్థం కుదురుతుంది; డొంక తిరుగుడు లేకుండా; పై మూడు పాదాలకు నాల్గవ పాదంతో అన్వయమూ కుదురుతుంది.

అంగుల శబ్దానికి దిక్కు అనే అర్థం నిరుక్తకారుని కాలానికే వ్యవహారచ్యుత మయిపోయి వుండవచ్చు. వ్యాఖ్యాతలూ దానిని విడిగా చేర్చి వుండరు.

అర్థ శతాబ్ది కింద ఊర్ణనాభమా, ఊర్ణ వాభమా అని శబ్దసాధుత్వ మీమాంస వచ్చినప్పుడు ఊర్ణం నాభౌ యస్యసః అనే వ్యుత్పత్తి సరికాదని, ప్రాచీన రూపం ఊర్ణ వాభమే నని, సంస్కృత సజాతీయ భాషలలో web పదం ఉంది గనుక వాభమే సాదునని శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు నిర్ధరించారు. కనుక, మనకు వైదిక పదాల విషయంలోగాని లౌకిక సంబంధ పదాల మూలస్వరూపంలోగాని సందేహం ఏర్పడినప్పుడు, సాధుత్వాసాధుత్వ విచికిత్స ఏర్పడిప్పుడు సంస్కృత సజాతీయ భాషలు చాల సహాయకారులవుతాయి.

# ధర్మ సూక్ష్మం

అడిగేవారికి చెప్పేవారు లోకువ-అన్నది సామెత. ఎంత చెప్పినా పృచ్ఛకుని జిజ్ఞాసను తీర్చలేమనేది దీని తాత్పర్యం. కాని ఇది నేడు పూర్తిగా తారుమారయింది. చెప్పేవారికే అడిగేవారు లోకువవుతున్నారు. ఎవరిని ఏవిషయమైనా ప్రశ్నించండి 'నీకేమి తెలుసులే!' అన్న నిర్లక్ష్యంతో చెప్పడం సాగిస్తాడు ఆవ్యక్తి.

ఏ ఉపాధ్యాయుణ్ణైనా పృచ్ఛించండి. తరగతిలో పేముబెత్తం ఒకచేత ఝళిపిస్తూ, మరొకచేత సుద్దముక్కతో వ్రాసిచూపుతూ పిల్లలకు బోధించినట్టు చెబుతాడు; మధ్య మధ్య అర్థమయిందా అంటూ కనుబొమ్మలు పైకెత్తి చూస్తూ తను చెప్పేదేదో అత్యంత గహనమైన విషయమైనట్టు.

ఏ విజ్ఞాన శాస్త్రజ్ఞునితోనన్నా సంభాషించండి. అణుభంజనం నుంచి ఆరంభించి చంద్రలోక యాత్రవరకు సోది మొదలుపెడతాడు; తను అప్పుడే చంద్రమండలంనుంచి దిగివచ్చినట్టు, ఎదుటివాడు అణువంటె మణువు అనుకుంటున్నట్టు.

రాజకీయ నాయకుణ్ణి ఏ సభలకైనా పిలవండి. అక్కడ ఉన్నవారి పరిజ్ఞానం ప్రసక్తేలేకుండా ప్రథమ భారతస్వాతంత్ర్య సమరం, దానివిరుగు, గాంధీజీ అవతారం. రక్తరహిత విప్లవం, అహింసాయుతంగా స్వాతంత్ర్య సంసిద్ధి ఏ కరువు పెట్టి, గత వైభవానికి తమపార్టీ ప్రభుత్వం భారతజాతిని ఎలా నడిపించుకుపోతున్నదీ వివరిస్తాడు; మనమంతా గొర్రెలమంద అయినట్టు.

ఏ కవిపుంగవునైనా కదపండి. తను కాళిదాసంతవాడిననుకొని తను మాతృగర్భంలో ఉన్నప్పుడు మొదలు ఆ క్షణంవరకు చెప్పిన కవితలు గానంచేసి, కవి హృదయం ఏమిటన్న దానిని ఆనందవర్ధనాచార్యునిలాగ, జగన్నాథ పండితరాయలు లాగ వివేచించడం ఉద్యమిస్తాడు; ఎదుటివానికి వివేకమే లేదనే విశ్వాసంతో.

ఏ అర్థశాస్త్రవేత్తనన్నా "ఇదేమిటి!" అని అడదండి. కౌటిల్యునినుంచో, ప్లేటోనుంచో గోతులుతవ్వి వస్తువు, ఉత్పత్తి, సరఫరా, గిరాకీలు జీవిత

వ్యవస్థకు ఎలా మూలాధారమైనవీ చెప్పి తత్‌క్షణ జీవితం నుంచి ఉదాహరిస్తూ పోతాడు; మనకు వ్యవహారజ్ఞానం వీసమైనా లేనట్టు.

ఏ తత్త్వజ్ఞుణ్ణైనా పలకరించండి. అప్పుడే బ్రహ్మను సాక్షాత్కరించుకొని జగన్మిథ్యాజ్ఞానం విశ్వవ్యాప్తం చేయడానికి అంతర్ముఖుడైనట్టు అరమోడ్పు కనులతో, చిన్ముద్రతో, మాయాజాలాన్ని పటాపంచలు చేస్తున్న గొంతుతో, అరిషడ్వర్గాలను తరిమివేస్తున్నట్టున్న హస్తావలేపాలతో ప్రసంగించడం మొదలుపెడతాడు; ఎదుటివాడు అజ్ఞాని, మాయామోహితుడు, ఉద్ధరించక తప్పదన్న మొగంపెట్టి,

ఏ కళాకారునితోనన్నా కళలసంగతి ప్రస్తావించండి. ప్రతిమ అన్నా, రంగులన్నా, రేఖలన్నా మనకు ఈషత్తయినా తెలీదన్న ఆత్మవిశ్వాసంతో సోదాహరణంగా ఉపన్యసిస్తాడు; మొహెంజోదారో మృణ్మయ విగ్రహాలు మొదలుకొని.

ఏ వ్యాసకర్తనైనా ఒక వ్యాసం వ్రాసి పంపమనండి. తనే వ్యాసభగవానుల అపరావతారమన్నట్టు భావించుకొని ఆ వ్యాసభగవానుడు వేదాలు వింగడించుకొని ఇతిహాసపురాణాలు చెబుతూపోయినట్టు తన వ్యాసరాజాన్ని గ్రంథరాజంగా గ్రథించి పంపుతాడు; తనది ప్రత్యక్షరమూ వేదమంత బరువూ, నక్షత్రమంత హరువూ కలదన్న నిండుమనంబుతో.

ఇంతెందుకు? తొక్కు పలుకులు పలికే పసిపాపను పలకరించండి. "అది కాదు నాన్నా, నీకు తెలీదు నాన్నా" అని అందుకుంటుంది సాధికారంగా చర్చకు. కనుకనే నేమో 'కాదన్నవాడు కరణం' అన్న సామెత పుట్టింది.

ఈ ప్రవృత్తికంతా మూల మేమిటి? ఎదుటివాడు మనంతగా వికసించలేదనే అపోహ, తను సర్వజ్ఞుణ్ణనే అసహజమైన ఆత్మప్రత్యయమూను. ఇదే అజ్ఞానానికీ, అశాంతికీ బీజం. ఎదుటివానికీ కొంత తెలుసు, ప్రపంచం నాతోనే లేదు-అన్న కనువిప్పు కలిగేవరకు ఏ చర్చ అయినా, రచన అయినా ఉదాత్తంగా సాగదు. ఇతరుల 'అంతస్తు'ను గ్రహించి మాటలాడనేరనివాడు అహం ముదిరి వైతండికుడవుతాడు; సంఘజీవి అసలే కాలేడు. ఈ ధర్మసూక్ష్మగ్రహణం పైనే, భావపరివర్తనం పైనే, అన్ని రంగాలలోను అభ్యుదయం రూపు తీర్చుకుంటుంది.

ఈలాటి ఉదాత్తస్థాయిని నెలకొల్పడానికి ప్రతి విద్యావంతుడూ, వివేకి కృషి చేయాలి.

# ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం తెలుగు సాహిత్యస్థితి

ఈ శతాబ్ది పూర్వార్ధం వరకు భారతదేశ సామాజిక జీవితాన్ని ప్రభావితం చేసిన స్వాతంత్ర్యోద్యమం వంటిదిగాని, తర్వాత తెలుగువారి చిరవాంఛితాలను పూరించిన ఆంధ్ర విశాలాంధ్రోద్యమాలవంటిదిగాని ఆటు తర్వాత మూడు దశాబ్దాలలో తెలుగువారి జీవితాన్ని ప్రభావితం చేసే అవకాశం కలుగలేదు. అందువలన తెలుగు సాహిత్యంలో స్తబ్దత కనిపించకపోయినా, సంచలనాత్మకమో, నూతన పథప్రవర్తనమో అయిన రచన వెలువడలేదనే చెప్పాలి. స్వాతంత్ర్య లబ్ధికి ముందు సామాజిక జీవితంలో ఎన్నో సమస్యలున్నా, పరప్రభుత్వ శృంఖలాలను తెంచుకోవడం ప్రధాన లక్ష్యం కావడంవల్ల సంఘంలోని ప్రతివారి దృష్టి ఏకోన్ముఖమైంది స్వాతంత్ర్యం సిద్ధించింది. కాని, సమస్యలకేమీ కొదువలేదు.

అయినా సంఘాన్ని ఏకంచేసే మహోద్యమమేదీ వాటి పరిష్కారానికి పుట్టుకురాలేదు. ఈ స్థితి సాహిత్యంలోను ప్రతిబింబించక తప్పలేదు. జాతి జీవితాన్ని ఉత్తేజపరచగల రచన ఏదీ ఉద్భవించలేదు. స్వాతంత్ర్య ఫలాన్ని స్వార్థానికి వినియోగించుకొనాలనే దురాశ సంఘంలోని బలవంతులకు కలిగినట్లే సాహిత్యంలోనూ అల్ప ప్రయత్నంతో అనల్ప ప్రయోజనం పొందాలనే కాంక్ష వెర్రితలలు వేసింది. దానివల్ల జాతి ఆత్మ సాక్షాత్కారం పొందాలనే మహాప్రేరణ తొణికిసలాడే రచనాధ్వరంగాని, జాతి వైభవదీధితులు దిగంతాలను తాకగల కళాఖండాలుగాని ఆవిర్భవించలేదు.

ఆంధ్ర రాష్ట్రం సిద్ధించింది. విశాలాంధ్ర అవతరించింది. మనపరిధి సమస్యలతోపాటు విస్తరించింది. వివిధరంగాలలో నేతృత్వం వహించగల పెద్దలు లేనట్లే, సాహిత్యరంగంలోను పదుగురిని ఆకర్షించి కార్యోన్ముఖులను చేయగల రచనగాని, సంక్షుభిత సమాజానికి చిత్తశాంతి కలిగించే ధోరణిగాని, చివరకు కొందరినైనా ఉత్తేజపరచగల సాహిత్యోద్యమాలుగాని తలెత్తలేదు.

ఈ విశ్లేషణ దృష్టితో చూచినపుడు జగాదివిటీలుకాక పోయినా, చిరు వెలుగులు ప్రసరింపజేసే కొన్ని మంచి రచనలు రాకపోలేదు. వివిధ ప్రక్రియ లలో విలక్షణమైన రచనలు ఉన్నవేమో పరిశీలిద్దాము. కావ్యంతో ఈ పరిశీలన ప్రారంభిద్దాం.

కవిత:— కవితా రంగంలో భాషాచ్ఛందశ్శైలీ సౌకుమార్యాలతో కొన్ని అందచందాలు వెలార్చే కావ్యాలు వెలువడినప్పటికీ, సామాజికాభ్యుదయమే పరమ ధ్యేయంగాగల బృహద్రచనలు, జీవద్రచనలు 1956 తర్వాత చెప్పుకో దగినవి కానరావు. దీనికి చెదురుగా చిన్న అపవాదాలు లేకపోలేదు.

సమకాలిక సాంఘిక సంక్షోభాన్ని ఇతివృత్తంగా గ్రహించి, సామాజిక దురన్యాయాలకు ఖండిస్తూ శ్రీ కుందుర్తి ఆంజనేయులు తెలంగాణ కావ్యాన్ని తాత్త్విక చింతనతో శ్రీ సోమసుందర్ సోమరసం సుందరకాండ కావ్యాన్ని రచించారు. ఇవి నూతన సాహిత్య ధోరణులకు ప్రతిపాదకాలుకావు. 1977లో వెలువడిన శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి స్వాతంత్ర్యోద్యోమ చరిత్ర కావ్యం గొప్పదే. ఇది 1860 నుండి 1906 దాకా ఉన్న ఉద్యమాలకు కవితారూప మైన 18 పర్వాల ఇతిహాసం. దీనిలో ప్రాచీన నవీన కవితా సంప్రదాయాలు సమన్వయించాయి. శైలి అద్భుతం, శిల్పం అపూర్వం. ఇది త్యాగధనుల చరిత్ర కావడంవల్ల మన గౌరవాదరాలను చూరగొంటుందేగాని నూతన కవితా ధోరణికి పథప్రదర్శకం కాదు. దేవరకొండ బాలగంగాధరతిలక్ రచించిన అమృతం కురిసిన రాత్రి వైలక్షణ్యంగల ఖండకావ్య సంపుటి. రచనా రామణీయకంతోను, భావసౌకుమార్యంతోను ఇది పాఠకులను ఆకర్షిస్తుందన డంలో సందేహం లేదు. కాని, కవితా రంగంలో మౌలికమైన పోకడకు ఇది ఆధారంకాదు. వివిధ భాషా సాహిత్య సౌందర్యాలను ఆరగించి ఆకళించుకొన్న శ్రీ గుంటూరి శేషేంద్రశర్మ కవిత మెదడును పదునుబెట్టి మనసును మథిం చేదయినా, రాయప్రోలు రచనలవలెగాని, కృష్ణశాస్త్రి రచనలవలెగాని, శ్రీశ్రీ రచనలవలె గాని కొత్త పోకడకు మూలం కాలేకపోయింది. తెలుగు రుబాయీలు, తెలుగు గజళ్ళు వంటివి వైచిత్రీ ద్యోతకాలేగాని నూతన ధోరణికి ప్రవర్తకాలుకావు.

సంఘంలోని లోపాలను అధిక్షేపిస్తూ ఉపదేశాత్మకంగా సాగిన కవిత మనకు పండితారాధ్యుని కాలంనాటి నుంచీ ఉంది. వేమన మొదలయిన శతక కవులు దానిని మరింత కరకుగా వాడారు. ఆ ధోరణిలోని వారు శ్రీ కాళోజీ నారాయణరావు. ధోరణి పాతదైనా ఈయన గొంతు కొత్తది, కనుక విలక్షణత కనపడుతుంది.

"వెనుకకు చూస్తే భూతం
కనుపించును చూడకు అటు,
లభ్యంకాని భవిష్యం
లక్షిస్తూ రభసపడకు,
వర్తమానం వ్యర్థం చేయని
కర్తవ్యం నీదని మరువకు,
పశ్చాత్తప్తులు పూర్వతప్తులు
ప్రస్తుత మెరుగని వ్యక్తులు వ్యర్థులు."

అంటాడు కాళోజీ. ఈ ఖండికలో ప్రధానమైన గుణం చురుక్కున గుచ్చుకొనే వాడి. దానికి చమత్కారం తోడయింది.

ఈ మూడు దశాబ్దాలలో కవితారంగంలో సామాజిక స్పృహతో సంప్రదాయంపై తిరుగుబాటు దిగంబర కవుల ఉద్యమం. ఇది తక్కిన ఉద్యమాల వలె చాలకాలం నిలవకపోయినా, కొంతకాలం సాహిత్యజ్ఞుల దృష్టిని ఆకర్షించ గలగింది. ఈదిగంబర కవులు తమను నిత్యనూతన మహత్తర వ్యవస్థకోసం తపనపడుతున్నామని చెప్పుకొన్నారు.

దిగంబర కవులలో ఒకరైన మహాస్వప్న 'గ్లానిర్భవతి భారత' అనే ఖండికలో ఇలా అంటారు :—

"మానవత మసిపాతలా మారిపోయినప్పుడు
మాసిపోయినప్పుడు
నేను వస్తున్నాను దిగంబర కవిని
స్తంభించిన కవితా స్తంభం బ్రద్దలై
పుట్టుకొస్తున్న ఉగ్ర నగ్ననర కేసరిని
నా చేసిన చెట్లని నడిపించేందుకు
వికృతాకారపు శిలల్ని మానవులుగా మలిచేందుకు
మరణించిన భగవంతునికి ప్రాణం పోసేందుకు
నేను వస్తున్నాను దిగంబర కవిని — వాచవిని
రాత్రి ఉదయిస్తున్న ప్రతిభారతిని."

## నవల:

ఈ మూడు దశాబ్దాలలో తెలుగు నవల ముక్కారు పంట పండిన మాట

నిజమే. అయితే ఇవిగో ఇవి మైలు రాళ్ళు అని చెప్పటానికి ఏమున్నాయి,
మాలపల్లి, వేయిపడగలు, తుఫాను, చివరకుమిగిలేది, అతడు — ఆమె వంటి
నవలలు — అంటే ఇంకోపాతికేళ్ళు పోయిన తర్వాత కూడా తెలుగు నవలా
వస్తు శిల్ప సంవిధానరీతులను వెలార్చే వాటిసరసను నిలవదగిన నవలలు పాతి
కేళ్ళలోనూ రాలేదంటే ఎవరూ తప్పు పట్టాల్సిన పని లేదు. అయితే కొన్ని
మంచి నవలలు వచ్చిన మాట నిజమే. వినూత్న ధోరణులు కాని, విశిష్ట ప్రభావ
ప్రసారకాలుకానీ, అఖిల భారత స్థాయిని ఇదుగో ఇదీ తెలుగు నవల అని చూప
టానికి తగినది కానీ వెలువడలేదనటం తెలుగు నవలను అన్యాయం చేసినట్లేమీ
కాదు.

కొన్ని ప్రయోగాలు, సామాజిక చైతన్య ధోరణులు ప్రతిస్పందించే,
ప్రతిబింబించే నవలలు వచ్చాయి. అంతేకాదు. నవల, వర్తమాన సాహిత్య
ప్రక్రియలన్నిటిలోనూ జనప్రియమైన స్థానం సంపాదించుతుంది. ఈవేళ పోటీలు
పడి వార, పక్ష, మాస పత్రికలు, ఒకటి, రెండు మూడు అయినా ఆకర్షక
మైన నవలలు ధారావాహికంగా ప్రచురిస్తూ ఉంటే తప్ప తమ ఉనికికే ఏమి
ముప్పు వస్తుందో అని డోలాందోళనం చెందే అతిశయస్థానం నవల సంపాదించు
కొంది. పత్రికా పాఠకుల సంఖ్యను 'నవల' ఆకర్షించి పెంచినట్లు తదితర
ప్రక్రియలు చేయలేవేమోనన్న స్థితికి చేరుకొంది నవలా ప్రియుల ఆదరణ.

సుమారు మూడు దశాబ్దాల క్రిందట తెలుగు నవలలో ఒక వినూత్న
మైన ధోరణి, ఒక మంచి వైఖరి, ఒక సంప్రదాయం ప్రారంభమైంది. సామా
జిక వాస్తవికతకు, అందునా ముఖ్యంగా కుటుంబ జీవన సమస్యల పరిష్కారా
లకు నవల ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలి అనేది ఆ ధోరణి. కీ. శే. 'శారద'
మంచి — చెడు, అపస్వరాలు అనే నవల ద్వారా ఈ భావ ధోరణి మొదలైంది.
తర్వాత పురాణం సూర్య ప్రకాశరావు 'జీవనగంగ', 'మాతేమనుషులు' వంటి
మంచి నవలలు వ్రాశారు.

ఈ శతాబ్ది ఆరవదశకంలో తెలుగు నవలకు పాఠక బాహుళ్యాన్ని వృ
చేసిన వారు కొమ్మూరి వేణుగోపాలరావు. 1968వ సంవత్సరంలో ప్రార
భించిన ఎమెస్కో పాకెట్ బుక్స్ తొలి విడతలలో అన్నీ నవలలే ప్రచురి
చటం విశేషం. నెలకు నాలుగు వానల్లాగ నెలకు నాలుగు నవలలు కురిపిం
తెలుగు పాఠలకు అందించారు ఎమ్. శేషాచలం అండ్ కో వారు. వృద్ధతర
నవలా రచయితలు, అతియువకులు తమవంతు 'కృషి' నందించారు. ఆ
పంటకు విశ్వనాథ సత్యనారాయణగారివంటి జగాదివ్వటి రచయిత వ్రాసిన నేపా
దేశ చరిత్రాత్మక నవలలు, కాశ్మీర చరిత్రాత్మకాలు పన్నెండు నవలలు పాకె

బుక్స్ ప్రచురణావళిలోనే వెలువడ్డాయి. విశ్వనాథ వారి పురాణ వైర గ్రంథ మాల నవలలు కూడా ఈ మూడు దశాబ్దాల నవలా సమీక్షలో పేర్కొన దగి నవి. భ్రమర వాసిని, మ్రోయు తుమ్మెద లాంటి విశిష్టమైన నవలలు కూడా ఈ ఆరవైలలోనే విశ్వనాథ వెలువరించారు. విశ్వనాథ వారితోపాటే నోరి నరసింహ శాస్త్రిగారు కూడా మల్లారెడ్డి, ధూర్జటి వంటి చరిత్రాత్మక నవలలు ఈ కాలం లోనే ప్రకటించారు. ఇక సామాజిక ఇతివృత్తాలు పరిశీలిస్తే గోపీచంద్ ఈ మూడు పదుల కాలంలో చాలా నవలలు వ్రాశారు. మనోవైజ్ఞానికాలూ, మానసిక తాత్త్విక విశ్లేషణాలూ అయిన నవలలు మెరుపులు – మరకలు, గడియ పడని తలుపులు, పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా, చీకటి గదులు (అసం పూర్ణం) ఈ కాలంలో వెలువడ్డవే. నవలా రచయితలుగా ఒకప్పుడు ప్రసిద్ధు లైన మొక్కపాటి నరసింహ శాస్త్రి, ఉప్పల లక్ష్మణరావు, తమ ప్రసిద్ధ రచనల అనుబంధ సంపుటాలు ప్రచురించడం విశేషం. మొక్కపాటి వారి బారిస్టర్ పార్వతీశానికి, ఉప్పల వారి అతడు – ఆమెకు రెండు, మూడు భాగాలు ఈ కాలంలో వెలువడ్డాయి.

రాష్ట్ర సాహిత్య అకాడమీ బహుమానం పొందిన మహీధర రామమోహన రావు గారి 'కొల్లాయి గట్టితే నేమి' తెలుగు నాట జాతీయోద్యమాన్ని చక్కగా వర్ణించిన నవల.

సాలీనా కొన్ని వందల నవలలు వెలువడుతూ ఉండడం వల్ల సాహిత్య విమర్శకులు రాశీ వాసీ అంటూ బేరీజు వేయడంలో తికమక పడవలసి వస్తు న్నది. ఆర్. ఎస్. సుదర్శనం గారి సంసార వృక్షం, అసుర సంధ్య, మేధావి వర్గం పాఠకులకు బాగా నచ్చినా బహుళ పరిధి పాఠక ప్రీతి పాత్రాలు కాలేదు, ఏనుకొండ నాగరాజు 'ఊబిలో దున్న' సమకాలీన సాంఘిక రాజకీయ కళ్మ లాన్ని ధ్వన్యాత్మకంగా చిత్రించిన ప్రతీకాత్మక నవల. మహిళల్లో వాసిరెడ్డి సీతాదేవి, రంగనాయకమ్మ, మాలతీచందూర్ పాఠకుల అభిమానాన్ని సము పార్జించుకున్నారు. వాసిరెడ్డి సీతాదేవి రచించిన 'మట్టి మనిషి' తెలుగు దేశం లోని నగరీకరణ ప్రభావపు సంధి కాలాన్ని అద్దంపట్టి చూపుతున్నది. బలివాడ కాంతారావు 'దగాపడిన తమ్ముడు' నగరీకరణ ప్రభావంలో సామాజిక మూల్యాలు ఎట్లా తలక్రిందులైనవో సమర్థంగా చిత్రించిన నవల. ఇటీవల 'వంశధార' అనే నవలను కూడా ప్రకటించారు కాంతారావు. ఇది విశాఖ మండల సామాజిక జీవనాన్ని మూడు తరాల సాంఘిక పరివర్తనలను చిత్రించే నవల. వడ్డెర చండీదాసు 'హిమజ్వాల' మనోవైజ్ఞానిక, అస్తిత్వవాద సిద్ధాంతాలను గర్భీకరించుకొన్న నవల. ఈ ముప్ఫై ఏళ్ళలో కనీసం ముప్ఫైవందల నవలలు

వచ్చాయని అతి సామాన్యమైన అంచనా వేసుకున్నప్పటికీ ముప్పై అయినా మంచి నవలలు ఎంచి చెప్ప మంటే కష్టసాధ్యం.

**కథ :-**

కథ విషయంలో కూడా "అనితరసాధ్యం నా మార్గం, నాదొక దుర్గం, నాదొక స్వర్గం లేదా సర్గం" అని చెప్పుకోగలిగిన శిల్పపరిణతి కాని, వస్తూదాత్తతకాని ప్రకటితం చెయ్యగల గొప్ప కథలు ఈ మూడు దశాబ్దాలలో రాలేదేమో ననుకోవలసి వస్తుంది. తెలుగు కథను ఇతివృత్త శిల్పాభిరామ సుందరంగా తీర్చిన జాతి కథకుల సరసను చేర్చగల కథకులు ఈ మూడు దశాబ్దాలలోంచి పేర్కొ_వాలంటే కష్టమే. కాని, తెలుగుతనాన్ని, తెలుగువారి సాంఘిక జీవిత వాతావరణాన్ని, మానవ జీవితంలోని విలక్షణ మానసిక ప్రవృత్తులను, శ్లాఘాపాత్రంగా చిత్రించిన మంచి కథలు కొన్ని వచ్చాయి. భాష, భావం, శైలి, ఎత్తుగడ, ముగింపు ధ్వని, విషయకంగా మధురాంతకం రాజారాం, కలువ కొలను సదానంద, శ్రీమతి ఆర్. వసుంధరాదేవి, త్రిపుర, కాశీ పట్నం రామారావు, రాచకొండ విశ్వనాథ శాస్త్రి, బీనాదేవి కొన్ని మంచి కథలు వ్రాశారు. రాజకీయ సిద్ధాంత నిబద్ధత, నిమగ్నతల విషయంగా ఉత్తమ శ్రేణి తెలుగు కథా రచయితలు తాదాత్మ్యం చెందినంతగా తెలుగునాటి కవులూ, నాటక రచయితలూ ఎక్కు_వగా పట్టించుకోలేదు. శ్రీమతి వసుంధరా దేవి ప్రకటించిన గాలిరథం, నీడలు, తాత్త్విక భూమికలు గల మంచి కథా సంపుటాలు. కలువకొలకు సదానంద నవ్వే కళ్ళు - ఏడ్చే పెదవులు. సాహిత్య అకాడమీ బహుమతి పొందిన ఉత్తమ కథల సంపుటి. నవలలు వందల సంఖ్యలో ప్రకటితమయితే కథలు వేల సంఖ్యలో ప్రచురితమై ఉంటాయి. మూడు పదుల ఈ సాహిత్య కాలిక వ్యవధిలో అయినా గురజాడ, వేలూరి, బాపిరాజు, శ్రీపాద, మల్లాది, బుచ్చిబాబు వంటి కథకుల్ని మరో ముగ్గురు నలుగుర్ని ఆ శ్రేణికి చేర్చమంటే కష్టసాధ్యమే ననిపిస్తూంది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తొలినాళ్ళ తెలుగుకథలను రెండు సంపుటాలుగా శ్రీ రాజారాం సంపాదకత్వంలో వెలువరించడం మెచ్చదగిన సంగతి. శ్రీ చిలుకూరి నారాయణ రావుగారివంటి పండిత విమర్శకులు కూడా కథలు వ్రాసిన విషయం ఈ సంపుటాలవల్ల వెల్లడి అవుతుంది. వచ్చే సంవత్సరానికి తెలుగు కథకు నూరేళ్ళ పండుగ జరుగవలసి ఉంది. ఈ డెబ్బై అయిదు సంవత్సరాల కాలంలో వెలువడ్డ కథల్లో 75 మంచి కథలను ఎన్నిక చేసి సాహిత్య అకాడమీ వంటి ఏ సంస్థ అయినా ప్రకటించడం సముచితం.

**విమర్శ:—**

ఆధునిక సాహిత్యంలో అంతగా పరిపుష్టంకాని శాఖ విమర్శ. ఇటు భారతీయ సంప్రదాయ పరినిష్ఠితమైన కొలబద్ధతోగాని, అటు ఇంగ్లీషు సాహిత్య విమర్శ రీతులతో తలమున్కలైన పరిజ్ఞానంతోకాని ఆధునిక తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియల వికాసరీతులను విమర్శించి చూపగల జిజ్ఞాసువులు తెలుగు వారికి కరవైనారని చెప్పవలసి ఉంది. విశ్వవిద్యాలయ బోధకమండలికి ఇటువంటి అవస్థ ఉన్నట్లు కనిపించదు. తెలుగు నవల గురించి, కథా ప్రక్రియ గురించి గాని, ఆధునిక కవిత్వం, మొదలైన అంశాలను గురించి గాని ప్రామాణికమైన విమర్శ గ్రంథం ఇంత వరకు వెలువడలేదు. కాని ఈ ముప్పై ఏళ్ళ సాహిత్య సమీక్ష ప్రస్తావన చేస్తున్నప్పుడు కె. వి. రమణారెడ్డి, ఆర్. ఎస్. సుదర్శనం, ఆరుద్ర, జి. వి. సుబ్రహ్మణ్యం, వంటి విమర్శ రీతులు తెలిసిన కొందరు తమ అభినివేశం కొద్దీ సాహిత్యంలోని పాత కొత్తల తీరుతెన్నులను సమీక్షించే రచనలు కొన్ని వెలువరించారు. కె. వి. రమణారెడ్డి గురజాడ అప్పారావు జీవితం — సాహిత్యం విషయమై సమగ్రమైన సమాచార సంభరిత గ్రంథాన్ని రచించారు. ఆర్. ఎస్. సుదర్శనం, సాహిత్యంలో దృక్పథాలు, సాహిత్యనేపథ్యం, సాహిత్యమూ - సమాజమూ వంటి విమర్శ సంపుటాలు ప్రకటించారు. ఈ విమర్శ రచనలలో ఎక్కువగా ఆధునిక సాహిత్య సిద్ధాంతాలను, ధోరణులను, అనువర్తిత దృక్పథాలను శ్రీ సుదర్శనం విశ్లేషించి చూపారు. సృజనాత్మక రచయితలలో చెప్పుకోదగిన కొడవటిగంటి కుటుంబరావు ఆధునిక సమాజాన్ని గురించి, సాహిత్యాన్ని గురించి విమర్శాత్మక రచనలు కొన్ని వెలువరించారు. రాచమల్లు రామచంద్రారెడ్డి గారు కొన్నాళ్ళు మాత్రమే నడిపిన సంవేదన పత్రిక ప్రధానంగా సాహిత్య విమర్శనం దృష్టిలో పెట్టుకుని వెలువడిందే. చలం సాహిత్యం దృక్పథం, సామాజిక విశ్వాసాలను గురించి అతి తీవ్రమైన నిరసన వైఖరితో డా. నిమ్మగడ్డ వేంకటేశ్వరరావు చలం శ్మశాన సాహిత్యం పేరుతో ఒక చిన్న విమర్శ గ్రంథాన్ని ప్రకటించారు. అది కొంత వాదాన్ని రేకెత్తించింది. ఈ గ్రంథం పై ప్రతి విమర్శగా రంగనాయకమ్మ ఇంకొక గ్రంథం వ్రాశారు. విమర్శ అనగానే భూషణ దూషణలనుమించి ఆలోచించలేని దృక్పథం ఆధునిక కాలాన కూడా ఇంకా కొనసాగుతూనే ఉన్నది. ఏది ఏమైనా తెలుగు సాహిత్యంలో విమర్శ ప్రక్రియకు స్వతంత్రమైన ప్రతిపత్తి ఇంకా ఏర్పడలేదు. గుంటూరు శేషేంద్ర శర్మ ప్రకటించిన 'కవిసేన మేనిఫెస్టో' ఆధునిక కావ్యాలంకార సిద్ధాంత గ్రంథంగా ఆయన ఉద్దేశించినట్లు

కనపడుతుంది. కవిత్వాన్ని కవిత్వంగానే అధ్యయనం చేయాలి, అభిమానిం చాలి, ఆనందించాలి కాని, సామాజిక రాజకీయ సిద్ధాంత వాహికగా కాదు అనేది శర్మగారి అభిప్రాయం. ఆధికులలో కళావాది, సౌందర్యవాది, అనుభూతి వాదిగా కనిపిస్తారు గుంటూరు శేషేంద్ర శర్మ.

**ఆత్మకథలు:-**

ఈ ముప్పై ఏళ్ళలో తెలుగు సాహిత్యంలో కొన్ని మంచి ఆత్మ కథలు వెలువడ్డాయి. జీవిత చరిత్రకాని, స్వీయ చరిత్రకాని తెలుగు వాళ్ళు ఇంకా ఒక విలక్షణమైన సాహిత్య ప్రక్రియగా గుర్తిస్తున్నట్లు కనిపించదు. సృజనాత్మక సాహిత్యానికి సాటిగా, ఇంకా అంతకంటే కూడా సమాదృతమవుతూ పాశ్చాత్య దేశాలలో జీవిత చరిత్ర, స్వీయచరిత్ర ప్రక్రియ రచనలు ప్రతి యేడూ చాలా వెలువడుతూ ఉంటాయి. సాహిత్యపు విలువలు కల గ్రంథాలుగా కూడా అభి పరిగణిత మవుతాయి. ఉదాహరణకు సుప్రసిద్ధ చరిత్రవేత్త అయిన గిబ్బన్ రచించిన రోమన్ సామ్రాజ్య పతనం అనే గ్రంథం చారిత్రకులకు శిరోధార్య మైనది. సాహిత్య విద్యార్థులు కూడా దానిని అంతే గాడాభిమానంతో అధ్యయనం చేస్తారు. ఇంగ్లీషులో వెలువడ్డ స్వీయచరిత్ర లెన్నో సాహిత్య గౌరవానికి నోచుకున్నవి ఉన్నవి.

ఈ మూడు దశాబ్దాలలో సుమారు ముప్పై వరకు స్వీయ చరిత్రలు వెలువడటం చెప్పుకోదగిన సంగతి. స్థానం నరసింహారావు వంటి ఉత్తమ కళా కారుడు స్వీయచరిత్ర ప్రకటించుకున్నారు. దువ్వూరి వేంకటరమణశాస్త్రి వంటి పేరుకెక్కిన వైయాకరణులు స్వీయచరిత్ర వెలువరించారు స్వాతంత్ర్యో ద్యమంలో పాల్గొన్న దేశభక్తులెందరో తమ అనుభవాలను అక్షర బద్ధం చేశారు. గొట్టిపాటి బ్రహ్మయ్య వంటి వృద్ధతమ నాయకులు స్వీయ జీవితో దంతం అక్షరబద్ధం చేశారు. ఈవిధంగా వెలువడ్డ స్వీయచరిత్రలలో అయ్యా దేవర కాళేశ్వరరావు గారి నా జీవిత కథ- నవ్యాంధ్రం, మామిడిపూడి వేంకట రంగయ్యగారి మారుతున్న సమాజం - నా అనుభవాలు ప్రత్యేకించి పేర్కొన దగినవి. ఈ ఆత్మకథల్లోని విశేషం ఏమంటే తమ జీవితానుభవాన్ని కేంద్ర బిందువుగా చేసుకొని సమాజాన్ని, సామాజిక పరిణామాలను, వీరు పరిధిగా విస్తరింపచేయడం. సమకాలీన ఆర్థిక, సాంఘిక, మత, నైతిక, రాజకీయ పరిణా మాలను ఆ పరిణామ హేతువులను, చోదక శక్తులను చక్కగా విశ్లేషించి చూపారు వారు. నిజానికి ఇవి సామాజిక చరిత్రలుగా ప్రామాణికంగా నిలుస్తాయే కాని కేవలం స్వీయ చరిత్రలుగా మిగిలిపోవు. ఈ శతాబ్ది ప్రథమ దశకంలోనే

తెలుగులో స్వీయచరిత్ర తొలిసారి రూపురేఖలు దిద్దుకొన్నా మొదటి అర్ధశతాబ్ది కన్నా తరువాతి ఈ 30 ఏళ్ళలోనే సముపాధికమైన స్వీయ చరిత్రలు వెలువడ్డాయి.

ఉత్తమ సాహిత్య ప్రమాణాలతో జీవిత చరిత్ర అనేది తెలుగు వారు ఇంకా నేర్వవలసిన కళ. ఈ 30 ఏళ్ళలో జీవిత చరిత్రలు చెప్పుకోదగినవి ఏవీ వెలువడలేదు.

ప్రాచీన సంప్రదాయ పద్ధతిలో కొన్ని ప్రబంధ వ్యాఖ్యానాలూ వెలువడ్డాయి. వాటితో ముఖ్యంగా చెప్పదగినది శ్రీ తాపీ ధర్మారావుగారి పారిజాతాపహరణ వ్యాఖ్య. దీనిలో ఆయన వివిధ రామణీయకాలను చూపారు.

సంస్కృత కావ్యాల అనువాదాలు, ప్రముఖ సంస్కృత మత గ్రంథాల అనువాదాలూ చాలా వచ్చాయి. కావ్యాలలో పండితవరేణ్యులు శ్రీ కప్ప గంతుల లక్ష్మణ శాస్త్రి విక్రమాంకదేవ చరిత్ర గొప్పది బిల్హణుని మూలానికి దీటుగా ఆయన, ఆయన మిత్రుడు శ్రీ మాదిరాజు విశ్వనాథరావు అనువదించారు. మరొక మహోదాత్తానువాదం ఆర్య. దానికి నీతి ద్విషష్టిక అని నామాంతరం. దీనిని విద్వద్విమర్శకవరేణ్యులు శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు అనువదించారు.

## పరిశోధన :

శాసన, చరిత్ర భాషా పరిశోధనలో మాత్రం చరిత్రగతిని మళ్ళించగల్గ కొన్ని గ్రంథాలు వెలువడ్డాయి. సుగృహీతనామధేయులు కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావు దక్షిణదేశదేశీయాంధ్ర వాఙ్మయాన్ని నూతన దృక్పథంతో విమర్శించి, 'దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం' అనే గ్రంథం వెలువరించారు. దానిలో మధుర నాయకరాజు విజయరంగ చొక్కనాథుడు ఒలాందులకు వ్యాపారం చేసుకోడానికి ఇచ్చిన తెలుగు శాసనం ఉదాహరించి తెలుగు చరిత్రకొక తురాయి చెక్కారు. ఈ శాసనం బంగారురేకుపై చెక్కినట్టిది. ఇది హాలెండువారి నుంచి వారి వలస రాజ్యమైన ఇండోనీషియా చేరి నేడు బటేలియా మ్యూజియంలో భద్రంగా ఉంది. పుదుకోట రాజుల కేతనం మీద 'బృహదంబా సహాయం' అనే వాక్యం తెలుగు లిపిలో ఉండడాన్ని శ్రీ వేంకటరావు కనుగొని, ఆ రాజుల మూలం తెలుగువంశమని నిరూపించడం మరొక గొప్ప అంశం.

శ్రీ కొల్లూరి హర్షవర్ధనశర్మ భారతిలో ప్రచురించిన కృష్ణరాయల్ల గఘ్ను

శాసనం కాటయ వేముని అన్నవర శాసనం చరిత్రకారులలో గొప్ప సంచలనాన్ని కలిగించాయి.

డాక్టర్ నేలటూరి వేంకట రమణయ్య చరిత్ర పరిశోధనంతా ఒక ఎత్తు, ఆంధ్ర కర్నాటక సాహిత్య చరిత్ర గతిని మార్చిన గంగాధర శాసన ప్రచురణం మరొక ఎత్తు. కర్నాటక ప్రథమ కవి అయిన పంపడు జైనుడు కావడం వలన తెలుగుదేశంలో ఉండలేక కృష్ణదాటి కన్నడ దేశానికి వలస వచ్చాడని అది వరకు ఉన్న చరిత్ర గంగాధర శాసనం బయలుపడడంతో తారుమారయింది. ఈ శాసనాన్ని పంపని తమ్ముడు జినవల్లభుడు కరీంనగర్ జిల్లా రామగిరిగుట్టపై వేశాడు. దీనివల్ల పంపడు తెలుగుదేశందాటి రాలేదని వేంగి నుంచి కరీంనగర్ ప్రాంతమైన సబ్బిసాయిరానికి వచ్చి, అక్కడి అరికేసరిని ఆశ్రయించాడని నిర్ణయం కావడంతో కన్నడ సాహిత్య చరిత్ర గతి మారిపోయింది. జినవల్లభుడు శాసనమంతా కన్నడ సంస్కృతాలలో వేసి, చివర తెలుగు కంద పద్యాలు రచించాడు. దానినిబట్టి నన్నయ భట్టారకునికి వందఏళ్ళ ముందే తెలుగు కవిత సలక్షణంగా ఉండేదని తేలింది.

ఆంధ్రప్రదేశ్ అవతరించిన వెంటనే రెండు నెలలకు వెలువడిన అపూర్వ పరిశోధన గ్రంథాలలో ఒకటి మన లిపి పుట్టు పూర్వోత్తరాలు. దీని రచయిత నేను (తిరుమల రామచంద్ర). లిపి పరిణామం తెలిపే ఇలాటి గ్రంథం భారతీయ భాషలలోనే అంతకు ముందు లేదు. తర్వాత మూడు దశాబ్దాలు గడచినా రాలేదు.

శ్రీ కందుకూరి ఈశ్వర దత్తు చారిత్రక భూగోళం, శాసన పదకోశం అంతవరకు అలాటి గ్రంథాలు లేని లోటు తీర్చాయి.

భాషా పరిశోధనలలో పెక్కు విశ్వవిద్యాలయాల సిద్ధాంత గ్రంథాలు (పిహెచ్.డి.లు) వెలువడినా చాలా వరకు పిష్టపేషణాలే. రాష్ట్ర సాహిత్య అకాడెమీ ప్రచురించిన వృత్తి పదకోశం ప్రశంసనీయమైన సేవ చేసింది. భాషా శాస్త్రాన్ని మానవజాతి శాస్త్ర, సాంఘికశాస్త్ర, చరిత్రాదులతో సమన్వయించి రచించిన అపూర్వ గ్రంథం నుడి నానుడి నాదే (ఇది కూడా తిరుమల రామచంద్రదే). ఈ పద్ధతిలోను ఇలాటి గ్రంథాలు తర్వాత వెలువడలేదు.

ప్రాకృతానికి తెలుగుకూ రెండువేల సంవత్సరాలకు పైగా సంబంధం ఉంది. స్వాతంత్ర్యానికి ముందు శ్రీ పరవస్తు వెంకట రామానుజస్వామి మున్నగు వారుచేసిన కృషి కనిపిస్తుంది. ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత దీనికి ఎంతో ప్రోత్సాహం కలుగవలసింది. కాని కలుగలేదు. ప్రాకృత అకాడెమీ పక్షాన ప్రచురించిన "గాథా సప్తశతిలో తెలుగు పదాలు", "ఎవ్వెరీ దే లైఫ్ ఇన్ ప్రాకృత లిటరేచర్" అనే రెండు అపూర్వ గ్రంథాలు మాత్రమే ప్రాకృత

భాషలో తెలుగు వారి పరిశోధనకు తార్కాణాలుగా కనిపిస్తాయి. గాథాసప్తశతిలో తెలుగు పదాలు ఉన్నవని, గాథా సప్తశతిని కాళిదాసు అనుకరించాడని నేను ఈ గ్రంథంలో మౌలికంగా పరిశోధించి తొలిసారిగా సిద్ధాంతీకరించాను. ప్రాకృత సాహిత్యంలోని ప్రజా జీవితాన్ని డాక్టర్ కె. కమలమ్మ పైన పేర్కొన్న రెండవ గ్రంథంలో ప్రశంసనీయంగా వివరించారు.

ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత ఆంధ్రులను ఏకంచేయడానికి జరిగిన కృషికి మహత్తర ఫలితం 1975లో హైదరాబాదులోను, 1981లో మలేషియా రాజధాని కౌలాలంపూర్‌లోను జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచికలు. సామాన్య ప్రజలకు ఇవి తెలుగు వైభవాన్ని తెలిపే మణిదీపికలు. ఈ సభల విజయానికి కారణభూతులైన నిర్వాహకులు, అప్పటి విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అభినందనీయులు.

తెలుగు అధికార భాష కావడంతో తెలుగు పాఠ్య పుస్తకాలు వివిధ శాస్త్రాలలో అవసరమయ్యాయి. తెలుగు అకాడమీ ఆ పాఠ్య పుస్తకాలను మహాపండితులతో వ్రాయించి అందించడమనే మహాధ్వరానికి పూనుకొని నిర్వహిస్తున్నది.

ఏ రంగంలోను భారతదేశం కాని, ప్రపంచం కాని తలలూపే గొప్ప ధోరణులకు దారి తీయగల రచనలు వెలువడలేదనే ఆవేదన ఈ వ్యాసంతో తెలిపాను. ఏ రచయితనూ కించపరచడం నా ఉద్దేశం కాదు. నూతన ధోరణులకు, మౌలికతకుగల మన్నన ఎలాటిదో సహృదయ హృదయైకవేద్యం.

పెద్ద పొరపాటు జరిగింది. శ్రీ తెన్నేటి సూరి నోబెల్ బహుమతి రాదగినట్టి గొప్ప నవల రచించారు. అది చెంగిజ్ ఖాన్. స్వాతంత్ర్యానంతరం వచ్చిన అద్వితీయ చారిత్రక నవల అదేనని నా తలంపు.

# నా కలలు

మానవుడు తన పరిసర స్వరూప స్వభావాలేమిటో తెలియక చీమ చిటుకుమన్నా చెల్లా చెదరై పారిపోయే పరిస్థితినుంచి, అంతు తెలియని దేదో తనను ఆడిస్తున్నదనే నమ్మకం కలిగిన తర్వాత తనే కాదు, "భీషాస్మా ద్వాతః వదతే, భీషోదేతి సూర్యః" అని తన భయాన్ని తన చుట్టుపట్లకూ ఆపాదించే దశనుంచి, "అస్మిన్ లోకే ప్రతతిష్ఠాసీతి, అస్మిన్నేవలోకే ప్రతితిష్ఠతి" అనే నిశ్చయానికి వచ్చిన అవాంతర దశలకూ, సశరీరంగా శాశ్వతత్వం సంభవం కాదని నిరాశపడినా ఏదో రీతిగా (సప్త సంతానాలలో నన్నా) నిలిచి ఉండాలనే బలీయ సంకల్పానికి - అమరత్వ వాంఛకు, జిజీవిషకు - విస్తృత రూపాలే ఆలయాలు, అట్టువలు, సమాధులు స్తూపాలు, పురాలు, గోపురాలు, పిరమిడ్లు పీఠాలూను.

తథాగతుని దంతధాతు చరిత్ర, అతని కేశ దశకంపై నెలవు కట్టుకున్న రంగూన్‌లోని ఘంటామందిరం, చిదంబరంలోని పతంజలి సమాధి అని పండితులు భావించే నటరాజ మందిరం, ఈజిప్టులోని ఫేరోవా రాజ వంశీయుల పాంచభౌతిక దేహాన్ని భద్రపరచుకున్న పిరమిడ్లు, యమునా తీరంలోని తాజ్‌మహల్ మన కట్టెదుట నేటికీ నిలిచిన రూపాలు. ఇక సాహిత్యమా!

సాహిత్యం సమకాలీన ప్రజా జీవితానికి ప్రతిబింబమూ, భావికాలీన లక్ష్యానికి ఆదర్శమూ అవుతుంది. మహాకవి ప్రజలమధ్యనే మసలుతూ వారి కంటె ఒక్కొక్క అడుగే ముందుకువేస్తూ వారిని నవనవోషస్సును తిలకింపజేస్తాడు; తను విశ్వ శ్రేయమని విశ్వసించిన దానిని జంకు కొంకులులేక గంటవలె కంగున మ్రోయించి వినిపిస్తాడు. అట్టికవికి వాస్తవమైన స్మారక చిహ్నం అతని కవితల వ్యాప్తే అయినా, మానవుని 'వీర పూజాసక్తి', శాశ్వతత్వానురక్తి మిన్నకుండవు. దీనికి ఉజ్జ్వల నిదర్శనమే ఉజ్జయినిలో కాళిదాసు స్మారక చిహ్నం నెలకొల్పాలనే నిర్ణయం, (కాకతీయుల మన్ననలందిన) కంబ మహాకవికి సంస్మరణచిహ్నం కడుదామనే తమిళుల తలంపూను.

ఈ విషయంలో మనమూ నడుం కట్టాలి. తెనుగును విశ్వ సాహిత్య స్థాయికి తీసుకొనివెళ్ళిన కవి మహారథులకు ఏటేటా నివాళులివ్వడంతోనే తన్వి

చెందక శాశ్వతమైన చిహ్నాలుకూడా నెలకొల్పుకోవాలి; మన మనసును నివేదించుకోవాలి.

తన ప్రసన్న కథాకవితార్థ యుక్తితో ఆంధ్ర కవితకు ఆకృతి తిద్దిన ఆదికవి నన్నయకు గోదావరీ తటాన గోపురం కట్టాలి. జాను తెనుగు జాలు వార్చి, ద్విపదను సృష్టించి నూతనపథాన్ని తీర్చిన సోమనాథునికి పాల్కురికిలో సౌధం కట్టాలి. రామాయణ గాథను ప్రజల పారాయణ కథగా చేసిన రంగ నాథునికి ఓరుగల్లులో వీరగల్లు వేయించాలి. తెలుగువారి రాజకీయ ధురంధ రతకు కవితలో కమనీయరూపం కల్పించిన కవి బ్రహ్మకు పెన్నానది గట్టున కీర్తి స్తంభం కట్టాలి; కనీసము పాటూరులోని అతని గంటం ఒరనైనా భద్ర పరచుకోవాలి. ప్రబంధ పరమేశ్వరునికి పెంచికల దిన్నెలో పీఠం నెల కొల్పాలి. తన మందార మకరంద మాధుర్యముతో తెలుగు గుండెను ముంచెత్తిన పోతనకు బమ్మెరలో భవనం కట్టాలి. తెనుగు కవితకు శ్రీని కూర్చిన శ్రీనాథునికి కృష్ణాతీరంలో కట్టడం కట్టాలి. వడ్డికాసులవానిని ఇల్లటపు అల్లుణ్ణి చేసుకొన్న అన్నమయ్యకు తిరుపతిలో మరపురాని మందిరం కట్టాలి. మను చరిత్రలో మనోహరతకు మారాకు పెట్టించిన పెద్దనకు కడపలో గడప వేయించాలి. ఆముక్తమాల్యదతో తెనుగుకు అపురూపపు కల్పనల ఆణిముత్యాల సరులు కైసేసిన కృష్ణరాయునికి చంద్రగిరిలో కనక హర్మ్యం నిర్మించాలి. అచ్చ తెనుగుకబ్బాన్ని తొలిసారిగా వెలార్చిన తెలగనార్యునికి గోలుకొండలో కోట కట్టాలి. తన వసుచరిత్రతో సంస్కృత తమిళ భాషలనూ వసుమతులను చేసిన రామరాజ భూషణునికి పెనుగొండలో మేడకట్టించాలి. రాధను ఉషస్స్నుషమలతో రాజిల్లజేసిన వెలిదండ్ల వేంకటపతికి కర్నూలులో వేయి స్తంభాలశాల నిర్మించాలి. తన మాటల అడిదంతో కుకవులను జడిపించిన అడిదము సూరకవికి విజయనగరంలో విజయతోరణ మెత్తించాలి.

తన తలపులకు త్రుటిలోనే రూపు తీర్చుకొనే చేవగల తెలుగు గుండె తలచుకుంటే ఇవన్నీ ఎంతలో మాట!

# కళా విజ్ఞాన వికసనానికి ఆటుపట్టయిన మతాలు

**మతం** మాదకమైన అహిఫేనం వంటిది అని మార్క్స్ మహర్షి అన్నా, మతం అరిషడ్వర్గాల విజృంభణకు, పతనానికి కారణ మయిందని మరి కొందరన్నా, మానవజాతి మనోవికాసానికి, కల్పనా కమనీయతకు ఎంతగానో దోహదం చేసిందనడం చారిత్రక సత్యం. మతమే లేకపోతే, మానవజాతి కళారంగంలోను, శాస్త్రరంగంలోను విజయ వైవిధ్యం సంపాదించి ఉండదు. మతం, ఆస్తిక్యభావన ఒక ప్రాంతంలో భౌతికాదిశాస్త్రాల పరిణామ వికాసాలకు దారి తీస్తే, మరొక ప్రాంతంలో వాస్తుకళా శిల్ప చిత్రలేఖన కవితాది లలితకళలను కుప్పలుగా పోశాయి.

మతం అనేది ఎవరో, ఎందుకో, ఎప్పుడో, ఎక్కడో ఆలోచించి రూపొందించిన వస్తుగడేమీ కాదు, కాల దేశ వర్తమానాలను అనుసరించి, జన సందోహంలో వ్యాపించిన భావాలు, విశ్వాసాలు, ఆచారాలు క్రమబద్ధం చేయ గలిగిన ఏవ్యక్తో, ఏ వ్యక్తులగణమో ఒక మలుపు తిప్పగా, తత్ప్రవర్తితమన్న పేరుతో వ్యాప్తి చెందినట్టిది. కాని నిజానికి దాని వ్యాప్తికి, విస్తరణకు మూల కారణం ప్రజల సమకాలిక భావనా స్రవంతే. ఈ దృష్టితో చూచినప్పుడు తెలుగుదేశంలో మతాల అభ్యుత్థాన పతనాలగతి మనకు సులభంగా తెలుస్తుంది. మరొకసంగతి ఉంది. మనది దేవకుల సంప్రదాయం. గురుకులంలాగే దేవ కులమూ వివిధ దేవతా బృందం ఆలయం. గురుకులంలో ఒక జిజ్ఞాసువు అనేక గురువుల వద్ద చదువు నేర్చి జ్ఞానార్జన చేసినట్టే, ఆర్తుడు దేవకులంలోను వివిధ దేవతల సన్నిధిని సేవించి మనశ్శాంతి పొందేవాడు. ఈ దేవకులమే దేగులమయి, దేవళమయింది. రాను రాను కొందరు తమ ఇష్టదైవానికి సర్వోత్తమత్వం ఆపాదించి ఇతర దైవాలను ఈసడించడంతో మన స్పర్ధలు, వైరాలు ఏర్పడడం, ఒక మతంవారు బలపరాక్రమాలతో తమ ప్రత్యర్థులను పరాస్తులను చేయడం, తమ మతావలంబులుగా చేయడం, తర్వాత తర్వాత పరిపాటీ కాకపోలేదు. కాని, వీటన్నిటి మూలాలూ వెదుక్కొంటూ పోతే విధి

వీడిగా దేవతారాధనలున్నా, వైరాలు లేని వెలుగు-వెన్నెలకాలం ఒక్కటి ప్రతిదేశంలోను కానవస్తుంది. కొన్ని మతాలవారు పరస్పరం కలహించడం, జనశ్రేయస్సు కోరే కరుణామయులు పరస్పరం సామరస్యం కుదర్చడం, కొంతకాలానికి అదొక నూతన పథమై మతంగా పరిణమించడమూ మనం చరిత్రలో చూచినాము, చూస్తున్నాము, నేడూ.

## వైదిక, బౌద్ధధర్మాలు

ఈ పశ్చాద్భూమికతో మనం తెలుగుదేశంలో మత వికాసం పరిశీలిద్దాము. ఇప్పుడు మనం 'మతం' అంటున్న దానిని పూర్వం 'ధర్మం' అనేవారు. నేటికీ ఉత్తర భారతంలో ధర్మం అనే అంటున్నారు. వైదిక ధర్మనిష్ఠలను ధార్మిక, ధమ్మియ అని అంటున్నట్టు గాథాసప్తశతిలో పెక్కు గాథలు తెలుపుతున్నాయి. గాథా సప్తశతిలో కొంతభాగమైనా తెలుగు గడ్డపై వెలసిన సాహిత్యమని నమ్మేవారిలో నేనొకణ్ణి. కనుకనే దానిలో తెలుగునాటి జనపదాల సౌందర్యం, ఆచారవ్యవహారాలు వెల్లివిరిశాయి; దాదాపు 40 తెలుగు పదాలూ ఉన్నాయి. దానిలో శివ, విష్ణు, కృష్ణ, సూర్య, బలి, వామన, గణపతి, గౌరి, లక్ష్మి, బుద్ధదేవుల ప్రస్తావన ఉంది. రామాయణ భారతాల ప్రసక్తి ఉంది. కాని ఏ దేవతకూ సర్వోత్తమత్వం కట్టబెట్టినట్టు కనిపించదు. వైదికధర్మం ప్రధానంగా ఉండేది. వైదికధర్మం ఎప్పటినుంచి ఆంధ్రదేశంలో వ్యాపించి ఉందో స్పష్టంగా చెప్పలేము కాని, సూత్రకాలానికి ముందేననడం స్పష్టం. తెలుగుదేశంలోని అగ్రజాతివారిలో ఆపస్తంబసూత్రులు ఎక్కువమంది కావడం వల్ల, ఆపస్తంబుడు రచించిన శ్రౌత గృహ్యసూత్రాలు హెచ్చుగా తెలుగు ఆచారాలనే స్ఫురింపజేస్తాయి గనుక ఆపస్తంబుడు తెలుగువాడనే వాదం ఉంది. దీనిని బట్టి చూచినా, పాణిని అష్టాధ్యాయిని బట్టి చూచినా, వైదికమతం క్రీస్తుకుపూర్వం కొన్ని వేల సంవత్సరాలనుంచి తెలుగునాట ఉండి ఉండవచ్చునని తోస్తుంది. కనుకనే సాతవాహనులు మొదలు చాళుక్యులవరకూ తెలుగు దేశపాలకులందరూ యజ్ఞదీక్షితులయి, వైదికమతాన్నే అనుసరించడం సంభవించింది. దీనికి నాగార్జునకొండ త్రవ్వకాలలో వెలువడిన యజ్ఞవాటికలను ఉదాహరించవచ్చు.

తెలుగుదేశంలో వైదికధర్మం వ్యాప్తంగావున్నా, తర్వాత వచ్చిన బౌద్ధం జనాదరం పొందింది. బౌద్ధమతంలో కర్మకాండ లేకపోవడం, కులాల మాటే వినిపించకపోవడం, మొదట్లో ధనినిర్ధనాది తారతమ్యం తక్కువగా కనిపించడం ప్రజాసామాన్యాన్ని విశేషంగా ఆకర్షించాయి. అశోకచక్రవర్తి

కాలానికి ముందే ఆంధ్రదేశంలో బౌద్ధం వ్యాపించింది. అప్పటి శ్రావస్తితో తెలుగుదేశంలోని అశ్మక, ముళక నగరాలకు సంబంధం ఉన్నట్టు, దక్షిణాపథనటుడొకడు బింబిసారుని ఆస్థానంలో బుద్ధచరిత్రం నటించినట్టు బుద్ధచరిత్ర గ్రంథాలు తెలుపుతున్నాయి.

బౌద్ధమతంలో తర్వాత విభేదాలు చాల ఏర్పడినాయి. వాటి జోలికి నేను ఇప్పుడు పోను. కాని, బౌద్ధమతంలో హీనయాన మహాయాన మతాల ప్రసక్తి అవసరం. పిటికాలను వేదాలని నమ్మినవారు హీనయానులు. వాటి ఆధారంగా, తత్త్వచింతతో నూతనమార్గం తొక్కినవారు మహాయానులు, అంటే క్లుప్తంగా సరిపోతుంది. సాతవాహనులు వైదిక మతావలంబులయినా, బౌద్ధాన్ని ఆదరించారు. మహాయాన ప్రవర్తకుడైన నాగార్జునుని కాలానికి బౌద్ధం బాగా వ్యాపించింది. అప్పటికి ప్రాకృత భాషాప్రాధాన్యం తొలగి సంస్కృతానికే ప్రాధాన్యం కలిగింది. సంస్కృతంతోగాని వైదికులను ఢీకొనడం సాధ్యం కాదని వారికి తోచి అలా చేసినట్టు భావిస్తున్నాను. ప్రాకృత భాషా ప్రాచుర్యం క్రీస్తుశకం 4వ శతాబ్దానికే అంతరించింది. ఆంధ్ర సాతవాహనుల కాలంలో మహాయానం అప్పుడప్పుడే తల ఎత్తుతున్నదనడానికి గాథా సప్తశతి లోని ఒక గాథను ఉదాహరిస్తాను:

"కీరముహ సచ్ఛహేహిం
రేహఇ వసుహా పలాస కుసుమేహిం,
బుద్ధస్స చలణ వందణ
పడిఏహిం వ భిఖ్ఖు సంఘేహిం." (4.8)

(కీరముఖ సదృశైః
రాజతే వసుధా పలాశకుసుమైః,
బుద్ధస్య చరణ వందన
పతితైరివ భిక్షు సంఘైః.)

చిలుకముక్కులాగ ఎర్రగావున్న మోదుగ పూవులు భూమిమీద పడ్డాయి. బుద్ధుని పాదాలకు మోకరిల్లిన ఎర్రటి కాషాయాలు ధరించిన భిక్షు సంఘాలలాగ వుందట ఆ దృశ్యం. దీనికి ఒక చిన్న వివరణ వుంది. మానవుని ప్రేమ భక్తి విశ్వాసాలు స్మరణ సంకీర్తనాదులతో తృప్తిపొందవు. కనుక ఒక సాకార కల్పన చేసుకొని, దానిని అతిలోకంగా రూపుదిద్దుకొనిగాని సంతృప్తి పడడు. బుద్ధుడు తనకు దేవాలయాలు, సమాధులు వద్దన్నాడు. కాని ఆయన చితి మీదే శిష్యులు పోట్లాడారు. ఎవరికి చిక్కినవి వారు దోచుకొన్నారు

సమాధులు కట్టారు. మొదట దీర్ఘవర్తులాకారంగా ఒక రిక్తస్థలంవదలి దానికి రెండు ప్రక్కలా పైన గంధర్వుల బొమ్మలు చెక్కారు. తర్వాత ఆ దీర్ఘ వర్తులాకారం కింద కమలం చెక్కారు. కమలం జ్ఞానమూర్తి అయిన తథా గతునికి చిహ్నం. అంతటితో తృప్తి పొందక ఆ పద్మంపై పాదాలు చెక్కారు. ఆ పాదాలవరకు పరిణమించిన కాలంనాటిదే పైన పేర్కొన్న గాథ. ఆ పాదా లను మనం ఆంధ్రదేశంలోని ప్రతికొండమీదా చూడవచ్చు. నేడు వాటికి రాముని పాదాలు. సీతమ్మ వారి పాదాలు అని వ్యవహారం. ఈ పాదం గౌరవ వాచకమై యతులకు, పూజ్యులకు పేర్ల చివరన ప్రయోగించే సంప్రదాయం ఏర్పడింది; శ్రీ చరణాః, శ్రీపాదాః, శ్రీపాదంగళు, అడిగళ్ మొదలుగా. సరే. ఈ పాదాలు క్రమంగా బుద్ధమూర్తులకు కారణమయాయి. పాదాల మీద సంపూర్ణ విగ్రహం చెక్కారు. మహాయానం ప్రబలిన కాలానికి ఆంధ్రదేశ మంతటా బుద్ధలీలావిభూతి వెల్లువలై పారింది. నాగార్జునకొండ, అమరావతి, గోలి, శాలి హుండాం, జగ్గయ్యపేట-ఇవన్నీ బౌద్ధశిల్ప వాస్తువులతో వెలిగి పోయాయి. 7వ శతాబ్దిలో బౌద్ధయాత్రికుడు హుయాన్ త్సాంగ్ మనదేశానికి వచ్చిన నాటికే బౌద్ధమతం ఆంధ్రదేశంలో క్షీణదశకు వచ్చింది. దానికి తోడు వజ్రయాన సంప్రదాయం ఏర్పడి బౌద్ధమతాన్ని అధోగతిపాలు చేసింది. నాగార్జునుని శూన్యవాదానికి విజ్ఞానమనే మరొక విషయం చేర్చాడు మైత్రేయ నాథుడు. దానిలో ధ్యాన నిదిధ్యాసనలు ప్రధానం కావడంతో దానికి యోగా చారం అనేపేరు వచ్చింది. తర్వాత దానికి మహాసుఖమనే మరొక తత్త్వం చేరింది-శూన్యం, విజ్ఞానం, మహాసుఖం అనే మూల తత్త్వాలు మూడయాయి. ఈ మహాసుఖమనేది వజ్రయానానికి మూలం. ఈ మహాసుఖం కరుణామయి అయిన శక్తి సహాయంతోగాని రాదనే వాదంతో శక్తిపూజ ప్రవేశించింది. దానితో తారాదేవి, మరీచి మొదలయిన దేవతలు బయలుదేరారు. తంత్ర మంత్రాలు చెలరేగాయి. ధాన్యకటకం క్రమంగా లంజెదిబ్బ అయింది. కాని 12వ శతాబ్దందాక బుద్ధదేవరకు పూజాపురస్కారాలు అక్కడక్కడ జరుగు తున్నట్టు చరిత్ర చెబుతున్నది. ఏమైనా బౌద్ధం తెలుగుదేశానికి చేసిన మేలు చాల గొప్పది.

## శైవం ముందు వర్తిల్లిన జైనం

తెలుగుదేశంలో జైనమత పరిస్థితీ ఇలాంటిదే. నిజానికి జైనమతం తెలుగుదేశంలో మౌర్య చంద్రగుప్త సార్వభౌముని కాలానికే వున్నట్టు 12వ శతాబ్దిలో జయసేనకవి రచించిన 'ధర్మామృతం' అనే కావ్యం చెబు

తున్నది. 12వ తీర్థంకరుడైన వాసు పూజ్యతీర్థంకరుని కాలంలో ఇక్ష్వాకు రాజయిన యశోధరుడు విజయయాత్ర చేస్తూ వేగీదేశానికి వచ్చి, ముగ్ధుడై ప్రతిపాలపురం, (భట్టిప్రోలు) అనే రాజధాని స్థాపించి వుండిపోయి, జైనం పుచ్చుకొని, శ్రీపర్వతం, మల్లికార్జునం, సిద్ధవటం, అమరావతి మొదలయిన చోట్ల తపస్సు చేసినట్టు ఈ కావ్యం చెబుతున్నది. బోధాయనుని వంటి సూత్రకారుడు కళింగానికి వెళ్ళితే ప్రాయశ్చిత్తం చేసుకోవలెనని శాసించడం వల్ల జైనము బౌద్ధంలాగే ఆంధ్రంలో వ్యాపించి వుంటుందనడం నిస్సందేహం. ఖారవేల్లుడు తప్ప మరొక రాజు జైనాన్ని తెలుగుదేశంలో ఆదరించినట్లు కన పడదు. అందువల్ల తెలుగుదేశంలోని జైనులు కూడా కన్నడ దేశానికి వలస పోయినట్లు చరిత్ర చెబుతున్నది. కన్నడ మహాకవి అయిన పంపడు వేంగి దేశంనుంచి నేటి కరీంనగర్ జిల్లాలోని సబ్బిసాయిరనాడుకు వచ్చి రాష్ట్ర కూట సామంతుడైన అరికేసరి ఆస్థానంలో వున్నట్టు స్పష్టమయింది. పంపని తమ్ముడైన జినవల్లభుని శాసనం కొండకు చెక్కినది లభించడంతో పంపడు కృష్ణ దాటి మరొక తెలుగు ప్రాంతానికి వెళ్ళినవాడేకాని, కన్నడనాడుకు కాదని స్థిరపడింది. జైన మతానినికి బౌద్ధమంత అలంబన లేకపోయినా కడప, పెనుకొండ, రామతీర్థం, వరంగల్లు మొదలయిన చోట్లగల జైన శిథిలాలను బట్టి శైవం ప్రబలం అయ్యేవరకు కూడా జైనం పూర్తిగా అంతరించలేదని తెలుస్తున్నది. కాకతి ప్రతాపరుద్రుడు జైనాన్ని ఆదరించాడు. 1295-1323 లో ఓరుగంటిలోవున్న అప్పయాచార్యుని జినేంద్ర కాంత్యభ్యుదయమనే గ్రంథంలో జైనవ్యాప్తి గురించి ఎంతో వుంది. జైనులను వైదికకవులు హతమార్చినట్టు సాహిత్య చరిత్ర చెబుతున్నది. విజయనగర పాలకుడు బుక్కరాయల కాలంలో జైనులు సామరస్యంలేక అతనితో మొరపెట్టగా, వారి తగాదాలు ఆయన తీర్చినట్టు కథలున్నాయి. నేడు హంపీలోవున్న గాణిగిత్తి గుడి జైన శిథిలాలలో ఒకటి. గాణిగిత్తి గణిక. జైన శిల్పాల విషయంలో ఒక్క వింత జరిగింది. జైనశిల్పాలు చాల సుందరమయినవి. కనుక వైదికమతస్థులు వాటిని పాడుచేయక, కన్నడ వైష్ణవులు వాటికి విష్ణువు పేర్లు పెట్టినట్టే తెలుగువారు జైనుల పద్మాక్షిని పద్మాక్షితిగా, కొన్ని దిగంబర విగ్రహాలను బాలాత్రిపుర సుందరి మొదలుగ మార్చివేసుకొన్నారు. ఏమైనా, జైన మందిరాలు అంతగా పెంపొందలేదు. దానికి కారణం శైవమతవ్యాప్తే.

## శైవ, వైష్ణవ మతాలు

శైవ వైష్ణవమతాలు తెలుగుదేశంలో నేటికీ జీవించివున్న మతాలు. ఇవి

రెండూ అతి ప్రాచీనకాలంలోనే తెలుగుదేశంలో పాతుతున్నట్టు గాథాసప్తశతే మనకు సాక్షి. తెలుగుదేశంలో హరసర్వోత్తమత్వం వైదిక పద్ధతిపైనే జరిగింది. ఇది పాశుపత సంప్రదాయం. అప్పటివారు ఇప్పటి అరాధ్యులు. సాతవాహనులు, శైవం ఆదరించారనడానికి గాథాసప్తవతిని హాలుడు శివస్తుతితో ప్రారంభించి, శివస్తుతితో ముగించడం సాక్ష్యం.

పసువఇణో రోసారుణ
పడిమాసంకంత గోరి ముహఅందం,
గహిఅగ్ఘపంకఅం విఅ
సంఝూ సలిలాంజలిం ణమహ. (1-1)

(పశుపతేః రోషారుణ
ప్రతిమా సంక్రాంత గౌరీముఖ చంద్రం,
గృహీతార్ఘ పంకజమివ
సంధ్యాసలిలాంజలిం నమత.)

సంఝూగహిఅ జలంజలి
పడిమా సంకంత గోరి ముహకమలం,
అలిఅం చిఅ ఫురిఓట్ఠం
విఅవిఅ మంతం హరం ణమహ. (7-100)

(సంధ్యా గృహీత జలాంజలి
ప్రతిమా సంక్రాంత గౌరీ ముఖ కమలం,
అలీకమేవ స్ఫురితోష్ఠం
విగళత మంత్రం హరం నమత.)

ఆంధ్రదేశం పాలించిన ఇక్ష్వాకులు, శాలంకాయనులు తమను మహాసేన పాదానుధ్యాతులు, శ్రీ పర్వత స్వామి పాదానుధ్యాతులు అని చెప్పుకొన్నారు. ఈ మతం పూర్తిగా రాజాదరం పొందింది. పూర్వ చాళుక్యులు, మొదట జైనులయినా తర్వాత శైవం అవలంబించిన కాకతీయులు, విజయనగరాధీశులు శైవాన్నే పూర్తిగా ఆదరించారు. నేడు ఆంధ్రదేశం ఈ చివరినుండి ఆ చివరి వరకు ఎన్నో మహోన్నత శివాలయాలున్నాయి. నెల్లూరులో మూలస్థానేశ్వరాలయం, గుంటూరుజిల్లాలో కోటప్పకొండ, కర్నూలు జిల్లాలోని శ్రీశైలం, ద్రాక్షారామం, వేములవాడ, ముఖలింగం, కాళేశ్వరం, పచ్చల సోమేశ్వరుడు

కొలనుపాక, వరంగల్లు-ఎక్కడ చూచినా శివలీలలు, మనోహరంగా కనిపిస్తాయి. పరిసర తమిళ శైవ సంప్రదాయాలు, చాళుక్య చోళుల సంబంధంతో తెలుగుదేశానికి వచ్చాయి. శైవ నాయనార్లలో ఒకరయిన సుందరమూర్తి నాయనారు చరిత్ర ఒడియనంబి విలాసమనేపేర తెలుగులో కావ్యమయింది. సోమనాథుడు బసవపురాణంలో తమిళదేశ భక్తులయిన అరువత్తు మువ్వరును చాలావరకు పేర్కొన్నాడు.

ఆచార్య నీలకంఠశాస్త్రిగార్నట్టు దేవాలయమనేది అనాడు ఒక విశ్వవిద్యాలయం, కళానికేతనం, పూజాస్థలం మాత్రమేకాదు, ప్రజల సాంఘిక, సాంస్కృతిక ఆర్థిక జీవితాలలో చాలాభాగం పూరించేది. దేవాలయ నిర్మాణం, నిర్వహణం ఎందరికో వృత్తి కల్పించేది. విగ్రహనిర్మాణం శిల్పుల చాతుర్యానికి మెరుగులు దిద్దేది. నిత్యోత్సవాదులు అర్చకులకు, సంగీతజ్ఞులకు, నృత్యవేదులకు. వంటవారికి- ఇంకా ఎందరికో వృత్తి కల్పించేది. ఉత్సవాలలో పోటీలు, పందేలు, కుస్తీలు, జరిగేవి; వినోదం కలిగించేవి. దేవాలయాల ఆవరణలోనే పాఠశాలలు, వైద్యశాలలు నెలకొనేవి. ఉత్సవాలంకరణకు వాడే నగనట్రతో నగల వ్యాపారులకు, నిర్మాతలకు వృత్తి కలిగేది. నిజానికి దేవాలయం, ధర్మోత్పన్నమైన ఆత్మగుణాలతో ప్రజలను నాగరికులను చేసేది. మధ్యకాలంలో దేవాలయం సాంఘిక శ్రేయస్సాధకమైనసంస్థగా పెంపొందిందనడానికి సందేహం లేదు. బౌద్ధజైనుల చైత్యారామాలు సంస్కృతికి ఎంతగా ఉపయోగపడ్డాయో, ఆ విధంగానే శైవ, వైష్ణవ దేవాలయాలూను. ఈ రెండు మతాలూ ముస్లిముల దండయాత్రను అరికట్టడానికి సహకరించాయి. కాని శైవానికి ప్రధానాలంబనమైన కాకతీయసామ్రాజ్యం కూలిపోవడంతో శైవం పట్టుతప్పింది. వైష్ణవానికి ప్రాబల్యం ఎక్కువయింది.

వైష్ణవ మతానికి మొదట వాసుదేవ మతమని పేరు. ఈ వాసుదేవమతం భాగవతమతమని పేరుపొందింది. ఈ మతం ఉత్తరంనుంచి సాతవాహనుల కాలంలో తెలుగుదేశానికి వచ్చినట్టు కనిపిస్తుంది. సాతవాహనులలో పలువురు వాసుదేవ. సంకర్షణ, వర్ధన, కృష్ణ, కేశవాది నామాలు ధరించారు. గాథాసప్తశతిలో విష్ణు కథలున్నట్టు ఇదివరకే చెప్పాను. గాథాసప్తశతినుంచి ఒక గాథ ఉదాహరిస్తాను :

ణచ్చణ సలాహణ ణిహేణ
పాస పరిసంఠిఅ నిఉణ గోవీ,
సరిసగోవియాణ చుంబఇ
కవోల పడిమాగఅం కణ్హమ్. (2-14)

(నర్తన శ్లాఘన నిభేన
పార్శ్వ పరిసంస్థితా నిపుణగోపీ,
సదృశగోపీనాం చుంబతి
కపోల ప్రతిమాగతం కృష్ణమ్.)

గోపికలు, కృష్ణుడు కలిసి నృత్యం చేస్తున్నారు. ఒక్క గోపి చెక్కులమీద కృష్ణునిరూపం ప్రతిఫలించింది. ప్రక్కనఉన్న గోపి దానిని చూచింది. ఆ గోపి నృత్యాన్ని మెచ్చుకొనే సాకుతో కృష్ణుని ప్రతిబింబాన్ని ముద్దుపెట్టుకొంది. ఇలాటి కృష్ణలీలల వర్ణనలు గాథాసప్తశతిలో చాలా ఉన్నాయి.

ఇక్ష్వాకుల తర్వాత తెలుగుదేశాన్ని పాలించిన పల్లవులకాలంలో, స్కందవర్మ పరిపాలనప్పుడు ధాన్యకటకంలో యువరాజుగా వున్న బుద్ధవర్మ భార్య చారుదేవి దాలూరులోని నారాయణ దేవకులానికి కొంతభూమి దానం చేసింది. "దాలూరే కూలి తరక దేవకులస్స భగవన్నారాయణస్స." ఇదే విష్ణు దేవాలయాలకు మొదటిసారిగా భూమి దానంచేసినట్టు తెలిపే మొదటి శాసనం. కూలితరక అనేవాడు దేవాలయ నిర్మాత అయివుంటాడని చరిత్రకారుల నిర్ణయం. ఈ శాసనం క్రీ.శ. నాల్గవ శతాబ్దంది. మౌర్య సమ్రాట్టయిన సముద్ర గుప్తుని భారతవర్ష దండయాత్రాకాలానికి ప్రాకృత శాసనాలు వేయడం ఆగిపో యింది గనుక, ఇది కడపటి ప్రాకృత శాసనమని పరిశోధకుల అభిప్రాయం.

ఆంధ్రదేశంలో శ్రీకాకుళం, వేల్పాద్రి, తిరుపతి మొదలయినవి ప్రాచీన విష్ణ్వాలయాలున్నా, వైష్ణవమతం నేటి విశిష్టాద్వైత సిద్ధాంతంతో వ్యాప్తి చెందింది రామానుజులవల్లనే. ఈయన 11వ శతాబ్దివాడు. తిరుపతి పూర్వం శాక్త, శైవ క్షేత్రమని రామానుజులే దానిని ఏదో మాయామహిమలతో వైష్ణవ క్షేత్రంగా చేశారని ఒక కట్టుకథ. కాని, రామానుజులకు రెండువందల ఏండ్లకు ముందే ఇది వైష్ణవ క్షేత్రమయినట్టు శాసనాలున్నాయి. పల్లవ రాజయిన కోవిజయదంతి విక్రమవర్మ క్రీ.శ. 830లో తిరువెంగడ కొట్టంలోని ఉలగ ప్పెరుమాన్‌కు నందాదీపం దానంచేసినట్టు శాసనం ఉంది.

హరిసర్వోత్తమత్వ సిద్ధాంతాన్ని వైఖానస పాంచరాత్రాగమాలతో కలిపి, ప్రపత్తి - శరణాగతి అనే కిరీటంతో స్థాపించినవాడు నాథముని అనే అపరనామం గల రంగనాథాచార్యులు. ఈయన మనుమడే యామునా చార్యుడు. ఈయన హరిసర్వోత్తమత్వ ప్రతిపాదకమైన ఒక స్తోత్రం రచించాడు. దీనికి స్తోత్రరత్నమని, ఆళవందార్ స్తోత్రమని పేరు. ఇది కవితాదృష్టితోను గొప్పది. భగవంతుని అతిలోక సుందరుడుగా, నిత్యయౌవనుడుగా చెప్పిన ఒక శ్లోకం ఉదాహరిస్తాను :

"ప్రబుద్ధ ముగ్ధాంబుజ చారులోచనం
సవిభ్రమ భ్రూలత ముజ్జ్వలాధరమ్,
శుచిస్మితం, కోమల గండ మున్నసం
లలాట పర్యంత విలంబితాలకమ్"

దీనిని వివరించనక్కరలేదు. సులభగ్రాహ్యం.

ఓ భగవంతుడా, అమృతంకురిసే నీ పాద పంకజాలలో మనసుంచిన వారికి మరొకటి నచ్చేనా? మకరందం పొంగిపొర్లే అరవిందం ఉండగా, తుమ్మెద, అడవిచెరుకును చూసేనా? — అంటాడు.

తవామృత స్యందిని పాదపంకజే
నివేశితాత్మా కథమన్య దిచ్ఛతి,
స్థితేஉరవిందే మకరంద నిర్భరే
మధువ్రతః నేక్షురకం సమీక్షతే.

ఓ పరమేశ్వరుడా. నీవు తోసివేసినాసరే నేను నీ పాదాలు వదలను. తల్లి కోపంతో పాలుతాగే పిల్లడిని ప్రక్కకు తోసివేసినా, ఆ పిల్లడు తల్లికాళ్ళను చుట్టుకొంటాడు, వదలడు.

నిరాసకస్యాపి న తావ దుత్సహే
మహేశ హాతుం తవ పాదపంకజం,
రుషా నిరస్తోపి శిశుః స్తనంధయో
న జాతు మాతు శ్చరణౌ జిహాసతి.

కాని, ఈ వైష్ణవంలో 13 వ శతాబ్దిలో అభిప్రాయ భేదం ఏర్పడింది. వర్ణాశ్రమ ధర్మాలకు ప్రాధాన్యమిచ్చేది వడగల శాఖగాను, దానికంత ప్రాధాన్య మివ్వక భక్తికే ప్రాధాన్యమిచ్చేది తెంగలశాఖగాను విడిపోయింది. మొదటి దానికి వేదాంత దేశికులు, రెండవదానికి పిళ్లైలోకాచార్యులు, మణవాళ మహాముని నాయకత్వం వహించారు.

1298 లో మాలిక్కాఫర్ దక్షిణదేశంపై దండెత్తి రావడంతో మతపరి స్థితి మారింది. ఆతడు విగ్రహాలను విరగ్గొడుతూ రావడంవల్ల శ్రీరంగంలోని అతి సుందరమయిన రంగనాథ విగ్రహం ధ్వంసంకాకుండా, వేదాంత దేశికులు దానిని భద్రంగా తిరుపతికి తెచ్చి కాపాడారు. తర్వాత విజయనగర చక్రవర్తుల సేనాపతి గోపయామాత్యుడు మాలిక్కాఫర్ సేనల తరిమివేసిన తర్వాత ఆ విగ్రహం మరల శ్రీరంగం చేర్చబడింది. వేదాంతదేశికులు గోపాష్టకమనే స్తోత్రంతో గోపయామాత్యుని ప్రశంసించారు.

విజయనగర చక్రవర్తులు వైష్ణవాన్ని ఆదరించడంవల్ల తెలుగుదేశంలో ఈ మతం బాగా వ్యాపించింది. వేదాంతదేశికుల కుమారుడయిన వరదాచార్యు లనబడే నాయనాచార్యులు రాచకొండకు వచ్చి, సర్వజ్ఞ సింగ భూపాలునికి వైష్ణవదీక్ష ఇచ్చారు. తెలుగు నడిగడ్డపై మొట్టమొదటి వైష్ణవ మతప్రచారకుడు ఈయన. తర్వాత వచ్చినవారు అహోబల మఠాధీశ్వరులయిన ఆదివణ్ శఠ గోపయతి. ఈయన మహాయోగి, పరమ భాగవతాచార్యుడు. ఇలాంటి వానిని శ్రీనాథుడు వెక్కిరించినట్టు "ఇంగలమంచు వచ్చి యడియేనని" అనే చాటు పద్యం వ్యాప్తిలో వుంది.

విజయనగర సామంతులు, తర్వాత గద్వాల, వనపర్తి మొదలయిన సంస్థానాధీశులు వైష్ణవ మతాన్ని ఆదరించారు. వైష్ణవంలో కులానికి అంతగా ప్రాధాన్య మివ్వక, భక్తికి ప్రాధాన్య మివ్వడంవల్ల సామాన్య ప్రజలు విశేషంగా ఆకర్షితు లయ్యారు. 12వ శతాబ్దికే శ్రీకూర్మం, సింహాచలం, సర్పవరం, బాపట్ల, నెల్లూరులలోని వైష్ణవాలయాలు మహావైభవం అనుభవించాయి.

మతం, తత్త్వవర్తకులు ప్రజాదరం పొందడంతో దేవాలయ నిర్మాణమూ విస్తరించింది. గర్భాలయం, అంతరాళం, ముఖమంటపం - ఇంతవరకేవున్న దేవాలయం పరివార దేవతలు, భక్తులూ పెరగడంతో, వారికి నివాసాలు కల్పించవలసి వచ్చినందున, ఉత్సవాలు ఎక్కువయినందున వారికి ఆ ఆవరణ లోనే ఆలయాలు, కళ్యాణ రంగమంటపాలూ లేచాయి.

## ఇస్లామ్, క్రైస్తవం

మాలిక్కాఫర్ 1310లో తెలంగాణాపై దండెత్తి వచ్చాడు. 1323లో ముహమ్మద్ బిన్ తుఘ్లక్ కాకతీయ ప్రతాపరుద్రుని జయించి బందీచేసి, ఓరుగల్లును వశపరచుకొన్నాడు. అప్పటినుంచే తెలుగు దేశంలో ఇస్లాం అడుగు పెట్టినట్టు తోస్తుంది, ఓరుగల్లులో మసీదు కూడా నెలకొనినట్టు క్రీడాభిరామంలో "తుర్కల మసీదు" ప్రస్తావన వుంది. కుతుబ్‌షాహీల కాలంలో మతం మార్పు తెలుగు నాట అంతగా జరుగక పోయినా అసఫ్‌జాహీ నిజాముల కాలంలో చాలా జరిగింది.

తెలుగు దేశంలోని ముస్లిములు మొదట మూడు రకాలవారుగా వున్నా, తర్వాత, నేడు అంతా ఒక్కటే అయ్యారు. 1. అన్యదేశీయులు, 2. అన్యదేశీ యులు స్థానిక స్త్రీలను పెండ్లాడగా జనించినవారు, 3. ఇక్కడివారు మతం పుచ్చుకొన్న తర్వాత కలిగిన సంతానం.

క్రైస్తవం తెలుగు దేశంలో అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకా

కృష్ణాపురం నుండి 1709 నుంచి తొలిసారిగా వ్యాపించింది. తర్వాత 1720లో అనంతపురం జిల్లాలోనే ముదిగుబ్బ. ఆలమూరులలోను వ్యాపించింది. తర్వాత కర్నూలు, చిత్తూరు, గుంటూరులకు వ్యాపించింది.

## శిఖ్ఖుమతం

గురునానక్ తెలుగుదేశంలో యాత్ర చేసినట్టు స్పష్టమయిన నిదర్శనాలున్నా, శిఖ్ఖుమతం వ్యాప్తి కనిపించదు. కాని పూర్వపు హైదరాబాద్ రాష్ట్రంలో నాందేడ్‌లో దశమ గురువయిన గురుగోవిందసింహుని సమాధి అయిన హంజూర్ సాహబ్ ఉన్నందున, అది శిఖ్ఖుల యాత్రా కేంద్రమయినందున, తెలుగు వారికి శిఖ్ఖులతో పరిచయ సౌహార్ద్రాలున్నాయి. కొన్ని శిఖ్ఖు కుటుంబాలు నిజాముల్ ముల్క్ కాలంలో కరీంనగర్ జిల్లాలో స్థిరపడినట్టు, ఈ కుటుంబాలవారు నిజాం సైన్యంలోని వారయినట్టు చరిత్ర నిదర్శనాలున్నాయి. ఈ శిఖ్ఖుల కుటుంబాలు సికిందరాబాద్ సమీపంలో స్థిరపడ్డాయి. దీనికి శిఖ్ గాంవ్ అని పేరు. నేటికీ కొన్ని శిఖ్ కుటుంబాలు ఇక్కడవున్నాయి. నాకు తెలిసినంతవరకు తెలుగుదేశంలో ప్రాచీనమయిన శిఖ్ గురుద్వార హైదరాబాద్ నగరంలోని గౌశిగూడ లోనిది. దాదాపు రెండువందల ఏళ్ళనాటిదని అంటారు.

ఇతర మతాలు - బ్రహ్మసమాజం, ఆర్యసమాజం, కుసుమ హరనాథబాబా మతం, మెహర్ బాబా మతం మొదలగునవి ఎన్నో తెలుగునాట వున్నాయి.

ఇన్ని మతాలున్నా, మన తెలుగువారి అదృష్టం మత విద్వేషం లేకుండా ఎంతో సామరస్యం విరాజిల్లు తుండడం, మన రాష్ట్రంలో ప్రస్తుతం తరుచు జరిగే ఉరుసులు, మొహరం పండుగలలో పీర్లకు బహూకరించే దట్టీలు, చక్కెర పంచడాలు మొదలయినవి సామరస్యానికి చిహ్నాలు.

(ఆనంద రాష్ట్ర సాంస్కృతికోత్సవాల ప్రత్యేక సంచిక నుంచి)

# మహబూబ్‌నగర్ మండలం
# సాహిత్య మణిదీపాలు

ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడ అడుగు పెట్టినా, అక్కడి నుడికారం, దానిపై అక్కడి జనం మమకారం నాకు ఆశ్చర్యానందాలు కలిగిస్తూంటాయి. "బారా కోస్‌మేఁ బాత్ బదల్ జీ"—పన్నెండుకోసులకు పలుకుబడి మారుతుంది—అనేది పంజాబీ సామెత. ఇది తెలుగుకూ అక్షరాలా వర్తిస్తుందంటే నిజం మరొకసారి చెప్పినట్టవుతుంది. తెలుగుబాస యేసల వయ్యారంతో జిల్లాజిల్లాకూ క్రొత్త సోయగాలు చిందుతూ, సరికొత్త సత్తువపొందుతూ, చిత్తూరునుంచి శ్రీకాకుళంవరకు, కాళహస్తి నుంచి కాళేశ్వరంవరకు నడిచే వడిని, నడిణ్ణి చూస్తున్నప్పుడు, చూస్తూనే ఉందామా అని అనిపిస్తుంది.

దీనికి ఆయా ప్రాంతాల గత వైభవగాథలు, వర్తమాన ప్రయత్నాల ప్రగతులు తోడయి ఆయాప్రాంత ప్రజలపై ఎనలేని ప్రీతి పరీవాహమై పొంగుతుంది. ఈ బాష, ఈ యేస, ఈ పలుకుబడి గ్రంథాలలోకి ఎక్కితేగాని తెలుగు జాతికి - ముఖ్యంగా, స్వభాషలో పరిపాలన, వృత్తి విద్యాబోధన కొనసాగిస్తున్న తెలుగుజాతికి - మహానిఘంటువు, విజ్ఞాన సర్వస్వం సమగ్రమయినవిగా రూపొందజాలవనే నమ్మకమూ నాకు నానాటికీ బలపడుతూ వుంటుంది. అట్లా బలపడడంలో మహబూబునగరం జిల్లా-పాలమూరు జిల్లాకూడ మరొక కారణమయింది.

ఈ పాలమూరుజిల్లాను తలచుకొన్నప్పుడల్లా నేను పొంగిపోతుంటాను. వైయక్తికమయిన సంబంధం ఉంది. నా మిత్రుల తండ్రులు తాతలు విద్వత్కవులయి నాకు దీనితో ఆత్మీయత కలిగించారు. ఈ జిల్లాలోని సంస్థానాలు, సంస్థానాల పండిత వంశాలు, ఈ ప్రాంతానికేకాక యావదాంధ్ర దేశానికి, భారతదేశానికీ కూడా తెచ్చిన కీర్తి సామాన్యమైనది కాదు.

నేను ఈ ప్రాంతం ప్రాచీన చరిత్రను తడివి పాఠకులకు విసుగు కలిగించను; అద్యతన భూతకాలంలోను, వర్తమానకాలంలోను విరాజమానులయిన కొందరు సంస్కృత కవిపండితులను మాత్రం ఉట్టంకించి, విరమిస్తాను.

ప్రస్తుతం ఈ మహబూబ్‌నగర్ జిల్లాలోని పాలెం ప్రాచ్య విద్యాలయంతో,

ఇతర కళాశాలలతో, మహాప్రగతి సాధిస్తున్నది. వీటిని ప్రోత్సహించినవి బహుశా ఈ పాలెం పరిసరాల పూర్వ చరిత్రలేనని అనుకుంటాను. పాలెం చుట్టుపట్ల ఉన్న అచ్చంపేట, రఘువతిపేట, బలమూరు పండితులకు ఆలవాలం. నాకు తెలిసిన వారు అచ్చంపేట నరసింగయ్య శాస్త్రిగారు. ఆయన మహా వైయాకరణులు. కాశీకి వెళ్ళి శివకుమార పండితులవద్ద పుష్కరం పాటు వ్యాకరణం చదివారు. ఆ శివకుమార పండితులు విద్యార్థులకు విద్యతోపాటు అన్నదానమూ చేసి, వారిని మహావిద్వాంసులుగా తీర్చేవారు. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగాను, కేంద్రమంత్రిగాను ఉన్న కమలాపతి త్రిపాఠీ మాతామహులు వారు. నరసింగయ్య శాస్త్రిగారు కాశీనుంచి స్వప్రాంతానికి తిరిగి వచ్చి, వనపర్తి, గద్వాల మొదలయిన సంస్థానాలలో పెక్కు వాక్యార్థాలలో విజయభేరి మ్రోగించిన వారు. వారికి ఈ మండలంలోనేకాక, తెలంగాణాలోను అంతేవాసుల సఖ్య అనంతం. వారు గతించి ఇరవైయేళ్ళు కావచ్చిందనుకుంటాను. ఒకమారు వారిని మిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ఇంట దర్శించడం తటస్థించింది. అదే ప్రథమ దర్శనం. మిత్రుడు భోజనాంతరం వారిని "శాస్త్రిగారూ, తాంబూలం సేవిస్తారా?" అని అడిగాడు. "నేను పతిత ద్విజుణ్ణి" అన్నారు వారు. అంటే పడిపోయినపళ్ళు గలవాణ్ణి అన్నమాట. పాతిత్యం పళ్ళకే గాని వారికి కాదు. వారి చమత్కార సంభాషణం అలాంటిది.

రఘువతిపేటలో సుబ్బాశాస్త్రిగారనే గొప్పపండితులు ఉండేవారు. వారు వ్యాకరణంలోనూ, అలంకార శాస్త్రంలోనూ, పురాణ ప్రవచనంలోను ఆంధ్రదేశంలో పేరుపొందినవారు. రఘువతిపేట సుబ్బాశాస్త్రి అని వారికి ప్రసిద్ధి.

గోపాలపేట సంస్థానంలో వల్లా నరసింహశాస్త్రిగారు గొప్ప విద్వాంసులు. వీరిని గురించి ఒక విచిత్రమైన కథ వ్యాప్తిలో ఉంది. వీరి వంశంవారు రాజపురోహితులు. నరసింహశాస్త్రిగారికి మొదట్లో కొంత స్మార్తం వచ్చునేకాని శాస్త్ర పరిచయం కాని, సాహిత్య సంబంధంకాని లేదు. ఒకమారు, వారు, అప్పటి రాజాగారి తండ్రి తద్దినం పెట్టిస్తున్నారు. ఆ సంస్థానంలో నంబాకం రాఘవాచార్యులనే అపరపతంజలి ఉండేవారు. శ్రాద్ధసమయంలో వారూ రాజాజ్ఞతో అక్కడ ఉన్నారు. నరసింహశాస్త్రిగారికి సంస్కృత భాషాజ్ఞానం లేదుగనుక తద్దిన మంత్రాలు చెబుతూ పితరం అనడానికి పిత్రే అని, మహ్యం అనడానికి మమ అని విభక్తి ప్రత్యయాలు తప్పులు చెబుతుండగా, రాఘవాచార్యులుగారు షష్ఠీ, సప్తమి, తృతీయ అంటూ తప్పులు దిద్దసాగారట. నరసింహశాస్త్రిగారు సహించలేకపోయారు. రాజాగారి వద్ద తమ పరువు తీస్తున్నాడే ఈ విద్వాంసుడు అనుకున్నారు; లేచి నిలబడ్డారు; రాజాగారితో "మహారాజా! ఒక మనవి. తప్పు

తండ్రిగారు పరమపదించినది ద్వాదశినాడు. మా తండ్రిగారూ, నేనూ ఆ విధంగానే ఆ తిథి చెప్పి శ్రాద్ధ కర్మ చేయిస్తున్నాము. ఈ ఆచార్యులవారు ఒకసారి షష్ఠి అని, మరొకసారి సప్తమి అని, ఇంకొకసారి తృతీయ అని అంటున్నారు. ఏది సరైన తిథి అనేది తమరే సెలవీయండి. దాని ప్రకారమే చెబుతాను, చేస్తాను." అని అన్నారు. రాజావారు కోపంతో "ఆచార్యులవారూ, శాస్త్రి గారు సరిగా తిథి చెబుతూంటే, తప్పుదారి ఎందుకు పట్టిస్తున్నారు ఆయనను? ద్వాదశి తిథి అని నగరులోని ఆడబాపలకు కూడా తెలుసే, ఊరుకోండి" అన్నారు. శాస్త్రిగారి దూర్తత్వానికి ఆచార్యులవారు ఆశ్చర్యపడి, అవమానంతో, కోపంతో లేచిపోయారు. శ్రాద్ధం యథావిధిగా సాగింది. నరసింహశాస్త్రిగారి మనస్సు తర్వాత విచారంతో కుతకుతలాడింది. మహాపండితులను ధూర్తత్వంతో, అజ్ఞానంతో అవమానించానే అని. వెంటనే ఆచార్యుల వారి యింటికి వెళ్ళారు; వారి రెండు కాళ్ళు పట్టుకొన్నారు. "మీరు నాకు చదువు చెబుతానని మాట యిచ్చే వరకు కాళ్ళు వదలను" అని మార్కండేయునిలాగ భీష్మించారు. "ఏమయ్యా, ఎంత గడుసరివి? నడి వీధిలో పాదరక్షలతో కొట్టి, నట్టింట్లో కాళ్ళు పట్టుకొన్న సామెత చేశావు." అంటూ ఆచార్యులవారు ఎత్తి పొడిచారు; ఎంత సేపటికీ సమాధానపడలేదు. "స్వామీ, నాకు అక్షరం ముక్కయినా రాదనే అనుకోండి. రాజావారి వద్ద మీరు నా పరువు తీస్తే, మా గతి యేమి? మేము వంశపారంపర్యంగా తప్పులతో షోడశ కర్మలూ చేయిస్తున్నామనే అపోహ వారికి కలుగదామరి? కనుక, అలాచేయక తప్పలేదు. ఎట్లయినా, నన్ను శిష్యుణ్ణిగా ఏలుకోండి" అని ప్రాధేయపడ్డారట శాస్త్రిగారు. ఆచార్యుల వారి మనస్సు కరిగింది. శాస్త్రిగారు నాలుగైదు సంవత్సరాలలో భాష్యాంతం వ్యాకరణం నేర్చారు; గురువులకు కీర్తి తెచ్చారు. వారి శిష్యులే ఖండవల్లి నరసింహశాస్త్రి గారు. వారిని వత్తెం శాస్త్రిగారని వ్యవహరిస్తారు.

వల్లా నారాయణశాస్త్రి గారు వేదుట్ల వారు; శాస్త్రాలలోనే గాక వేదాల లోను విద్వాంసులు; వేదార్థం కదళీపాకంగా వివరించేవారు.

ఖండవల్లి నరసింహశాస్త్రి గారు వ్యాకరణ శాస్త్రపారావార పారంగతులు; ప్రస్తుతం ఆంధ్రదేశంలో ఉన్న మహావైయాకరణులలో అగ్రగణ్యులు; ఆంధ్రప్రదేశ్‌కు గర్వకారణమయినట్టివారు. వారు పైకి ఏమి తెలియని వారి వలె ఉంటారు; కాని, వాక్యార్థాలలో పంచాననులు, వారి వాక్యార్థం 1971లో హైదరాబాదులో నల్లకుంట రామాలయంలో మరొకమారు వినే భాగ్యం కలిగింది. నేను దేశమంతా తిరిగినవాడిని. అంతోఇంతో భాషాపరిచయం ఉన్న వాడిని. వాక్యార్థాలలో, పాఠప్రవచనాలలో వత్తెం శాస్త్రిగారి స్థానం గొప్పదనే

విశ్వాసం కలిగింది నాకు. వారు సంవత్సరం క్రితంవరకు హైదరాబాద్‌లో సీతారాంబాగ్ సంస్కృత కళాశాలలో వైస్ ప్రిన్సిపాలుగా ఉండేవారు; ఉప కార వేతనం పొంది స్వగృహంలోనే శిష్యులకు పాఠాలు చెబుతున్నారు. వారు అనంత శిష్యవరంపర కలవారు వారి పాండిత్యం బహుముఖం. సంస్కృత భాగవతం వారి సొమ్మంటే ఆశ్చర్యంలేదు. శ్రీమద్భాగవతం శ్రీధరీయవ్యాఖ్యా నంతో సహా ఏమూల ఏ అక్షరముందో వారికి తెలుసు, కొన్ని వందల భాగ వత సప్తాహాలు జరిపినవారు. జ్యోతిషంలో త్రిస్కంధాలు తెలిసినవారు. వేదం అశీతిద్వయం నేటికీ కంఠస్థం. పంచదశ కర్మలు అలవోకగా చేయిస్తారు. వారు తమ చిన్నతనంలో పిఠాపురం విద్వత్సభలో పరీక్ష యిచ్చినప్పుడు జరిగిన వాద ప్రతివాదాలు వారే చెప్పగా వినే సదవకాశమూ నాకు కలిగింది.

పాలెం సమీపంలోని రాజాపురం వారు తెలకపల్లి రామచంద్రశాస్త్రి గారు. సంస్కృతంలో సుందర కవిత చెప్పి శృంగేరి పీఠాధిపతుల అనుగ్రహానికి పాత్రమయ్యారు.

ఆ ప్రాంతం వారే అయిన కేతేపల్లి పల్లా చంద్రశేఖరశాస్త్రిగారు వ్యాక రణ విద్వాంసులు. పాలెం విద్యా సంస్థల కార్యదర్శి శ్రీ సుబ్రహ్మణ్యంగారి మామగారయిన, కొల్లాపురంవద్ద వంగపట్నంలో వున్న ఓరుగంటి లక్ష్మీ నారాయణశాస్త్రిగారు గొప్ప తర్క విద్వద్వరేణ్యులు.

జటప్రోలు సంస్థానం ఆస్థాన పండితులైన వెల్లాల సదాశివ శాస్త్రిగారు జగద్విఖ్యాతులు. జటప్రోలు సంస్థానంలో భారతీదేవికి శాస్వతంగా పీఠం స్థాపించారు వారు. మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తిగారి వంటి లబ్ధ ప్రతిష్ఠులను ఊపించివేసిన ఉద్దండులు వారు. వారు రచించిన అమా సోమవార వ్రత నిర్ణయం జ్యోతిశ్శాస్త్ర, ధర్మశాస్త్ర, వ్యాకరణశాస్త్ర ప్రకర్షకు గీటురాయి వంటిది. ఈ వ్రతచర్చ వారి సకలశాస్త్ర పాండిత్య ప్రకర్షకు కేవలం సాకు. వెల్లాల వంశమే విద్వద్వంశం. వెల్లాల శంకర శాస్త్రిగారు కూడా అలాంటి ఉద్దండులే.

జటప్రోలు సంస్థానంలో వనం సీతారామశాస్త్రి, కృష్ణశాస్త్రి మొదలయిన మహాపండితులు ఉండేవారు.

అంతకు పూర్వం కూడ యావర్ల మొదలయిన గ్రామాలలో అక్షింతల సుబ్బాశాస్త్రిగారు వుండేవారు. సింగరశాస్త్రిగారు, వారి కుటుంబం సుప్రసిద్ధ విద్వద్వంశం. సుబ్బాశాస్త్రిగారు ఎందరికో శాంకర భాష్య శాంతి చేయించిన వారు.

వనపర్తి సంస్థానం తలచుకొన్నప్పుడు నా పక్షపాతం ఇనుమడిస్తుంది,

కవి గండభేరుండ సర్వతంత్ర స్వతంత్రేత్యాది బిరుదాంకితులైన శ్రీకృష్ణ బ్రహ్మతంత్రపరకాల మహాదేశికేంద్రులు ప్రత్యక్షమవుతారు. వారి కుమారులైన శ్రీనివాసరాఘవాచార్యుల వద్ద సమాశ్రయణాది పంచసంస్కారాలు పొందిన వాడిని గనుక నేను ఆ పరకాలదేశికేంద్రులకు ప్రశిష్యుణ్ణి. సుగ్రహీత నామ ధేయులు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు, నాపితృపాదులు తిరుమల శాస్త్రి శేషాచార్యులుగారు మొదలయినవారు శ్రీకృష్ణబ్రహ్మతంత్రుల పాండిత్య పారమ్యం గురించి అసంఖ్యాకంగా చెప్పిన కథలు విన్నవాడిని. వారి శిష్య వాత్సల్యం పార మెరుగనిది. వారు పారంగతులు కాని శాస్త్రమంటూ లేదు. వారు చేపట్టి ముగించని సంస్కృత సాహిత్య ప్రక్రియ అంటూ లేదు రామేశ్వర విజయ చంపువును రచించిన సౌలభ్య సౌకుమార్యాలతోనే రమణుల పాటలూ రచించారు సంస్కృతంలో. సంస్కృత చరిత్రకారుడు కీత్ వారి చంపువులను కొంచెం చిన్నచూపు చూచినాడంటే, అది అతని సహృదయతాలోపమే పాట లలో వాకిలి తీసేపాట చరణమొకటి ఉదాహరిస్తాను:-

"జఘన తల విజిత పులినే లలనే
విఘటయాఽరరం బాలే, సఖి
బాలచంద్ర సమఫాలే."

తలంటు పాట :-

"జయ జయ సితకరవదనా,
జయ కుసుమోజ్జ్వల సితరదనా."

వారిగ్రంథాలు అసంఖ్యాకాలు. అలంకార మణిహారం మొదలయినవి శతాబ్దాలుగా వస్తున్న మన అలంకారిక సంప్రదాయావిచ్ఛిన్నతకు తార్కాణం.

వారి తమ్ములు ఘనాసదుర్గం వేదాంతాచార్యులవారు గొప్ప వ్యాకరణ శాస్త్ర కోవిదులు.

వనపర్తిలో ఆచార్ల రంగాచార్యుల వారి పేరు పండితలోకానికి చిరపరి చితం. వారుకూడా కాశీపండితులు. శివకుమార పండితుల శుశ్రూషతో, వ్యాకరణశాస్త్రంలో నిధులయ్యారు. వనపర్తి ఆస్థానం అలంకరించారు. వారికి పండితరంగాచార్లనే పేరు పడింది. వారు సరసులు, శాంతస్వభావులు. తిరుపతి వేంకటకవులు వనపర్తికి వచ్చినప్పుడు, వారి న్యాయబుద్ధిని ఉల్లేఖించారు.

'రంగాచార్యులవారి సంగతి నెరింగినారు" అని. వారిని గురించిన కథలు ఎన్నో వున్నాయి; ఒక్కటి మనవిచేస్తాను.

వారు పది పన్నెండు మంది శిష్యులకు భోజనంపెట్టి పాఠాలు చెబుతూండేవారట. అందుకోసం వారికి వనపర్తి సంస్థానంనుంచి నెలకు పది రూపాయలు పండిత భృతి ముట్టేది. ఒక సంవత్సరం విద్యార్థులెవరూ లేకపోతే, రాజాగారు ఆ భృతి ఆపివేశారు. రంగాచార్యులవారు అభిమానధనులు. అప్పటి నుండి ఆ సంస్థానం వైపు తిరిగిచూడలేదు. రాజాగారు ఎంత బ్రతిమాలినా వినలేదు, రాచనగరుకు వెళ్ళలేదు. తమ పాండిత్యాన్ని రాజాగారు పది రూపాయలతో విలువకట్టటం వారికి ఉచితమనిపించలేదు. వారి అంత్యకాలంలో రాజాగారు వారి యింటికే వచ్చి "స్వామీ తమరు మా ఆస్థానానికి రాకనే వైకుంఠానికి వేంచేస్తున్నారు" అని విలపించారట. "అదే పెరుమాళ్ళ నిర్ణయమేమో!" అన్నారట వారు. ఈలాటి కథలెన్నిటినో వారి సోదరపుత్రులు, ఆనెగొందిలో వకీలుగా ఉన్నట్టివారు అయిన ఆచార్ల వేంకటాచార్యులు నా చిన్నతనంలో వినిపించేవారు.

వారి తమ్ములు రాఘవాచార్యులు, రంగాచార్యుల కుమారులు శ్రీనివాసాచార్యులూ వైయాకరణులే. రంగాచార్యుల వారి అల్లుడు చేట్లూరి కంఠీరవాచార్యులు.

వారి తర్వాత, వారికి సమకాలికులుగా ఉండి వనపర్తి ఆస్థానంలో ప్రధాన పండితులుగా మన్ననపొందిన వారు నంబాకం రాఘవాచార్యులుగారు. వారు తర్కవేదాంతాలలో అఖండ ప్రతిభావంతులు; కస్తూరి రంగాచార్యుల వారి శిష్యులు. వారు ఆజానుబాహులు; ఉదారత వారి పాండిత్యానికి బంగారు మలామా. వారి నిర్భీకత్వానికి ఎన్నో కథలు చెబుతారు. ఒక కథ విన్నది చెబుతాను.

ఆస్థాన పరీక్షలలోను, పండితగోష్ఠులలోను, గెలుపొందిన వారికి ఉత్తమ సంభావన రూ. 18-0-0, మధ్యమ సంభావన రూ. 12-0-0లు, మూడవ సంభావన రూ 8-0-0 లు ఉండేవి. ఆస్థాన ప్రధాన పండితుల నిర్ణయానికి అనుగుణంగా రాజాగారు సంభావన యిచ్చేవారు. పండితులు ఒక చిన్న చీటిలో ఒక సంకేతం వ్రాసేవారు అది నిర్ణాయక విద్వాంసులకు, రాజాగారికి మాత్రమే తెలుసు. చీటిలోని ఆసంకేతాన్ని రాజాగారు చూచుకొని ఇచ్చేవారు. ఒక మారు ఒక పండితునికి రూ. 12-0-0లు ఇవ్వవలసిందని నంబాకం వారు వ్రాశారు - అంటే, చీటీలో సంకేతమిచ్చారు. ఎందువల్లనో రాజాగారు ఆయనకు ఎనిమిది రూపాయలే యిచ్చారు. ఇది నంబాకంవారు గ్రహించారు. ఆ పండితుని దగ్గరికి

పిలిచారు. ఆయనతోపాటు రాజుగారి గద్దెవద్దకు వెళ్ళారు; రాజాగారి చేతిలోని రూపాయల సంచీ లాక్కున్నారు. పిడికెడు రూపాయలు ఆ పండితుని దోసిట్లో కుమ్మరించి, వెళ్ళమన్నారు "ఇదేమి అన్యాయమండీ ఆచార్యులవారూ? సభా మర్యాదను మీరిపోయారే, న్యాయమా?" అని రాజుగారు ప్రశ్నించారు. "ఆస్థానంలో విద్యార్హతలు నిర్ణయించే అధికారిని నేను. నేను సూచించిన మొత్తం ఇవ్వవలసినవారు మీరు. అంతే మీ అధికారం. ఈ విద్వత్పరీక్షలు జరుగుతున్నంతవరకు ఈ రూపాయల సంచి నాది" అన్నారు వారు. రాజుగారు సహృదయులు. తన పొరపాటు గ్రహించారు; నంబాకం వారి పనిని హర్షించారు; విరగబడినవ్వారు.

నా మిత్రుడు, వనపర్తి ఆస్థానం భూతపూర్వ విద్వత్కవి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి కూడా నంబాకం వారి ఉదారతను గూర్చి పలు కథలు చెప్పేవాడు. తను వారికన్నా ఎంతో చిన్నవాడయినా, వారి శిష్యుడయినా, ఉత్తమ సంభావనకు అర్హుడని ఆస్థానంలో ఉద్ఘోషించిన ఉదంతం కథగా చెప్పినాడు.

నంబాకం వారి ధైర్యసాహసాలను గురించి బూర్గుల రామకృష్ణరావుగారు చెప్పిన ఒక కథను పేర్కొంటాను. వనపర్తి సంస్థానం ప్రభువులు లోగడ నంబాకం వంశంవారికి పండిత భృతిగా ఇచ్చిన జాగీరును తర్వాత రాజు లాక్కున్నారు. దానిమీద ఆచార్యులవారు మహబూబ్‌నగర్ జిల్లా కోర్టులో దావావేశారు. బూర్గుల రామకృష్ణరావుగారు ఆచార్యులవారి పక్షం వకీలు. దావా రెండు దశాబ్దాలు నడిచింది. ఆచార్యులవారికి ఉరుదూ కూడావచ్చు కనుక కోర్టులో ఉరుదూలోనే మాట్లాడారు. జిల్లా జడ్జి అడిగాడు: "పండిత్ మహారాజ్, ఉన్హోనే జాగీర్ దీ, బాద్‌మేఁ లేలీ, ఇస్‌మేఁ క్యా గల్తీ హై?" అని. (పండిత మహారాజా, వారు జాగీరు దానంచేశారు. మళ్ళీ పుచ్చుకొన్నారు. దీనిలో తప్పేమిటి?) ఆచార్యులవారు "జజ్ సాహబ్, వహ్ జాగీర్ ఖైరాత్‌మేఁ హమేఁ దీహుఈ నహీఁ, హమారీ కాబిలీయత్ దేఖ్‌కర్ దీ హుఈ హై. ఇన్ రాజా ఓఁనే హమారే బుజుర్గోంకో కఈ మిన్నతేఁ కర్కే బులాయా, సంస్థాన్‌కే విద్వాన్ బనాయా, హమేఁ బరోడాకే గాయక్వాడ్ బులా రహెహైఁ తిరువాన్కూర్‌కే మహారాజా బులా రహేహైఁ. వన్‌పర్తిరాజానే కహియే కి ఛూక్‌కర్ చాటో. దియేహుఎకో కోఈ ఛీంచ్‌లేగా?" అన్నారు. (జడ్జిగారూ, ఇది మాకు దానమిచ్చిన జాగీరు కాదు. మా సమర్థత చూచి ఇచ్చింది. ఈ సంస్థానం రాజులు మా పూర్వులను ఎన్నో విన్నపాలుచేసి పిలిపించుకొన్నారు; తమ సంస్థానంలో పండితులుగా నియమించుకున్నారు. నన్ను బరోడా మహారాజు గాయక్వాడ్ పిలుస్తున్నారు;

తిరున్నూరు మహారాజా పిలుస్తున్నారు. మీరు వనపర్తి సంస్థానాధిపతులకు చెప్పండి ఉమ్మివేసి దాన్ని నాకమని. ఇచ్చిందాన్ని ఎవరైనా లాక్కుంటారా?)

వనపర్తివారయిన చేట్లూరి కంఠీరవాచార్యులుగారు, వ్యాకరణ విద్వాంసులు. బుక్కపట్నం రంగాచార్యులవారు దురదృష్టవశాత్తు కుష్ఠురోగంతో బాధపడినా, భాషకు గొప్ప సేవచేసినవారు. వారి కుమారులు అణ్ణయాచార్యులవారు వ్యాకరణ వేదాంత విద్వాంసులు. అనంతపురంజిల్లా పెనుగొండలో ఉండేవారు.

వనపర్తిలో ఇప్పటికీ కవి పండితులుగా గౌరవించబడుతున్నవారు విక్రాల వేంకటాచార్యులవారు, వారి తమ్ములు నరసింహాచార్యులవారూను. మొదటివారు కాశీ పండితులు. తమ్ములు తెలుగు కవిత చెబుతారు. గురురాయాచార్యులు, కృష్ణాచార్యులు ద్వైత వేదాంత విద్వాంసులు.

వనపర్తిలో ఆంధ్ర కవి పండితులకు తక్కువలేదు. వేద విద్వాంసులకు తక్కువలేదు. పల్లా వంశం వేదవిదుల నిధి. వనపర్తి పరిసరాలలో ఋగ్వేద యజుర్వేదాధ్యాయులు చాలమంది బలమూరు మున్నగు గ్రామాలలో ఉన్నారు. యజ్ఞయాగాలు చేసిన సోమయాజులూ ఉన్నారు.

గీర్వాణ వాణిలో అనర్గళంగా ప్రసంగించడమేకాక గీర్వాణాంధ్రాలలో మధురోదాత్త కవిత చెప్పగల నామిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, ఆయనతో పాటు బిల్హణుని కర్ణసుందరి నాటికను, విక్రమాంక దేవచరితను, మరికొన్నింటిని తెలిగించిన మాదిరాజు విశ్వనాథరావుగారునూ వనపర్తివారే. లక్ష్మణశాస్త్రి పద్యాలు ఈ జిల్లావారేకాక, తెలుగువారంతా విన్నవే. అతని సహకవి కీర్తి కాయులు విశ్వనాథరావుగారి కవిత ఇటు అచ్చ తెలుగులోను, అటు తత్సమ భాషలోను ఎంత ప్రౌఢిలో నడిచిందో రెండు పద్యాలతో సూచిస్తాను. వసంత వర్ణన ఘట్టంలోనివి ఈ పద్యాలు:

"ఆనెన్ వననళినాలయ
మానితమలయానిలాతిమానసురభిళా
నూనశ్వాసము, ముగ్ధము,
నూనస్మితదంతురంబు సురభిముఖంబున్."

దోలాకేళి :-

"ఊగుడువేడుక బల్లవు
లూగి మఱలు గరితలంది రుప్పరపీడిన్
మూగినవేల్పు వెలందుల
కో గననౌ సోయగంబులో సగపాలున్."

మలయ మారుతము :-

"కరసరసీరుహద్వితయ
గాఢగృహీతవిలోలడోలికా
భరణసమర్థరజ్జుచయ
వారిజదృగ్గనతానిరస్తవి
స్తరపరిధానబంధనవి
ధాననితంబతటీనిజోచ్ఛ్వాస
న్మరుదురుమోహితుండగుచు
గ్రమ్మన్బడియెన్ మరుడంత వింతగాన్."

దీనిలో మూడు పాదాలు సంస్కృతం, నాల్గవది తెలుగు కావడం ఒక చమత్కారం. క్రమాలంకారంతో ఉన్న ఒక సీస పద్యం ఉదాహరిస్తాను.

జలక్రీడ :-

"కుంకుమ కెంజాయ గొనరు మైపస దగి
ఎమ్మెమై క్రైదీవ నెత్తె నొకతె
తన్ను బాటింపని మన్నిని గని వడి
రహి మీర దనమెడ గ్రాల్చె నొకతె
మొలపైస డాకేలు బూనిచి తనవంగు
నొడలుడాలున నిల్చి యదరె నొకతె
ఎరుపురాసోరణాలెసగి నిద్దపు నెల
వెలుగు వెల్లని మెయి నిలిచె నొకతె

వలవరద మునిగి కేలూత వలచినటుల,
విల్లుగొననెదగల మరు న్వేడినటుల,
రేనినొప్పింప మరుని విల్లయినయటుల.
పాలెవలె తాను పరునగ్గి వ్రేలినటుల."

వనపర్తి సమీపంలోని చింతకుంటవాసులు కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు, సంస్కృతాంధ్రాలలో చక్కని కవిత చెప్పే విద్వాంసులు ఆకాశ వాణిలో పనిచేశారు.

మూడు దశాబ్దాలుగా పండిత సభలకు ప్రసిద్ధమైన గద్వాలను గురించి చెప్పనక్కరలేదు. గద్వాలలో ఎందరో ఆంధ్ర గీర్వాణకవులు వెలసినారు. వారిలో ప్రథమ స్మరణీయులు శ్రీ వాగీశ బ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు. వారు అనేక శాస్త్రాలలో సారమెరిగినవారు. గద్వాలవారయిన పుల్లగుమ్మి

వేంకటాచార్యులుగారు వారిసంతతి అనంతాచార్యులు మొదలయినవారు వ్యాకరణ శాస్త్రాన్ని గుత్తగొన్నవారు.

అనేక శాస్త్రాలలో విద్వత్తను సంతరించుకొని, లౌకిక వ్యవహారాలలోను ఆరితేరి, జిల్లాకలెక్టరు, సెషన్స్‌జడ్జివంటి ఉన్నత పదవులు అలంకరించిన వృద్ధ పండితులు గుండేరావు హర్కారే ఎన్నో సంవత్సరాలు గద్వాలలో ఉన్నవారు గనుక నేను వారినీ గద్వాల వాస్తవ్యులనుగానే భావిస్తున్నాను. వారు అరబ్బీ, ఫారసీ భాషలలోను పండితులు. ఖురాన్ షరీఫ్‌ను సంస్కృతీకరించారు. పాణినీయ రూపాల ప్రక్రియకు యంత్రం కనిపెట్టారు.

గద్వాల అనగానే గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారి మధురోదారమూర్తి, ప్రతిభే ఆకృతితో వచ్చిందా అన్నట్టున్న మూర్తి ప్రత్యక్షమవుతుంది. వారు సహస్రావధానులు. ఆశువుగా అత్యంత కమనీయ కవిత చెప్పేవారు. వారి కవితలు వినే అవకాశం నాకూ కలిగింది. రాజాస్థానాలలో గణికలు నాట్యమాడుతుండగా, రాజవంశ్యులు, రాజబంధువులు ఆ గణికల సోయగానికీ, భంగిమా సౌందర్యానికీ విస్తుపోయి రూపాయలు విసిరే కాలమది, అదొక రాజఠీవి. ఆ రూపాయలను ఆ గణికలు మొగ్గవాలి తీసుకోవాలి. మొగ్గవాలినప్పుడు అంగాంగాకుంచన ప్రసారాలవల్ల కలిగే అందచందాల ఆస్వాదననుగురించి చెప్పనక్కరలేదు. ఒక ఉత్సవ సమయంలో రాజాగారి కొలువుకూటంలో ఒక గణిక నాట్యమాడుతున్నది. నిండు ఓలగం. ఒక రాజన్యుడు రూపాయి విసిరాడు "మొగ్గవాలి తీసుకో!" అని పర్మాయించారు. ఆమె గర్భవతి, మొగ్గవాలలేకపోయింది. అప్పుడు ఆశువుగా అన్నారు గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు:

"మకరాంకు కేళికొర్వని
ముకురానన మల్లయుద్ధమునకెట్లోర్చున్?"

అని. ఉత్తరార్ధం జ్ఞాపకంలేదు. పూర్వార్ధం మాత్రమే ఉదాహరించాను.

గద్వాల దేశం నాలుగంచులనుంచి వచ్చిన పండిత ప్రకాండుల వాక్యార్థ యుద్ధాలకు, అనేకానేక గాయక సార్వభౌముల జుగల్ బందీలకు రంగమయినట్టిది. అష్టావధాన, శతావధాన, సహస్రావధాన, ఆశుకవితా మల్లయుద్ధాలకు, భరతమునినే దిద్దిన నర్తకీమణుల నాట్య స్పర్ధలకు ఆటపట్టయినది. గద్వాలే కాదు, ఈ జిల్లాలోని సంస్థానాలన్నీ అలాటివే. గద్వాలను గురించిన మరొక విచిత్రమైన కథ చెబుతాను.

అర్ధశతాబ్ది క్రితం శాఖాభిమానాలూ, పరమత అసహనాలూ మరీ ఎక్కువ. మరొక శాఖవారిని గుర్తించడానికీ, వారికి ఆస్థానంలో ప్రవేశం

కలిగించడానికి ఆస్థాన విద్వద్వరేణ్యులు ఎన్నో అడ్డుపుల్లలు వేసేవారు. ఒకసారి ఒక మహావిద్వాంసుడు గద్వాలకు వచ్చాడు. రాజాస్థానంలో ప్రవేశం దొరకలేదు. యుక్తి పన్నవలసివచ్చింది. ఆస్థానం గుమాస్తాను ఆశ్రయించాడు. మహారాజు పండితగోష్ఠి చివరినాడు "మరెవరైనా వున్నారా విద్వత్కవులు? ఉంటే దయచేయవచ్చు." అని ప్రకటించారు. దర్బారు గుమాస్తాలేచి, "చిత్తం, హుజూర్, మా ఇంట్లో ఒక పెద్దమనిషి దిగాడు. ఎప్పుడూ ఏదో వ్రాసుకుంటూ ఉంటాడు. నేను కవిని, మహారాజావారి దర్శనం చేసుకోవాలి అంటున్నాడు. సెలవయితే...." అని నీళ్ళు నమిలాడు "అట్లనా! రమ్మనండి!" అని మహారాజా సెలవిచ్చారు.

ఒక ఆజానుబాహువైన స్ఫురద్రూపి దర్బారులో అడుగుపెట్టాడు. ఆయన చేతిలో ఒక చిన్నమూట ఉంది. "ఏమి చేస్తారు? ఏమి చెబుతారు?" మహారాజా ప్రశ్న. "కవిత్వం చెబుతాను మహారాజా!" ఆయన మనవి చేశారు. "వ్రాసుకొని వచ్చారా? మూటవిప్పి చదవండి."అన్నారు మహారాజా. "వ్రాసుకొని రాలేదు మహారాజా!" ఆయన సవినయంగా మనవి చేశాడు.

"అయితే ఆశువుగా చెబుతారా?"

"చిత్తం."

"అయితే, చెప్పండి."

ఆ వ్యక్తి నెమ్మదిగా మూట విప్పాడు. జరీ ఉత్తరీయంతీసి కప్పుకొన్నాడు. చేతిలో టెంకాయ పట్టుకొన్నాడు. వందపద్యాలు ఆశువుగా చెప్పాడు. మహారాజు ఆశ్చర్యపడ్డారు. తమ ప్రక్క విడిగా కుర్చీ వేయించి కూర్చోబెట్టుకొన్నారు. ఆయన ఎవరో కాదు! దేశంలోని అనేక రాజాస్థానాలలో ఆశుచిత్ర కవితలు చెప్పి, అవధానాలు వినిపించి ఆనందింపజేసిన పిశుపాటి చిదంబర శాస్త్రిగారు. శాస్త్రిగారు తర్వాత ఆరునెలలపాటు గద్వాలలో ఉండి నిత్యకవితోత్సవం జరిపారని వారి శిష్యులు చెప్పేవారు.

నేటికీ గొట్టుముక్కల కృష్ణమూర్తిగారు మొదలయిన కవులు గద్వాల కవితా సంప్రదాయం కాపాడుతున్నారు.

కవి పండితులను పోషించిన మరొక సంస్థానం అమరచింత ఆత్మకూరు. ఇక్కడ బుక్కపట్నం వంశీయులు మహావిద్వాంసులు. ఆ వంశంవారే ప్రౌఢ సరస్వతి బుక్కపట్నం శ్రీనివాసాచార్యులు. వారు పెక్కు శాస్త్రాలలో విద్వాంసులు, శ్రీనివాస విజయాది కావ్యాలు రచించినవారు. శ్రీనివాసవిజయం పరకాల మఠాధిపతులు, హైదరలీ కాలంవారు అయిన శ్రీ శ్రీనివాస బ్రహ్మతంత్ర

పరకాల యతీంద్రుల విజయాలు వర్ణించే కావ్యం. ఈ ప్రౌఢ సరస్వతితోనే తిరుపతి వేంకటకవులు ఢీకొన్నది.

మొన్న మొన్నటిదాక పరకాల మఠాధిపతులయిన శ్రీ అభినవ రంగనాథ బ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు ఆత్మకూరువారే. వారు న్యాయ విశిష్టాద్వైత వేదాంతాలలో అసమాన విద్వాంసులు, వ్యాఖ్యాతలు.

ఆత్మకూరు వారయిన పుసులూరు శేషాచార్యులవారు, వారి సోదరులు దీక్షాచార్యులుగారు సుప్రసిద్ధ విద్వాంసులు.

ఆత్మకూరులో పెరవలివంశం విద్వాంసులపుట్ట. వారిలో ఇటీవలి పెరవలి లింగయ్యశాస్త్రిగారు, సంస్కృత వాగ్గేయకారులు. వారి సంస్కృత గేయ మొకటి, వారి జ్యేష్ఠ సోదరులయిన నరసింహావధానులుగారి పుత్రి శ్రీమతి కప్పగంతుల అన్నపూర్ణమ్మగారినుంచి విన్నది ఉదాహరిస్తున్నాను :

శంకరా హర శంభో
శంకరా హర శంకరా.
సంకట కృన్మీనాంక వి
శంకట దర్పాంకుర హర-శంకరా.

ఫాలలోచనా, నాథ
పాప మోచనా
బాలేందు మౌళే, గౌరీలలన
పాలయమాం నీలకంఠ-శంకరా.

రాజతాచలవాస పూజితాఖిల
తేజః పరిమాణ దివ్య
భ్రాజత్సకలాగమ
యోజన పదరాజీవ-శంకరా.

ఈ నరసింహావధానులుగారు అటు వేదాలను ఇటు సంగీతాన్ని పుక్కిటబట్టిన వారు. వైదికలౌకిక కళావిదులు. వీరు సంస్కృత నాటకాలలో సూత్రధార పాత్రను, తక్కిన పాత్రలను అతి నిపుణంగా నిర్వహించి తమ శ్రావ్యగాన కళతో ప్రేక్షక శ్రోతలను ఆనందపరచేవారు. వీరి వంశం వేదశాస్త్ర నిష్ణాత్ర ముక్తామణులకు వంశం. వీరు సార్థక శ్రీవత్స గోత్రులు.

కృష్ణాతీరంలో జటప్రోలు సంస్థానంలోని మంచాలకట్ట "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అన్న భగవద్గీతోక్తిని అనుసరించే విశిష్టా

ద్వైత సంప్రదాయాన్ని సార్థకం చేసినట్టిది. ఇది ఒకప్పుడు పరమైకాంతులకు పుట్టినిల్లు. శరణాగతి శాస్త్రానికి ప్రతీక. వేదవేదాంత సారమని విశిష్టాద్వైతులు నమ్మే మూల మంత్రంతోనే వైదికకర్మలు చేయవచ్చుననే సంప్రదాయం ఇక్కడ పుట్టింది. ఇది నిజానికి ఉత్తమోత్తమ భక్తియోగానికి ఉదాహృతి ప్రాయమయినా, ఆ స్థాయిని అందుకోలేని వారికి విడ్డూరమయి మంచాలకట్ట సంప్రదాయం అని ఆక్షేపణకు, కువ్యాఖ్యలకు దారితీసింది. ఈ గ్రామంవారయిన గోవిందాచార్యులవారు మొదలయిన మహా విద్వాంసులు ఆంధ్రదేశమంతటా విఖ్యాతులు.

విఖ్యాత తార్కికులు దోనిపూడి నరసింహశాస్త్రిగారు ఈ మంచాలకట్ట వారే. వీరు నా చిన్నతనంలో తిరుపతికి వచ్చినప్పుడు, "కా పూర్వః?" (మీది ఏ ఊరు?) అని ప్రశ్నించేవారు. విద్యార్థులను ప్రశ్నించేటప్పుడు కా తర్వాత ఒక మాత్రాకాలం ఆగేవారు, శ్రోతలను వల్టీ కొట్టించటానికి.

అలంపురంలో వెల్లాల శంకరశాస్త్రిగారు, బాలసరస్వతి కుమారస్వామి శాస్త్రిగారు ప్రఖ్యాత విద్వాంసులు.

అలంపురం తాలుకా అన్నప్పుడు సార్థక నామధేయులయిన సురవరం ప్రతాపరెడ్డిగారు తెలుగువాడయిన ప్రతివాడికీ జ్ఞాపకం వస్తారు. వారు ఇటిక్యాల గ్రామ వాస్తవ్యులు. నీళ్ళులేని ఇటిక్యాల అని ఆయన వ్రాసుకునే వారు. నిజాం ప్రభుత్వాన్ని పల్లెత్తుమాటఅన్నా పరలోకం చూడవలసిన భయంకర కాలంలో కోఠీకి సమీపంలోనే గోలకొండ పత్రిక నెలకొల్పి నడుపుతూ నిరంకుశ ప్రభుత్వానికి పక్కలో బల్లెమై, ధైర్యానికి, న్యాయానికి, ధర్మనిష్ఠకు పత్రికా రచనను ప్రతీకగా తీర్చిదిద్దిన మహాప్రతాపులు వారు. వారు సంస్కృత భాషాపండితులు, తెలుగుకవులు, వచన రచయితలు, పరిశోధకులు, కథకులు, సాటిలేని ప్రజా సేవకులు. సహృదయత అనేది వారి స్వభావానికి బంగారు రంగరింపు. దానికొక చిన్న ఉదాహరణ ఇస్తున్నాను:-

నేను మీజాన్ పత్రికలో పనిచేస్తున్నప్పుడు ప్రతాపరెడ్డిగారు అధ్యక్షులుగా విజ్ఞానవర్ధినీ పరిషత్తు అనే సాహిత్య సంస్థ నెలకొన్నది. దానిలో వారం వారం ఒకరు వ్యాసం చదవాలి, దానిపై చర్చలో ఎవ్వరూ మొగమాటపడరాదు; పడలేదు. ఒకమారు నేను "తెలుగు సాహిత్యంలో స్త్రీవాచకపదాలు" అనే వ్యాసం చదివాను. దానిలో నంగనాచి శబ్దచర్చ ఉంది. ఆ చర్చలో వారు నంగానాచ్-సిగ్గులేక ఎగిరేది అనే అర్థమిచ్చే హిందీమాట నంగనాచి పదానికి మూలమయి ఉంటుందన్నారు. నేను నక్కురతనం కొద్దీ ప్రతిఘటిస్తూ, నంగనాచి అంటే, అమాయికురాలివలె ప్రవర్తించే గరిత గనుక నంగానాచ్ అనే హిందీపదం

మూలమనడం సరిపోదని, ఇది ద్రావిడపదాల సమాహారమేనని అన్నాను. నంగ్రై అంటే అమాయకురాలైన చిన్నపాప. నాచ్చి అంటే నాయకురాలు. అర్థాత్ నంగ్రైగా అమాయకురాలయిన చిన్నపాపగా కనిపించే నాతి చతురురాలు. అన్నాను. రెడ్డిగారు ఆనందించడమే కాక ఫైలాలజీ ద్వారా నాకు ఆత్మీయు లయ్యారు.

ఈ జిల్లాలోని సంస్థానాధీశ్వరులూ మహా విద్వాంసులు, కవిత చెప్పగల వారూ, వనపర్తిని 16వ శతాబ్దిచివర పాలించిన అష్టభాషా బహరీ గోపాల రావుగారు రామచంద్రోదయ కావ్యం, శృంగారమంజరీ భాణం రచించారు. వారి మేనల్లుడు బిజ్జల తిమ్మారెడ్డి అలంపురం వాస్తవ్యులు. అనర్ఘరాఘవ నాటకాన్ని మహా ప్రబంధంగా తెనిగించారు. దినికి ఏ కారణంవల్లనో అంత ప్రచారం రాలేదు. దానిలో నాకు తెలిసిన రెండు పద్యాలు ఉదాహరిస్తాను.

తిమ్మారెడ్డిగారు తమ ప్రబంధం అవతారికలో తమవంశ ప్రశస్తి ఇట్లా చెప్పుకున్నారు :

"ఏ సరిత్తిలకంబు హేమాంబరుని పాద
రాజీవమునకు మరందధార,
ఏ నదీ తల్లజం బీశాను మస్తక
సీమకు పాండురోష్ణీషశాటి,
ఏ వాహినీసతి హిమవద్ధరాధర
శృంగాంతరంబుల క్రీడసల్పు,
ఏ ధునీకాంత పాథోధి మూర్ధన్యున
కగ్రభార్యామణియై రహించు
అట్టి గంగకు తోబుట్టువగు చతుర్థ
జాతియందు నితాంత విఖ్యాతి దనరి
యున్న మొటవాడ కులమున చెన్నుమీరె
చాల బిజ్జల తిమ్మభూపాలమౌళి"

ఇది వారి ఊహాచమత్కృతికి తార్కాణం. వారి పాండిత్యానికి మచ్చుతునకగా ఒక పద్యం ఉట్టంకిస్తాను. ఇది వారు నామధాతువుపైన శత్రంతాలతో నడిపిన మత్తేభం. చిన తిమ్మభూపతి ప్రతాపాగ్ని కాంతికి ప్రపంచమే ఎర్రబడి పోయిందట.

"ఇనదబ్జంబు, ధనంజయచ్చరము,
వాణీశద్గిరీశంబు కో

కనదత్తైకరవ, మబ్బురాగదుడురా
టాకంతంబు, కాశ్మీరజ
ఘనసారంబు, సురాలయద్రజతగో
త్రంబౌచు, చెన్నొందె నా
చినతిమ్మ క్షితిపాల బాహువిభవా
ర్చిర్వ్యాప్తి ముల్లోకముల్."

ఇన ఇవ ఆచరతి=ఇనయతి ఇనత్ సూర్యునివలె ఆచరించుచున్నది చంద్ర మండలం. అంటే ఎర్రబడిపోయింది.

విద్వత్కవులకు నెలవైన ఈజిల్లా పూర్వమేకాక ఇప్పుడూ ఎంతో ప్రతిష్ఠ కలిగి ఉంది. ఈ ప్రాంతం వారయిన మిత్రులు ముకురాల రామరెడ్డి గారు నవ్వుపై వ్రాసిన పద్యాలలో ఒక్కటి ఇది:-

"నా కవితా మనస్విని క
నంత విహార వికాస రాస హే
లా కమనీయ జీవిత వి
లాసము నిత్యకళా కలాపమై
చేకురుదాక నవ్వేదను
చింతల పుంతల గ్రమ్ముకొన్న చీ
కాకులు డుల్లగా బ్రతుకు
కంచెల నవ్వులబండి దోలెదన్."

ప్రాచీన సాహిత్యాన్ని లోతుగా అధ్యయనంచేసి అనర్గళంగా ఉపన్యసించి, తను భావాలను మరుగులేక తెలిపే సాహిత్యోపాసకురాలు డాక్టరు శ్రీమతి పి. యశోదారెడ్డిగారు వనవర్తి ప్రాంతం వారే వారు ఆశువుగా జాను తెలుగులో కవిత చెప్పగలరు; మధురోహతో కథ నడిపించగలరు; ఎర్రన హరి వంశంలోని బిర్ర బిగిసిన పద్యాలను పిండికొట్టగలరు. అన్నిటికీ మిన్నగా అమాయకమైన అంతరంగంతో సాహిత్య ప్రేమికులకు భావామృతం పంచి పెట్టగలరు.

"విజ్జికాం నైన జానామి
శీలాభట్టారికా మపి,
యశోదామేవ జానామి
ఘ్యా శ్లోకే శారదాయతే,"

నేను దండినే ఆక్షేపించిన విజ్జికను ఎరుగను. ఆలంకారికులు ఉదాహరించిన శీలాభట్టారికను ఎరుగను. లోకంలో శారదగా వెలుగుతున్న యశోదగారినే ఎరుగుదును - అని నేను ఆమెను కీర్తించాను.

నాకు తెలియని వారు ఎందరో మహానుభావులూ ఉంటారు.

మరిచాను. మహబూబ్‌నగర్ జిల్లా వారయిన మహనీయు లొకరిని స్మరించకపోతే నా కృషి సమగ్రం కాదు. వారు బహు భాషాకోవిదులు, పండితులు, న్యాయశాస్త్రనిపుణులు, పరిశోధకులు, రచయితలు,కవిత,వక్తృత్వం పుణికి పుచ్చుకొన్నవారు, ప్రజా సేవాపరాయణులు. వారు జీవించి ఉంటే ఆంధ్రప్రదేశ్ రూపురేఖలు మరొక విధంగా ఉండేవేమో! వారు బూర్గుల రామకృష్ణరావుగారు, షాద్‌నగర్ వాస్తవ్యులు. వారిసేవను గురించి ఆంధ్రావళికి చెప్పడం చర్విత చర్వణం. వారు శాసనసభలో పలుభాషలలో అడిగే ప్రశ్నలకు ఆ యా భాషలలో జవాబు చెబుతుంటే వినముచ్చటగా ఉండేది. వారి ఉపన్యాసం వింటున్నవారికి వామనులయినా త్రివిక్రములుగా కనిపించేవారు.

# ఆడవారికి నిజమైన స్వాతంత్ర్యం అరిక స్వాతంత్ర్యం

"యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః."

స్త్రీలు గౌరవింపబడే చోటే దేవతలు సంతోషిస్తారు — అని మనువు అన్నాడని, కనుక మన పూర్వులు స్త్రీలను ఎంతో గౌరవంతో చూచేవారని మన పెద్దలు అంటుంటారు. పై శ్లోకం అన్న మనువే

"పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,
రక్షంతి స్థావిరే పుత్రాః న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి."

స్త్రీలకు ఎప్పుడూ స్వాతంత్ర్యం ఇవ్వవద్దు. దానికి వారు ఎప్పుడూ అర్హులు కారు; కౌమారదశలో తండ్రి పాలనలోను, వివాహమయిన తర్వాత యౌవనదశలో భర్తపాలనలోను, వృద్ధాప్యంలో పుత్రుల పాలనలోను ఉండాలి- అంటూ పురుషులు చాల సత్ప్రవర్తనకలవారయినట్టు, తప్పంతా స్త్రీదే అయినట్టు, భావించుకొని వారికి వావీవరుసా లేదని, పురుషుడు అని అంటే చాలు, ఎగబడతారని అన్నాడు:

"సుందరం పురుష దృష్ట్వా భ్రాతరం పితరం సుతమ్,
యోనిర్ద్రవతి నారీణామ్.................................."

అనీ నిర్దయగా నిర్ణయం చేశాడు.

భర్తృహరివంటి తత్త్వవేత్తలయితే, స్త్రీ ఏదో సర్వనాశకర యంత్రమని, పురుషుణ్ని పాడుచేయడానికే పుట్టినట్టు, బ్రహ్మ సృష్టించినట్టు చిత్రించాడు. అతడు వైరాగ్య శతకంలో

"కామినీ కాయ కాంతారే కుచపర్వత దుర్గమే,
మా సంచర మనః పాంథ తత్రాస్తే స్మరతస్కరః."

అని అన్నాడు. కామిని ఒక కారడవి. పాలిండ్లలేని ఎక్కరాని పర్వతాలు. అక్కడ మన్మథుడనే దోపిడిదొంగ ఉన్నాడు జాగ్రత్త. అంతా కొల్లగొడు

కాడు – అని హెచ్చరించాడు అంత పెద్ద రాముడూ రావణ వధానంతరం సీతమ్మ తల్లితో అంటాడు కదా—

"ఏషా సి నిర్జితా భద్రే శత్రుం జిత్వా రణాజిరే,
పౌరుషా ద్యదనుష్ఠేయం మయైత దుపపాదితమ్."

*　　　　*　　　　*

"యత్కర్తవ్యం మనుష్యేణ ధర్షణాం ప్రతిమార్జతా,
తత్కృతం రావణం హత్వా మయైదం మానకాంక్షిణా.

విదిత శ్చాస్తు భద్రం తే యోఽయం రణ పరిశ్రమః,
సుతీర్ణః సుహృదాం వీర్యాత్ న త్వదర్థం మయా కృతః.
రక్షతా తు మయా వృత్తం అపవాదం చ సర్వతః,
ప్రఖ్యాత స్యాత్మవృత్తస్య వ్యంగం చ పరిమార్జతా.
ప్రాప్త చారిత్ర సందేహా మమ ప్రతిముఖే స్థితా,
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే దృఢా.
తద్గచ్ఛ త్వా నుజానేఽద్య యథేష్టం జనకాత్మజే,
ఏతా దశదిశో భద్రే కార్యమస్తి న మే త్వయా.
యదర్థం నిర్జితా మే త్వం సోయ మాసాదితో మయా,
నాస్తి మే త్వయ్యభిష్వంగో యథేష్టం గమ్యతామితి."

(యుద్ధ కాం - 150 స.)

ఓ భద్రే, యుద్ధ రంగంలో శత్రువును ఓడించి నిన్ను గెలుచుకొన్నాను. రాజులు పౌరుషంతో చేయవలసిన పని నేను చేశాను. అపకీర్తి పోగొట్టుకొనడానికి మనుష్యుడు చేయవలసింది చేశాను. నా గౌరవం కాపాడుకోదలచి రావణుని చంపాను. నా మిత్రుల రణ పరాక్రమంతో ఈ రణ పరిశ్రమ దాటాను. ఇదంతా నీకోసం చేశాననుకొన్నావేమో၊ కాదు. ఈ విషయం నీకు తెలియనీ. నా చరిత్ర కాపాడుకొనడానికి, నాకు కలిగిన అపవాదం తుడిచివేసుకొనడానికి ఇదంతా చేశాను. సందేహాస్పదమయిన నడవడిగల నీవు ఇప్పుడు నా ఎదుట ఉన్నావు. కళ్ళజబ్బు వానికి ఎరుట ఉన్న దీపం గిట్టనట్టు నాకిప్పుడు నీవు గిట్టడంలేదు. కనుక, నేను అనుమతిస్తున్నాను. నీ ఇష్టం వచ్చినచోటికి పో. పది దిక్కులూ నీ ఎదుట ఉన్నాయి. నీతో నాకు అవసరమేమీ లేదు. ఎందుకోసమయితే నేను నిన్ను గెలుచుకొన్నానో, ఆ పని పూర్తయింది. నీతో నాకు సంబంధం లేదు. ఎక్కడికైనా పో....

పితృవాక్య పరిపాలనవంటి సమయపాలన కోసమే పుట్టినట్టు, ప్రేమ

పరాకాష్ఠ అయిన దాంపత్య జీవితానికి ఆరాధ్యాదర్శం కోసమే అవతరించినట్టు చెప్పే రాముని మాటలు ఎంత కఠోరంగా వున్నాయో విన్నారుగదా!

ఇక కాళిదాసుడు దుష్యంతని నోట స్త్రీజాతినే శంకింపజేశాడు. శకుంతల కొలువుకూటంలో తనతో చెప్పినదంతా కట్టుకథ అని తోసివేస్తాడు దుష్యంతుడు.

"స్త్రీణాం అశిక్షిత పటుత్వ మమానుషీషు
సంధృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః,
ప్రాగంతరిక్ష గమనాత్ స్వమపత్యజాతం
అన్యైః ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి."

"ఆహా ఎంత చక్కగా చెప్పావు కథ! ఆడజాతే చాతుర్యం గలది. పశు పక్ష్యాదులలోను ఎవరూ చెప్పకనే ఆడ జాతికి తెలివితేటలు అబ్బుతాయి. తెలివి తేటలుగల మానవజాతి స్త్రీలను గురించి చెప్పాలా? కోకిలలు తమ గుడ్లను పొదగలేక ఇతర పక్షులతో పొదిగించి రెక్కలు పెరిగేటట్టుచేసి, ఆకాశంలో ఎగిరేటట్టు చేయడం మనం చూడలేదా?" అంటాడు.

అయితే, ఒకప్పుడు స్త్రీ పూజిత అయిన మాట నిజం. స్త్రీని ఆదిమ సంఘాలవారు సృష్టి స్థితి లయకారిణి అయిన శక్తిగా భావించారన్న మాటా నిజమే. దీనికి కారణం నేటికీ ఆశ్చర్యం కలిగించే సృష్టికి ఆమె మూల స్వరూపిణి కావడమే. ప్రకృతి సహజంగా స్త్రీలో కలిగే మార్పులు, గర్భ ధారణం, గర్భపరివర్ధనం, సంతానోత్పత్తి — ఇవన్నీ ఆదిమానవుణ్ని ఆశ్చర్య పరిచాయి. మాతృస్వామిక సంఘాలున్నంత వరకు స్త్రీ స్థానం గౌరవయుతంగా ఉండేది. కాని, పురుషుడు స్త్రీని ఉపభోగ్య వస్తువుగా, ఆస్తిగా, ఆటవస్తువుగా పరిగణించడం ప్రారంభంకాగానే ఆడవారిపై కట్టుదిట్టాలు మొదలు పెట్టాడు. తను పోయిన తర్వాత ఆమె ఎందుకుండడం? ఇతరులకు ఉపయోగపడుతుం దేమో, తనకు ఉపయోగపడినట్టు! తనకు అగౌరవం కలుగదూ? ఈ భయంతో పాటే సహగమనమనే పేర స్త్రీ హత్యకు కూడా పూనుకున్నాడు; మరణించిన వాని వస్తువులన్నీ అతని కళేబరంతో పూడ్చిపెట్టడం సంగతి ఒక శాస్త్రంగానే చేశాడు.

సుఖదుఃఖాలలో అద్వైతమయిన దాంపత్య ప్రేమగల భార్యా భర్తలలో ఎవరుపోయినా, మరొకరి గుండె పగిలిపోవడం అంటే మనకేమీ అభ్యంతరం లేదు. కాని, ఏ చావనో, గుడ్డనో మృతునితోపాటు కాల్చివేసినట్టు ఒక నిండు ప్రాణాన్ని కాల్చివేయడం ఎంత దారుణం? అలా కాల్చివేయబడిన స్త్రీ పేరంటాళ్లు, వరదాభయదాత్రి అయిన దేవతః ఇలాటి మనః ప్రవృత్తికి కారణాలు

పురుషుడు స్త్రీని ఆస్తిగా భావించడం కాక మరేమిటి? తను అనుభవించినంత సేపూ అనుభవించాడు; బాగా చాకిరీ చేయించుకొన్నాడు. తను పోయినతర్వాత ఎవ్వరికీ ఉపయోగపడరాదు.

రామాయణ, భారత సంపూల కాలంలో సహగమనం నిర్బంధంగా ఉన్నట్టు కనిపించదు. గాథా సప్తశతిలోను సహగమనం ప్రేమతో ఐచ్ఛికంగా జరిగినట్టు చెప్పిన గాథలున్నాయి. కాని, తర్వాత అభిప్రాయాలు మారాయి. భార్యకూడ ఆస్తి అన్న భావం రామాయణ కాలానికే పాతుకుంది. కాకపోతే;

"దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః,
తంతు దేశం న పశ్యామి యత్ర భ్రాతా చ సోదరః"

అని అంటాడా రాముడు? దేశ దేశాలలోను భార్యలు దొరుకుతారట, జ్ఞాతులు దొరుకుతారట. ఒక కడుపులో పుట్టిన సోదరులు దొరకరట! ఎందుకు దొరకరు? తల్లికి తండ్రికి యౌవనం నిత్యంగా ఉండేట్టు చూస్తే సరి!

పూర్వం ఆంధ్రదేశంలో ప్రత్త అనే ఆచారం ఉన్నట్టు వాత్స్యాయనుడు చెప్పాడు. ప్రత్త అంటే, కన్య ఈడేరగానే రాజువద్దకు, పాలకుని వద్దకు పంపడం. అంటే, కింది వారి ఆడవాళ్ళంతా పాలకుని ఆస్తి అన్నమాట.

ఇక స్త్రీ కాలుజారితే విధించిన శిక్ష తలచుచుంటే ఒళ్ళు జల్లుమంటుంది. పురుషుడు ఎంత కర్కోటకుడో, ఎంత కట్టుదిట్టాలు చేసుకొన్నాడో అర్థమవుతుంది. కఠినశిక్షకు పేరుపొందిన కౌటిల్యుని అర్థశాస్త్రం నుంచి ఒక శిక్ష ఉదాహరిస్తాను :

"ప్రోషిత భర్తృకాం అపచరంతీం పతిబంధుః తత్పురుషో వా సంగృహ్ణీయాత్. సంగృహీతా పతిం ఆకాంక్షేత, పతిశ్చేత్ క్షమేత విసృజ్యేతో భయం, అక్షమాం స్త్రీ యః కర్ణనాసాచ్ఛేదనం. వధం జారశ్చ ప్రాప్నుయాత్." (అధికరణం - 11. అధ్యా - 12.) భర్త పరదేశానికి వెళ్ళితే భార్య తద్వ్రతగా ఉండాలి. ఒకవేళ ఆమె కాలుజారితే, అతని రక్తబంధువులు, చుట్టాలు ఆమెను తమవద్ద వుంచుకోవాలి. పతి ప్రవాసం నుంచి తిరిగి రాగానే, క్షమిస్తే ఇద్దరినీ వదలిపెట్టాలి. అతడు క్షమించకపోతే, ఆ స్త్రీ ముక్కు, చెవులు కోయించాలి న్యాయస్థానంలో. జారుణ్ణి వధించాలి,

ఇది మరణదండనకన్నా కఠోరం. పురుషుడు స్త్రీని సమానంగా భావించేవాడే అయివుంటే, ఇలాటి శిక్షలు విధించేవాడా? ఊహించేవాడా? నిజానికి స్త్రీని రెచ్చగొట్టేవాడు పురుషుడేకదా!

ఇక మన వివాహకాండ చూస్తే మరీ ఆశ్చర్యమవుతుంది. మన వివాహ మంత్రాల అర్థాలు వేరు; మన ఆచరణ వేరు. మన శుభాశుభ కర్మకాండ యుగ యుగాల గాథల, సన్నివేశాల, సంఘటనల, చరిత్రల సారాంశం. వివాహ కాండలో ప్రధానమయిన మంత్రాలు ఋగ్వేదంలోని సూర్యాదేవి వివాహ గాథ లోనివి; అధర్వణ వేదంలోని ఉపలా వివాహ గాథలోనివీని. మరికొన్ని మంత్రాలూ చేరాయనుకోండి. ఋగ్వేదంలోని సూర్యాదేవి పూషణుల వివాహ గాథ ఒక కావ్యం. దానిలో వారిద్దరూ పరస్పరం సమభావంతో, సమాన స్థాయితో చెప్పుకొన్న మాటలు, చేసుకొన్న వాగ్దానాలు నేడు మనకు వివాహ మంత్రాలయ్యాయి. నిజానికి ఇదే నిజమైన వివాహం. "ఇదుగో! సూర్యా! మన మిద్దరం కలిసి పనిచేద్దాం. కలిసి తిందాం, కలిసి ఉందాం, సత్సంతానం కందాం." అని పూషణుడు అంటే, సూర్య దానికి అనుగుణంగా అంటే, తక్కిన వారు "ఓ దేవతలారా! ఈ వధువు సుమంగలి, ఈమెను చూడండి. ఈమెకు సౌభాగ్యం ఇచ్చి, సౌభాగ్యం కలగాలని ఆశీర్వదించి వెళ్ళండి. ఊరికే వెళ్ళకండి అని కోరితే, వారు "ఈమె పదిమందిని కననీ, పతి పదకొండవవాడు కానీ!" అని దీవించగా, ఒక నాటకంవలె సాగుతుంది ఈ సూర్యాసూక్తం. అతి ప్రాచీనమైన వివాహపద్ధతి గాంధర్వ వివాహమే. కాని దానిని మనువు ఒప్ప లేదు. దానిలో కామానికి ప్రాధాన్యం ఉందని, భార్యాభర్తల ఎన్నిక వివేకంతో జరుగకపోవచ్చునని, కుటుంబానికి రక్షణ తగినంత ఉండదని అంటూ, దానిని గౌణం చేశాడు.

"రాత్రంతా రామాయణం విని రాముడికి సీత ఏం కావాలి? అన్నాడట" అనేది మనకొక సామెత. ఈ సామెతకు మూలం లేకపోలేదు. పూర్వం అన్నా చెల్లెళ్ళు వివాహం చేసుకొనేవారు. ఇది చాలాకాలం వుంది. సంఘం నాగరక మయిన తర్వాత, మరుగయిపోయినట్టు ఋగ్వేదంలోని యమ యమి సంవాదం తెలుపుతుంది. బౌద్ధ జాతక కథలలో సీత రాముడికి చెల్లెలయిన గాథ ఒకటి ఉంది. ఈజిప్టులో పాలకులు - ఫెరోవాలు-తమ రాజరక్తం చెడిపోకుండా చెల్లె ళ్ళనే పెళ్ళాడేవారు. కొంతకాలానికి ఆ పద్ధతి అసహ్యమనిపించింది. పినతండ్రి, పెదతండ్రి పిల్లలను, అన్నదమ్ముల పిల్లలను చేసుకొనే ఆచారం ఏర్పడింది. చెల్లెళ్ళను చేసుకొనేపద్ధతి అవశేషమే మన మేనరికంపద్ధతి. ఏకరక్తవివాహం (Consanguinity) మంచిది కాదని ఏడు గోత్రాలు వదలాలని నాటి ధర్మ

శాస్త్రకారులూ చెప్పారు; నేటి డాక్టర్లూ చెబుతున్నారు. తమ వంశంలోని స్త్రీలపై ప్రలోభం పోగొట్టుకోలేక పెండ్లాడడమే ఇది. ఒక హక్కుక్రింద నొక్కి చెప్పే అలవాటయింది. అంటే తన రక్తం పంచుకొని పుట్టినవారి పిల్లలూ తనకు ఆస్తి అని భావించడమే కదా యిది! ఈ భావం-స్త్రీ తన ఆస్తి అనే భావం ఎంత వరకు వచ్చిందంటే, తనకు ఇష్టంలేని స్త్రీని తనవారెవరూ చేసుకోగూడదు. దానికి పుట్టుగతులుండరాదు. అవసరమయితే దానిని నిలబెట్టి గోరీ కట్టించవచ్చు—అన్నంతవరకు. రోమియో జూలియట్ కథ, అనార్కలీ కథ లాంటివి ఎన్నైనా ఉదాహరించవచ్చు.

మరొక ఘోరం సంతానంకోసం పురుషుడు చేసిన పనులు. పిల్లలు కలగకపోతే పురుషుడు మరొక వివాహం చేసుకొనవచ్చు, తన లోపం యేదో చూచుకోకుండా. దశరథుడు ఎన్నో వివాహాలు చేసుకొన్నాడట ఏదో సాకుతో. మన పాత నిజాంగారికి, విష్ణ్వంశ సంభూతులైన మహారాజాలకు వందలాదిగా భార్యలుండేవారు. తనకు ఒక భర్తవల్ల సంతానం కలుగలేదని ఒక ఇల్లాలు మారుమనువు చేసుకొందనుకోండి, మొదటి భర్త సహిస్తాడా?

పూర్వం మన దేశంలో స్త్రీలకు నిజమైన స్వాతంత్ర్యమిచ్చినవారు బౌద్ధులు, జైనులు. మహావీర బుద్ధులు స్త్రీలకు అన్నివిధాల పురుషునితో సమాన ప్రతిపత్తి కల్పించారు.

కాని, వారు ఎంతచేసినా, ఆర్థిక స్వాతంత్ర్యం లేనిదే స్త్రీల పరిస్థితి బాగు పడలేదు, పడదు. ఆ నిజమైన స్వాతంత్ర్యం మన దేశం స్వతంత్రమైన తర్వాతనే వచ్చిందని నేను నమ్ముతున్నాను. ప్రజాస్వామ్య పద్ధతి మన దేశంలో, ఒకానొకప్పుడు, బౌద్ధయుగంలోను శలాకా పద్ధతి అనే పేరుతో ఉన్నప్పటికీ, అది దేశవ్యాప్తంగా స్థిరపడింది ఇప్పుడే. మనమే, తొలిసారిగా వయోజన నియోజనాధికారం ఆచరణలో పెట్టాము; పాశ్చాత్య దేశాలకన్నా మున్నే స్త్రీలకు పురుషులతో సమానంగా హక్కులిచ్చాము. దానితో వారికి ఆర్థిక స్వాతంత్ర్యమూ ఏర్పడింది.

ఈ విషయంలో రష్యా చైనాలు చేసిన కృషి మెచ్చుకోదగింది. ఎంతో సంపన్నమైన అమెరికాలోనూ ఇటీవలే మహిళా విమోచనోద్యమం — **Womans' liberation movement** ప్రారంభమయింది ఇంగ్లాండులో ఇటీవలే స్త్రీలకు వోటింగు అధికారం ఏర్పడింది.

ఒక రష్యన్ స్త్రీ అమథ్య తెలుగు నేర్చుకొనడానికి వచ్చింది. "మీ దేశంలో, అన్ని పనులూ స్త్రీలు చేయవచ్చా?" అని అడిగాను. "మా రాజ్యాంగంలోనే ఆసంగతి ఉందికదా! మహిళలు ఏమిచేయదలచినా ఆటంకం లేదు" అన్ని

అన్నది ఆమె. "రాజ్యాంగం సంగతి వుందనీ. ఆచరణలో ఎలావుంది?" అనడిగాను; మనదేశంలో కొన్ని ఇంకా చట్టంలో ఉన్నా, రాజ్యాంగంలో ఉన్నా ఆచరణలో లేనివి ఉన్నాయిగనుక. అలాంటి వ్యత్యాసం ఏమీ లేదని ఆమె జవాబు.

ఇంత సంపన్నమైన అమెరికాలో అందరికీ న్యాయం జరుగుతున్నదా? అక్కడ తెల్లవారు నల్లవారిని పెళ్ళాడుతున్నారా?—అని ఎవరైనా అడగవచ్చు. అది ఎప్పటికైనా — రెండు మూడు వందల ఏళ్ళకైనా తప్పదని అన్నాడు టాయన్ బీ.

మన సాహిత్యంలోని స్త్రీవాచక శబ్దాలు పరిశీలిస్తే మన సంఘ చరిత్ర బోధపడుతుంది. తెరవ, ప్రోయాలు, మొదలయిన తెలుగు పదాల వ్యుత్పత్తి పరిశీలించండి. స్త్యాయతే గర్భమితి—గర్భం ధరిస్తుంది గనుక—స్త్రీ. మహతే-గౌరవించబడుతుంది, గౌరవమిస్తుంది--గనుక మహిళ. యోషతే—సేవచేసేది-గనుక యోషిత్, యోష.

స్వాతంత్ర్యానంతరం స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చింది. అవిభక్త కుటుంబాలు-ఇంటిల్లిపాదికి సేవచేసే అవిభక్త కుటుంబాలు-పోవడం, స్త్రీల సాంఘిక స్థితి మెరుగుకావడం, పరిశ్రమలు పెరిగి, మహిళలు హెచ్చుగా వాటిలో ప్రవేశించడం, ఇతర దేశ సంఘాలతో సంబంధం మొదలయిన వాటి వల్ల ఆ స్త్రీ స్వాతంత్ర్యం బలపడుతున్నది.

మన పెద్దలకు ఒక అపోహ ఉంది. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం రాగానే, స్వైరత ఏర్పడుతుందని, సీత, అనసూయలవంటి పతివ్రతా శిరోమణులు— నేడు ఉద్యోగానికి విదేశాలకు వెళ్ళే భర్తలవెంట భార్యలు వెళ్ళడంలేదా? ఇంటికి ఎలాంటివారు వచ్చినా, పుత్ర వాత్సల్యంతో ఇల్లాళ్ళు తిండి పెట్టడం లేదా?—పుట్టిన మన దేశం చెడిపోతుందని, విదేశాలలో వారంతా చెడిపెలసీని. కాని, ప్రేమ పరాకాష్ఠ అయిన గార్హస్థ్య జీవితం ఎక్కడైనా ఒక్కటే: నిత్య సత్యాలలో ఒక్కటి ఇదీ: నాకు తెలిసిన వందమంది విదేశ వనితలను చెప్ప గలను; వేల మైళ్ళ దూరంనుంచి మన దేశానికి వచ్చి, ఎంతో చిత్తశుద్ధితో కాపు రం చేస్తున్నవారిని. వారంతా నాకు మహా పతివ్రతలుగానే కనిపిస్తారు.

# తొలి తెలుగు నిఘంటువు

# మలి ముద్రణం

సంఘం ప్రవాహిని. దానిని అంటిపెట్టుకునివున్న భాషకూడ ప్రవాహిని. సంఘంలో ఎప్పటికప్పుడు కలుగుతున్న మార్పులనుబట్టి భాషలోవున్న పదాలు కొన్ని వ్యవహారచ్యుతం కావడం, కొత్తపదాలు తలఎత్తడం సహజం. ప్రజాసామాన్యానికి వ్యవహారంతోనే పని. మార్పులు, చేర్పులు ఎలా కలిగాయన్న ప్రసక్తి దానికి లేదు. పరిమిత పదసముదాయంతో దాని అవసరం తీరుతుంది. కాని, విస్తృత ప్రయోజనాపేక్షులు కొందరు తమ భావాల స్పష్టీకరణకు ఎక్కువ పదాలు గుర్తుపెట్టుకోవలసి వస్తుంది. తాము వ్యవహరించిన పదాల అర్థాల సాధుత్వ నిరూపణకు పాతపదాలను పచరించవలసివస్తుంది. అయితే ప్రతి పదాన్ని జ్ఞాపకం వుంచుకోడం సాధ్యమా? అభిరుచి గలవారు, అవసరమని భావించేవారు వీటిని విస్మరించకుండా వుండడానికి ప్రయత్నిస్తారు. ఇదే నిఘంటు నిర్మాణానికి అంకురార్పణం.

19వ శతాబ్దం ప్రారంభం వరకు తెనుగు నిఘంటువులన్నీ సంస్కృత నిఘంటువుల ఫక్కీనే ఛందోబద్ధంగా నడిచాయి. తమ పరిపాలన సౌకర్యంకోసం దేశభాషలు నేర్వదలచిన పాశ్చాత్యులకు తమ భాషలలో వున్నట్టే వీటిలోను అక్షరక్రమంలో జాబితాల రూపంగా వున్న నిఘంటువుల అవసరం తోచింది. దానితో దేశమంతటా-ప్రతిదేశభాషలో మాత్రమేకాక సంస్కృతంలోను ఆకారాది జాబితా రూపంలో వున్న నిఘంటుల రచన 19వ శతాబ్ద ప్రథమపాదంతో ప్రారంభమైంది. సంస్కృతంలో శబ్దకల్పద్రుమ, వాచస్పత్యాలు వెలిసినవి. సంస్కృత నిఘంటు చరిత్ర తెలుసుకొనగోరేవారు బరోడా సీరీస్‌వారు ప్రకటించిన "కేశవస్వామి కృత నానార్థార్ణవ సంక్షేపం" పీఠికను చూడగోరినాను.

పాశ్చాత్య సంప్రదాయం వచ్చినప్పటికి తెనుగులో నిఘంటు రచన రెండు విధాలుగా సాగింది : ఒకటి పరిపాలనకు అవసరమైన వ్యవహార పదాల పట్టిక. రెండవది ప్రాచీన కావ్యప్రబంధాల పదాల పట్టిక. వ్యవహారపదాల జాబితాలో మొట్టమొదటిది 'ఈ తెనుగు - ఇంగ్లీషు నిఘంటువు. దీని మొదటి పేరు

"ఏ వొకబులరీ ఆఫ్ జెంటూ అండ్ ఇంగ్లీష్." ఇది 1807లో రచితమై 1818లో తొలిముద్రణ పొందింది. 135 సంవత్సరాల తర్వాత ఇదిమలిముద్రణం.

ఈ నిఘంటుకారుని లక్ష్యం మన దేశానికి వచ్చిన విదేశ పాలకుల, వ్యాపారుల సులువే. కనుకనే ఈయన అప్పటికి సామాన్య వ్యవహారంలోవున్న పదాలను గ్రహించి వాటికి ఇంగ్లీషులో అర్థాలిచ్చి, వచనక్రియా కారకాల వివరణ చేశాడు. తెనుగు అర్థాలివ్వ లేదు. కవి ప్రయోగాల జోలికి పోలేదు.

తెనుగు నిఘంటు రచనా పరిణామం తెలుపుతూ డాక్టర్ గిడుగు సీతాపతిగారు పీఠికలో అన్నట్టు ఈ 'తెనుగు-ఇంగ్లీషు నిఘంటువు' ఆంగ్లభాష తెలిసిన ఆంధ్రేతరులకు, ఆంధ్ర భాషా పరిణామం తెలుసుకోగోరిన భాషా పరిశోధకులకు ఎక్కువగా ఉపయోగిస్తుంది.

రెండవ జాబితాలో మొదటిది ఆంధ్ర దీపిక. దీనిని మామిడి వెంకయ్యగారు 1816లో రచించారు. 1848లో ముద్రించారు. దీని ఉద్దేశ్యం కేవలం కావ్యప్రబంధాల పదాలకే పట్టిక సిద్ధపరచి, ప్రయోగాలు వివరించడం. కాగా, మొదటిది పరిపాలకులయిన కాంబెల్, సి. పి. బ్రౌన్ మున్నగువారికి, రెండవది పండితులయిన సీతారామాచార్యులు మున్నగువారికి మార్గదర్శకమైంది.

నిజానికి ఈ రెండు పద్ధతులు ఏకంచేసుకుని, నాలుగుకోట్ల జనంగల విశాలాంధ్రలోని ప్రతిమారుమూల మాండలికాన్ని సేకరించుకుని, కవి ప్రయోగం వున్నా లేకున్నా ప్రతి ప్రాంతీయ వ్యవహారాన్ని తెలిపే మహా ప్రయత్నం జరిగినప్పుడే మనభాషలోని ప్రతిపదమూ ఖిలంకాక మనకు దక్కుతుంది; సమగ్ర శబ్దకోశంకూడ నిర్మిత మౌతుంది. ఈ తొలి తెలుగు ఇంగ్లీషు నిఘంటువును మార్పులు, చేర్పులుచేయక మలి ముద్రణచేసి తమ ప్రాచీన సంస్కృతి ప్రియత్వాన్ని చాటుకున్న 'సంస్కృతి ప్రచురణలవారు' అలాటి సమగ్ర నిఘంటువు రచనకు పూనుకుంటారని ఆశిస్తున్నాను.

[తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు. రచయిత : విలియం బ్రౌన్, పుటలు: 378 క్రౌను సైజు, వెల: 5-00. ప్రచురణ, ప్రాప్తిస్థానం: సంస్కృతి ప్రచురణ, కల్చరల్ బుక్స్ లిమిటెడ్. 31, మీరాన్ సాహెబ్ వీథి, మౌంట్ రోడ్డు, మద్రాసు-2.]

# ఆధునికుల రచనలపై ఆగ్రహమెందుకు?

అదేమి కాలవైపరీత్యమో! అదేమి హృదయ దుర్విపాకమో! ఇటీవల కొందరు పెద్దలు నేటి కవులను ఈసడించడం పరిపాటి అయింది. తెలుగు తీవియ "పడమటి గాలి యొడుపున వాడి చెడి వ్యక్తిత్వ ముడిగి మాడి"పోయినదని మథనపడుతారు; ప్రాచీన స్వర్ణయుగం మరొకమారు ముసురుకొని రాక మానదని స్వప్న లడ్డుకాలు సేవిస్తూ కనులు మూస్తారు; భావకవిత్వం అహంభావ కవిత్వమని భాషిస్తారు; చెడిపోయిన దేమిటో చెప్పరు, పాడైపోయిన దేమిటో పలుకరు.

అరునెలల సావాసంతో వీరు వారౌతారన్నది నిజమని వీరు ఎందుకు గ్రహించరో! శాంతమహాసాగరంలోని మారుమూల దీవులే నేడు తక్కిన దేశాలతో సహవాసానికి చేతులు చాచుతున్నాయి గదా! సహస్రాబ్దాలుగా ఇతర దేశాలతో సంబంధమున్న భారతదేశంలో, దానితోపాటు తెనుగునాడులో పెరవారి ప్రభావం పడకపోవడం ఎలా సంభవం? బుద్ధునికి ముందునుంచీ మనకు పాశ్చాత్య దేశాలతో సంబంధం ఉంది— ముఖ్యంగా యవనులతో. కొత్తనీరు వచ్చి పాతనీటిని పూర్తిగా పారించివేసినట్లే కనబడుతుంది. కలకదేరిన పిదప పాత కొత్తల మేళికలయికతో నూతన సృష్టి ననలువారుతుంది. గ్రీకుల కళాప్రాభవానికి లోనయిన మనం గాంధార శిల్పమనే నూతన సంప్రదాయాన్నే సంతరించుకొన్నాము. అట్లే వెయ్యేళ్ళ ముస్లిం సంబంధంతో మన భావాలు, భాష కొంత మారక తప్పలేదు.

ఈ మార్పు మనను ముంచెత్తింది ఆంగ్లేయుల పాలనలో. వారి పాలనకు పునాది మతం కాదు; విద్యావిధానం. ఇది మన భావనా పద్ధతిలోను, కళల్లోను ప్రాభవం పరచింది; ఇతర పాశ్చాత్య సాహిత్యాల సువాసనలను గూడ మన ముంగిటికి తెచ్చి నిలిపింది. వారి భావచిత్రణం (ఇమేజరీ) మన కవులను ముట్టడివేసింది. దీనివల్ల మనకు కలిగిన నష్టమేమీ లేదు. సాహిత్యానికి సోకిన

సన్ని పాతమేమీ లేదు. ప్రత్యుత, ఖండకావ్యాన్ని ఇక్షుఖండంగా, ద్రాక్షపండ్ల గుత్తిగా తీర్చిదిద్దింది.

నిజమే: మనకూ, పాశ్చాత్యులకూ ఆలంకారిక సమయంలో విభేదాలు ఉండడం నిజమే: కవిత ప్రాణుల ప్రవృత్తి వీధులను అభివర్ణిస్తుందనడం మనకూ వారికీ సమానమే. కవిత ఆనందంకోసమంటాము మనం. ఆ ఆనందం మనకు రసరూపంగా ధ్యేయం. పరగత సుఖ దుఃఖాలను భావనచేసి అనుభవించగలగడం మనకు సత్త్వగుణం. దీనినే పాశ్చాత్యులు 'సహజమైన ఆసక్తి' (హ్యూమన్ ఇంటరెస్ట్) అన్నారు. మన కావ్యఫలం సద్యః ఫలనిర్వృతి రూపమయిన ఆనందం. వారిది సుఖసంవిద్రూపమైన అనుభవం (ప్లెజర్). అది తాత్కాలిక చిత్తవిస్తృతిరూపమని వారి నమ్మకం. దీనిని మన ఆలంకారికులు చమత్కారమన్నారు. కేవలం చమత్కారం అవరమని, రసానందమే శ్రేష్ఠమని మనవారి నిర్వచనం.

కావ్యానుభూతి విషయంలో, కావ్య నిర్మాణ విషయంలో మనకు రసం నికషం. దానికి తక్కినవన్నీ ఉపస్కారాలు. పాశ్చాత్యులలో రస చర్చ లేదు. కనుక ప్రతివారూ ఒక స్వతంత్రమార్గంతో నడవడం సామాన్యం. కనుకనే వారిలో భావచిత్రణం విశిష్టరూపం తీర్చుకుంది. ఈ భావచిత్రణం అలంకారాలకు సంబంధించిందే అయినా, అంతమాత్రమే కాదు. అంతకుమించింది కూడ. ఈ ఇమేజరీ అనేది కవితలో ఉంటే, దానిలో భావోద్వేగం, వైషయికత, చెప్పిన అభిప్రాయాన్ని టార్చిలైటువేసి చూపినట్టుగా వెలుగుపూతలు పూసే శక్తి, ఒక సంవిధానక్రమం ఉంటాయని పాశ్చాత్య కావ్య మర్మజ్ఞులు అనే మాట. ఈ భావచిత్రణం మన అలకారికులు చెప్పిన గుణీభూతవ్యంగ్యంగా, అలంకారప్రాయంగా, కవి అభిప్రాయానికి వ్యాఖ్యగా, కావ్యసృష్టిలోని ప్రవృత్తిరూపమైన యాథార్థ్యాన్ని తెలియజేప్పేదిగాను వివిధ రూపాలుగా ఉండవచ్చు. సకల సృష్టిలోను సంవిధానపద్ధతి ఒకటుంది. దానికి సమగ్రత, అఖండత ఉన్నట్లే కావ్యంలోనూ ఆ ప్రవృత్తిరూప యాథార్థ్యాన్ని చెప్పడంలో సమగ్రతను, అఖండతను సాధించి, ఈ విశ్వసృష్టితో సంవదింపజేయాలనేది భావచిత్రణంలోని ఉత్తమ పద్ధతి. ఈ పాశ్చాత్యుల ఇమేజరీ మన నవ కవుల రచనకు వన్నె తెచ్చి నిత్యవాసనల మల్లెలు పూయించిందనడం అసత్యమూ కాదు; అతిశయోక్తీ కాదు. దీనివల్ల, పాశ్చాత్యుల తక్కిన నుడికారాల అనుసరణవల్ల మనకు కలిగిన నష్టమేమీ లేదు. మంచి ఎక్కడున్నా పంచుకొనడం మన ధర్మం. సమర్థుడయినవాని రచనలో ఏదైనా ఒదిగి కొత్త అందాలు చిందుతుంది; అసమర్థుని చేతుల్లో పడి అనర్థం కలిగిస్తుంది. అది దాని తప్పా?

లేపాక్షి బసవయ్య లేచి రావయ్య
కైలాస శిఖరిలా కదలి రావయ్య!
హుంకరించిన దెసలు ఊగిపోయేను,
ఖురముతో దువ్వితే కుల గిరులె వణికేను.

ఆకాశ గంగకై అ్రరెత్తి చూస్తేను
పొంగేటి పాల్కడలి గంగడోలాడేను.

నంది పర్వతజాత నవపినాకిని జలము
నీ స్నాన సంస్పర్శ నిలువునా పులకించు.

ఒంగోలు భూమిలో పెనుగొండ సీమలో
నీ వంశ మీనాడు నిలిచింది గర్వాన....

కులపతి అడవి బాపిరాజుగారి ఈ గేయంలోని భావ చిత్రణోదాత్తతను అనుభవించడం భావితాంతఃకరణులయిన భావుకులకే వదలుతున్నాను. ఇది ఇక కుంచె తాకనవసరంలేని చిత్రం. ఉలి రాపాడ నక్కరలేని శిల్పం.

సుళ్ళు తిరిగే కదలి నడుమా
సూపు కందీ అందకుండా
తెప్ప లేసుకు పాము పడుచులు తేలిపోతారో....

అంటారు విశ్వనాథ సత్యనారాయణగారు కోకిలమ్మ పాటలో. తరగలను ఉరగ ఫణాలుగా వర్ణించడం మనకు కొత్తగాదు. పైకి లేచిన తరగలతలలను పాము పడుచులుగా, తరగల మొదళ్ళలోని ఒంపును తెప్పగా వర్ణించడం మనకు కొత్త. కాని, ఎంత అందంగా ఉంది?

నవరింతునా అగ్నివీణ! రింగులు వార
నవరింతునా దిశాంచలము
నవ నవాంగార సంభవకీల బుసదేర
మనసులో మిన్నాగు ఫణమెత్తి పారాడ
నవరింతునా అగ్నివీణ!....

అని హుంకరిస్తారు పుట్టపర్తి నారాయణాచార్యులుగారు. అగ్నివీణ అనడం, మనసులో మిన్నాగు ఫణమెత్తినదనడం అన్యసంప్రదాయపు మెరుపులే. అయితే ఏం? ఎంత భయద గంభీరంగా ఉన్నాయి!

గగనమంతా నిండి
పొగలాగ క్రమ్మి

బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను.

ఆకాశపు ఎడారిలో అంతటా అకట
ఈ రేయి రేగింది ఇసుక తుపాను.

గాలిలో కనరాని గడుసు దయ్యాలు
భూ దివమ్ముల మధ్య ఈదుతున్నాయి.

నోరెత్తి హోరెత్తి నాగులు సాగరము
కరి కళేబరములా కదలదు కొండ.

ఆకాశపు ఎడారిలో కాళ్ళు తెగిన
ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి.

విశ్వమంతా నిండి వెలిబూది వోలె....
బహుళ పంచమి జ్యోత్స్న భయపెట్టు నన్ను—

అని శ్రీరంగం శ్రీనివాసరావుగారు భయపడుతారు. భయ సమ్మిళితమైన నైరాశ్య భావ చిత్రణ మిది. తద్వ్యంజక సామగ్రి అంతా పాశ్చాత్యం. నైరాశ్యానికి చిహ్నం పొగమంచు. భయపెట్టే వెన్నెల అట్లుంది. (కవి చూచిన బహుళ పంచమి జ్యోత్స్న మార్గశిర పుష్య మాసాలదేమో: అప్పుడుగాని వాతావరణంలో పొగమంచు కనిపించదు.) ఇసుక తుపాను, గాలిలో కనరాని గడుసు దయ్యాలీదడం, ఆకాశపు ఎడారి, కాళ్ళు తెగిన ఒంటరి ఒంటె - ఇవన్నీ భారతీయేతర దేశ కాల సంప్రదాయగతాలు. మనకు జాబిల్లి పురుషుడు—ఉంది కాదు; ఉన్నాడు. జాబిల్లికీ ఒంటెకూ రూపసాదృశ్యం లేదు. నైరాశ్యానికి మనం మరు మరీచికలను ఉదాహరిస్తాము; పొగమంచును కాదు.

అయితే ఏం: ఏ సంప్రదాయంతో చెప్పినదానిని ఆ సంప్రదాయంతోనే అనుభవించి ఆనందించాలి. శ్రీశ్రీగారి బహుళ పంచమి జ్యోత్స్న గగనమంతానే కాక మన మనోగగనమంతా నిండి, భయపెట్టడానికి మారు ఆనంద పెడుతున్నది. ఛందస్సా మంజరీ ద్విపద; ఎంత సహజ సౌందర్యం పుణికి పుచ్చుకుంది:

దినములు పరస్పర ప్రతిధ్వనులు గాగ
ఇరువదైదెండ్లు నా బ్రతుకిట్టె గడచె
ఈ రహో దుఃఖ పీఠులం దేనెరుంగ
సఖుల యడుగుల జాడ లీసరికి గూడ....

అంటారు వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు "దీపావళినాడు". దినములు పరస్పరం ప్రతిధ్వనించడమనే సమయం, భావచిత్రణం మన సంప్రదాయం కాదు. కాని, ఏ మార్పూ లేక గడిచిపోయాయనే సాదృశ్యాన్ని ఎంత చక్కగా చిత్రించారు?

అంతో ఇంతో షెల్లీ భావచ్ఛాయలలో విహరించిన కృష్ణశాస్త్రిగారి "అన్వేషణ"లోనిది మన భావాలతో, ఆలంకారిక సమయాలతో మేళవించిన పాశ్చాత్య భావచిత్రణ పరిపాకమే. కనుకనే ప్రాచ్య పాశ్చాత్య రీతుల సుందరతా పరాకాష్ఠను పండించుకుంది.

నండూరి వెంకట సుబ్బారావుగారి 'కలత నిదురలో"—

ఆకాశమో తీరు
ఆవులించిన రేయి—

మనదా? పూర్తిగా, నోరారా వెడలిన ఆంగ్లేయుల ఆవులింత. అయితే ఏం? భయానక రసాన్ని పాయలుగా పారించింది.

జగత్తాక పోస్టాఫీసు ముద్ర
ఫగత్తు ఇదేనంటుంది కాలం.

ముద్రకింద నల్ల సిరా
మాసిపోదు ససేమిరా.

తమస్సు ముద్రించిన జాబులు
కట్టేసిన సంచికి సీలులు.

ఈ దుర్వార్తల ఉత్తరాల సంచీ
ఎప్పటికీ పో దిక్కడనుంచీ.

ఏమిటంటే ఏరొకటద్దం
ఎప్పటికీ వంతెన మెమొరాండం.

సామాన్యుడు రన్నరు పాపం
పోకుంటే వీళ్ళకు కోపం
కానీ పోలేడు వాడు
కానీ కెవ్వడు పోతాడు!
అఘడియ మన కాదివారమైతే సరి
శతాబ్దాల తర్వాతనే మన కది డెలివరీ....

అంటారు సాళ్వ కృష్ణమూర్తిగారు "నిరీక్షణ"లో. వీరు తమ జాబుకోసం ఎదురు

చూచే మిషతో అనంతకాలంలో ఎన్ని జగత్తులలో, ఎన్ని జన్మలలో కాచుక్కూచోవాలో అనే తత్త్వ చింతనను — యాథార్థ్యాన్ని ఈ చిత్రణలో స్ఫురింపజేశారు. దీనిలోని సామగ్రి అంతా ఆధునికం; నిత్య దృశ్యమానం. అంతమాత్రాన గభీరత కొరవడిందా? తత్త్వధ్వని మరుగు పడిందా?

చావ చింపు సామ్రాజ్యం
కోడిగుడ్డు కోహినూరు
పాటి మన్ను ప్లాటినం
బస్సు సీటు బ్రహ్మ రథం
ఏదైతేం, ఏదైతేం
పోటీపడి కాటులాడ?....

అని కాళోజీ నారాయణరావుగారు "పోటీ తెన్నులు"లో నేటి మారణాయత్తుల సర్వ సర్వంసహా జిఘృక్షను చిత్రించారు. ఈ భావ చిత్రణంలోని రెండు జంటలూ పరస్పరం నిమ్నోన్నతాల అంచులు. మనస్తత్త్వం మారలేదు; మనిషి పెరగలేదు అనేది కవి వివక్ష. ఎంత సులభంగా నిరూపించారు!

ప్రతి మనిషి కాంతిగోళంలా మారి
మనిషి మస్తిష్కం టెలివిజన్ యంత్రమై
గాలి కెరటంలా తేలే మనస్సులో
బంతిలా ఎగిరే శరీరంతో
మీరంతా నా స్థానం ఆక్రమించి,
పూర్వం నన్ను గురించి మీ లోకంలో
వ్యాప్తమైన అతీత కల్పనల రూపం
వింతలు విశేషాలకు బదులు, రేపు
కదలిక ఎరుగని నాపై సాగించి
పరిశోధనలు—ఆయుర్దాయం తేల్చి
కొండజాతి మంచుమనిషినని నిశ్చయించి
నా చుట్టూ రక్షణకోసం యంత్రాలు

* * *

రాజకీయ వైద్యులు మార్పులు—మృత్యువు!
తెలియని భాషలో సాగే ఓదార్పులు
అప్పుడు మీర్లూ నేనూ ఒకటి అన్నమాట!

నమ్మనంతగా మారుతుంది నా పూర్వరూపం
కాంతి గోళాల్లా తిరుగుతుంటారు మీరు
ఎవరికి వాడే స్వయం వ్యక్తి సంపూర్ణంగా
టెలివిజన్ మస్తిష్కంలో మనుషులు.

కాలం ముద్రలు—చెల్లిపోయిన
చెల్లని హక్కుల సత్రం 'రిన్యూ' ఔతుందా!
కాంతి చక్రం పరిధిలో వెలుగుతప్ప
సాగి వచ్చినంత మేర తిరిగి చీకటేగా! ...

అని మాదిరాజు రంగారావుగారు వచన గంధి పద్యమైన "ఇరవై ఐదో శతాబ్దంలో చంద్రుడు"లో చంద్రుని ఆత్మవేదనకు కవితా రూపమిచ్చారు. ప్రతి మనిషీ కాంతి గోళంగా మారడం, గాలి కెరటాలకు మనస్సు తేలడం, శరీరం బంతిలా ఎగరడం—ఇవన్నీ చంద్రలోకంలోని వాతావరణానికి సంబంధించిన భౌతికశాస్త్ర విషయాలు. మన ప్రాచీనులు శాస్త్ర సంప్రదాయాలను కవితలో ఇమిడ్చారు. రోహిణీ మధ్య గత చంద్రుడు హారమధ్యంలో ఉన్న పతకంలాగ ఉన్నాడన్నాడు వాల్మీకి. చాకు కొనలాగ, కొనదేరిన దండలాగ ఉన్న రోహిణి నక్షత్రం స్వరూపం రోహిణీ శకటాకారం పంచ—అని తెలిస్తేగాని రసాస్వాదనం కలుగదు. పూర్వాభాద్ర ఉత్తరాభాద్రలనే మంచంలో చంద్రుడు పడుకున్నాడని ఎవరైనా వర్ణిస్తే, ఆ నక్షత్రాలు — పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ఖట్వాకారం చత్వారి — అని మంచంకోళ్ళలా గున్నది తెలియాలి. నేటి శాస్త్ర విషయాలు అలాటివే. అవి తెలిస్తేనే చర్వణ.

రేకులు రేకులుగా విరిసెను
విజ్ఞానపు ఉషస్సు
చందమామ నందుకొనెను
మనిషి చేయు తపస్సు....

అని అంటారు వేణుగారు "వెలుగు నీడలు"లో. నిన్న మొన్న జరిగిన, జరుగుతున్న ఘటనలు కావ్య వస్తువయిందని మనం సంతోషించవద్దా!

జగత్తుకు ప్రాణం ప్రసాదించిన
కార్బన్ పరమాణువు
అందులో సెంట్రల్ న్యూక్లియస్‌చుట్టూ
చాంద్రాయణం చేసే ఆరు ఎలెక్ట్రానులు.

  

కాలం అక్కడక్కడే పెరగ్గలదా!
నయాగరా జలపాతంవలె
నడుం విరిగేటట్టు దూకంది తప్పదు గదా!

*　　　*　　　*

బ్రతుకు నాగజముడు గూడ
పూలు పూచనీవయ్యా
మెతుకులో ప్రోటీనులు
మిక్కిలిగ రానీవయ్యా

*　　　*　　　*

మథనపడే మేధావుల
శిథిలాశలు చివురించే
రసరాజ్యం లేబరేటరీ ...

అని నిర్వచిస్తారు 'మస్తిష్కంలో లేబరేటరీ'లో దాశరథి కృష్ణమాచార్యులు గారు. విజ్ఞానం వేయి చేతులతో మానవ జాతిని పరీరంభణం చేసుకుంటున్నది. కావ్య వస్తువులు, కవి సమయాలు మారక తప్పదు. నేటి విజ్ఞానశాస్త్ర వికాస ప్రకాశాన్ని చిదిమి ఎక్కడి కక్కడే దివ్వెలు వెలిగించి, ఆ వెలుగులో తన భావచిత్రాలశాలను తెరుస్తారు దాశరథిగారు. కార్బన్ పరమాణువు, ఎలెక్ట్రానులు, ప్రొటానులు, ఇవన్నీ శాస్త్రజ్ఞుల జీవితంలో పరిచిత పరిభాషలు. వాటిని దాశరథిగారు కవితా స్థాయికి తెచ్చి లేబరేటరీని రసరాజ్యంచేసి, మన హృదయాలను స్పందింపజేశారు?

పారిజాతాంగనల పట్టి తెచ్చి వలాశ
వీరులకు పెండ్లి సేయింతు,
సెలయేటి సొగసుగత్తెలు మేరుగిరిపతికి
గిలికింతలిడ సంతసింతు!
ఆశలను దిగద్రావినట్టివాడే తావి
యంత స్వేచ్ఛగ ఎగసి పోవు....
బ్రతుకును పరిమళ ప్రతిగా మలచుకొన్న
వాని కే వరిదులును లేవు.

అని సింగిరెడ్డి నారాయణరెడ్డిగారు తమ "ఆశలు" పరుగులెత్తించారు. ఈ నవ్య భావనలోని చేవన్ను ఘూర్ణశేషీ ఆక్షేపకులు?

ఇన్నాళ్ళకు మానవుడే దేవదేవుడు
విన్నారా, సామాన్యుడు ఆదిదేవుడు!
తన పలుకే నవవేదం
తన కరుణే సుధారసం
మనిషిలోని మంచితనం
ఎన్నటికీ పోని ధనం....

అని ఆరుద్రగారు మానవుణ్ణి దేవుణ్ణి చేశారు పాశ్చాత్య సంప్రదాయ సుగంధం చిలకరిస్తూ. నిజానికి మానవుడే—సంపూర్ణ మానవుడేగా దేవుడు! జీవాత్మేగా పరమాత్మ ఇటునుంచి చూస్తే.

అనగా అనగా ఆంధ్రదేశమున
అధికారానికి వచ్చారయ్యా
అకస్మాత్తుగా ముగ్గురు రాజులు
ఒకరికి ఊరూ లేదూ, రెండు పేరూ లేదు.

ఊరూ పేరూ లేని రాజులు
పట్టం కట్టే సంకల్పంతో
ఇట్టటు దిక్కులు పరకాయిస్తే
జాగా కానారాదు చెప్తే వినాలేదు.

కనివిని ఎరుగని కందనవోలు
కాలువ గట్టున దేరావేసి
సాలు రాబడిని గుణించి చూస్తే
రాబడి సున్నకు సున్నా పోబడి హళ్ళికి హళ్ళి.

హళ్ళికి సున్నకు పెళ్ళి చేయ వం
డిళ్ళు వేసి పెద్దలను పిలువగా
వచ్చిన మూడూ రూపాయల్లో
ఒక్కటి చెల్లాచెల్లదు రెండూ ఒల్లాఒల్లవు....

అని తత్త్వం పాడుతారు రాంభట్ల కృష్ణమూర్తిగారు, ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధానిని హేళనచేస్తూ, దీనిలో నడకే కాక, సంప్రదాయానుసరణే కాక, ఎంతవ్యంగ్యం ఉంది? పెద్దలు వీటిని ఎందుకు చూడరు?

నవ రచయితల రచనలు చదువుతూపోతే సానలు తీరి నవ్య పథాన రంగు రంగుల రోచిస్సులు విరజిమ్మే మణులు మనకు మిరుమిట్లు గొలుపు

తాయి; కలరవాలు కురిపిస్తూ వంపు వంపునా కర్పూర కాంతు లీనే కలరవ కంఠాలు కనిపిస్తాయి; వివిధ సౌరభాలు వెదజల్లే భావ కదంబ ప్రసూనాలు వికసిస్తాయి. పక్షపాతం మాని పెద్దలు పరికించాలి; అప్పుడు గాని నిజం తెలియదు. సహృదయతకు పాత కొత్తలు పరిధులు కావు. అది కాలాతీతమైనది; కాలానికి కళ్ళెం వేసేది.

విజ్ఞానం వేయి రేకులతో విరిసి మనను ప్రలోభింపజేస్తున్నది. దేశం కాలం ఒక్కదానితో మరొకటి పోటీపడి ఏకమైపోతున్నది. ఎంతో పుణ్యంతో గాని చేరలేమని, గ్రహమనీ అనుకున్న చందమామ మన ఆగ్రహానికి గురిఅయి అనుగ్రహం వేడే దశ వచ్చింది. కనుక ఏ కొత్త వచ్చినా—హృదయానికి హత్తుకోవలసిందే. దానికి కొందరు ఏమన్నా ఒత్తిగిలు మనవలసిందే.

ఇట్టి స్థితిలో ఆధునిక కవి సమకాలీన వస్తు సామగ్రి సాహాయ్యంతో భావ చిత్రణం చేయక ఏంచేస్తాడు? ఈ సామగ్రి తపాలా ముద్ర మొద్దలు తప్పేటవరకు మోగవచ్చు. అది నిత్య జీవితంలో పరిచితమయినా, కవితలో ప్రయుక్తమయినప్పుడు కవితా స్థాయికి అందివచ్చి పాఠకుని స్పందింపజేస్తున్నదా, లేదా, అన్నదే విమర్శకులు చూడాలి; కవి గూడా గుర్తుంచుకోవాలి. వాటికి అనుభవ గోచరత ఉన్నా ఊహా చోదకశక్తి ఏర్పడిందా, లేదా అన్న విషయాన్నే కవులు, పెద్దలు పరిశీలించాలి.

"యద్య త్సాధు న చిత్రే స్యాత్
క్రియతే తత్త దన్యథా."

—కాళిదాసు

# నన్నయ పదకోశ నిర్మాణం

వాఙ్మయ ప్రపంచం అతివిస్తృతమైందన్నారు పెద్దలు. దానిలోని ప్రతి పదమూ మనకు అవసరాన్ని బట్టి గ్రాహ్యమే అవుతుంది. కాని సామాన్య మానవునికి రెండుమూడువందల పదాలతో జీవయాత్ర గడుస్తుంది. అతనికి భాషలో మార్పులు, చేర్పులు ఎలా కలిగాయన్న ప్రసక్తిలేదు. ఆ లోతుపాతులను తరచడం పండితుల, అందులోను నిఘంటుకారుల పని. కనుక వారి కర్తవ్యం ఎంతో గురుతరం. (1) దేశ్యన్యదేశ్య పదనిర్వచనం, (2) వ్యుత్పత్తి, (3) అర్థపరిణామ వివరణం, (4) సాధ్వర్థ నానార్థ నిరూపణం, (5) పర్యాయాల, రూపాంతరాల చేర్పు, (6) తెలుగుసాహిత్యంలోని సంస్కృతపదాల, సంస్కృత ప్రాకృతభవాల విశదీకరణం, (7) వెనుకటి కోశకారులు వదలిన పదాల క్రోడీకరణం - ఇంకా ఎంతటిదో కోశకారుల బాధ్యత.

ఈ దృష్టితో పరిశీలిస్తే పాశ్చాత్య భాషలలో ప్రతి ప్రాచీన కావ్యానికి విపులమైన 'గ్లాసరీ' ఉంటుంది. మనదేశంలో తమిళ కన్నడులు మనకంటే ఎంతో మేలు. మనకు నన్నయ భారతానికే తగిన పదకోశం లేదు.

నన్నయ పదకోశ నిర్మాతల బాధ్యత గురుతమమని చెప్పనక్కరలేదు. మనకది ఆదికావ్యం. వేద నిర్విశేషంగా ప్రామాణికం. నన్నయ ప్రయోగించిన ప్రతిపదమూ ఈ కోశంలో చేరాలి. ఏపదం ఎన్నిసార్లు ప్రయుక్తమైందో వివరించాలి. వాడు, అది అనే సర్వనామాలు సహా తు.చ. తప్పక చేరాలి.

(1) ఈ కోశంలో దేశిపదాలుమాత్రమే చాలదా, సంస్కృత పదాలు వీందుకు చేర్చాలి?— అన్నవాదం ఉంది. సంస్కృత పదాలు మనదేశంలోని వివిధ భాషలలో వివిధరీతుల అర్థాలలో ఉన్నాయి. మన ఉపన్యాసం హిందీ, బెంగాలీవారికి నవల. మన అవసరం తమిళులకు తొందర. మన కాదంబరి కన్నడులకు నవల. మన నిబంధం హిందీవారికి వ్యాసం, మన ప్రబంధం హిందీ వారికి ఏర్పాటు. మన నిమంత్రణం హిందీవారికి కేవలం ఆహ్వానం. నేడేకాక ఈ భేదం అనూచానంగాను ఉన్నట్టు ఉంది. నన్నయ రక్తం అనే అర్థంలో అరుణవారి (మాంసపంకారుణ వారి. ఆది. 6-305) అని, యమగృహం అనే అర్థంలో అంతకకక్షయము (హంసుండు నా ఢిభకుండు నంతక కక్షయగతు

లైన, సభా. 1-161) అని, అనిశ్చయం అనే అర్థంలో అనేకాగ్రత (అనేకాగ్రత బొందనేల యే నుండగ. సభా 2-93) అని, కట్టుట అనడానికి రచియించు (ఇమ్మగ విశ్వకర్మ రచియించిన, ఆది 8-71) అని ప్రయోగించాడు. ఇలాటివి ఇంతవరకు నిఘంటువులకు ఎక్కలేదు. (శ్రీ నిడదవోలు వెంకటరావుగారు శబ్దరత్నాకరం అనుబంధంలో వీటిని చేర్చారు.) ప్రయోగ వైశిష్టి, అర్థభేదం ఉండడాన్నిబట్టి ప్రతిసంస్కృత పదమూ ఈ కోశంలో చేరకతప్పదు.

(2) ప్రతిపదం పద్దు (entry) లోను దానికి సంబంధించిన వివరాలన్నీ ఆకారాదిలో ఉండాలి. ప్రతిదానికీ ఉదాహరణం, అర్థభేదం చూపాలి. ప్రతి తిఙంతరూపమూ, సుబంతరూపమూ ఉంచాలి. సాధారణ నిఘంటువులలో ఒక క్రియకు అన్నిరూపాలూ ఇవ్వరు. కాని, నన్నయ ప్రయోగాలఎడ సందేహం కలుగకుండా స్పష్టతకోసం ప్రతి క్రియారూపమూ ఇవ్వాలి. ఈ వరుస సంస్కృత లకారాల వరుసను ఉండడం ఉచితం. శబ్దపల్లవాలని మన వ్యాకర్తలు చెప్పిన అనుప్రయుక్తక్రియల అర్థభేదం వివరించాలి. ఉదాహరణకు తెంచు అనుబంధం ప్రయోగించబడిన తీరునే చూద్దాం. "ఎనేడు లగుదెంచె నర్జునుం డేగి యింత కేతెంచు బూని దివ్యాస్త్రముల్ వడసి" (అరణ్య 4.3), "మునిశాపదినమ్ములు పోవుదెంచె" (ఆది 4-35), "అరుగుదెంచె" (ఆది 3-40), ఎగయదెంచె, పుత్తెంచె అని నన్నయ తెంచుధాతువును విశిష్టార్థంలో అనుప్రయోగించాడు. ఇలాటి వాటి వివరణ అవసరం కదా!

(3) ఈ పదకోశనిర్మాణంద్వారా మనకు నన్నయకాలపు, ప్రాఙ్నన్నయ కాలపు భాషా సాహిత్యాల సంపూర్ణ స్వరూపం ప్రత్యక్షం కావాలి. ఈ లక్ష్య సాధనకు ప్రతిపద వివేచనమూ అవసరం. వ్యుత్పత్తి, సజాతీయ భాషాపదాలతోను, సమకాలిక, ప్రాక్కాలిక శాసనపదాలతోను తులనాత్మక చర్చ జరపాలి. వెల్వడు, కీడ్వడు, మన్మడువంటి శ్లిష్టాక్షరమధ్య పదాలలో పూర్వపదం ఉకారాంతమా, అకారంతమా అన్న నిర్ణయం జరుగాలి. నన్నయకాలానికి గసడదవాదేశం నిత్యమే. (దీనికి నేటి తెలంగాణా ప్రజాసామాన్య వ్యవహారం తార్కాణం.) ఉభయరేఫలసాంకర్యం, పూర్ణార్ధబిందు సాంకర్యం కవిత్రయం చేయలేదన్నది పండితులమతం. ("ఎసగు-పొసగు," వ్యాసం—యువసంవత్సర మార్గశిర భారతి, "ఆంధ్రఛ్ఛందో విశేషములు"—యువ సంవత్సరం భారతి.) కొందరు సాంకర్యం కలదంటారు. ఇలాగే పదప్రాసం—వీటినిర్ణయం కావాలి. విభక్తి ప్రత్యయాల నిర్ణయం జరగాలి. ఉదాహరణకు: నన్నయ తో తోడలను తృతీయా విభక్తి వాచకాలుగాను, కైను చతుర్థీవాచకంగాను స్పష్టంగా ప్రయో

గించినట్టు కనబడదు. అతని ప్రయోగాలలో యొక్క కనిపించదు. గల అనుబంధం కనిపించదు. వీటిపై చర్చ జరగాలి.

(4) నన్నయ భారతభాగంపై కన్నడ ప్రభావం - ముఖ్యంగా పంప భారతప్రభావం-ఎంతవరకు గలదో క్షుణ్ణంగా పరిశీలించాలి.

(5) ఇంత వివేచన జరగడానికి నన్నయ భారతం పాఠాల నిర్ణయం కావాలి. ఇప్పటి ముద్రితప్రతులను 104 సంవత్సరాలక్రితం కరాలపాటి వెంకట రంగయ్యగారు సంస్కరించి ప్రకటించిన భారత ప్రతులతో పోల్చిచూస్తే తర్వాతి పండితులు తమ వ్యాకరణ దృష్టితో ఎలా దిద్దివేశారో స్పష్టమౌతుంది. ఉదా:

పోలగ ధర్మశీలుడయి
భూరి బలాధికుడైన ధారుణీ
పాలకు రక్షమున్ బడసి
భార్యను బుత్రుల నర్థయుక్తితో
నోలినమేలుగా బడసి
యూళ్ళను నున్నది యట్లుగానినా
దేల గృహస్థవృత్తిః సుఖ
మేగి వనంబున నున్కి కష్టమేః (ఆది. 6-270)

ఇది వావిళ్ళవారి ప్రతిపాఠం. మూడవపాదం అర్థం కుదరలేదు. రంగయ్యగారి ప్రతిలో "మేలుగా బడయు మాళ్ళను నున్నది యున్కి కానినాడేలః" అనే సరైన పాఠం చూస్తేగాని అర్థం కుదరదు.

"చింతించుచున్నచో నిప్పు డెద్దియేని" (ఆది, 6-243) వావిళ్ళవారి ప్రతి. "చింతించుచుండుదు ఇప్పుడె" రంగయ్యగారి ప్రతి.

"ఇంద్రుడై పరిగిన నిద్ధతేజు" (ఆది, 2-8 ). వావిళ్ళవారి ప్రతిలో దీనికి సాంద్ర, ఇంద్ర అని పాఠాంతరాలివ్వబడ్డాయి. వ్రాతప్రతులలో "రుంద్రతేజు" అనేపాఠం ఉంది. నన్నయ ఈ సీసం ప్రతిపాదం రెండవదళంలో ప్రాసయతి పాటించినాడు. ఇద్ధతేజుడనే పాఠంలో ఈ నియమం భగ్నమౌతుంది. సాంద్ర తేజుడనే పాఠమైనా బాగుండును. చూడండి:

బ్రహ్మణ్యుడగు కశ్యపబ్రహ్మవరమున
వినతకు బుట్టిన యనఘమూర్తి
వాలఖిల్యులదయ వరపక్షి కులమున
కింద్రుడై పరగిన రుంద్రతేజు

డుదధిలో నున్న యత్యుగ్రనిషాదుల
నారంగ్రమింగిన ఘోరవీరు
డిభకచ్ఛపముల రౌహిణశాఖతో నెత్తి
కొని దివి బఱచిన యనిలవేగి.

"ఒడలు తెల్లని తురగోత్తము వాలంబు నల్లసేసితిరేని నాకు దాని" (ఆది. 2.35) ముద్రిత ప్రతి. "ఉల్ల తెల్లని" అని వ్రాత ప్రతి, ఉల్ల విర్దేశ వాచకం.

"వంటి లమరునంతకు" (అరణ్య 2-196) ముద్రిత ప్రతి "అమయు నంతకు" అని వ్రాతప్రతులు. (అమయు ప్రయోగం హరివంశంలో ప్రాసస్థానంలో ప్రయుక్తమైంది.)

నన్నయ్య భారతం ప్రామాణిక పాఠాలతో పరిష్కరించి ప్రకటించవలసిన అవసరం గూర్చి కీర్తిశేషులు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు ఇప్పటికి 37 ఏళ్ళ క్రితమే రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో "రాజరాజు కాలమందున్న తెలుగుభాష" అనే వ్యాసంలో ఉద్ఘాటించారు. తర్వాత 1937లో వారిశిష్యప్రధానులు డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఆంధ్రభాషా చరిత్ర ద్వితీయ సంపుటంలో నన్నయభాషను గురించి పరిశ్రమించి పరిష్కరణ విధానం సూచిస్తూ, ఉదాహరణ ప్రాయంగా సౌపర్ణోపాఖ్యానం ప్రకటించారు. 1940లో త్రిలింగ రజతోత్సవ సంపుటిలో డాక్టర్ సీతాపతిగారు నన్నయ్య భారత పరిష్కారణావశ్యకతను చక్కగా నిరూపించారు. మన సాహిత్య సంప్రదాయాలకు మూలమైన నన్నయ భారతభాగం వివిధ తాళపత్ర ప్రతులతో తైపారుచేసి, ప్రామాణిక పాఠాలతోను, కూలంకషవ్యాఖ్యానలతోను ప్రకటించే అవకాశం కలిగితే ఎంత బాగుండును! అప్పటికిగాని సూక్ష్మమైన నన్నయ పదకోశం నిర్మించడం సాధ్యంకాదు. ఏ కవి కావ్యపదకోశ నిర్మాణానికైనా పరిష్కృతప్రతులు అవసరం.

అయితే, దీనివల్ల పదకోశ నిర్మాణంలో విలంబన జరగవచ్చునని తోస్తే, పదకోశాన్ని ఇప్పుడు ఉపలబ్ధమైన సమీచీన ముద్రితప్రతులు ఆధారంగానే సిద్ధపరచి ముద్రణావసరంలో తాళపత్ర ప్రతులతో తైపారుచేసుకోవచ్చు. ఏమైనా పాఠనిర్ణయం అత్యావశ్యకం.

తెనుగులో కావ్యపదకోశా లనదగినవి రెండే ఉన్నవి. ఒక్కటి: డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్ర తుదిని ఇచ్చినది. రెండు: మద్రాసు విశ్వవిద్యాలయంవారు ప్రకటించిన నన్నిచోడ కుమారసంభవం చివర ఉన్నది. ఈ రెండింటిలోను వాటి సంపాదకులకు ముఖ్యమని తోచినపదాలే సంగృహీతాలు.

ఇక సంస్కృతంలో ప్రామాణికంగా ఉన్నవి మూడు: 1. మారిస్ బ్లూంఫీల్డ్ సిద్ధపరచగా, హార్‌వార్డ్ విశ్వవిద్యాలయం ఓరియంటల్ సిరీస్‌వారు ప్రచురించిన "వేదిక్ కంకార్డెన్స్" (1906). ఇది వేదమంత్రాల పాదాలసూచి. కనుక మనకంతగా తోడ్పడదు. 2. శ్రీ హంసరాజ్ సిద్ధపరచిక "వేదిక్‌కోశ్". ఇది బ్రాహ్మణాంతర్గత వైదికపదాలకోశం. లాహోర్‌లో 1926లో ముద్రితం. అర్థనిర్వచనం మొదలయిన వివరాలతో ఉన్నందున మనకు కొంత తోడ్పడు తుంది. 3. "మహాభాష్య శబ్దకోశః." పూనా భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌వారు దీనిని 1927లో ముద్రించారు. మనదేశంలో సిద్ధ పరచిన సమగ్రమైన పదకోశం ఇదే అనవచ్చు. దీని నిర్మాణపద్ధతి నన్నయ పదకోశ నిర్మాణంలో చాల తోడ్పడుతుంది. దీనిలో సామాసికమైన శబ్దాలలో ద్వంద్వఘటితమైన శబ్దాలు మాత్రమే విభజించి ఇవ్వబడినవి. తక్కిన సమాస గతపదాలు పూర్తిగా, ఉన్న వున్నట్టుగా చూపబడినవి. ఒకపదం. సమాసం మొదటవస్తే దానికి మొదట"ం" గుర్తు, మధ్యవస్తే పదానికి ఇరువైపులా ఆగుర్తు, ఆఖరునవస్తే పదం చివరన ఆగుర్తూ పెట్టబడింది. అన్ని శబ్దాలకూ ప్రాతిపదిక స్వీకరించబడింది. సర్వనామశబ్దాలు మాత్రం సవిభక్తికంగా విభక్తిక్రమంలో సూచితమైనవి. ధాతురూపాలన్ని ఆ యా ధాతువులకింద చూపబడినవి-మొదట నిరుపసర్గాలు, తర్వాత సోపసర్గాలు, ఒకపదం ఎన్నిసార్లు ప్రయుక్తమైందీ సూచితమైంది. ఇది చాల సహాయకారి కాగలదు.

పూర్వం కోశకారులకు పరిశీలన నిమిత్తం తగినన్ని ప్రతులు దొరక లేదు. ఇప్పుడు కావలసినంత ఈ సాధన సామగ్రి ఉన్నది. ఇదివరకే ఈ విషయమై పలువురు పరిశోధకులు జరిపారు. ఈ కారణాలవల్ల ఇప్పుడు నన్నయపదకోశం సర్వాంగీణ సుందరంగా సిద్ధం కావచ్చు.

ఈ పదకోశాలు ఒక్క నన్నయభారతానికే కాదు. ప్రతి ప్రాచీన కావ్యా నికీ ఉండాలి. క్రీడాభిరామం చిన్న గ్రంథం. దానికే సమగ్రమైన పదసూచిక లేదు. దానిలోని పదాలు నిఘంటువుకు ఎక్కనివి ఎన్నో ఉన్నాయి. అది జాతీయాలతో నిండిన జాతిరత్నం. మరి దానివంటిదానికైనా సూచికవద్దా?

ఇలా ప్రతి ఉత్తమరచనకూ గ్లాసరీలు సిద్ధమైనప్పుడే, పెక్కు అపూర్వ శబ్దాలు మనకు తెలిసి, మహా నిఘంటు నిర్మాణానికి, తద్ద్వారా వాఙ్మయ విస్మృతికి తోడ్పాటు కలుగగలదు.

# కొత్త పదకోశం - వావిళ్ల నిఘంటువు

ఆంగ్లభాషను అందరూ అతిసులభంగా అభ్యసించడంకోసం ఇంగ్లీషు వారు 872 పదాలతో "బేసిక్ ఇంగ్లీషును" నిర్ణయించారు. దీనితో ప్రతివాడు ధారాళంగా ఆంగ్లభాషలో తన దైనందిన వ్యవహారం సాగించుకొనవచ్చు. మనకంటే అన్ని విధాలా అతి విస్తృతమైన జీవనపరిధిగల ఇంగ్లీషు వారి వ్యవహారానికి 872 పదాలు చాలినప్పుడు మన నిత్యజీవితావసర వ్యవహారానికి వాటిలో నాలుగో వంతే చాలునేమో! ఏ రెండు మూడు వందల పదాలతోనో మన జీవితం వెళ్ళమారుతుంది.

సంఘంలో ఎప్పటికప్పుడు కలుగుతున్న మార్పులను బట్టి వున్న పదాలు కొన్ని వ్యవహారం నుంచి జారిపోవడం, కొత్తపదాలు తలఎత్తడం సహజం, విస్తృత ప్రయోజనాపేక్షులు కొందరు తమభావాల స్పష్టీకరణకు పాతపదాలను తడుముకోవలసివస్తుంది; కొత్త పదాలను సృష్టించవలసివస్తుంది. ఇదే భాషా వికాసానికి, సాహిత్యానికి అంకురార్పణం. కాని, ఇన్ని పదాలను సామాన్యుడు జ్ఞాపకం వుంచుకోగలడా? అభిరుచి కలవారు, అవసరమని భావించేవారు వీటిని విస్మరించకుండా వుండడానికి ప్రయత్నిస్తారు. ఇదే కోశాల నిర్మాణానికి పునాది.

తెనుగులో 1816 వరకు వున్న కోశాలన్నీ పద్యాత్మకాలు. అకారాది క్రమంతో వెలసిన తొలి కోశం ఆంధ్ర దీపిక. ఇది 1816లో సమాప్తి చేయబడింది. దీనిని రచించినవారు శ్రీ మామిడి వెంకయ్య. పిదప బ్రౌణ్య నిఘంటువు. శబ్దరత్నాకరము, ఆంధ్ర వాచస్పత్యం, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు వెలువడ్డాయి.

పూర్వ నిఘంటువులలో ఉత్తమమైనవి, ప్రామాణికమైనవి, బ్రౌణ్య, శబ్దరత్నాకరాలు. వీని రచనా కాలానికి, నన్నెచోడుని కుమార సంభవం, పాల్కురికి సోమనాథుని బసవ పురాణం మున్నగు ఉద్గ్రంథాలు లభ్యం కానందున వీనిలో ఎన్నో పదాలు చేరలేకపోయాయి. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు నాలుగు సంపుటాలతో (నకారం వరకు) ప్రస్తుతానికి ఆగింది. ఇలాంటప్పుడు సమగ్రకోశ నిర్మాణానికి వావిళ్ళవారు పూనుకొనడం ప్రశంసనీయం.

ఈ నిఘంటువు విశిష్టత ఇది:— (1) తత్సమ పదాల వివరణకు కూడా కవిప్రయోగాలు విరివిగా ఉదాహరించడం. (దీనికి ఉభయతోముఖివంటి పదాల వివరణ నిదర్శనం.) (2) నవీన కవుల ప్రయోగాలను కూడా ప్రామాణికాలుగా పొందుపరచడం. (3) ఇస్తిరి, ఓటు మున్నగు అన్యభాషా పదాలను జంకుకొంకులు లేకుండా ఉదాహరణాలుగా ఇవ్వడం (4) శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు వదలిపెట్టిన ఇంచులాడి. ఏకచక్రము, ఏకచ్ఛత్రము మున్నగు పదాలు సేకరించడం. (5) ఎవరు ప్రచురించిన గ్రంథాల నుంచి ఉదాహరణాలు గ్రహింపబడినవో తెలపడానికి గ్రంథసంకేత వివరణ పట్టికలో గ్రంథ స్వరూపాన్ని తెలపడం, ఈ కారణాలతో దీని నడక అభ్యుదయ్య మార్గంలోనే కొనసాగిందనడం నిస్సంశయం.

కాని, నిఘంటువుల పరిధి అతి విస్తృతం. భాషలోని ఏమారు మూల పదమైనా దానిలోకి రావలసిందే. ఇక కావ్యప్రాయాలయిన శాసనాల పదాల సంగతి వేరుగా చెప్ప నవసరంలేదు. (1) ఈ నిఘంటువులో దీర్ఘాసిశాసనంలోని "ఇష్టపూర్తి" వంటి పదాలన్ని చేరివుండవలసింది. (2) అఖండదీపం (నిర్వచనోత్తర రామాయణం), అగస్త్యమంత్రం (దశావతార చరిత్ర), అచిరాంశువు (నన్నెచోడుని కుమారసంభవం), అడవిచిచ్చు (భారతం), అసితీ (ఈ కారాంత స్త్రీలింగం, దశావతార చరిత్ర), అనేకాగ్రత (భారతం), అప్పాజీ (ఆనంద రంగరాట్ ఛందము), అరుత (బసవపురాణం), అసిత పక్షం (భీమేశ్వరపురాణం), అరగజం, ఇంద్రపదం (హంసవింశతి), ఉత్పిబం (పాండురంగ మాహాత్మ్యం), ఎల్లారు (హాలాస్య మాహాత్మ్యం). ఏకవాక్యం (మార్కండేయ పురాణం), ఏకాంగియుద్ధం (శివరాత్రి మాహాత్మ్యము), ఏమారమి (భారతం) మున్నగు పదాలను ఈ నిఘంటువు జారవిడువకుండా వుండవలసింది. (3) నేడు పత్రికలలో ప్రయుక్తమౌతున్న అగ్రరాజ్యాలు, అధినివేశాలు, ఆర్థిక క్లేశం - ఇన్‌ఫ్లేషన్, సంస్థ, ప్రణాళిక, నివేదిక వంటి సాంకేతిక పదాలు చేరవుండవలసింది. (4) ముర్రేన్ ఇంగ్లీషు డిక్షనరీ ఆదర్శంనా అన్న, అమ్మవంటి ప్రతి సాధారణ పదానికి వ్యుత్పత్తి చూపడం అవసరం. నిఘంటువులే వ్యుత్పత్తి నిరూపణకు పూనుకొనకపోతే దిక్కేమిటి? ప్రతి తెలుగు పదానికీ వ్యుత్పత్తి చూపినప్పుడే నిఘంటు నిర్మాణం సార్థకం. ఇలాంటి నిఘంటువును సిద్ధపరచడానికి తాము పూనుకొన్నట్టు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు (కవిగారు) నాకు ఒకమారు తెలిపారు. ఇది కొనసాగుతున్నదని నా విశ్వాసం. తెలుగులో వెలువడిన ప్రతి ప్రాచీన నవీనరచనకూ "గ్లాసరీ" సిద్ధపరచినప్పుడే ప్రతి పదమూ జారిపోకుండా మనకు దక్కుతుంది. (5) ఉర్లగడ్డ

మున్నగు మాండలికాలన్నీ వివరణతోపాటు నిఘంటుకు ఎక్కాలి. (6) నిఘంటువు ఎంత విపులంగా వున్నా కిట్టెల్ కన్నడ నిఘంటువువలె ఒకే సంపుటిలోనే ఇమడాలి. భద్రపరచుకొనడానికి, పరిశీలనకు అప్పుడు సౌకర్యం ఎక్కువ. (7) నిఘంటువులలోకూడా తప్పొప్పుల పట్టిక వుండడం ఉచితం కాదు.

నిఘంటు నిర్మాణం ఒకరి చేతిమీద నడవవలసిన పనికాదు. అది ఒక్క శబ్దరత్నాకరకారునికే చెల్లింది. ఒంటిచేతిమీద నడవడంవల్ల సమగ్రత, ప్రామాణికత చేకూరవు. వివిధ శాఖలలో నిష్ణాతులైన పలువురి కృషి అవసరం. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ కోదాడ రామకృష్ణయ్య, శ్రీ నిడదవోలు వెంకటరావు గారలవంటి పండితుల సలహాలు ముఖ్యం. రాజకీయాల ప్రాబల్యం కారణంగా ఎప్పటికప్పుడు కొత్త పదాలు సృష్టిస్తున్న పత్రికల తోడ్పాటు కూడా అవసరమని వేరుగా చెప్ప నక్కరలేదు.

*

కొత్తగా వెలువడిన వావిళ్ళ నిఘంటువు రెండవ సంపుటం నడక తత్సమ తద్భవాల వివరణకు కవి ప్రయోగాలు విరివిగా ఉదాహరించడం, నవీన కవుల ప్రయోగాలనుకూడా ప్రామాణికాలుగా స్వీకరించడం, శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు వదలిపెట్టిన పెక్కు పదాలను సేకరించడం, ఎవరు ప్రచురించిన గ్రంథాలనుంచి ఉదాహరణాలు గ్రహించబడ్డాయో తెల్పడానికి గ్రంథ సంకేత వివరణ పట్టికలో గ్రంథ స్వరూపాన్ని పేర్కొనడం—మున్నగు కారణాలతో మొదటి సంపుటంలాగే కొంతవరకు అభ్యుదయ మార్గంలోనే కొనసాగించడం నిస్సంశయం.

కాని, నిఘంటువుల పరిధి విస్తృతం. (1) దేశ్యన్యదేశి పదాల వింగడింపు సుకరంకదు. సజాతీయమైన కన్నడ, తమిళ పదాలమాట అలావుండగా, విజాతీయమైన ఫార్సీ, అరబ్బీ పదాలు దేశిపదా లనేభ్రాంతి కలిగించే తీరుగా తెలుగులో కలిసిపోయాయి. శబ్దరత్నాకరం నాటికన్నా నేడు భాషా పరిశోధన ఎన్నో అంగలు ముందుకు వేసింది. ఇలాటి అన్యదేశపదాల ఆకరం తెలుసుకొనడానికి తగినన్ని అవకాశాలు నేడున్నాయి. బ్రౌన్ పండితుడు తెలుగులో అన్యదేశాల నిఘంటువును వేరుగా పొందు పరచాడు కూడా. అయినప్పుడు ఈ సంపుటిలో కస్బా, కిమ్మత్తు, కిల్లా, ఖరారు, ఖాతరు, ఖామందు,

ఖావిందు, ఖుసి, ఖూని, జరి, జరతాజు, జరతారు,జలతారువంటి పదాలకు అకరం, (పార్సీయో అరబ్బీయో) మార్పు స్పష్టంగా తెలుపవలసింది; హిందూస్థానీ అంటే చాలదు. ఈ పదాలన్నీ హిందూస్థానీ,ఉరుదూ అనబడే హిందీకికూడా అన్యదేశ్యాలే. జలతారు వ్యుత్పత్తి జలకము+తారు కాదు. జర్+తారు జలతారు. బంగారుతీగ. ఖావందు, ఖుదా మున్నగు పదాలకు దిట్టకవి నారాయణకవి రంగరాయ చరిత్రమునుంచి ప్రయోగాలు చూసినప్పుడు, ఆ గ్రంథంలోని ఖిర్దాబాదువంటి ప్రయోగాలను ఉదాహరించకపోవడం ఎందుకు? గదర్‌పార్టీలోచేరి స్వాతంత్ర్యపు పోరాటంలో పోరాడిన ఆంధ్రవృద్ధులు కొందరు నేడూ జీవించి వున్నారు. పెక్కు విదేశీ పదాలను చేర్చుకొన్న తెలుగు నిఘంటువులో "గదర్" (విప్లవం) పదానికి కూడా స్థానం వుంది.

(2) భాషలోని ప్రతి ప్రదమూ ఏదో పరిస్థితిలో సంకేతికం. పదాల పుట్టుపూర్వాలు నిఘంటువులే తెలుపకపోతే దిక్కేముంది? అతి ప్రాచీన సాహిత్యంలేని తెలుగువంటి భాషలోని పదాలకు వ్యుత్పత్తి చెప్పడం కష్టమనడం నిస్సందేహం. కాని, వ్యుత్పత్తికి ప్రయత్నించడం, కనీసం పెనగులాడడం తప్పదు. అప్పుడే నిఘంటు నిర్మాణం సార్థకం. (ఇలాంటి నిఘంటువును నిర్మించడానికి కీర్తిశేషులు శ్రీ మారేపల్లి రామచంద్ర కవిగారు పూనుకొని ఒక నమూనా సంచికను ప్రచురించారు. వారి "నుడికడలి"ని పూర్తిగా ప్రకటించడం తెలుగువారి విధి.) ఈ నిఘంటువులో తెలుగు పదాలు కొన్నిటికి సజాతీయ భాషా పదాల పర్యాయాలు ఇవ్వడంతప్ప వ్యుత్పత్తికి ప్రయత్నం లేకపోగా "చౌదరి" వంటి వైకృత పదాల వివరణకూడా జరగలేదు. (చతుర్థహర — చవుత్తహరి — చౌధురీ — చౌదరి.)

(3) వ్యుత్పత్తి సంగతి యెలావున్నా, సరైన అర్థాలు, నానార్థాలు ఇవ్వడం నిఘంటువుల మొదటిపని కదా! ఈ సంపుటంలో అక్కడక్కడ ఈ రెండూ కనిపించడంలేదు. ఉదా: (1) కుడుపు=అనుభవింపజేయు, భోజనము, విందు, అనుభవము, భుక్తి - అనే అర్థాలు ఇవ్వబడ్డాయి. కుడుపు పరిణామంగా వచ్చిన పూయు అనే అర్థం ఇవ్వబడలేదు. నీలికుడిపిన క్రియ - కుమార సంభవం. 8 వ ఆశ్వాసం, 99 వ పద్యం. (2) కందెర=కన్ను+తెర, రెప్ప- అని మాత్రమున్నది. చిత్తరువుపై కప్పు పావడ అనే అర్థం ఇవ్వలేదు. సలక్షణముగా జిత్రించి పన్నువగొలిపి కందెర దెరచిన — కుమారసంభవం, 5 వ ఆశ్వాసం, 118 వ వచనం. (3) కనుకలికి దృష్టి, చూపు అనే అర్థం సరికాదు. చూచుటవలన కలిగిన ప్రేమ కనుకలి, వినుటవలన కలిగిన ప్రేమ వినుకలి.

(మొదటిది "లౌ ఎట్ ఫస్ట్ సైట్" వంటిది. రెండవది నలునియెడ దమయంతికి కలిగినది.) (4) గణిక=వేశ్య, ఆడ ఏనుగు, అడవి మొల్ల, నెల్లి అనే నాలు గర్థాలుకాక కన్నె చెలికత్తె అనే మరొక అర్థం ఇవ్వలేదు. గణికాసమూహితోద వరదు బూజింకె—కుమారసంభవం, 3వ ఆశ్వాసం, 108 వ పద్యం, (5) గుత్తి= పూలు మున్నగువాని గుచ్ఛము, సమూహము, చీలమండ, మనికట్టుక్రింద చేతి భాగము, వృక్ష విశేషము, కవ్వపుబిళ్ళ, బాధ - ఇవి మాత్రమే వున్నాయి. గుత్తికోట భారతదేశములోని కోటలన్నిటిలోను ప్రసిద్ధమైంది. దక్షిణావర్త శంఖాకారంగా కట్టిన దుర్భేధ్య దుర్గమది. ఒకమారు దాని ముఖమార్గంలో ప్రవేశించిన శత్రువు లోపల తిరుగుళ్ళు పడుతుండవలసిందేకాని వెలికి రాలేడు. చెంచలి, గురిగింజవంటి పదాలు ఇచ్చినప్పుడు, గుత్తి శబ్దం ఇవ్వవలసిందే. ఇది తెనాలిరాముని చాటువులతో తెలుగు సాహిత్యానికికూడా ఎక్కింది. (6) కిటక శబ్దానికి గుర్రము, ఒకానొకదేశము - అనే అర్థాలు ఇవ్వబడ్డాయి. బోయ అనే అర్థం ఇవ్వబడలేదు. ఆముక్తమాల్యద, 4 వ ఆశ్వాసం, 31 వ పద్యం. (7) జరీ = వెండి బంగారములతో మొలాముచేసిన నూలిపోగు - అనే అర్థం సరికాదు. జర్=బంగారు, జరీ, జలతారు=బంగారు తీగ. జారీ - ఇది దేశ్యంకాదు, పార్సీ పదం. (8) కిలాసము=సిధ్మరోగము, సోబె అని మాత్ర మున్నది. ధవళితం అనే అర్థం ఇవ్వలేదు. దీని ప్రయోగం ఇవ్వడం అవసరం కదా. కైలాసము నభ్రవిభ్రమ కిలాసము మేరుతటీ విలాసమున్, ఉత్తర హరి వంశం, 2 వ ఆశ్వాసం, 159 వ పద్యం. (9) కతక, కదార, కలంబ, కరండ, కేకర, కృకలాస, చాండాలిక, చండాతక, ఖురళీ, ఝూట, ఘుణ, శబ్దాలకు ఆముక్తమాల్యద ప్రయోగాలన్నా యివ్వవలసింది.

(4) ప్రతి పదానికి పర్యాయాలు ఆ చోటనే ఇచ్చే సంప్రదాయం పద్య నిఘంటువులో మాత్రమే వుంది. ఆ సంప్రదాయం ఈలాటి నిఘంటువులలో పాటించకపోయినా, రూపాంతరాలు వదలిపెట్టడం ఉచితంకాదు, ఈ నిఘంటువులో కడ్డాయము, కటాయితపడు, కటాయితము పదాలున్నాయి. (1) కడ్డాయమునకు రూపాంతరమైన "కట్టాయము" రూపంలేదు. నాలికి గట్టాయము సేయుచుండు డిదమేలే - కుమారసంభవం, 8 వ ఆశ్వాసం, 177 వ పద్యం. (2) కహ్లారము ఇవ్వబడింది. రూపాంతరాలైన కలుహారము (కుమారసంభవం, 9 వ ఆశ్వాసం, 72 వ పద్యం) కల్హారము (కుమారసంభవం, 9 వ ఆశ్వాసం 80 వ పద్యం, తాళ్ళపాక పెదతిరుమలయ్య చక్రవాళ మంజరి) ఇవ్వబడలేదు.

(5) సంస్కృతపదాలు మనదేశంలోని వివిధ భాషలలో వివిధ రీతుల అర్థాలలో వున్నాయి. మన ఉపన్యాసల హిందీ బెంగాలీ వారికి నవల, మన

అవసరం తమిళులకు తొందర, మన కాదంబరి కన్నడులకు నవల, మన నిబంధం హిందీవారికి వ్యాసం, మన ప్రబంధం హిందీవారికి ఏర్పాటు, కనుక, తెలుగు సాహిత్యంలోను, తెలుగువారి వ్యవహారంలోను వున్న ప్రతి సంస్కృత పదమూ, అవసరమైతే ఇతర భాషలవారు వాడే ప్రతి అర్థాల మార్పుల కూర్పుతో - మన నిఘంటువులకు ఎక్కవలసిందే. మరి సాహిత్యం లోనే నన్నెచోడడు, పాల్కురికి సోమనాథుడు, నాచన సోముడు, కృష్ణదేవ రాయలు వంటివారు ప్రయోగించిన సంస్కృత పదాలు నిఘంటువులో వదిలం కావడం అవసరంకదా! దీనిలో (1) కడారపటుడు—సీతాంబరుడు, పాండురంగ మాహాత్మ్యం 4,61; (2) కనకస్వామి. (3) కాసూధరుడు - శక్తిధరుడు (పాండురంగ మాహాత్మ్యం, 2,180); (4) కుటిలాలకి, కుమారసంభవం 5,24; (5) ఘుల్లకాశిక్యము - జోలెసంచి, పాండురంగ మాహాత్మ్యం, 5,108; (6) గద - దుఃఖము అకారాంత స్త్రీలింగం, బసవపురాణం, 6,176; (7) గమకి - శ్రావ్యంగా పద్యాలు పఠించేవాడు, కుమార సంభవం, 11,1; (8) గాంగేయ గర్భుడు - బ్రహ్మ, పాండురంగ మాహాత్మ్యం, 3,178; (9) గరుడాండము-పచ్చరాయి, కుమారసంభవం. 3,18; (10) గుడరసము - తేనెపాకము, కుమారసంభవం, 3,62; (11) గోమిని-లక్ష్మి, కుమార, 3-108; (12) ఘటయోని - అగస్త్యుడు, కుమార, 7,114; (13) చంద్రగోళి-వెన్నెల, పాండురంగ, 5,24; (14) జయచూళి-వ్యూహ విశేషం, కుమార; (15) జీరము-జిలకర, కుమార, 11-36; (16) జనాంతికపదము-రహస్య ప్రదేశం-అంతః పురం, పాండురంగ మాహాత్మ్యం 3-142; (17) కాంబవ - కంబుసంబంధి, ఆముక్తమాల్యద 3,85; (18) చూత్కృతము, (19)ఝూత్కృతము, ఆముక్త, 4,27; (20) కశ్మల, ఆముక్తమాల్యద-వంటివి వదలివేయబడ్డాయి.

(6) వెనుకటి కోశకారులు కొన్ని పదాలు వదలివేయడానికి, అప్పటికి పెక్కుగ్రంథాలు లోకానికి తెలియకపోవడమే కారణం. కాని, నేడు పెక్కు గ్రంథాలు ప్రకటించబడ్డాయి. పెక్కు తాళపత్రగ్రంథాలయాలలో పదిలపరచ బడ్డాయి. కారాలు, గాపతాడు, చీకటిగలువంటి మాండలికాలతోపాటు ప్రాచీన గ్రంథాలలోని ప్రతి దేశి పదము నిఘంటుకారుని చూపునుంచి తప్పిపోకూడదు. తెలుగులో వెలువడిన ప్రతి ప్రాచీన, నవీన రచనకూ "గ్లాసరీ" సిద్ధపరచి నప్పుడే ప్రతిమాట జారిపోకుండా మనకు దక్కుతుంది. ఈ సంపుటిలో పూర్వ పదాలు ఎన్నో చేరలేకపోయాయి. ఉదా: (1) చిరుత చౌకము, క్రీడాభిరామం, పుట44; (2) కరివంకబొమలు-నల్లకనుబొమలు, హరవిలాసం 3,38; (3) కన్నటనానా, ఉత్తర హరివంశం 4వ ఆశ్వాసము; (4) కుట్రము; (5) కొత్తడి-

స్త్రీల సమూహము- బసవపురాణం; (6) కొత్తి-స్త్రీ, బసవపురాణము, (7) చట్టు తనము-శిష్యత్వము, (8) కిరిదియ, కరడియ-వాద్యవిశేషం, కుమార 2.102; (9) కాదలి-ప్రియురాలు కుమార, 2,28; 10) కేకించు-కేకవేయు, (కేకించు పురినమ్మి) కుమార 5,85; (11) జల్లి-కావ్యదోషము, (12) గొట్టుబోయ, గట్టుబోయ, గొట్టరుపు, బసవపురాణం, పాండురంగ మాహాత్మ్యం; (1 ) కందు బండ్లు- నల్లనిపండ్లు, కుమార, 6,37; (14) కైదీవియ-చేతిదీవము, దీవిటి, కుమార, 9,120, (15) కొరనెల-చంద్రరేఖ, కుమార, 3-26. కొరనవ్వు, కొర ప్రాణము వున్నప్పుడు కొరనెలవంటి చక్కనిపదం విడువరాదుగదా; (16) కౌవు - కుచ్చెళ్ల, కాసె, కుమార, 8-64; (17) గండబేటము - పురుషునికి పురుషునిపై గల్గు మోహము: కుమార, 4,36; (18) గర్జు - గర్జించు, కుమార, 12-169; (19) గొడుగు క్రిందిరూపు-సేనాపతి, రాజు, కుమార 11,37, (20) ఘనంపరచు-గట్టిపరచు కుమార, 4,47; కుమార సంభవంలోని మరికొన్ని (21) చనుము - సమూహము (22) చనుమెత్తు - సమూహముగా గూడు, (23) చరులు-చప్పట్లు, చరులిచ్చు-చప్పట్లు చరచు, 2,101, (24) చిర్రన-తిరుగుటలో అనుకరణశబ్దం, 3-5, 6-138; (25) చిల్లతర్కము-అన వసరవాదం, 6-136; (చిల్లజగడం ఉదాహరించబడింది), (26) చెప్పు-చెప్పిన మాట, 5-79, (27) చేయుడు-చేయుట, 1-18; కాటమరాజు కథలోనివికొన్ని (28) కాలావు-నల్లఆవు; (29) కల్లుగా-చిత్తుగా; (30) కంపటం-సైన్యం; (31) కంపటీడు-సైనికుడు; (32) కైతాళం-చేతితాళం; (33) గుమ్మడిగింజలు, (34) గుమ్మడిగింజలుగు-ఆయుధ విశేషాలు (గుమ్మడి గింజనామము వుంది), (35) గంటగాలము-ఒక నగ, బిరుదు; (36) చిత్తువిత్తుగా-చిత్తుగా, (37) ఛప్పన - ఏబదియారు; (38) ఛత్తీస-ముప్పదియారు; (39) గండముంగిలి-కోటలో ఒక భాగం, ఉత్తర హరివంశం 2-94; (40) గౌరత, (పాములపాడు శాసనం), (41) చయ్యంకి (42) చావడము, ఆముక్తమాల్యద, (43) జబురుగొట్టు-గువ్వమని వాసంకొట్టు, కర్పూరవీటి జబురుగొట్టుచు-ఆముక్త, 2,73. అన్నమాచార్యుని పదాలు చూస్తే అపూర్వపదాలు కొల్లలుగా దొరకుతాయి.

ఇలాటి పదాలన్నిటినీ కొత్తగా ఏర్చికూర్చనక్కరలేదు. ఇదివరకే కీర్తిశేషులు శ్రీయుతులు విక్రమదేవవర్మ, వేటూరివారు, గిడుగువారు, తాపీ ధర్మారావు, మనవల్లి రామకృష్ణకవి, బులుసు వెంకటరమణయ్య, నిడదవోలు వెంకటరావు మున్నగు పండితులు పెక్కు వ్యాసాలలో కొన్నేండ్లక్రిందనే ప్రచురించారు. మరికొంత పరిశ్రమించివుంటే పెక్కు అపూర్వపదాలు ఈ సంపుటిని అలంకరించి వుండేవి.

(7) "పై సంవత్సరములోగా మూడవ సంపుటమునుగూడ ముద్రించి నిఘంటువును పూర్తిచేయ నిశ్చయించుకొంటిని............" అని ప్రకటితలు పీఠికలో తెలుపుతున్నారు. నిఘంటువు ఎంత విపులంగావున్నా కిట్టెల్ కన్నడ నిఘంటువువలె ఒకే సంపుటంలో ఇమడడం మంచిది. భద్రపరచుకొనడానికి, పరిశీలనకు అప్పుడు అనువుగా వుంటుంది. తక్కిన భాగమంతా ఒక సంపుటిగా ప్రచురిస్తామని తెలిపారు ప్రచురణకర్తలు. నిఘంటువు మొదటి సంపుటం అచ్చులకు అయిన పుటలు 554, ఈ రెండవ సంపుటంలో క.చ.వర్గాలకు అయిన పుటలు 687. శబ్ద రత్నాకరంలో క.చ.వర్గాలకు 255 పుటలు, తక్కిన భాగానికి 688 పుటలు పట్టాయి. బ్రౌను నిఘంటువులో క.చ. వర్గాలకు 214 పుటలు, తక్కిన భాగానికి 934 పుటలు పట్టాయి. దీనిని బట్టి ఈ నిఘంటువులో కూడా ట.త.ప. వర్గాలకు, యరలవశషసహళలకు 687 పుటలకు ముబ్బడి కాక తప్పదు; ఆసంపుటం ప్రమాణం ఎబ్బెట్టుగా పెరిగిపోయి, ఒకే సంపుటంలో అన్నిపదాలు ఇమిడించాలనే తొందరలో పెక్కు పదాలు జారిపోవచ్చు. కాగా, ట.త.ప వర్గాలు ఒక సంపుటంగాను, తక్కినవన్నీ నాల్గవ సంపుటంగాను ముద్రించడం సమంజసం.

కాగితపు కరవు, క్రేతల కొరత పెచ్చుపెరిగిన ఈనాడు నిఘంటు ముద్రణవంటి కార్యం శ్రమైకసాధ్యం. 99 సంవత్సరాలుగా సారస్వత సేవ చేస్తూ ఆంధ్రుల అభిమానాన్ని చూరగొన్న వావిళ్ళవారు ఈ సూచనలు సరసతతో గ్రహించి, మలిముద్రణలో లోపాలను సవరించుకొంటారని ఆశిస్తున్నాను.

(మొదటి సంపుటము : అ-ఔ. రెండవ సంపుటము క-చ వర్గాలు.)

# భారతీయ సాహిత్యం – తెలుగు పాత్ర

భారత దేశమొక బన్నసరం. బన్నసరంలోని రంగురంగుల మణులు వివిధ కాంతులను విరజిమ్మినా ఏకసూత్రబద్ధమై అందాలు చిందు తున్నట్టే భారతదేశం వైవిధ్య విలసితమైనా ఏకసూత్రబద్ధమే. భారతదేశ మొక కదంబమాల. కదంబమాలలోని వివిధ పుష్పాలు వేరువేరు తావులు కలవైనా, అన్ని తావులూ కలిసి విచిత్రమైన తావిని వెలార్చినట్టు భారత దేశం వివిధ భాషావర్గ సంకీర్ణమూ, వివిధ జాతి సంతతి సంకులమూ అయినా ఒకే ఆత్మను వ్యక్తీకరిస్తుంది. ఇది భారతదేశ విశిష్టత. 'అగ్నిమీళే పురో హితం' అని తొలి ఋక్కును వేదం ఆలపించినది మొదలు నేటివరకున్న భార తీయుని వరకు ఈ ఏకత్వం, భూమికున్న అదృశ్య అక్షరేఖవలె అదృశ్య మైనా, అపరోక్షానుభూతివలె మనోగోచరమౌతున్నది. ఇది నాటి మతాలకు, భాషలకు నేటి రాజకీయ వాదాలకు అతీతమైనది; అసాధారణమైనది. ఎన్నో జాతులవారు తండోప తండాలుగా భారతదేశానికి వలస వచ్చారు. రాజ్యాలు స్థాపించుకొన్నారు. మతాలు నెలకొల్పుకొన్నారు. విడివిడి వర్గాలుగా మనుగడ సాగించారు, సాగిస్తున్నారు. అయినా, భారతీయతను తమదిగా చేసుకొన్నారు.

భారతదేశంలో బహిరంగంగా చూస్తే భిన్నత్వం కనబడుతుంది. ప్రజా జీవనంలో అనంతమైన వైవిధ్యం కనబడుతుంది. అయినా అత్యంత దృఢమైన ఏకత్వం కూడా అంతటా కనబడుతుంది. ఏవిధమైన రాజకీయ వ్యవస్థను, దురదృష్టకరమైన సన్నివేశాలను మనం అనుభవించవలసి వచ్చినా ఈ ఏకత్వమే మనను యుగయుగాలుగా కలిపి ఉంచింది. "భారతదేశపు ఏకత్వం కేవలం ఊహాజనితమైనదని భావించటం పొరపాటు. ఏకత్వ భావన నన్ను పూర్తిగా పరవశుణ్ణి చేస్తుంది. మనను తరతరాలుగా కలిపి ఉంచిన ఈ ఏకత్వం రాజకీయమైన విభజన కానీ, ఏ ఆపదలు కానీ విచ్ఛిన్నం చేయలేనంత దృఢంగా కొనసాగుతున్నది" – అని భారతదేశ ప్రథమ ప్రధాని శ్రీ జవాహర్ లాల్ నెహ్రూ భారతదేశ ఏకాత్మతను దర్శించారు. ఈ దర్శనానికి కారణం భరతఖండంలోనేకాక, భారత వర్షంలోనే సమైక్య భావనను వ్యాపింపజేయ టానికి వేద ఋషులు, ఉపనిషద్రాజర్షులు, ప్రాగైతిక మహాపురుషులు, ఇతి

హాసిక మహాపురుషులు, యుగ పురుషులు నిరంతరం ఏకత్వ నిరూపణం జపించటమే. ఈ అదృశ్య అపరోక్ష సూత్రమే మనను అధఃపతితులు కాకుండా పట్టి ఉంచింది.

భారతదేశంలోని వైవిధ్యాన్ని పట్టి ఇచ్చేవి భాషలు. భాషల మూల విచారం వదలివేసి భాషలకు ఆత్మ సదృశమైన సాహిత్యాలను మనం దర్శించి నప్పుడు సమైక్యబంధం ప్రత్యక్షమౌతుంది. పాశ్చాత్య నాగరికతా సంబంధం సోకేవరకు భారతీయ సాహిత్యాలన్నీ దాదాపు వేద, భారత, రామాయణాది సంస్కృతేతిహాస కావ్య నాటకాల ప్రభావానికి లోనైనవే. ముఖ్యంగా రామాయణ భారతాల ప్రభావం అన్వయ వ్యతిరేక దృష్టితోనూ, అసాధారణం. వేద సంస్కృతిని వలదన్న జైన, బౌద్ధ మతాలు కూడా రామాయణ భారతాల పలుకుబడి ప్రజలపై ఉండటాన్ని గ్రహించి దానిని ఎదుర్కొనడం కన్న దానిని తమదానిని చేసుకొనటానికి ఆరాటపడి పెక్కు మార్పులు చేర్పులు చేయటం ఆయా సాహిత్యవేత్తలకు తెలిసిన నిజం. పాశ్చాత్య సంస్కారం, సంసర్గంతో పొటమరించిన నవ చైతన్యంతో ఉవ్వెత్తుగా లేచిన భారత జాతీయోద్యమం దేశాన్ని, ఆసేతుశీతనగం సమైక్య సువర్ణ శృంఖలాబద్ధం చేసింది. స్వాతంత్ర్య మహాసమరంలో జాతి మత కుల భాషా భావ భేదాలు హవిస్సయి పోయాయి. భాషలు వేరైనా భారత సాహిత్యాత్మ ఒక్కటే అని, మతాలు వేరైనా భారతాత్మ ఒక్కటేనని మరొకమారు భారతదేశం ప్రపంచానికి చాటింది.

ఈ సమైక్య సూత్రానికి పూర్వం ఆలంబనం సంస్కృత భాష, సంస్కృత సాహిత్యమూనూ. ఇవి దేశానికి సంధాన భాషా సాహిత్యాలుగా వినియోగపడ్డాయి. ఏదో రూపంలో వైదిక ధర్మం ఆచరణలో ఉన్నందున దానిని అంటిపెట్టుకున్న సంస్కృతం దేశవ్యాప్తంగా వ్యవహారంలో లేకపోయినా, దానిలోని అపూర్వ వాఙ్మయం దానిని పండితులలోనూ, నాగరికులలోనూ, రాజ్య పరిపాలనలోనూ ప్రవేశింపజేసి యావద్భారతానికీ సంధాన భాషగా రూపొందించటం సహజాతి సహజం. దానివలన భారతదేశంలోని ప్రతి భాషా వర్గమూ తన భాష ఏదైనా సంస్కృతం తన భాష, తన సంస్కృతి భాష, తన రాజనీతి భాష, తన ఆధ్యాత్మిక చింతన భాష అనే ఆదరంతో సంస్కృతాన్ని పెంచి పుష్టం చేసింది. అందువలననే కాశ్మీరీ పండితుడు శైవ మతాన్ని వ్యాపింపజేయదలచినా, వంగోపాధ్యాయుడు చైతన్య మతాన్ని విస్తరింపజేయదలచినా, కేరళాచార్యుడు అద్వైతాన్ని స్థాపించదలచినా, దాక్షిణాత్య గురూత్తముడు విష్ణు సర్వోత్తమత్వాన్ని నిరూపించదలచినా సంస్కృత భాషను ఆశ్ర

యించేవాడు; దానితో సంస్కృతం వివిధ రీతుల విస్తరిల్లి మహా వటవృక్షమై ఊడలు దించుకొంది. అన్ని ప్రాంతాల భావనలు, తత్త్వ చింతనలు. ఊహా రీతులు, సంస్కృతంలో జరిగాయి, సంస్కృతంలో మౌలిక రచనలు వెలిశాయి. దీనితో ఏనాడో భారతీయ సాహిత్య సృష్టికి - యావద్భారత విశ్వజనీన సాహిత్య సృష్టికి మూలబంధాలు పడ్డాయి.

సాహిత్యంలో ఏకాత్మతా భావన కలిగినప్పుడే దేశ సమైక్యం సుదృఢమౌతుంది. ఈ దృఢతా సాధనకు మనం ముఖ్యంగా దాక్షిణాత్య భాషలవారం ఏమి చేయాలి, నేడు భారతీయ సాహిత్య నిర్మాణం యావజ్జాతి దృష్టితో ఎలా జరగాలి అనే చర్చకు ముందు, దక్షిణ భారత సాహిత్యాల స్వరూప స్వభావాలను రేఖామాత్రంగా స్పృశిద్దాము.

**తమిళం :-** దక్షిణాపథంలో ప్రాచీనతమమైన భాష తమిళం. నిజానికి ప్రపంచంలోని ప్రతి భాష ప్రాచీనమే. ఏ కారణాలవల్లనో కొన్ని భాషలలో సాహిత్య సముద్గమం విలంబంగా జరుగుతుంది; మరొకదానిలో ముందుగా జరుగుతుంది. దానిని బట్టి భాషల ప్రాచీనత్వార్వాచీనత్వాలు గణనకు వస్తాయి. తమిళ సాహిత్యానికి దాదాపు 22 వందల ఏళ్ళనాటి చరిత్ర ఉంది. తమిళ సాహిత్య సంప్రదాయం సంస్కృత సాహిత్య సంప్రదాయం కన్నా కొంత భిన్నమైనా ఆకాశం నుంచి ఊడిపడినదేమీ కాదు. జైన, బౌద్ధ మతాల ద్వారాను, కాశ్మీరు శైవ మతం ద్వారాను, వైదిక సంప్రదాయం సంస్కృత భాషా ప్రభావం కొంత దానిపై పడకపోలేదు. సంస్కృతంలోని అతి ప్రాచీనమైన వర్ణసమామ్నాయ పద్ధతిని తమిళ వర్ణ క్రమం అనుసరించలేదనలేము. సంగం సాహిత్యానికీ, సాతవాహనుల కాలపు గాధాసప్తశతికి ఎన్నో పోలికలున్నాయి. పురనానూరు, అగనానూరు, ఎట్టుత్తొకై మొదలైన పేర్లు పెట్టడంలోను వేదంలోని పనసల లెక్క ఓం దశ వంటిది, గాథాసప్తశతి వంటి సంఖ్యతోడ్పడి ఉంటాయి. రమిళంలో అతి ప్రాచీనమైన క్రి. శ. రెండు, మూడు శతాబ్దాల నాటి స్వతంత్ర కావ్యాలు శిలప్పదికారం, మణిమేఖలై, జీవక చింతామణి వంటివి ఉన్నాయి. తిరుక్కురళ్ వంటి గొప్ప నీతి గ్రంథం వెలిసింది. తమిళ శైవ, వైష్ణవ భక్తులు తమిళంలోలాగే సంస్కృతంలోనూ స్తోత్రాలు, మత గ్రంథాలు రచించారు. ఈవిధంగా తమిళ మేధావిలసితం యావద్భారత సాహిత్యానికి మెరుగు తెచ్చింది. శ్రీమద్రామానుజ వేదాంత దేశికులవంటి వైష్ణవాచార్యుల భావనాధార తమిళంలో లాగే సంస్కృతంలోనూ ప్రవహించటం వల్ల సంస్కృతంలో అపూర్వ గ్రంథాలు వెలిశాయి. భారత

రామాయణ, శైవ, వైష్ణవ పురాణాలు కొంత మార్పులతోనైనా తమిళంలోకి దిగాయి. దీనితో భావనాసమైక్యం మతం ద్వారా. సాహిత్యం ద్వారా జరిగింది. ఆధునికులలో మహాకవి సుబ్రహ్మణ్య భారతితో నూతన యుగం ఏర్పడింది. ఆయన -

"ఎన్రు తణీముమింద సుదందిరదాహం
ఎన్రు మడియు మెంగళ్ అడిమెయిన్ మోహం
ఎన్రెమదన్నై విళంగుగళ్ పోగుం
ఎన్రెమదిన్నల్‌గళ్ తీర్‌ందు పొయ్యాగుం."

ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం?
ఎప్పుడు మడియు మా అడియరి మోహం?
ఎప్పుడు మన తల్లి సంకెలలు తొలగుతాయి?
ఎప్పుడు మన కష్టాలు కల్లలౌతాయి?

అని విలపించారు.

"భారత సముదాయం వాళ్గవే జయ జయ జయ
భారత సముదాయం వాళ్గవే."

భారత సమాఖ్యా వర్ధిల్లు అని యావద్భారతాన్ని ఏక ఖండంగా దర్శించారు.

"మనిషి మనిషిని దోచటం ఇక వద్దు
బాధ కలిగించు బ్రతుకు - ఇక వద్దు
మనకు స్వార్థ జీవితం ఇక వద్దు, వద్దిక.
ఏ జీవికీ తిండి కొరవడకూడదు
కొరవడితే లోకము నశించుగాక!"

అని శాసనం చేద్దాము, ఎప్పటికీ అనుసరిస్తాము అన్నాడు.

"అందరదొకటే జాతి అందరి కుల మొక్కటే - మనం
భారతీయులం, స్థాయిలో, విలువలో, ప్రతి ఒక్కరం సమానమే
అందరమూ ఈ దేశపు రాజులం
అవును, అందరమూ మన దేశపు రాజులం, దేశం వర్ధిల్లుగాక."

అని రానున్న స్వాతంత్ర్యాన్ని ఊహించి ఉప్పొంగిపోయారు భారతి. కానీ నేడు ఆయన జీవించి ఉంటే ఎంతగా బాధ పడేవారో!

భారతదేశపు చివరి తొలి భారతీయ గవర్నర్ జనరల్ శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి తమిళంలో నీతి కథలకు, పిట్ట కథలకే గాక ఆఖ్యాయికా

రచనకు కూడా ప్రసిద్ధులు. ఆయన రామాయణాన్ని 'చక్రవర్తి తిరుమగన్' అని, భారతాన్ని 'వ్యాసర్ విరుందు' అనీ క్రొత్త రీతిలో రచించి వాల్మీకి, వ్యాసులే రిచ్చ పడేటట్టు చేశారని ప్రతీతి. ద్రావిడ కళగం నాయకులకు రామాయణంపై కోపం వచ్చింది. దానిని కాల్చిపారేయదలచారు. తమిళనాడు మారు మూలలలో ఈ ఉద్యమం ప్రారంభమైంది. మద్రాసు నగరంలో ప్రారంభమైతే ఏమి గతి అని పలువురు రామాయణాభిమానులు వాపోయారు. ప్రతిఘటనకు ఆలోచనలు జరిగాయి. కానీ కార్యరూపం దాల్చలేదు. కారణం అది చివరకు కులద్వేషంగా పరిణమిస్తుందేమోనని. "రామాయణం కాల్చివేస్తే మరి కొన్ని వేల ప్రతులు ముద్రణ పొందుతాయి భయమెందుకు?" అన్నారు రాజాజీ. చెన్నపట్టణంలో దేవాలయాల ఎదుట దహనకాండ ప్రారంభించినప్పుడు శ్రీ అనంతరామ దీక్షితర్‌చేత మద్రాసు మహానగరం మారు మూలలలోను వాల్మీకి రామాయణం పురాణ కాలక్షేపం చేయించి, తాను, ఖాసా సుబ్బారావు ప్రధాన శ్రోతలుగా ఉంటూ రామాయణ దహన నిరసనోద్యమం నిర్వహించారు.

కన్నడం - దక్షిణ భాషలలో తమిళం తరువాత ప్రాచీన సాహిత్యంల గల భాష కన్నడం. దీనిపై సంస్కృత ప్రభావం తెలుగులోలాగే విశేషం. దీనిలో ఉపలబ్ధమైన తొలి రచన క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దానికి చెందిన కవి రాజ మార్గం. ఇది దండి కావ్యాదర్శాన్ని అనుసరించిన గ్రంథం. ఈ లక్షణ గ్రంథాన్ని బట్టి అంతకు ముందే కావ్యాలు విరివిగా ఉండవచ్చునని భావించవచ్చు. 10, 11, 12 శతాబ్దాలలో పంప, రన్న, నాగచంద్ర, జన్నల వంటి మహాకవులు అవతరించారు. వీరందరూ జైనులు. కనుక రామాయణ భారతాలను తమ మతానుసారంగా మార్పులతో రచించారు; అయినా ఆ కావ్యాలు మానవ స్వభావ పరిశీలన, ఉన్నత కల్పన మున్నగు గుణాలవల్లనే తరువాతి వారికి ఆదర్శప్రాయాలై ఉపాదేయాల యాయి. పన్నెండవ శతాబ్దంలో అల్లమ ప్రభువు, బసవేశ్వరుల వలన కన్నడనాడులో సాంఘిక మత విప్లవం చెల రేగింది. దాని ఫలితంగా 'వచనం' అనే కవితా ప్రక్రియ నేటి బ్లాంక్ వర్స్ వంటిది వికసించింది. అల్లమ ప్రభువు, బసవేశ్వరుడు 'అనుభవ మంటప' అనే పేరు గల ఆధ్యాత్మిక సభాంగణంలో కలుసుకొని ఆధ్యాత్మిక గోష్ఠులు జరిపేవారు. ఇదంతా 'శూన్య సంపదె' అనే మహా కావ్యంలో నిబద్ధమైంది. ఈ చర్చలలో అక్కా మహాదేవి అనే మహాయోగిని, నీలమ్మ అనే బసవేశ్వరుని భార్యకూడా పాల్గొనేవారు. ఆ వచనాలు మహా విప్లవాత్మకంగా కవితా క్షూలంకషంగా ఉంటాయి.

"కరికంటె అంకుశాన్ని చిన్నదిగా భావింపవచ్చా? కూడదు.
గిరికంటె వజ్రము చిన్నదని చెప్పగలమా? కూడదు.
తమస్సుకంటె జ్యోతి చిన్నదని చెప్పవచ్చా? కూడదు.
నిన్నే యోచించే మనస్సు విస్మృతి కంటె తక్కువా? కాదు.
ఓ కూడల సంగమ దేవా, కాదు."

అంటాడు బసవన్న. ఇది భావగౌరవంతో ఉపనిషద్వాక్యాలకు ఏమి తీసిపోదు. ఇక కవిత్వమా? అనుభవైకవేద్యం. ఇక అక్క మహాదేవి పదాలు అనుభవామృత గుళికలు.

"కొండమీద ఇల్లు కట్టాక క్రూర మృగాలంటే జడుపెందుకు?
సంద్రపొద్దున ఇల్లు కట్టాక నురుగన్నా, కెరటమన్నా
భయమెందుకు?
సంతలోన ఇల్లు కట్టాక సద్దని సణిగితే ఎట్లాగు?
చెన్న మల్లికార్జున దేవ వినవయ్యా
పుడమిపై పుట్టాక పూలగుచ్ఛాలకు రాళ్ళ దెబ్బలకు
తల ఒగ్గవలెనయ్యా
మనసులోన కోపానికి తావీయక
సమ భావనతో సాగవలెనయ్యా."

"నీ సతి నౌదామని నేను
తరతరాలుగా నిన్నే ప్రేమించా
పవిత్ర భస్మం అలదుకొని
వివాహ కంకణం ముంజేత దాల్చి
నేను నీకు అర్ధాంగిని కాగలనని
నీకోసమే వచ్చేసా.
చెన్నమల్లికార్జున దేవా."

అంటుంది మధురభక్తితో. మహాదేవి అక్క 13వ శతాబ్దంనుంచీ మాత్రాచ్ఛందో రీతులలో రగడలు, షట్పది, సాంగత్య, త్రిపది మున్నగువాటిలో కావ్యాలు వెలువడ్డాయి. వీటిలో గొప్పకావ్యం కుమారవ్యాసుని మహాభారతం. సర్వజ్ఞుడు మన వేమనవంటివాడు. కపటాన్ని, మోసాన్ని నిశితంగా విమర్శించాడు. ఇతని త్రిపదలు జీవితానుభవంతో, అవహేళనతో, విజ్ఞానంతో నిండి ఉంటాయి.

"బెచ్చనె మనెయాగి వెచ్చక్కె హొన్నాగి

ఇచ్చ మెచ్చిద హెణ్ణాగ, స్వర్గక్కె,
కిచ్చుహచ్చెంద సర్వజ్ఞ."
వెచ్చని ఇల్లయి వెచ్చానికి పొన్నయి
ఇచ్చ మెచ్చిన ఇంతి ఉంటే, స్వర్గానికి
చిచ్చు పెట్టమన్నాడు సర్వజ్ఞుడు.

అని మంచి గార్హస్థ్య జీవితం స్వర్గం కన్న గొప్పదన్నాడు సర్వజ్ఞుడు.

"మనస్సు పరధ్యానంలో ఉండగా
గుడిచుట్టూ ప్రదక్షిణం చేయడం
నూనె గానుగ చుట్టూ
గానుగెద్దు తిరగడంలాంటిది."

అంటాడు సర్వజ్ఞుడు, అతడొక అవధూత.

ఆధునిక కన్నడ రచనకు శ్రీకారం చుట్టినవారు ఒక సామాన్యపు బడి పంతులు ముద్దణ. ఇతని రామాశ్వమేధ వచన కావ్యం నేటి కన్నడ గద్య ప్రక్రియకు ఒరవడి. పాశ్చాత్య ప్రభావంతో 1920 నుండి ఆధునిక సర్జనాత్మక యుగం ప్రారంభమై పుట్టప్ప, కారంత్, బేంద్రే, మాస్తీ, కైలాసం మున్నగు మహా రచయితలతో కన్నడ సాహిత్యం శతపత్ర సుందరమైంది. కన్నడులు మూడు జ్ఞానపీఠ బహుమతులు సంపాదించారు.

"కుణియోణ బార, కుణియోణ బా
ఆ కుణియోణ బార కుణియోణ బా

తాళ్యాకె తంత్యాకె రాగాద చింత్యాకె
హెజ్జాకె గెజ్జాకె కుణియోణ బా

హగళిరళతాళక్కె జనుమగళమేళక్కె
ముగియద కాలక్కె కుణియోణ బా"

గునుస్తాము రారా, గునుస్తాము రారా
గునుస్తాము రారా, గునుస్తాము రారా,
తాళంయాల తంత్యాల రాగాల చింత్యాల
అడుగ్యాల. గజ్జ్యాల గునుస్తాము రా
పగలు రేల తాళానికి జనుమాల మేళానికి
ముగియని కాలానికి గునుస్తాము రా.

అని బేంద్రే ఈ సంసార మహా నృత్యాన్ని చేశాడు. శ్రీ యం. గోపాలకృష్ణ అడిగ "కొత్త భూతలం" నిర్మిస్తామంటాడు.

"నిర్మిస్తాం మేమొక కొత్త భూతలం
ఒక ఆనంద నికేతనం
మా నరాలలో ఉడుకు రక్తం చల్లారక ముందే
యౌవనపు ఇంద్రజాలం వట్టిపీడక ముందే
ఈ దైన్య సాగరంపై
ఉవ్వెత్తుగా లేచే ఆశా సాహసాల కెరటాలు
చితప చితవలు కాకముందే
నిర్మిస్తాం మేమొక కొత్త భూతలం."

**మలయాళం :-** కేరళ భాష అయిన మలయాళం చాలా కాలం వరకు తమిళ భాషా ప్రభావానికి లోబడి తొమ్మిదవ శతాబ్దంలో నిలువద్రొక్కుకుని పాలన శాసన వ్యవహారాలకు ఎక్కింది. తొలి కావ్యం కేవలం శృంగారమయ మయిన వైశిక తంత్రం. ఇది 13వ శతాబ్దిది. దీనికి మూలం 9వ శతాబ్దివాడైన దామోదర గుప్తుని కుట్టినీ మతం అనే సంస్కృత రచన. వైశిక తంత్రి భాష మణిప్రవాళం — అనగా మలయాళ సంస్కృత మిశ్రమం. ఈ మణిప్రవాళంలో సంస్కృత, విభక్తిరూపాలు, సంస్కృత విభక్తి ప్రత్యయాలతో మలయాళ పదాలు, సంస్కృతావ్యయాలు, వ్యవహృతాలయి, భాష విచిత్రంగా ఉంటుంది. 13 వ శతాబ్దంలో తమిళ, మలయాళ మిశ్ర శైలిలో చీరామన్ (శ్రీరామన్) అనే కవి వాల్మీకి రామాయణం ఆధారంగా రామచరిత్రం రచించాడు. 1350 — 1450 లమధ్య ముగ్గురు కవులు రామాయణ మహాభారత, భాగవతాలను, భగవద్గీతను స్వతంత్ర కావ్యాలుగా రచించారు. 16 వ శతాబ్దంలో ఎళుతచ్చన్ తాను కూడా రచనలుచేసి భాషను ప్రామాణికం చేశాడు. తరువాత మూడు శతాబ్దాలలోనూ సంస్కృతేతిహాస పురాణాలు, తత్త్వశాస్త్ర గ్రంథాలు మలయాళంలోకి వచ్చాయి. ఆధునికోద్యమం ఇరవయ్యవ శతాబ్దం ప్రారంభం నుంచీ మొదలైంది. దీనికి నాయకులు ఆశన్, ఉళ్ళూర్, వల్లథోళ్. వల్లథోళ్ సాహిత్యంలోని అన్ని ప్రక్రియలను సవ్యసాచి వలె నడిపించటమేగాక కేరళ ప్రాచీన నృత్యమైన కథకళిని గూడా పునరుద్ధరించి అంతర్జాతీయ స్థాయికి తెచ్చారు. జాతీయోద్యమంలో పాల్గొన్నారు. పూర్తి పేరు వల్లథోళ్ నారాయణ మీనన్. 'ఆచార్య దేవుడు' అనే కవితలో గాంధీజీని ఆయన చిత్రించిన తీరు మహోదాత్తం.

"గీతనివ్వగలిగిన పవిత్ర భూమిపైనే
ఇటువంటి మహోన్నతుని అవతారం సాధ్యం
ఈ కర్మయోగి ఈ భూమిలో మాత్రమే జన్మిస్తాడు
ఆర్యావర్తంలో, హిమాలయాలకు, వింధ్యకు
మధ్య పుణ్యభూమిలో మాత్రమే
ఇటువంటి కల్పవృక్షం ప్రభవింపగలదు."

తొలిసారిగా జ్ఞానపీఠం పురస్కారం పొందిన శ్రీ జి. శంకర కురుప్‌కు మలయాళ కవులలోనే గాక, దేశ కవులలోనే విశిష్ట స్థానం ఉంది.

కేరళం నేడు భారతదేశంలో అక్షరాస్యతలో అగ్రగామి. రచయితల సహకార సంఘ స్థాపనలోను అగ్రగామి. ఈ సంస్థ రచయితలకు 30 శాతం వరకు ప్రతిఫలం ముట్టచెపుతుంది.

**తెలుగు :** తెలుగు సాహిత్య చరిత్రప్రగతి రేఖామాత్రంగా మనందరికీ తెలుసు. ఇక్కడ ఒక్క విషయం చెప్పవలసి ఉంది. తెలుగువారి ప్రతిభ ప్రపంచానికి వ్యాఖ్యానాల రూపంలోనూ, నూతన అలంకార ప్రస్థాన రూపంలోనూ వ్యక్తమైంది. తుంగభద్రా తీరంలో వేదాలకు వ్యాఖ్యలు తొలిసారిగా వెలువడటం, ఆ సంప్రదాయానుగుణంగానే మల్లినాథుడు సంస్కృత కావ్యాలను వ్యాఖ్యానించటం గొప్ప సంఘటనలు. అలంకార శాస్త్రంలో చమత్కార ప్రస్థానమనే నూతన ప్రస్థానం వెలువడటం, జగన్నాథుని సౌందర్య నిర్వచనం గొప్ప విషయాలు.

తెలుగువారి ప్రబంధ రచనా పరిణతికి వసుచరిత్ర ఆనాడు సంస్కృతాది భాషలలోకి వెళ్ళడం నిదర్శనం. నేడు మిత్రుడు కుంటిమద్ది శేషశర్మ మను చరిత్ర, ఆముక్త మాల్యదలను, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు కళాపూదయాదులను, సంస్కృతజ్ఞులకు తెలిపారు.

సంస్కృత జన్య భాషలకు వెలిగా ఉన్న దక్షిణాపథం భాషా సాహిత్యాలు యావద్భారత మత సంప్రదాయ సంస్కృతుల ప్రభావానికి దూరం కావు అని తెలియజేయటానికే ఈ సాహిత్యాలను స్థూలంగా చెప్పాను.

దక్షిణ భారత సాహిత్యాలు పరస్పరం సన్నిహితంగా విజయనగర చక్రవర్తుల కాలంలోనూ, ఇతర పరిపాలనలలోనూ ఒక ఛత్రం క్రింద అభివృద్ధి చెందినా, క్వాచిత్కంగా తప్ప పరస్పరం ఆదాన ప్రదానాలు జరుపలేదు. దీనికెవరూ ఆశ్చర్యపడ నక్కరలేదు దక్షిణ భారత కవులకు సంస్కృతంపై ఉన్నంతమోజు ఇరుగు పొరుగు భాషలపై లేదు. ఎవరికివారే తాము గొప్ప, తమ భాష గొప్ప అని భిడిసిపడేవారు. శ్రీహర్షుని నైషధీయ చరితం రెండు

వందల సంవత్సరాలకే తెలుగులోకి వచ్చింది గదా, తమిళ కావ్యాలను తంజా పూరు, మధుర, పుదుక్కోట ఆస్థానాలలోని తెలుగువారు అనువదించుకోవచ్చును గదా. కన్నడంలోని అపూర్వ గ్రంథాలను తెలుగు చేసుకోవచ్చును గదా. భారత దేశీయులందరూ చేయి వేయటంవల్లనే సంస్కృతం సంపన్నమై విస్తరించింది. ఆంగ్లం కూడా నేడు ప్రపంచ సాహిత్యాన్ని స్వాయత్తం చేసుకొన్నది. ఖండన ఖండ ఖాద్యం వంటి క్లిష్టతమ వేదాంత గ్రంథాలు ఆంగ్లంలోకి వెళ్ళాయి. ఇతర శాస్త్ర గ్రంథాలు చెప్పనక్కరలేదు. కనుకనే మనం విశ్వసాహిత్యాన్ని ఆంగ్లం ద్వారా తెలుసుకోగలుగుతున్నాము. మన భావనకు కూడా అదొక వాహిక అయింది.

భారత ప్రభుత్వం, సాహిత్య అకాడమీ, జాతీయ పుస్తక సంస్థ, (నేషనల్ బుక్ ట్రస్టు) ఆదాన ప్రధానం ద్వారాను, ఇతర పద్ధతుల ద్వారాను, దేశ సమైక్యంతో పాటు భావ సమైక్యానికి పాటుపడుతున్నాయి. ఒక భారత భాషలో ఉత్తమ గ్రంథాన్ని తక్కిన భారతీయ భాషలలోకి అనువదింపజేస్తున్నవి. పిల్లలకోసం కూడా విడిగా పుస్తకాలు వ్రాయించి ప్రచురిస్తున్నవి. ఈ పద్ధతిలో పోలాప్రగడ సూర్యనారాయణమూర్తి, పాలగుమ్మి పద్మరాజు మున్నగువారి రచనలు, కొన్ని కథలు, అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, రంగనాయకమ్మ మున్నగువారి నవలలు వివిధ భాషలలోకి వెళ్ళాయి. వేమన, కందుకూరి వీరేశలింగం వంటి ప్రముఖుల జీవితాలు ఇతర భాషలవారికి తెలిశాయి. కొన్ని కవితా సంకలనాలు వివిధ భాషలలో అనూదితాలైనాయి.

**తెలుగుపాత్ర :-** భారతీయ సాహిత్య నిర్మాణం కేవలం ఆదాన ప్రదానాలతో మాత్రమే జరుగదు. ఆయా భాషలవారు తమ భాషలలో మౌలికంగా శాస్త్ర గ్రంథాలు రచించాలి. అవి ఇతర భాషలలోకి వెళ్ళాలి. కేవలం అనువాద రూపంలో గాక, జ్ఞానరూపంలో వెళ్ళాలి. కేవలం కావ్య, నాటకాలవల్ల భాష ఉన్నతిని చెందదు. తత్త్వచింతన, ఆధునిక విజ్ఞానశాస్త్ర చర్చ మౌలికంగా విలసిల్లాలి. అప్పుడే, ఆయాభాషల మేధా వైభవం తర్కప్రౌఢిమ ఇతరులకు తెలిసి వాటిని స్వాయత్తం చేసుకొంటారు. మనం మన భాషలో ఆలోచించటం, పరిభాషను నెలకొల్పుకోవటం, శాస్త్రీయ పదాలను రూపొందించుకోవటం జరిగినప్పుడు అవి మౌలికమై దేశాభ్యుదయ కారకాలయినప్పుడు ఇతర భాషల వారు యాదృచికంగా తీసుకొంటారు. ఆ విషయ జిజ్ఞాసువులు భాష నేర్చుకొని విషయాన్ని అధ్యయనం చేస్తారు. మనదేశం నుంచి విదేశాలకు వెళ్ళుతున్న విజ్ఞాన శాస్త్ర విద్యార్థులు రష్యా, జర్మనీ, ఫ్రాన్స్ దేశాలకు వెళ్ళినప్పుడు ఇక్కడ

ఎన్నికొమ్ములు తిరిగిన డిగ్రీలున్నా అక్కడి భాష నేర్చుకొని ఆ పరిభాషలో మరలా చదవవలసిందే గదా. పూర్వం మన తత్త్వశాస్త్రాలు, బౌద్ధదర్శనం, జ్యోతిషం, గణితం, ఆయుర్వేదం మున్నగు శాస్త్రాలు విదేశీయులను గౌరవంతోనే ఆకర్షించాయి. విదేశీ భాషలలోకి అనువాదం పొందాయి. చైనా, జపాను, కొరియా, వియత్నాం వారు నేటి విజ్ఞానాన్ని తమ భాషల్లో ఆలోచించి, తమ భాషల్లో వ్రాస్తున్నారు; అధ్యయనం చేస్తున్నారు; పాశ్చాత్యదేశాల వారితో పోటీపడుతున్నారు.

కనుక తెలుగువారు తమ రచనలను మౌలికంగా ఉండేటట్టు చూడాలి. వాటి ప్రాశస్త్యం ఇతరులకు తెలియాలి. దానితోపాటు సంధానభాషలోనూ రచన సాగించగలగాలి. నిన్న మొన్నటి సంధానభాష అయిన ఇంగ్లీషులోను, నేడు సంధానభాష అయిన హిందీలోను తెలుగువారు తమిళ, కన్నడ, మలయాళులవలె రచనలు సాగించకపోవటంవల్లనే తెలుగువారి మేధ ఇతరులకు తెలియకపోయింది. అప్పుడే భారతీయ సాహిత్య నిర్మాణంలో తెలుగువారి పాత్ర నిర్వహింపబడినట్లవుతుంది. దీనికి ఉదాహరణంగా రాజారావు, ఆర్. కె. నారాయణ్, నైపాల్ మున్నగువారిని చెప్పవచ్చును. పూర్వం సంధానభాష అయిన సంస్కృతంలో వ్రాశారు. కనుకనే తెలుగువారైన ఆయుర్వేద, జ్యోతిష, గణిత తత్త్వశాస్త్రజ్ఞులు యావద్భారతఖ్యాతిని పొందకలిగారు.

# శరదశ్శతం

మొన్ననే శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు నూరేళ్ళ పుట్టినదినం పండుగ చేసుకొన్నారు. ఇక ఐదేళ్ళకు కవిసార్వభౌమ మహామహోపాధ్యాయే త్యాది బిరుదాంచితులు, ఆంధ్రప్రదేశ్ ఆస్థానవిద్వత్కవులు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు నూరవ పుట్టినరోజు పండుగ చేసుకొననున్నారు. ఇటీవల శ్రీ శాస్త్రిగారిని రాజమహేంద్రవర పౌరులు 95వ జన్మదినోత్సవంనాడు వైభవోపేతంగా సత్కరించడం ప్రశంసనీయం.

బతకడంకోసం బతకడం గొప్పేమీ కాదు. ఇలాటి బతుకునుగురించే, అకర్మణ్యతనుగురించే.

"ఉడు ముండదె నూరేండ్లును?
పడియుండదె పేర్మి పాము పదినూరేండ్లున్?
మడుగున కొక్కెర యుండదె?
కడు నిల పురుషార్థపరుడు కావలె...."

అన్నాడు సుమతిశతకకారుడు. పురుషార్థపరత పూర్ణారోగ్యం లేనిదే సాధ్య పడదు. కనుకనే మన పూర్వులు

"పశ్యేమ శరద శ్శతం
జీవేమ శరద శ్శతం
నందామ శరద శ్శతం
మోదామ శరద శ్శతం
భవామ శరద శ్శతం
శృణవామ శరద శ్శతం
ప్రబ్రవామ శరద శ్శతం
అజీతాస్స్యామ శరద శ్శతం."

ఊరికే ఏదో జీవచ్ఛవంలాగ బతకడంకాదు: నూరేళ్ళు చూద్దాం. నూరేళ్ళు జీవం తొణికిసలాడుతూ ఉందాం. నూరేళ్ళు సంతోషిద్దాం. నూరేళ్ళు మోదంతో ఉందాం. నూరేళ్ళు ఉందాం. నూరేళ్ళు విందాం. నూరేళ్ళు మాట్లాడుతూ ఉందాం. అన్నిటికన్నా మించి, నూరేళ్ళు ఒకరికి లొంగకుండా ఉందాం-అని కోరుకున్నారు.

శ్రీ శాస్త్రిగారి తొంబయ్యయిదేళ్ళ జీవితమూ కార్యకలాపాల సమ్మర్దంతో సార్థకమైంది. వీరు చెప్పినన్ని పద్యాలు ప్రపంచంలో ఎక్కడా ఎవ్వరూ చెప్ప లేదు. వీరి కవితావేశం అటు రాజాస్థానాలలోనేకాక, ఇటు న్యాయస్థానాలలోను పొంగులు వారింది. అటు ఒక చేత రామాయణ భారత భాగవతాది ప్రాచీన సాహిత్యాన్ని, మరొకచేతి తిలక్ మహారాజు నాటకం, బొబ్బిలి నాటకంవంటి అర్వాచీన సాహిత్యాన్ని — శతాధిక గ్రంథాలను సవ్యసాచికలాగ ఆంధ్రా వళికి అందించినవారు; తమకు నచ్చిన దానిని కచ్చితంగా ఎదిరించే గుండె నిబ్బరం గలవారు; వ్యావహారిక భాషావాదాన్ని తమ వజ్రాయుధంతో ప్రతి ఘటించారు. అదే ఆవేశంతో, అదే అభినివేశంతో నేటికి రచనను కొనసాగి స్తూనే ఉన్నారు.

ఇలాటి కార్యవ్యగ్రులు ఐదు సంవత్సరాలను ఐదుక్షణాలుగా గడిపి, నూరవజయంతి చేసుకోవాలని ఆశిస్తున్నాము; చేసుకోగలరని విశ్వసిస్తున్నాము. నూరే ఎందుకు? కృష్ణభగవానుడు 108 సంవత్సరాలు జీవించాడని, ఇతరుడనే ఋషికుమారుడు మహీదాసుడు మృత్యువును నిలువుమని 116 సంవత్సరాలు జీవించాడని (మహీదాస ఐతరేయః ...సహషోడశం వర్షశత మజీవత్) ఛాందో గ్యం చెప్పినట్టు నూటపదహారవ జయంతి చేసుకోవాలని అకాంక్షిస్తున్నాము.

శ్రీ కార్వే, శ్రీ విశ్వేరయ్యగార్లను గౌరవించినట్లే భారతప్రభుత్వం వీరిని కూడా ప్రత్యేకపు తపాలా బిళ్ళలు ముద్రించి, ఇతర విధాలుగాను సముచిత రీతిని సన్మానించగలదని ఆశిస్తున్నాము.

"శతం జీవేమ శరది సువీరాః."